# బాలవ్యాకరణోద్ద్యోతము

వఝ్ఝల చినసీతారామస్వామిశాస్త్రి విరచితము




ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్, సైఫాబాద్
హైదరాబాదు-4

# తొలి పలుకు

కళాప్రపూర్ణ బ్రహ్మశ్రీ వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రి జగమెరిగిన ఆంధ్ర వైయాకరణులు. వ్యాకరణరంగములో సాగిన "అనేక యుద్ధముల నారియు తేరిన వృద్ధమూర్తి!" బహుకాలము వాల్తేరులోని ఆంధ్ర విశ్వకళా పరిషత్తులో వ్యాకరణాచార్యులుగా పారప్రవచనము చేసి, శిష్యప్రశిష్య పరంపరను తయారుచేసిన కులపతి తెలుగు వ్యాకరణ మునిత్రయములో చిన్నయసూరి, బహుజనపల్లి సీతారామాచార్యులు పాణిని, కాత్యాయన స్థానీయులైనచో, శ్రీశాస్త్రిగారే పతంజలి స్థానీయులని శిష్యపరంపరచే కీర్తింపబడుచున్న మహాభాష్యకారులు

తమ 'విజ్ఞప్తి'లో శ్రీశాస్త్రి చెప్పినట్లు బాలప్రౌఢ వ్యాకరణములలోని దురుక్తములను సవరించుట, అనుక్తములను చేర్చుటయే కాక, తెలుగు విద్యార్థుల కావశ్యకమైన సర్వ సంస్కృత వ్యాకరణాంశములను గూడా వివరించునదగుటచేత ఈ బాలవ్యాకరణోద్ద్యోతము 'ఆంధ్ర విద్యార్థుల కవశ్య పరనీయ' మనుటలో సందేహము లేదు.

1959లో వెలువడిన ప్రథమ ముద్రణ ప్రతులు ఏనాడో చెల్లిపోవుటచే ఈ గ్రంథమును పునర్ముద్రింపవలసినదిగా శ్రీ శాస్త్రిగారి కుమారులు ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఆకాడమీని అర్థించిరి ఆ విధముగా ఈ ఉద్గ్రంథ పునర్ముద్రణావకాశమును కలిగించినందుకు అకాడమీ వారికి ధన్యవాదము లర్పించుకొనుచున్నది ప్రథమ ముద్రణమును వలెనే, ఈ ద్వితీయ ముద్రణమునుకూడ తెలుగు పండిత లోకము, విద్యార్థి లోకము సాదరముగ స్వీకరింపగలదని విశ్వసించుచున్నాము.

హైదరాబాదు
1-12-1977

దేవులపల్లి రామానుజరావు
కార్యదర్శి



గ్రంథకర్త:

కళా ప్రపూర్ణ

శ్రీ వఝల చినసీతారామస్వామి శాస్త్రి గారు



కృతిపతి:

డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారు, పి. హెచ్. డి.

# కృతిసమర్పణము



శ్లో॥ శ్రీరస్తు, మాఙ్గళ్యపరంపరాస్తు।
దీర్ఘాయు రారోగ్య సమృద్ధిరస్తు।
దిగన్త విశ్రాన్త సుకీర్తిరస్తు।
గోపాలరెడ్డి ప్రభుశేఖరస్య॥ ౧

ఆన్ధ్రాణా మున్నతత్వం కలయితు మనిశం భావయన్తం మహాన్తం।
శ్రీమత్త్రైలిఙ్గకాన్ధ్రి పదభజన రతాన్ పణ్డితాన్ పాలయన్తమ్।
భాషాదేవీ దదానం సుకవి గురు రవీన్ద్రీంప కావ్యార్థ భూషాః।
శ్రీమద్గోపాలరెడ్డి ప్రభువర మవతా దాసుధాధామతారమ్॥ ౨

క॥ బాలవ్యాకరణోద్ద్యో
తాలోకన ముభయభాషలందును వ్యాకృ
త్యాలోడన ఫల మీయం
జాలుట నిది శబ్దశాస్త్ర సర్వస్వ మగున్. ౩

క॥ దీనికిఁ దగియెడు నాథుం
డీ నరలోకమున నీవె యెన్నిక సేయన్
గానం దీనికిఁ గృతిపతి
వై నా వాంఛితము దీర్పు మదిగాక యిలన్ ౪

తే. గీ. సర్వ సన్మంగళంబులు సంతరించు
శాశ్వతం బగు సత్కీర్తి సంఘటించు
సప్త సంతానములలోఁ బ్రశస్తిఁ గాంచుఁ
గృతి పతికి నంచు వేద సమ్మతి వహించె

సీ ఇండియా దేశంపు ఋక్థశాఖా మంత్రి
యాంధ్రవిశ్వకళా సమజ్యకెల్ల
గౌరవాధ్యక్షుఁ డాంగ్లంబున వంగాంధ్ర
సంస్కృతంబులను విశారదుండు
విద్యాలయమువారి బిరుదముల్ డాక్టరు
డీ లిట్టు లలరు విశాలకీర్తి
పండిత కవి పక్షపాతి పండిత పోష
ణాభిముఖ్యుండు దేశాభిమాని

తే గీ కృతిపతిత్వంబు నంగీకరించె నాంధ్ర
సంస్కృతంబుల లక్షణజాల మిందు
పరగుచుండ [illegible] సూరిలోపములు దీర్చు
నిట్టి ది [illegible] నాటి వ్యక్తులు గలవె! ౬

మ చరకా [illegible] భించ [illegible] శ్రీరెడ్డిసామ్రాజ్య మీ
[illegible] శ్రీ [illegible] ఘ [illegible] వాంఛం ఋజ్వ్వలంబౌచు ఖా
స్వరిత [illegible] బగనె గోపాలాంధ్ర రెడ్డిప్రభూ!
వరలింపం [illegible] ద్ది సత్కీర్తిర [illegible] ౭

[illegible] ధాయురింతె [illegible]
[illegible] ము శ్రీప్రకు [illegible]
[illegible] గిత్వార్థమైయె సార్థక
[illegible] క్షేత్రం [illegible] ౮

[illegible] దీర్ఘ [illegible] ఘుప్య ఖం
[illegible] డో [illegible] త్రైబముల్
గో [illegible] శ్రీ గోపాలాంధ్ర [illegible] డ్డి ప్రభూ!
[illegible] చంద్ర తారార్కముగన్ ౯

క	ఆరాధిత వాగ్దేవీ
సార విబుధపోషణార్థ సంసక్తాత్ముం
డై రామాయణ భారత
పౌరాణార్థాభిధాన పాండిత్యుండై	౧౦

క	చుట్టాలసురభి సీతమ
జెట్టం జేపట్టినట్టి జెట్టికి శ్రీమత్
పట్టాభి రామరెడ్డికి
దిట్టకు మీ పితకుఁ గలదె దీటిలలోనన్?	౧౧

క	తన కద్వైతమె సమ్మత
మనుమన్ శివ కేశవులకు నద్వైతము నం
చును జంద్రశేఖరాఖ్యుం
దనయుల గోపాల రామ నాములఁ జేసెన్	౧౨

మ	వర జాడ్యపు వాదియై చెలకుఁ బో వ్వారించె నా చంద్రశే
ఖరరెడ్డి ప్రభుఁ డాత్మదేశముపయిం గారాబముం జూపి తా
నరవిందాంచిత ఘోషనామునకు శిష్యత్వంపు వాక్యం బుదా
హరణం బొందఁగ నభ్యసించె సరి నాంధ్రాంగ్లంబులన్ వంగమున్

క	ఆ చంద్రశేఖ రేంద్రుఁడు
భూచక్రము విడి స్వర్గమును సేవింపన్
నేచెను గా కాతఁడె భువిఁ
దోఁచిన నాంధ్రం బిదెట్లు తులకించునొకో?	౧౪

క	బెజవాడ వంశ మౌక్తిక
విజయశ్రీ కలిత గోపవిభు నామునకున్
సుజనుల కొంగు పసిండికి
రజనీకర విశదకీర్తి రాజిత మహికిన్

క    దేశక్షేమంబునకై
కోశంబు గృహంబు వీడి క్రూరపు చెఱలోఁ
గౌశల్యంబునఁ గావ్యపు
రాశిని రచియించు లోకరక్షామతికిన్ ౧౬

క    మేరు ధరాధర ధీరున
కారాద్ధ సరస్వతీ పదాంభోజునకున్
పూజిత ఫలానుమేయ
ప్రారంభున కాత్మనుతి పరాఙ్ముఖ మతికిన్ ౧౭

క    పాలిత పండితకవికిన్
లాలిత వైయాకరణ సులక్షణ కృతికిన్
శీలిత భాషా వాఙ్మయ
జాలంబున పాండితి విఘూర్ణిత మతికిన్ ౧౮

క    పాపుల కతి దూరునకున్
శ్రీపతి పాదాబ్జ చంచరీకాత్మునకున్
గోపాలరెడ్డి విభునకు
భూపాల సమర్చితాత్మ పుష్కర యుతికిన్ ౧౯

వ    అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా రచించిన "బాలవ్యాకర
ణోద్ద్యోతంబు" సమర్పితం బయ్యె. ౨౦

———

# విజ్ఞప్తి

—(ప్రథమ ముద్రణ)

ఆంధ్ర మహాశయులారా! ఆంధ్ర గ్రాంథిక భాషాజిజ్ఞాసువుల కిపుడు బాల వ్యాకరణ మత్యంతోపకారకమై యున్నది కాని దీని యందును, దీని వివరణ మనఁదగు త్రిలింగ లక్షణ శేషమందును గొన్ని యపసిద్ధాంతములు లక్షణవిరోధములును నుండుటయే కాక యాంధ్ర గ్రాంథిక వాఙ్మయ స్థలములగు పెక్కు లక్షణములు పేర్కొనఁబడలేదు లక్షణవిరోధములును నపసిద్ధాంతములును విద్యార్థుల నెమ్మనములందు నాటుకొనుట మిక్కిలి ప్రమాదకరము కాన నందలి యపసిద్ధాంతములను లక్షణవిరోధములను దొలఁగించి బాలవ్యాకరణ ప్రౌఢవ్యాకరణములయందుఁ బేర్కొనఁబడని లక్షణ విశేషములను జేర్చి మిగిలిన బాలవ్యాకరణ విషయములను నిల్పి రచించుట విద్యార్థుల కత్యంతోపకారక మగు నని తలంచి యీ బాలవ్యాకరణోద్ద్యోతమును రచించితిని

మఱియు నాంధ్రభాషలో సగభాగము నాక్రమించియున్న సంస్కృత భాష నభ్యసించుట విద్యార్థుల కత్యావశ్యకము గాన నాంధ్రోపయోగి సంస్కృత భాషా లక్షణములు సంక్షేపముగానైనఁ దెలియుటకై యిందు సంస్కృతకృత్తద్ధిత సమాస విషయములును సంస్కృత సమాస సంధులును సంక్షేపముగాఁ జేర్పఁబడినవి కావున దీనిని జదివిన విద్యార్థి సంస్కృత వ్యాకరణమును వేఱుగఁ జదువ నక్కఱలేదు నేఁటికిఁ బ్రసిద్ధమైయున్న యాంధ్ర వ్యాకరణములలో నిట్టి పద్ధతి లేదనవచ్చును పయి కారణములచే నీ గ్రంథ మాంధ్ర విద్యార్థుల కవశ్య పఠనీయ మయి యున్నది

ఈ గ్రంథమునకుఁ గృతి నాయకత్వమును బ్రీతితో నంగీకరించిన శ్రీ ఇండియా మంత్రిగారగు గౌ॥ డా॥ బెజవాడ గోపాలరెడ్డి, పి హెచ్ డి గారి నెంతయుఁ బ్రశంసించుచున్నాఁడను

దీని ముద్రణమునకుఁ దోడ్పడుచు నాకు వేయి రూపాయ లిప్పించిన శ్రీ యాంధ్రప్రదేశ ప్రభుత్వమువారియెడలను, వారి తరపున నట్టి వేయి రూపాయలను బ్రసాదించిన విద్యాశాఖాధ్యక్షులగు శ్రీ డైరెక్టరుగారియెడలను మిక్కిలి కృతజ్ఞుఁడ నగుచున్నాఁడను.

ఈ గ్రంథమునకుఁ బ్రకాశకత్వమును వహించి ప్రూపులు దిద్దుట మున్నగు వానికిఁ దోడ్పడిన నా కొమార్తె చిరంజీవిని కాకరపర్తి వేంకట సీతమ్మను నాయురారోగ్యాభివృద్ధిగా నాశీర్వదించుచున్నవాఁడను ఈ గ్రంథము వలయు వారు గ్రంథకర్తనగు నాకు వ్రాసి తెప్పించుకొనవలయును దీని వెల 'యెనిమిది' రూపాయలు

ఇది వ్యాకరణశాస్త్ర మగుటచేత దీని నత్యంత సమర్థతతో ముద్రించిన కాకినాడ వాస్తవ్యులగు శ్రీ పాపులర్ పవర్ ప్రెస్సువారి నెంతయుఁ బ్రశంసించుచున్నాఁడను

కోడుగంటివారి వీథి,
విజయనగరము
1-6-1959

ఇట్లు సుజన విధేయుఁడు,
వఝుల చినసీతారామస్వామిశాస్త్రి,
గ్రంథకర్త

# విజ్ఞప్తి యనుబంధము

—(ప్రథమ ముద్రణ)

నా రచించిన గ్రంథముల విషయములను విమర్శించుచు వ్రాసిన యలంతి విజ్ఞుల విమర్శనములను సావధానముగఁ జదివితిని ఆ విమర్శనములు సరిగా నుండలేదని తోఁచి సంక్షేపముగా నీ యనుబంధమును వ్రాయుచున్నాను ఆంధ్ర పత్రికా భారతీ సంపాదకులు తమ వికారి సంవత్సరాది సంచికలోఁ బ్రచురించిన శ్రీ నిడుదవోలు వెంకటరావుగారి వ్యాసమును, 1959 సం॥ జూలై భారతిలోని వారి సమాధానమును, దాని వెనుక సంపాదకులు వ్రాసిన యీ క్రింది ప్రకటనను జూచియు నీ యనుబంధమును వ్రాసితిని

[ప్రయోగశరణాః వైయాకరణాః- అన్నది పండితోక్తి కాని ఈ వివాదంలో ప్రయోగాలను దిద్దివేయవచ్చునని ఒకరి మతం 'పలుతావుల ప్రయోగించబడిన శబ్దములనెల్ల దిద్దుట సంప్రదాయ విరుద్ధ'మని మరొక మతం- అయినట్లు స్పష్టం కనుక ఈ వివాదానికిక స్వస్తి! —సంపాదకుఁడు ]

శ్రీ 'తూమాటి దోణప్ప' యమ్మెగారు (వాల్తేరు, ఆంధ్రా యూనివర్సిటీ) 'వికృతి వివేక కర్తృత్వము' అను శీర్షికగల వ్యాసములో వికృతి వివేకమనెడి యథర్వణకారికావళి యహోబల పండిత విరచితమనియు నా గ్రంథమన్యదేశ్యమును స్మరించినది గాన నది నవ్యమనఁదగుననియు దానిని బదుమూఁడవ శతాబ్దమువాఁడగు నథర్వణుఁడు రచించుట పొసఁగదనియు నాతని కాలమున నన్యదేశ్యము తెనుఁగులోఁ జేరలేదనియు భారతిలో వ్రాసిరి ఆ నాఁటికిఁ దెల్గున నన్యదేశ్యము చేరలేదనుట సత్యదూరమగుటంజేసియు వారు మూలభూతమగు 'ఆంధ్రశబ్ద చింతామణి'ని గాని దాని వివరణమగు వికృతి వివేకమును గాని యాఘ్రాణించుటయు లేమింజేసి వారి వ్యాసమును విమర్శించుట యనావశ్యకము.

శ్రీ నిడుదవోలు వేంకటరావుపంతులు యమ్మే గారు (చెన్నపురి యూనివ వర్సిటి) వికారి సంవత్సరాది సంచిక (ఆంధ్ర పత్రిక 1959-60 సం॥) 81 మొ 96 వ కల పుటలలోను, నాంధ్ర భారతి 1959 సం॥ ఏప్రిల్ 54 మొ 60 వ కల పుటలలోను, ౧౯౫౯ జూలై భారతి ౨౩—౨౪—౨౫ పుటలలోను, ప్రచురించిన విమర్శనములలో నన్నయాథర్వణీయ కారికల యర్థము సరిగాఁ దెలియకున్నను వానిని స్మరించియుండుటచేత వారి విమర్శనములను సంక్షేప ముగా నీ యనుబంధమున విమర్శించుచున్నాఁడను

వీరు వికారి సంవత్స రాంధ్రపత్రిక సంవత్సరాది సంచికలో "ఇది (ఆంధ్ర వ్యాకరణ సంహితా సర్వస్వము) పందొమ్మిదవ శతాబ్ది ప్రథమార్ధ ఎ స వెలసిన పరవస్తు చిన్నయ్యసూరి ప్రణీత బాలవ్యాకరణమునకు (1960 ప్రాంతమున రచింపఁబడినది) 'మహా పెద్ద' భాష్యగ్రంథము" అనియు, 1959 సం॥ ఏప్రెల్ భారతిలో "ఇది (ఆంధ్రవ్యాకరణ సంహితా సర్వస్వము) ఆంధ్ర భాషా వ్యాకరణములలో నర్వాచీనమును పందొమ్మిదవ శతాబ్ది ప్రథమార్ధమున వెలసినదియు పరవస్తు చిన్నయ్యసూరి ప్రణీతము నగు బాలవ్యాకరణమునకు విపులమగు వ్యాఖ్యాన గ్రంథము" అనియు వ్రాసిరి నా రచించిన యాంధ్ర వ్యాక రణ సంహితా సర్వస్వమునకు మూలము ప్రాచీనమగు నన్నయాథర్వణీయ మనియు (కారికలు) దానివ్యాఖ్యానములలో "కల్పతరువు" వలెనె బాలవ్యాకరణ మును నొక వ్యాఖ్యాన మనియు నా గ్రంథము నా భూమికలో వ్రాసితి నెల్ల విదితము కాఁగలదు 1959 జూలై భారతి 23 మొ 2 వ పుటలలోని సమాధానము లును సరిగ లేవు

శ్రీ వేంకటరావుపంతులు యమ్మే గారు రచించిన "తెలుఁగు కవుల చరి త్రము" లో నథర్వణకారికావళి ప్రాచీన మనియు నాంధ్ర శబ్దచింతామణి నన్నయ మనియు వ్రాసిరి మూలము నన్నయ మనియు దాని వివరణము ప్రాచీన మనియు వ్రాసిన వ్రాఁతలోని యసంగతిని నా రచించిన "ఆంధ్ర వైయాకరణ పారిజా తము ద్వితీయముద్రణము విజ్ఞప్తి యనుబంధమున" (౧౯౫౮—౨—౨౪) వివరిం పఁబడి యున్నాడు వికారి సంవత్సరాంధపత్రిక సంవత్సరాది సంచికలో (84 పుట మొ) నథర్వణకారికావళి సయుక్త మర్వాచీన మని "అర్వాచీన లాక్షణికు

లగు నాంధ్రశబ్దచింతామణికర్త, అధర్వణ కారికావళికర్త..." అని వ్రాసిరి పీరి కింక నేమిచెప్పినను ప్రయోజనము లేదు

పంతులుగారు నా గ్రంధములోని "ప్రాచీన కవిప్రయోగము లభింప లేదు . అని యుద్ఘాటించుటచేత నట్టి ప్రయోగములు కతిపయము మాత్రమె ప్రదర్శింపఁబడినవి" అని వ్రాసియు శాసన ప్రయోగములను, నాధునిక కవి ప్రయోగములను బ్రాచీన కవిగ్రంథములలోని కవిప్రయుక్తము లనఁదగని ప్రాచీన లాక్షణికసమ్మతిలేని ప్రయోగములను సంస్కర్తలు సంస్కరించిన వనఁదగిన యప్రామాణిక ప్రయోగములను జూపుట కేవల మసంగతముగా నున్నది

ద్విపద "ఈ విధంబున నిర్వదెనిమిదికోట్లు" అనునది మొదలగు పండితారాధ్య చరిత్రములోని (పర్వ-౨౭౧) ప్రయోగములను 'కోట్లు' అనుదానిని నిర్వహించుటకయి చూపిరి (౧౯౩౯-భారతి-ఏప్రెల్-౩౯ పుట) 'కోట్లు' అనునది వ్యావహారిక శబ్దము అచట 'కోటుల్' అని కవి ప్రయుక్తపాఠములను గ్రహింపవలయును బసవ కవి సూర్యగణములచోట 'గగ' మును బ్రయోగించుట వింతకాదు

"ద్విపద ప్రేమం బెలర్పంగ భృత్యేపరాధః । స్వామినోదండయన్ చదువు నిష్ఠించి" (బసవ ౧౦౬ పుట-౪ ఆశ్వా-౧౩౯ పంక్తి) "పాయక శ్రుతి రసాన్ భక్తస్య జిహ్వా । గ్రే యని యే ప్రొద్దు మోయు గావునను" (బసవ పుట ౧౬౪ పుట ౩ ఆశ్వా, ౩౯౦ పంక్తి)

౧౯౩౯ జూలై భారతిలో ౨౩ వ పుటలో వేంకటరావు పంతులుగారు ప్రాసఘటిత మహాకవి పయోగము లనుచు నీక్రింది వానిని వ్రాసిరి "అందుఁగల" పర్వతేంద్రంబు లైదు వాని । చుట్టుఁ గలిగిన కొండలు కోట్లసంఖ్య" (వరాహ పు ౧౦ ఆ ౧౩౩) "ఇట్లు కడనేక బ్రహ్మాండకోట్లు మెఱయు" (విష్ణు పు ౩ ఆ ౧౩౩ ప) కాని పైవుయు సంయు తాసంయుత ప్రాసము ను బ్రయోగించి యుందు రని పంతులుగారు గ్రహింపరైరి ఇట్టి యపపాఠములను జూచియే సూరియు అచ్చిక ౧౭వ సూత్రమున నట్లు భ్రమించెను.

తే గీ పొంది ద్రచ్చఁగనిమ్ము నాతండ్రి కృష్ణ । వేఁడుకొనియెద నందాఁకఁ బండ్లు తినము । మీఁద గపు చేష్టలును నోడిగాండ్ర తనము । మెండు గాఁజొచ్చె నికు నైదేండ్ల కనఁగ'' (అప్పక ౩ ఆ ౩౧౫) అని యప్పకవి యిట్టి ప్రయోగములను గాంచియే చెప్పియుండును గాక ''ఇట్లు కదలేక బ్రహ్మాండకోటి మెఱయు'' అని వెన్నెలకంటి సూరనయు, ''చుట్టుఁ గలిగిన కొండలు కోటి సంఖ్య" అని నంది మల్లయ్య, ఘంట సింగయ్యకవులును బ్రయోగించి యుందురు "తే గీ రలలు తమక్రింద జడ్డలై క్రాలుచ్రాలు । ప్రాసవర్ణంబులై వానిఁ బాసి యైనఁ । గూడియైనను బెఱ యడుగులను నిల్చు । సంయుతాసంయుత ప్రాస సంజ్ఞఁ దనరి'' (అప్ప-౩వ ఆ-౩౧౪వ ప) అని యప్పకవి స్పష్టముగాఁ జెప్పి యున్నాఁడు

'ఋ-ౠ' వర్ణములు స్వరము లనుబుద్ధితో నన్నయాదులు ప్రయోగింపఁగా ''ఋ-ౠ'' వర్ణంబులు 'ర-ల' తుల్యము లనుచు నర్వాచీను లిట్టి ప్రాసములను బ్రయోగించిరి

"వృషోత్సర్గ మనఁగా నాఁబోతులను విడుచుట సంప్రదాయముగాని యావులను విడుచుట అనునది లేదు'' అని యెవ్వరో చెప్పిరఁట (సంవత్సరాది సంచిక-౯౩ వ పుట)

''వృషోత్సర్గః-పుం- శ్రాద్ధాదౌ వత్సతరీ చతుష్టయసహిత త్రిశూల చక్రాఙ్కిత వృషత్యాగే'' (శబ్దార్థ చింతామణి కోశము) అను చొప్పున వీరశైవులును శివచిహ్న త్రిశూలాఙ్కిత వత్సతరీ త్యాగము చేయనగు నని విశద మగుచున్నది శ్రాద్ధములందే కాక పుణ్య కాలములం దందఱును వృషోత్సర్గము జేయనగు నని చెప్పఁబడి యున్నది "హేమాద్రౌ - విష్ణుధర్మే-అయనద్వితయే చైవ । మృతాహే బాంధవస్యచ । ఉత్సృజేత్ స్నీల వృషభం । కౌముద్యాం స్వయు పాకమే కౌముదీ-కార్తికీ'' (నిర్ణయసింధు II ప్రక-౨౦ పుట) 'శైవ మతసంప్రదాయము న వృషోత్సర్గ మనఁగా గోవుల విడుచుట'' గోదానము చేయుట మొదలగు నాచరణవిధానము లనేలెదు (సంవత్సరాది సంచిక

౬౨వ పుట) అని వ్రాసిరి గోదానము చేయ వలయునని చెప్పలేదే! వృషోత్సర్గమనఁగా గోదానము కాదే! "సంహితా కర్తలకు సంప్రదాయము నెఱుఁగక." "సంహితాకర్తలకు సంప్రదాయిక (అపశబ్దము దీనికి లెక్కయేమి?) దృష్టి లేదు ఆ మత సాంప్రదాయముల నెఱుఁగక "(వత్సరాది సంచిక ౯౨వ పుట)అనునవి మొదలగు ధోరణి కేవలము నసంబద్ధప్రలాపమే కదా!

ప్రాణము పోయినం బోవుఁగాక, మందు గుణము చేసిన దను నట్లు "పరిష్కర్తలు (శ్రీ శే వేటూరి ప్రభాకరశాస్త్రిగారు) 'విష్ణు వన్మాట' అను నూతనపాఠమును నెలకొల్పుట ప్రామాదికమె" అని వ్రాసిరి

"అనుకరణమున సంస్కృతవిభక్తి నిలువదనియు తెలుగు విభక్తియే నిలుచుననియు సిద్ధాంతము పండితారాధ్యుల కృతియందిట్టి ప్రయోగమును గమనించియె సోమనారాధ్యుఁడు 'కృతం కర్మ శుభాశుభంబు' అను నిట్టి ప్రయోగములను గావించి యున్నాఁడు."

"సంస్కృత వాక్యమయినను అనుకరణ సంధియందు తెనుఁగు విభక్తితో నుండుటయే ప్రాచీనాంధ్రభాషా సంప్రదాయము" (సం వత్సరాది సంచిక ౯౬వ పుట)అని యించుకేని సంకోచింపక వ్రాసిరి ఏవో కొన్నిచోటులు పైరీతివి వీరి యపూర్వ సిద్ధాంతమునకును లక్ష్యములైనను వీరి సిద్ధాంతము చొప్పున 'శివాయ నమో యనుచు'(శివతత్త్వసారము ౬౬వ పద్య) "మంవని మ్రొక్కిన దీక్షా। యని" (శివతత్త్వ ౪౧౪౫ పద్య) "మద్భక్తా విగత కల్మషా యను" (శివతత్త్వ ౧౮౦ పద్య) అను మొదలగు రీతిని బండితారాధ్యకవి యనుకరణ సంధిలోని తుదిపదము తత్సమముగాఁ బ్రయోగింపలేదే!

వీరి సిద్ధాంతము చొప్పున నీ పఱకు బసవపురాణమున నున్న "ఉమామాతా పితా రుద్ర యనెడు" అనుచోట "ఉమా మాతాపితా రుద్రుఁ డనెడు" (బసవ

౪ వ పుట) అనియు, శ్రుతి "విశ్వత శ్చక్షు ఋత యంచు" అనుచోట 'ఋత మంచు' అనియు (బసవ ౨౦ పు) "అవు నసంఖ్యాతా స్సహస్రాణి యనుచు" అనుచోట "సహస్రంబులనుచు" (బసవ ౪౦ పుట) అనియు, " స్వామి నోదండ యన్ చదువు' అనుచో "దండమనియు (బసవ ౧౦౬వ పుట), ".. బ్రాహ్మణా యన" అనుచోట "బ్రాహ్మణు లన" అనియు (బసవ ౨౧౧వ పుట) ". పితామహా యనుచు" అనుచోట "పితామహులనియు" (బసవ ౨౧౨ వ పుట) దిద్దవలసి యుండును గదా!

'శ్రీ గురవే నమో యనుచు' అను మూఁడు చరణములందును (బసవ ౩౫వ పుట) "శ్రీ గురవే నమో యనుచు" (బసవ ౩౬ పుట) అనుచోటను, "శివాయ నమోనమో యనుచు" (బసవ ౪౩ పుట) అనుచోటను "ఏక ఏవ హి రూపేణ యనియు" (బసవ ౬౮ పుట) అనుచోటను " .జిహ్వాగ్రే" యని (బసవ ౧౬౪ పుట) అనుచోటను "సదాపశ్యంతి సూరయో యనఁగ" (బసవ ౨౦౨ పుట) అనుచోటను "విష్ణుః పితా మహాత్తన" (బసవ ౨౦౨వ పుట) అను చోటను వీరి సిద్ధాంతము చొప్పున నెట్లు ఉద్దుటో వీరె చెప్పవలెను ఇవెల్లఁ దాళపత్రమాతృకల పాఠమ లే కదా! "వేదముల వలె. స్వర యుక్తముగ పఠించువారు కావున నిందు పాఠభేదములకు నావకాశము లేదుగదా!" అని వ్రాసిరే! ఏమిగతి! ఈ రీతిగ నెన్నో స్థలములు దిద్దవలసి యుండఁగా "ఆంధ్ర గ్రంథమాలాధిపతులు ప్రకాశ మొనర్చిన బసవపురాణ ద్వితీయ ముద్రణమున (1952) గల పాఠములు మార్చవలసిన యావశ్యకత యెంతమాత్రము లేదని విమర్శక లోకమునకు విన్నవించుచున్నాను" అని వీరు వ్రాయుట యుక్తమా?

శివతత్త్వసారమును ప్రకటించిన శ్రీ శ్రీ కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావు, యమ్మే గారు తాటియాకుల మాతృకల తప్పులను పుచు "కావున సంగతి సందర్భములను బట్టి ప్రకాశకులు తమ బుద్ధివైభవము నుపయోగించి మూల

మందుఁ దాము తప్పులనుకొనిన వానిని దిద్దవలసినదే. .కాని దిద్దువాఁ డెంత పండితుఁడై నను సర్వజ్ఞుఁడుకాఁడు-కాఁజాలఁడు '' ''ఛందోవ్యాకరణాది నియ మముల ననుసరించియు నర్థ సందర్భములను బట్టియు మూలమందలి పాఠములు తప్పని తోఁచినప్పుడు వానిని దిద్ది యచ్చొత్తించితిమి'' అని వ్రాసిరి (చూ డుఁడు-పీఠిక శివతత్వసారము ౪-౫-౭ పుటలు)

కం ''కొనునది భక్తునిచేతన। ధన మతనిక యిచ్చునదియు 'తస్మైదేయ' మ్మనియున్ 'తస్మాద్గ్రాహ్య'। మ్మనియున్ గలదనిరి భక్తియాగ విధిజ్ఞుల్'' (శివతత్వసారము ౧౧౫వ పద్య) అని కవి ప్రయుక్తపాఠ మనఁదగును దాని ప్రకాశకులగు కొ వేం లక్ష్మణరావు పంతులుగారు వ్రాసినట్లు''అయినను కొన్ని పొరపాటులుండిన నుండవచ్చును'' (శివతత్వ ౮ పుట) అనురీతిని ౧౪౮-౧౫౮ పద్యము మొదలగు వి యతిభ్రష్టములు ''గీర్తింపఁడు వెండి తన్నుఁ గార్యా కార్యా। వర్తనల'' (శివతత్వసారము ౧౪౮ పద్య) ''శివ ద్రోహుఁడు నరక గామి యగును మహేశా'' (శివతత్వ-౧౫౮ పద్య) ఇవి రెండును యతిభ్రష్ట ములె కదా!

తాళపత్రమాత్రృకలు సాధారణముగా నసంస్కారులు వ్రాసినవి కాన నవి తప్పుల తిప్పలు బసవపురాణ మాతృకలును నట్టివె యని పై సందర్భమును బట్టి విశదమగును గదా వానిని యథాస్థితముగా మహాకవి ప్రయుక్తము లనుట యసంభావ్యమని యెవ్వరును నంగీకరింపక తీరదుగదా ప్రతులు పెక్కిటిలో నొక్క రీతినే యుండిన నుండవచ్చును ఒకదానిని జూచి యొకటి వ్రాసినదేకదా. ఆయా వ్రాఁతగాండ్రును సంస్కర్తలును సంస్కరించినవే కదా సంస్కర్తలు తా మెఱింగిన రీతిని సంస్కరింతురు సంస్కర్తలె మహాకవులు కారుగదా మహా కవులె యగు లాక్షణికులు తమ కాలములందలి తాళపత్ర మాతృకలను జూచి యుండరా? ''ప్రయోగశరణా వైయాకరణాః'' అను పరిభాష వారెఱుంగనట్టిదా? వారు భాషానియమనము చెయునపుడు మహాకవి ప్రయోగములనే కదా పురస్క

రించుకొందురు ఆ యా కవులు వ్రాసిన తాళపత్ర మాతృకలు లభింపవుగదా, "యథా శివమయో విష్ణుఁడు", "కృతం కర్మశుభాశుభంబు" అని సోమనారాధ్యుఁడు ప్రయోగించెననుట కంత యభాజనుఁడా బసవపురాణకర్త? వీరి సిద్ధాంతము చొప్పున (వికారి సంవత్సరాది సంచిక ౯౬ పుట) "కృతం కర్మ శుభాశుభంబు", "విను యథా శివమయో విష్ణుఁడు" అని కదా యుండవలయును ఇట్టివి సాధువు లని యే ప్రాచీన లాక్షణికుఁడైన వచించెనా? ఇట్టి వ్రాఁతలు తమ యజ్ఞతను వెల్లడించును గాని తమ మనోరథము చొప్పునఁ దామును విమర్శకులె యను పేరు తెచ్చునా? పండితులున్న వారు కొందఱైనను జూడరా?

వీరికి 'వైరిపదము' అనఁగా నేమో తెలియక "కలగాయ పులగముగా" నా యా గ్రంథములలోని యా యా సందర్భముల నెల్ల నెక్కించిరి "వాఁడి మయూఖములు, వేఁడి పయోధారలు" మున్నగు నవి వైరిపదము లనుట సరియా? ఇట్టివి వైరి పదములని భ్రమించియే కావలయును బంతులుగారు "నన్నయాదుల ప్రయోగములలో వైరిపదములు గలవనిరి (సంవత్సరాది సంచిక ౧౧వ పుట) "కోమలిఁ పఁ డ ఁగ " అని పద్యము ఛందోదర్పణము ... రాయి వి రే ప్రతిని చూచిరో?

... పదములతో సంస్కృతపదములు సమసించుట వైరిపదముకాదని ... ప్రాచీన లాక్షణికుఁడైనఁ జెప్పెనా? ... సంస్కృత సమాస మధ్యగ... 'ఓడ' శబ్దము కాదు (౧౧ ... ఆ ౭౭-౮౪) 'ఓడ' శబ్దము వైకృతము ... తెలిసినచోఁ బంతులుగారిట్టి ... గల్పించియుండరు "సంసారార్ణవయోడ" (కావ్యాలం ౯ ఉల్లా-౬౧ పు-౧౩౩వ ప) అనునది వైరిపదమె వీరు ప్రాచీన గ్రంథముగా నంగీకరించిన కావ్యాలంకారచూడామణిలోనే యున్నది గదా! "ఓడ-నావ-పోతః" (వైకృతదీపిక) "ఓడ వై వి కలము-నావ" (శ ర) ఓడ-వి (సం-పోతః-ప్రా-- వేడో- బేడో- తమి-ఒడం-కర్ణా-ఓడ) నావ (శ్రీ-సూ-రా-ని)

"కం. క్షీరార్ణవ కూఁతురు సం। సారార్ణవ యోడ శుభ మొసఁగు మీ కనఁగా
వైరిపదం బగుఁ దెలుఁగునఁ। గూరని సంస్కృతముఁ దెనుఁగు గూర్చుటచేతన్"
(కావ్యాలం ౨౧వ పు ౧౩౩వ ప) అను పద్యమును వీరు సంవత్సరాది సంచికలో
౧౨౭వ పుటలో నుదాహరించియు నున్నారు కావి యర్థమును దెలిసి యుదాహ
రించిరా యేమి? "పది - కొడుకు" శబ్దములు శబ్దరత్నాకరమున వైకృ
తము లని వ్రాయఁబడెను అఱవ కన్నడములలో సంబంధి పదము లున్నంత
మాత్రమున వైకృతములు కావనరాదు అఱవ కన్నడములలో మాత్రము
వైకృతపదములు లేవా?

"పూర్వపదము సంస్కృతసమమై ఉత్తరపదము తెనుఁగుపదమైనపు డది
వైరిపదము"(వికారి సంవత్సరాది సంచిక ఆంధ్రపత్రిక ౧౨౩వ పుట) 'అంబుజ
పతి' అనుటలోని 'అంబుజ' అనునది సంస్కృత సమమా? "సంస్కృత సమ
శబ్దము, సంస్కృతశబ్దము" అను వాని భేదము తెలియదు పంతులుగారికి ఇట్టి
యమ్మేలకు సంస్కృతము 'అగ్గబుయ్య' కదా! అజ్ఞాతా భూయిష్ఠము లగు నిట్టి
వ్రాఁతలు వ్రాయనగునా? 'పుడమి' శబ్దము 'పృథివి' శబ్దభవ [illegible] యొకచోఁ
జెప్పినంత మాత్రాన [illegible] చో [illegible] సంస్కృత [illegible] బ్దమని సాధించుట [illegible]
[illegible] మొ చోటను సంస్కృ[illegible] గాగాదా?
[illegible] సాధిం
[illegible]
[illegible] రాదా? 'లక్ష్మి' శబ్దమునకు
[illegible] 'లక్ష్మి' [illegible] తత్సమ
[illegible] యెవ్వరును జెప్ప
[illegible] రూపము [illegible] గీకరించి పాపము!
[illegible] నంగీకరించినను
క్షతి లేదే.

ఏదో గొప్పవిషయముఁ గనిపెట్టినట్లు "అరణ్యపర్వ శేషమున ఉప ఆ ౯-౨ లో సొంతమైన యశశ్శబ్దమును 'యశశాలి' అని 'అదం'తముగా ప్రయోగించి యున్నాఁడు తత్సమ పరిచ్ఛేద వివరణమున వ్యా-సం-స-ము లో పై ప్రయోగము లెవియు నుదాహరింపఁబడి యుండలేదు" అని పంతులుగారు వ్రాసిరి యశశ్శబ్దము సకారాంతము మాత్రము సాధింపఁబడెనా? దాని 'అర్శ ఆద్యచ్' ప్రత్యయ రూపమును సాధించుటకు! సంస్కృత శబ్దముల ప్రాతిపదికములను మాత్రమె గ్రహించి యాంధ్రరూపముల ప్రక్రియ యందు సాధింపఁబడె నని తెలియదా?

కోడుగంటివారి వీథి,
విజయనగరము,
1-6-1959

ఇట్లు సుజన విధేయుఁడు,
వఝుల చినసీతారామస్వామిశాస్త్రి,
గ్రంథకర్త

# ఉదాహృత గ్రంథముల సంకేతములు

-o-

| | |
|---|---|
| వ్యా-సం | ఆంధ్ర వ్యాకరణ సంహితా సర్వస్వము |
| ద్రా-పరి | ద్రావిడ భాషా పరిశీలనము |
| వై-పా | ఆంధ్ర వైయాకరణ పారిజాతము |
| చిం-పరి | ఆంధ్ర శబ్ద చింతామణి విషయ సంశోధనము |
| బా-వ్యా | బాల వ్యాకరణము |
| ప్రౌ-వ్యా | ప్రౌఢ వ్యాకరణము |
| అహో | అహోబల పండితీయము |
| కవిశిరో | కవి శిరోభూషణము |
| ఆం-చిం | ఆంధ్ర శబ్ద చింతామణి |
| కావ్యాలం | కావ్యాలంకార చూడామణి |
| వికృతి | వికృతి వివేకము |
| నరస | నరస భూపాలీయము |
| ఆం- ఆది- సభా- మొ ) | కవిత్రయాంధ్రీకృతభారతము-ఆదిపర్వము -సభా- అరణ్య-విరా-ఉద్యో-భీష్మ-ద్రోణ-కర్ణ-శల్య-సౌప్తి - స్త్రీ- శాంతి-అను-అశ్వ-ఆశ్ర-మౌస-మహా-స్వర్గా |
| ఉ-హరి | ఉత్తర హరివంశము-నాచన సోమనాథ కృతి |
| బసవ | బసవపురాణము-పాల్కురికి సోమనారాధ్య కృతము |
| నైష-(కాశీ మొ ) | శ్రీనాథకృతులు-శృంగార నైషధము-కాశీఖండము మొ |
| మనుచ | మనుచరిత్రము-స్వారోచిష మను సంభవము |
| వానివాని సంజ్ఞలు | వివిధ ప్రబంధములు |
| ముగ్ధ | ముగ్ధబోధ వ్యాకరణము |
| కవికల్ప | కవి కల్పద్రుమము |
| దుర్గా | దుర్గాదాస వ్యాఖ్య (ముగ్ధబోధ వ్యాకరణము) |
| శ్రీరామ | శ్రీరామతర్క వాగీశ వ్యాఖ్య (ముగ్ధబోధ వ్యాకరణము) |

| | |
|---|---|
| గిరిశ | గిరిశ చంద్ర విద్యారత్న వ్యాఖ్య (ముగ్ధబోధ వ్యాకరణము) |
| సి-కౌ | సిద్ధాంత కౌముది (భట్టోజీ దీక్షిత విరచితము) (బాల మనోరమా వ్యాఖ్యతో నున్నదాని సూత్రసంఖ్య ) |
| బాలమ | బాల మనోరమా వ్యాఖ్య (సిద్ధాంతకౌముదిది) |
| తత్వ | తత్వబోధినీ వ్యాఖ్య (సిద్ధాంతకౌముదిది) |
| మహాభా | వ్యాకరణ మహాభాష్యము (పతంజలి ఋషికృతము) |
| శ-ర | శబ్ద రత్నాకరము |
| శబ్దా-చిం | శబ్దార్థ చింతామణి |
| శబ్దస్తో | శబ్దస్తోమ మహానిధి |
| సూ-రా-ని | సూర్యరా యాంధ్ర నిఘంటువు |
| లింగా | లింగాభట్టీయము |
| సర్వ | సర్వశబ్ద సంబోధిని |

— ० —

# విషయ సూచిక

## తత్సమ పరిచ్ఛేదము **78-149**

## కారక పరిచ్ఛేదము 208-241

## తద్ధిత పరిచ్ఛేదము 299-311



## సంస్కృత తద్ధితములు-అపత్యార్థకములు 312-342

## కృదంత పరిచ్ఛేదము (ఆచ్ఛికము) 432-446

శ్రీ వాగ్దేవతాయై నమః

# బాలవ్యాకరణోద్ద్యోతము

## సంజ్ఞాపరిచ్ఛేదము



### కావ్యసంస్కృతభాషకు వర్ణము లేఁబది ౧

(వ్యా-సం-౫-విష) (బా-సంజ్ఞా ౧ సూ)

"అ-ఆ-ఇ-ఈ-ఉ-ఊ-ఋ-ౠ-ౡ-ౡ-ఏ-ఐ-ఓ-ఔ" అనునవి (౧౪) యచ్చులు=(స్వరములు-ప్రాణములు) ం-ః (౨) ఉభయములు "క-ఖ-గ-ఘ-ఙ, చ-ఛ-జ-ఝ-ఞ ట-ఠ-డ-ఢ-ణ, త-థ-ద-ధ-న, ప-ఫ-బ-భ-మ, య-ర-ల-వ, శ-ష-స-హ-ళ" అనునవి (౩౪) హల్లులు = (వ్యంజనములు-ప్రాణులు) 'అచ్చులు - హల్లులు' అను సంజ్ఞలు మాహేశ్వరసూత్ర ప్రత్యాహార సిద్ధములు ''అ-ఇ-ఉ ణ్ ఋ-ఌక్ ఏ-ఓ ఙ్ ఐ-ఔచ్ హ-య-వ-రట్ ల ణ్ ఞ-మ-ఙ-ణ-నమ్ ఝ-భఞ్ ఘ-ఢ-ధష్ జ-బ-గ-డ-దశ్ ఖ-ఫ-ఛ-ఠ-థ-చ-ట-తవ్ క-పయ్ శ-ష-సర్ హల్ ఇతి మాహేశ్వ రాణి సూత్రాణి " = ఇవి మాహేశ్వర సూత్రములు వీని తుదిహల్లు 'ఇత్' సంజ్ఞ గలది అంత్యమగు నిద్వర్ణముతోఁ గూడిన యాదివర్ణము ప్రత్యాహార సంజ్ఞ గలది

ముగ్ధబోధవ్యాకరణమున (ముగ్ధబోధము పాణినియానుసారి) నీ ప్రత్యాహారములకు బదులుగా 'సమాహార'ము లని వ్యవహరింపఁబడును అందును 'అచ్చు'లనియే వాడఁబడును గాని 'హల్లు' లనుటకు మాఱుగ 'హస్సు' లని వాడఁబడును అందలి సూత్రము లు''అ-ఇ-ఉ-ఋ-ఌ-క ఏ-ఓ-ఙ ఐ-ఔ-చ హ-య-వ-ర-ల ఞ-ణ-న-ఙ-మ ఝ-ఢ-ధ-ఘ-భ జ-డ-ద-గ-బ ఖ-ఫ-ఛ-ఠ-థ చ-ట-త-క-ప, శ-ష-సా ద్యన్తాఖ్యాః ఏషాం మధ్యే యే వర్ణాస్తే ఆదివర్ణాన్త వర్ణ 'సమాహార' సంజ్ఞాః స్యుః" (ముగ్ధ-౩వసూ) పాణిని ముని

నాఁటికి "ల" (ళ) కారోచ్చారణము రాలేదు, దీనిని 'ళ' అని పల్కుట అప్పు
అది (ళ) ద్రావిడవర్ణము

'ం' అనుస్వారము 'ః' విసర్గము 'క-ఖ' లకు ముందటి విసర్గము
'ꣳ' = జిహ్వామూలీయము 'ప-ఫ' లకు ముందటి విసర్గము 'ꣳ' = ఉపధ్మా
నీయము అనుస్వార విసర్గము లుభయము (అచ్చులు-హల్లులు) లనఁబడును
ఇందలి యనుస్వారము నకార జన్యము, విసర్గము సకారజన్యము

## 'ఱ-ల' (ళ) అక్షువాని వివరణము

౧ వ వివరణము 'ఌ' కారము సంస్కృతమందును, ద్రావిడ భాషలం
దును[1] గలదు 'Pleasure' అను నాంగ్లశబ్దములోని 'sure' అనుదానివంటి
దానిలోనిది దీని యుచ్చారణము 'ఌ' అను నీలిపి ప్రాచీనాంధ్రశాసనములందుఁ
గలదు "ఈ ఌ నము = (ఈలనము) = (స్తుతి), హే ఌ నము (హేలనము) =
(పరిహాసము)-మున్నగు శబ్దములలోనిది 'ఌ' కారమె దానిని 'ల' (ళ) కారము
గాను 'డ' కారముగాను బల్కుట యర్వాచీనము అలఘు 'ల' (ళ) కారోచ్చార
ణము "వ్యాల, గోలా"ది శబ్దములలో నర్వాచీనముగా నేర్పడినది రెండచ్చుల
నడిమి 'డ' కారము నీషత్ స్పృష్టముగా, ననఁగా 'ఌ' కారముగా సయితము
పల్కుదురు [2]

## ప్లుతము - ఌకారము

౨ వ వివ వైదిక సంస్కృతభాషకు వర్ణము లఱువది నాలుగు [3]
అందుఁ బై నుదాహరించిన 'ఌ' కారము, (దుస్స్పృష్ట) ప్లుతాక్షరములును
గలవు కావ్యసంస్కృతమునఁ బ్లుతాక్షరములు లేవు దూరాహ్వాన గాన రోద

---

1 సంస్కృత ప్రాకృతములు, పాళీ-హిందుస్థానీ, బెంగాలీ, ఉరుదు
మొదలైనవి గౌడభాషలు అఱవము, కన్నడము, తెలుఁగు, మలయాళము
మొ॥ ద్రావిడభాషలు

2 'అజ్మధ్యస్థ డకారస్య' ఌ (డ) కారం బహ్వృచా జగుః (సాయన
భాష్యము) 'యుద్ధ స్తఖడ్గపరిధూత ' (ద్వితీయ కులోత్తుంగ చోడదేవుని
పొందువ గ్రామశాసనము ఇండియన్ ఏంటిక్వేరీ ౧౪ వ నెంబరు)

3 - "త్రిషష్టి శ్చతుష్షష్టిర్వా। వర్ణా శ్శమ్భు మతే మతాః । ...దుస్స్పృష్ట

నాదులందు సంస్కృతమునఁ బ్లుతము వాడఁబడును. దాని లిపి '౩' అనునది కావ్యసంస్కృతమున నట్టి యెడల సైతము ఏక మాత్రా ద్విమాత్రారూపము లగు (మాత్ర యనఁగా సెకండులో నయిదవ వంతు కాలము) హ్రస్వదీర్ఘ స్వరములె వాడఁబడును సీ హా మహారాజ, మహామహిరక్షణదక్ష దక్షిణ బాహుదండ, దండితారాతి, నిషధరాజాగ్రణీ, ... విడిచి ఆ వె . అఱచుచున్నదాని యాక్రందనధ్వని (ఆర ౨ వ ఆ ౧౨-౧౧-ప)

౩ వ వివ 'ౠ' అను దీర్ఘవర్ణమును బాణినీయు లంగీకరింప కున్నను నితర సంస్కృత వ్యాకర్తృ ప్రభృతు లంగీకరించుచున్నారు మాతృకాపూజలో 'ౠ' కార మావశ్యకము వాగ్దేవతాకార లేఖనమున నీ వర్ణము గలదు "ౠం నమో దక్షిణగణ్డే ౠం నమో వామగణ్డే" (వర్ణోద్ధారతంత్రము, శబ్దకల్ప ద్రుమకోశము) "సీ ౠవర్ణద్వంద్వ ముభయదంతచ్ఛదములు" (అప్పక ౨వ ఆ ౩౯-౩వ ప)

## లఘ్వలఘు 'య-వ'లు - శ్వాసనాదాది సంజ్ఞలు

౪వ వివ సంస్కృతమున 'య-వ' లకు లఘ్వలఘూచ్చారణ భేదము ప్రాచీనకాలమునను గలదు లకారమున కట్టి భేద మర్వాచీనముగఁ గల్గెను 'వ్యాల-గోల-గరల-సరలా' దిశబ్దములం దలఘు లకారోచ్చారణ మర్వాచీనముగఁ బ్రసిద్ధమై యున్నది వర్ణసమామ్నాయమున లఘ్వలఘువులకుఁ బృథగ్గణనము లేదు [1] లఘ్వలఘువులగు 'య-వ-ర' లను వేఱుగ గణింపని నన్నయ 'ల'= ళ) కారమునకుఁ బృథగ్గణనము చేసె ననుట విశ్వసింపఁదగినదిగాదు సూరి 'ళ' కారమును సంస్కృతవర్ణసమామ్నాయమునఁ జేర్చుట సరికాదు అయ్యది ద్రావిడ మూర్ధన్య 'ళ' కారము 'గయ్యాళి-కూళ-తుళ్ళు' మున్నగు

---

శ్చేతి విజ్ఞేయః । ౠకారః ప్లుత ఏవ చ" (వై పా ౨-౨౫ విష పాణినిశిక్ష) దుస్స్పష్టమనఁగా 'ఌ' కారము

1 వ్యోర్లఘుప్రయత్నతర శ్శాకటాయనస్య (౮-౩ ౧౮) (సి కౌ ౧౬౮వ సూ) "యశ్రుతిరః (౧-౩-౧౦) అకారపూర్వః అకారః లఘుప్రయత్నతర యకారశ్రుతి ర్భవతి ఆయవో" (షడ్భా-౧౧ వ పుట) "దన్త్యచజౌ గురు రలౌచ బిన్దుయుతౌ" (వ్యా-సం-౨౯ 11 విష) "లఘువోఽలఘవశ్చేతి । ద్వేధా నస్థాన్ విదన్తి శాస్త్రారః" (అం-చిం) (వ్యా-సం ౫౪ విష)

శబ్దములలోనిది దంత్యమగు నలఘు 'ల' కారము మూర్ధన్యమగు 'ళ' కార ము గాఁ బల్కుటయు దాని లిపితో వ్రాయుటయు సరికావు గొట్టు 'ల' కారముగ నలఘు లకారమును వ్రాయవలయునని నన్నయ సూత్రించెను "దన్త్యచజౌ గురు కలౌచ బిన్దుయుతౌ" (వ్యా-సం ౨౯ 11 వి) ఇప్డు దన్త్యచజలపై '‿' అని నిల్పుదురు

౩వ వివ 'క-ఖ-గ-ఘ-ఙ' అనునవి 'క'వర్గము ఇట్లే తక్కిన వర్గము లను దెలియనగును వర్గప్రథమ ద్వితీయములును విసర్గమును 'శషసహ' లును శ్వాసములు, తక్కిన యక్షరములు నాదములు వర్గద్వితీయ చతుర్థములును, శ-ష-స-హ, విసర్గములును మహా ప్రాణములు తక్కినవి యల్పప్రాణములు 'ఙ-ఞ-ణ-న-మ' లును, ననుస్వారమును ననునాసికములు వర్గాక్షరములెల్ల స్పర్శములు 'య-ర-ల-వ' లంతస్థములు 'శ-ష-స-హ' లూష్మములు వకా రము దంతోష్ఠ్యము 'ఏ-ఐ-ఓ ఔ' లు సంధ్యచ్చులు ఐకారోచ్చారణమున 'అ-ఇ' అనునవియును, 'ఔ' కారోచ్చారణమున 'అ ఉ' అనునవియును, విశ్లిష్టావయవములుగా సంధించియుండును 'ఏ-ఓ' ల యుచ్చారణమున నవి ప్రశ్లిష్టావయవములుగా సంధించియుండును (విశ్లిష్ట=వేఱయిన, ప్రశ్లిష్ట= కలిసిన) 'అ-ఆ-ఏ-ఐ-ఓ-ఔ' లును 'క' వర్గమును, 'ꣳక' 'ꣳఖ' అనునవి యును జిహ్వామూలీయములు (వీనిని పాణినీయులు కంఠ్యము లనుట సంకాదు) 'హ' కారము మాత్రమె కంఠ్యము. 'ఇ-ఈ-ఏ-ఐ' లును 'చ'వర్గమును 'య-శ' లును దాలవ్యములు 'ఉ-ఊ-ఓ-ఔ' లును 'ప' వర్గమును ఉపధ్మానీయమును (ꣳప-ꣳఫ) నోష్ఠ్యములు 'ఋ-ౠ' లును 'ట' వర్గమును 'ర-ష' లును మూర్ధన్యములు రకారమును దంత్యమె యని ప్రాతిశాఖ్యములు చెప్పుచున్నవి 'ఌ-ౡ' లును, 'త' వర్గమును, 'ల-స' లును దంత్యములు వ కారము దంతోష్ఠ్యము

## గురులఘ్వాది సంజ్ఞలు

౬ వ వివ అచ్చులలో హ్రస్వ మేకమాత్రాకాలికము దీర్ఘము ద్విమాత్రా కాలికము త్ర్యాదిమాత్రాకాలికము ప్లుత మందురు అది కావ్యసంస్కృతమున లేదు వ్యంజన మర్ధమాత్రాకాలికము మాత్రాకాలమనఁగా సెకండులో (౧/౨) నయిదవవంతు కాలము అచ్చే యక్షరము వ్యంజన మక్షరాంగము 'క్ర్' మున్న

గునవి యేకమాత్రికములె సంస్కృతమునఁ బద్యపాదాంతము పాక్షికముగ గురువగును తెల్గునఁ బాదాంతత్వము గురుత్వహేతువుగాదు ఏకమాత్రికమగు హ్రస్వము లఘువు ద్విమాత్రికమగు దీర్ఘము గురువు హల్ సంయోగ విసర్గాను స్వారములకు ముందటి హ్రస్వాచ్చును గురువె 'ప్ర-హ్ర' అను సంయోగము లకు ముందటి హ్రస్వాచ్చు వికల్పముగా గురువగును చ కృప కృతవర్మలం గడిమి గిట్టి శిఖండి ప్రభద్రకుల్ (శల్య ౧ వ ఆ. ౨౨౧) కం చూతఫలంబ। య్యవనిజమువలన నమ్మని। ప్రవరు పృథూత్సంగతలముపై వడిఁ బడియెన్ (సభా-౧వ ఆ. ౧౪౩) "ఈదంతా ఇద్వ్రదేవ కృత హ్రస్వాః"(అం-చిం) కం సంద్రం। బననౌ శతతాళదఘ్న హ్రదమునఁ బడియెన్ (కళా. ౪వ ఆ ౫౧వ ప) వెలిగందలనారయాది సామాన్య కవులు క్రావడికి ముందున్నదెల్లఁ బాక్షికముగ లఘు వనునట్లు ప్రయోగించిరి అవి ప్రామాణికములు కానేరవు "క ఆరయ వర్ణింపలేరు హరబ్రహ్మాదుల్ (భాగ ౧౧వ స్కం-౬౧) ఘనతరముగఁ జంద్ర సూర్య గ్రహములఁజూడన్(భాగ ౧౨వ స్కం ౧౨),౧౧-౧౨ స్కంధముల కర్త వెలిగందల నారయ చూ, వ్యా-సం-30, IV విష విస్తరము)

## సంయోగ పూర్వ గౌరవము

కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణసార సంగ్రహమున (౨వఆ-౨౩) పద్యాదులలో క్రారకు ముందటిది పాక్షికముగ లఘు వనుచు మహాకవి ప్రయోగ ములు చూప యత్నించెను "గీతవాద్య వినోద క్రియలఁ దగులు"(కాశీ ౪వ ఆ) ఇది నావద్దనున్న సాతాని ప్రతిలో సైతము "గీతవాద్యవినోదకేళిఁ దగులు" అని యున్నది ఉ "కావునఁ గామక్రోధములఁ గ్రాచు"(శాంతి ౨వ ఆ-౨౫౧) ఇది వావిళ్ళవారి ప్రతిలో "కావునఁ గామరోషములఁ గ్రాచు" అని యున్నది

సంస్కృతమందువలెఁ గాక తెల్గునఁ బొల్లు వ్యంజనమునకు ముందటి యక్షరము గురువగును ఉ . .రాజమహేంద్రుఁ డున్నతిన్ (ఆది ౧వ ఆ-౩) ఇందలి 'తిన్' అనునది గురువు

తెలుఁగున వ్యస్తపదాదిస్థ హల్సంయోగమునకు ముందటి లఘువు సంస్కృతమందువలె [illegible] కానేరదు ఉ నరపాలుఁడు శాపముఁ గ్రమ్మ [illegible] (ఆది ౧వ ఆ-౧౨౧) తెల్గునందును సిద్ధసమాసములందు భిన్న పదాదిస్థసంయోగమునకు ముందటి హ్రస్వము గురువే యగును. కం......విని

ధాగమ విహితశ్రమముఁడు తుహినకరుఁ డురుకాంతిన్ (ఆది ౧వ ఆ ౪) సాధ్య సమాసమం దట్లు కానేరదు కం. 'వచ్చిన క్షత్రియులెల్లను...'సాధ్యసమాసము లందును దీర్ఘము హ్రస్వమగుటకు నిమిత్తమగు భిన్నపదాదిస్థ సంయోగమునకు ముంటటి హ్రస్వము గురు వగును ఉ అమ్ముదితన్ విభీతహరిణాక్షి... (సభా ౨వ ఆ-౨౪౭) 'అద్రుచు-విద్రుచు' మున్నగు నాచ్ఛికము ౩౦-౩౧ సూత్రపు 'ద్రు'వర్ణకమునకు ముందటి హ్రస్వము సమానపదమయినను గురువు కాదు 'చి దుపలు' (ఇది శిథిలద్విత్వము) శబ్దమందలి 'ద్రు' వర్ణమునకు ముందటి హ్రస్వమును సమానపదమైనను గురువుకాదు ఉదా చ ఎద్రిచిన .।అద్రి చిన . ।విద్రుమపఁగ ।చిద్రుపలు .. . (ఉ హరి ౪వ ఆ ౧౦౫) 'కద్రువ' అనుదానిలోని 'క' గురువె ఇట్లు తక్కిన సమాన పదసంయోగ పూర్వాక్షర మెల్ల గురువె యగును

## ప్రాకృతవర్ణ సమామ్నాయము

### మహారాష్ట్రిప్రాకృతమునకు వర్ణములు

నలువది ౨ (బా సంజ్ఞా ౨) (వ్యా-సం-౧౭ విష)

"అ-ఆ-ఇ-ఈ-ఉ-ఊ-ఏ-ఓ" అనునవి (౮) యచ్చులు 'ం' అను స్వార ముభయము "క-ఖ-గ-ఘ-ఙ, చ-ఛ-జ-ఝ-ఞ, *, ట-ఠ-డ-ఢ-ణ, త-థ-ద-ధ-న, ప-ఫ-బ-భ-మ, య-ర-ల-వ-స-హ'' అనునవి (౩౧) హల్లులు 'ఎ-ఏ-ఒ-ఓ' లు వక్రము లనియు, 'ఐ-ఔ'లు వక్రతమము లనియుఁ బ్రాచీనులు వ్యవహరింతురు ఇట్టి సంజ్ఞలు వాని యాకృతినిబట్టి కల్గియుండును

౧౬ వివ ప్రాకృతము లారు విధములు ౧ మహారాష్ట్రి ౨ శౌర సేని ౩ మాగధి ౪ పైశాచి ౫ చూళికాపైశాచి ౬ అపభ్రంశి ఇందలి మహారాష్ట్రికిఁ

---

* ప్రాకృతమున 'ఙ-ఞ'లు గలవు విసర్గములేదు 'ళ' కారము గలదు గాని యలఘువుగాన దానికిఁ బృథగ్గణనము లేదు కాన సూరి'విసర్గ-శ'కారముల నుదాహరించుట సరికాదు వానిని విడిచి 'ఙ-ఞ' లను గ్రహించి చత్వారింశత్సంఖ్యను బూరించుట యుక్తము ''ఙ-ఞౌ' స్వవర్గసంయుక్తౌ భవత ఏవ అహఙ్కారో-అఞ్చితం'' (చండవ్యా స్వరవిధా ౧౫) 'లోలః '(౩-౨-౪౦)= పైశాచ్యాం లోలకారః స్యాత్ ముకులో (షడ్భా ౧౪౮వ పుట) మహారాష్ట్రిలో నది 'ళ' కారమె

ప్రాకృతమనియుఁ బేరుగలదు ఇదే తక్కినవానికన్న ముఖ్యము. మాగధిలో 'శ' వర్ణమును, జిహ్వామూలీయమును గలవు కావున మహారాష్ట్రియే "ఆద్యాయాః పఞ్చాశ ద్వర్ణాః । ప్రకృతే స్తు తే దశోనాః స్యుః" అను చింతామణి కారికచే న ద్దేశింపఁబడె ననందగును

౨వ వివ ప్రాకృతమున దంత్య చజలు లేవు(చూ వ్యా సం-౧౮ వివ) అవి గలవనెడి యహోబలాప్పకవ్యాదుల వ్రాఁతలు ప్రామాదికములు

౩ వ వివ సంస్కృతశబ్దముల నెల్ల సాధారణముగ నాంధ్రవిభ క్త్యాది యోగమున సంస్కృత సమములుగ వాడుకొనుచున్నట్లు ప్రాకృతశబ్దముల నెల్ల వాడరాదు 'మహాకవి వ్యవహారసిద్ధములను "సిరి-అగ్గి" మున్నగువానిని మాత్రమె వాడుకొనవలయును

౪ వ వివ ప్రకృతి (జనసామాన్యము) వ్యవహారసిద్ధము ప్రాకృతము ఈ వ్యుత్పత్తిచొప్పున వ్యావహారికభాష లెల్లఁ బ్రాకృతములె వ్యావహారిక భాషలు సంస్కరింపఁబడియే గ్రాంథికభాష లగును

## ప్రాకృతభేదములు—ఆంధ్రవర్ణమాల

అచ్చ తెలుఁగునకు వర్ణములు ముప్పదియేడు ౩ (బా—సంజ్ఞా ౩) (వ్యా సం ౨౦ వివ)

"అ-ఆ-ఇ-ఈ-ఉ-ఊ-ఎ-ఏ-ఐ-ఒ-ఓ-ఔ" అచ్చులు ౧౨ 'ఁ' అర్ధానుస్వారము, 'ం' పూర్ణానుస్వారము ఈ రెండు నుభయములు 'క-గ-చ-చ-జ-జ-ట-డ-ణ, త-ద-న-ప-బ-మ, య-ర-ల-వ-స-హ-ళ-ఱ" హల్లులు ౨౩

౧వ వివ తత్సమములు తెనుఁగే గాన'అచ్చ తెలుఁగు'న కని సూత్రింపఁ బడెను 'ఎ-ఒ-ఁ-చ-జ-ఱ' అనునవి (౬) ను తెల్గున మాత్ర ముండును

౨వ వివ 'చ-జ' లు తాలవ్యములు 'చ-జ' లు దంత్యములు 'చ-జ' చ్చ తెల్గున మాత్రమె యుండును సం స- మంచము అచ్చతెల్గు - మంచము సం-రాజు అచ్చతెల్గు-రాజు '౨' అను దంత్య'త'కార సంక్షేపపుగుర్తును

'చ-జ' ఁపై నిపుడు సిల్పెదరు 'చ-జ'లపై నొకబొట్టు నిల్పిన 'దంత్య' 'చ-జ'ల లిపి యగునని నన్నయ సూత్రించెను (వ్యా సం ౨౩ II విష) (చూ సంజ్ఞా ౧వ సూ ౪వ వి)

## ఱ-ఴ వివరణము

౩వ వివ ప్రాచీనతమకాలమున 'ఱ' కారము 'ట-త' మధ్య స్థోచ్చారణము గల్గియుండెడిది, కావుననె "కుఱు + ఉసురు = కుట్టుసురు" మున్నగు నెడల 'ట' కారస్థితి సంభవించెను కాని నన్నయ నాఁటికె దాని కలఘు రేఫోచ్చారణము గల్గెను దానికే కాక లకారమునకును నలఘూచ్చారణము సంభవించెను అట్లగుటచేతనే లఘు 'య, వ' లతో పాటుగ నలఘు 'ఱ-ళ' లకును వర్ణమాలలోఁ బృథగ్గణనము చేయలేదు అట్లయినను నితర ద్రావిడ మహాకవ్యాను రోధమునఁ దన భారతభాగమున నన్నయ 'ర-ఱ' లకు యతి ప్రాసమైత్రిని జేయలేదు తక్కిన కవులెల్ల నేదో యొకతీరున వానిమైత్రిని జేసిరి

౪వ వివ 'ఴ' కారము నన్నయనాఁటికె తెల్గున నశించినది అది 'డ' కారముగనో (ఏఴు = ఏడు) 'ల'-(ళ) కారముగనో (తమిల = తమిఴ) (హాసగన్నడమున పఴగన్నడ 'ఴ' కారము 'ళ' కారముగఁ బరిణమించెను) పరిణమించెను కాననె దానిని నన్నయ యచ్చాంధ్రవర్ణమాలలోఁ బరిగణింపలేదు కాని నన్నయకుఁ బూర్వపు యుద్ధమల్లుని బెజవాడశాసనమున నది లిఖింపఁబడి యున్నది (అఴిసిన-అస్సిన) ఇట్టి యలవాటుననె నన్నయకుఁ దర్వాతి పొందువ గ్రామ శాసనమందును (ఖఴ్గ = ఖడ్గ) నది లిఖింపఁ బడెను తమిఴమందు నేఁటికిని నట్టి వర్ణము నుచ్చారణము గలదు గాన దాని నచ్చ తెల్గున నిల్పితిని

## అర్ధానుస్వారాన్యదేశ్యములు

౫వ వివ ప్రాచీనతమకాలమున నర్ధానుస్వారము చోటఁ బూర్ణానుస్వారమే పల్కఁబడెడిది కాలక్రమమున నయ్యది తేలి నన్నయనాఁటి కర్ధానుస్వారముగఁ గొన్నిట నేర్పడెఁ నన్నయ భారత భాగమున మాత్ర మర్ధానుస్వారప్రాసము నియమితముగఁ గలదు ప్రాచీనతమకాలపు వాసనచే నన్నయకుఁ దర్వాతి కవులును గొందఱు ఖండానుస్వారముచోట దీర్ఘముమీఁద సైతము పూర్ణమునే ప్రాస

ములలోఁ బ్రయోగించిరి. క పోండిగ నగజతపశ్శిఖి । మూండు జగంబుల...బ్ర। హ్మాండ. [నన్ని-ఉ వ ఆ ౮౧౩ వ ప] నన్నయ చింతామణిలోఁ బూర్ణార్థములు పేర్కొనఁబడెను అట్టి పేరులే వాని యాకారమునకు నిరూపకము లనఁదగును

ఉ వ వివ నన్నయకాలమునకుఁ దురుష్కులయు, నాంగ్లేయులయు భాషలు తెల్గునఁ బ్రవేశించుట కవకాశము లేకుండుటచేత నన్నయ చింతామణిలో నన్యదేశ్యమును బేర్కొనలేదు తన భారత భాగమునఁ బ్రయోగింపనులేదు యయాతి చరిత్ర, మనుచరిత్రాదులలో నన్యదేశ్య (తురుష్క) శబ్దములు ధారాళముగ వాడఁబడినవి (నేఁటి కాంగ్లేయ భాషాపదములును గలవు) కాన నేఁటి వ్యాకరణములలో నన్యదేశ్యము నొకభాగముగ నంగీకరించుట యుక్తము అట్టి యన్యదేశ్యములలోని యనాంధ్రవర్ణములను దొలఁగించి వానిచోఁ దత్సన్నిహితాంధ్రవర్ణముల నిల్పుట యుక్తము అట్టి మార్పుచే నర్థస్ఫూర్తి ప్రతిబంధము గల్గుచో నట్టి యనాంధ్రవర్ణముల నిల్పుటయు యుక్తమె (షరా షరతు-మొ) శబ్దరత్నాకరాది కోశములలో నన్యదేశ్యములందే కాక కొన్ని యాంధ్రదేశ్యములందును ననాంధ్రవర్ణముల నిల్పుట పొరపాటు (అవమశించు-మొ) కొన్ని యన్యదేశ్యములు టాణా = (రాణా), టలాయించు = (రలాయించు), టికానా = (రికానా), పాయిదా = (ఫాయిదా), పిర్యాదు = (ఫిర్యాదు), సరాబు = (షరాపు), సికారు = (షికారు), హాజరు-హుకుము-హుజూరు-మొ, ఆంగ్ల కాపీ (కాఫీ), పీజు=(ఫీజు), హెడ్మేష్టరు=(హెడ్మేస్టర్) రైలు-రోడ్డు-కలెక్టరు-మొ

## అనాంధ్రవర్ణ నిర్దేశవిధాన విధులు

కవి ప్రయోగములందును సంజ్ఞాదులలో ననాంధ్రవర్ణములు ప్రాసాదులలోఁ బ్రయోగింపఁబడినవి అట్టి శబ్దముల నసాధ్య గ్రామ్యములుగా నంగీకరింపనగును

శా మక్కా మందువ పందువా । తుఖార. .। ప్రాక్షద్యోత... (నరస ౫వ ఆ ౨౪౪) క డుంరీఖ .లోలా। ద్యుంరేవమీఱ .(కవి సింగరయ్యగారి త్రైశంకవోపాఖ్యానము అప్పక ౫౬ ఆ ౧౫౪)

౭ ప వివ అనుకరణశబ్దములందలి యనాంధ్రవర్ణములను దొలఁగింపరాదు ఉదా గుభుల్-గుభుల్

౮వ విధ 'తాటాకు' మున్నగు రీతిగల శబ్దములందలి తాలవ్యతాదేశము నుచ్చరింపరాదు 'తాటాకు' అనురీతిని శుద్ధస్వరోచ్చారణమునే (యతినిబట్టి) చేయవలయును

౯వ విధ వర్ణనిర్దేశవిధానాదులందు బహుళముగా 'కార' ప్రత్యయమును ర' వర్ణమునకు 'ఇఫ' ప్రత్యయము నగును ఉదా ఆకారము-రేఫము-రకారము మొ॥ ఇవి సంస్కృత ప్రత్యయములు తెల్గున వర్ణనిర్దేశవిధానాదులందు హ్రస్వము దీర్ఘమగును దీర్ఘంబు దీర్ఘంబ ఉదా అకారమున కికారమగును- 'ఆ' కు 'ఈ' వచ్చును

౧౦వ విధ ద్వంద్వమున వర్ణములకు స్త్రీ సమత్వము పాక్షికముగా నగును ఉదా కచటతపలు-లళములు మొ॥

౧౧వ విధ పై విధులు గణాద్యక్షరములందును నగును ఉదా భకారము = భగణము "నజభజజజల్ జరేఫలఁ బెనంగి", "మసజమ్ము లిమ్మగ" వర్ణసంఘాతమందును బయివిధులు యథాప్రయోగముగ గ్రాహ్యములు ఉదా శ్రీకారము-పుప్ఫుభుభుల్ మూలకు విలసిల్లు పాఫాబాభామాలు- మొ॥ దీర్ఘాంత గణాద్యక్షరము తద్గణ ద్వయవాచి కానోపును ఉదా "భరనభారలగంబులఁ గూడి" మొ॥

ఋ-ౠ-ఌ-ౡ- విసర్గము ఖ-ఘ-ఛ-ఝ-ఠ-ఢ-థ-ధ-ఫ-భ-ఙ-ఞ-శ-ష లు సంస్కృత సమాన్యదేశ్యానుకరణాదులం గూడి తెల్గున వ్యవహరింపబడును ౪ (బా సం ౪వ సూ) (వ్యా సం 27 విష)

## తత్సమశబ్దమాత్ర వర్ణములు

ఋతువు-పితౄణము (పితృ + ఋణము) (కేవల ౠకార ఘటిత శబ్దములు కావ్యములం దప్రయుక్తములు) క్లృప్తము- (రచింపఁబడినది) ఌకారము (కేవల ఌకార ఘటిత శబ్దములు కావ్యములం దప్రయుక్తములు) దుఃఖము-ఖడ్గము-ఘటము-ఛత్రము-ఝరము-కంఠము-[తెల్గున వర్గపంచమాదేశము లేదు] ఢక్క-రథము - ధరణి-ఫణము - భయము*-శార్ఙ్గము-ఆజ్ఞ-శరము-షండము

---

* తెల్గున వర్గపంచ మాదేశము లేమింజేసి 'పంక్తి' శబ్దమును సూరి ఙకారోదాహృతిగ నిచ్చుట సరిగాదు

## తెల్గున వర్గపంచమాదేశము

౧ వ వివ సంస్కృతమున వర్గపంచమాదేశము గలదు* గాని యట్టి సంస్కృతశబ్దము తత్సమ మగుచు తెల్గునకు వచ్చునపు డందలి వర్గపంచమముచో నిండుసున్న నిల్చును (సం) శఙ్కరః=(సం-సమ)=శంకరుఁడు శంకరాజ్ఞ మొ॥ పదాన్తమం దీవిధి సంస్కృతమందే వైకల్పికము, ఉదా సంగమః=సఙ్గమః మొ॥ తెల్గున వర్గపంచమాదేశము లేదనుట కీ క్రిందిరీతి మహాకవి ప్రయోగములు మూలము కం పంగుల మూకాంధుల వికలాంగులను నబాంధవుల దయం బ్రోతె భయార్తుం గడిఁది శత్రునైనను। సంగర రంగమునఁ గాతె శరణం బనినన్॥ (సభా-౧వ ఆ-౪౫) అచ్చ తెల్గున 'ఙ-ఞ' లు లేవుగదా (చూ వ్యా సం ౨౮ విష దీని విస్తరము) బిందు యతియు వర్గపంచమాదేశము తెలుఁగున లేదని వచించుచున్నది

'క-చ-ట-త-ప' ల పరుషంబులని 'గ-జ-డ-ద-బ'లు సరళంబులని చెప్పంబడును ౫ (బా సం ౫ వ సూ) (వ్యా సం ౩౦ విష) ఇతరములగు హల్లులు స్థిరములు ౬ (బా సం ౬ వ సూ) (వ్యా సం ౩౦ విష)

ఖ-ఘ-ఙ, ఛ-ఝ-ఞ, ఠ-ఢ-ణ, థ-ధ-న, ఫ-భ-మ, య-ర-ల-వ-శ-ష-స-హ-ళ-ఱ (స్థి ములు)

౧ వ వివ సంజ్ఞ ౭ వ సూత్రము చెప్పునఁ దాలవ్య 'చ-జ'లు దంత్య చ-జ లకు గ్రాహకములు గాన 'చ' కారమును బరుషమె 'జ' కారమును సరళమె లఘ్వలఘువులగు ద్వివిధ 'య-ర-ల-వ' లును స్థిరములె

౨ వ విప ప్రాతిపదికము = నామము ప్రత్యయము = వర్ణకము = వన్నియ క్రియ = ధాతువు 'న్-(నకారము) ను-ని' అనునవి ద్రుతములు

## దంత్య, తాలవ్య 'చ జ' లు

దంత్యతాలవ్యంబులయిన 'చ-జ'లు సవర్ణంబులు ౮ (బా సం ౮ వ సూ)(వ్యా సం ౩౧ విష) తాలవ్య 'చ' కారంబు దంత్య 'చ' కారంబునకును దాలవ్య 'జ' కారంబు దంత్య 'జ' కారంబునకును గ్రాహకములని తాత్పర్యము

---

* అనుస్వారస్య యయి పరసవర్ణః (౮-౪-౫౮) వా పదాన్తస్య (౮-౪-౫౯ సి కౌ ౧౨౪, ౧౨౫ సూ)

'ఇ-ఈ-ఎ ఏ' లం గూడిన 'చ-జ' లు తాలవ్యంబులు ౮ (బా సం ౮) (వ్యా సం ౩౧ 1విష (

చిలుక-చీమ-చెవి-చేమ-జిల = (దురద)-జీడి-జెట్టి-జేజే = (దేవత, జేజ రూపాంతరము )

'అ-ఆ-ఉ-ఊ-ఒ-ఓ-ఔ' లం గూడిన 'చ-జ'లు దంత్యములు ౯ (బా సం ౯వ సూ ) (వ్యా సం, ౩౧ - 1 విష )

చలి-చాప -చుక్క - చూపు - చొక్కు = (పారవశ్యము)- చోటు-చౌక జముడు-జాతర =(ఉత్సవము)-జున్ను-జూలు-జొన్న-జోలి = (సంబంధము)-జౌకు = (మెత్తగిల్లు) ఐదంతములయిన 'చ-జ'లు సమేతరములం దుండరాదు

౧వ విష సమేతరము లనఁగా సంస్కృత సమేతరములు అందు 'ఐ' దంత 'చజ' లుండరాదు గాని కొందఱు సామాన్య కవులు ప్రయోగించిరి సీ చైవుల సాకిరిబాయ మగఁడు (ఆంధ్రనామ సంగ్రహము) ఉ చక్కెర బొమ్మ మార్మలయు చైవులకున్ . (శుకస ౧వ ఆ సూ రా ని )

౨వ విష దంత్య 'చ-జ' ల యుచ్చారణమునుబట్టి యవి దంత్యతాలవ్య 'చ-జ' లనఁదగియున్నను 'కురుపాండవ' న్యాయముననవి దంత్య 'చ-జ' లని వ్యవహరింపఁబడుచున్నవి

౩వ విష సంధిస్థలములందు సంధి పూర్వావస్థలోని దంత్యతాలవ్యతలే నిల్చును ఉదా అచ్చు = (ముద్రణము) + ఇది=అచ్చిది

వైకృతమగు 'రాజు' శబ్దపు జకారము దంత్యము అర్చులు-వాజులు-పాండురాజు-భీమరాజు మున్నగువాని జకారము తాలవ్యమె ౧౦ (బా సం ౧౦ వ సూ)(వ్యా సం ౩౬ మొ ౪౦ విష )సంస్కృత ప్రాకృత వర్ణసమామ్నాయములలోనె దంత్య చజ లు లేవు

౪ వ విష సంస్కృత 'చ-జ' లు కొన్ని దంత్యములు గల వని సూరి ప్రభృతి నవ్యులు భ్రాంతిపడి వ్రాయుటచేత నిట్లు సిద్ధసాధనముగా సూత్రింపఁ బడెను [1]

## ద్రుతప్రకృతిక శబ్దములు

పదాంత 'ను' వర్ణంబు ద్రుతంబు[2] ౧౧ ద్రుతాంతములయిన పద ములు ద్రుతప్రకృతికములు ౧౨ (బా సం ౧౧-౧౨ వ సూ) (వ్యా సం. ౪౨ విష )

ప్రథమా-కయి-పట్టి-యొక్కొ-తరములైన విభక్తులు, నుత్తమ పురుషైక వచనంబులు, భూత తద్ధర్మాద్యర్థక ప్రథమ పురుషైక వచనంబులు, నాశీరాద్య

---

1 ''సంస్కృతసమములం దికారాంతము లయిన శబ్దముల యుపధా (ఉపధ యనఁగా దుదివర్ణమునకు ముందువర్ణము ) 'చ-జ' లు బహువచనంబు పరంబగునపుడు దంత్యములగు ఉదా అచ్చులు, వాజులు రాజు శబ్దం బొక్కటి దంత్యయుక్తంబు గానంబడియెడి ''(బాల-సంజ్ఞా-౧౦ వ సూ ) అను సూరివ్రాఁత కేవలము నగ్రాహ్యము సంస్కృతసమములందలి 'చ-జ' ల దత్యంత యశాస్త్రీయము-నిరాధారము, సంస్కృతవర్ణమాలలోనే దంత్య చ-జలు లేవు దంత్యతాలవ్య 'చ-జ'లకు యతిప్రాసమైత్రి యుండుటచేత వానినిబట్టి యీ విషయములను నిర్ణయింపరాదు రాజ శబ్ద భవమగు నర్వాచీన 'రాజు' శబ్దమునుబట్టి యిట్టి యపభ్రష్టోచ్చారణము, సూరి భ్రాంతియుఁ గల్గెనని తోచెడి ఇట్లే యైనచో ''రవితేజుడు-విగత సంకోచుఁడు'' మున్నగువాని 'చ-జ'లు దంత్యములని యేల సూత్రింపరాదు.

2 ''నకారంబు ద్రుతంబు''(బా సంజ్ఞా ౧౧ వ సూ)అని సూరి చింతా మణి వాసనచే సూచించుట సరికాదు అట్లె సంజ్ఞా ౧౨-సంధి '౧-౮-౪౩' మున్నగు సూత్రములం దుదాహరించెను ఒక్క నన్నయ భారతభాగము నందును నన్నయ యాథర్వణీయ గ్రంథమందును మాత్రమె ద్రుతము (న్ = నకార) వ్యంజన రూపముగ వాడఁబడినది తిక్కన ద్రుతమును 'ను' స్వరూపముగనె పయోగించెను ౬౦ విని పార్థుడిట్లు. జయమునీకోక । ల్గెను దాని (శా- ఉవ

ర్థంబయిన ‘త’ వర్ణకంబు[1] శతృ-తుమ్-భావలక్షణ[2] చేదాద్యర్థకంబులు[3] ‘వలెను’ ప్రభృతులును ద్రుతప్రకృతికంబులు ఉదా నన్నును - మమ్మును-రాములను-నాచేతన-నాతోడను-నాకొఱకున-నావలనను -నాకంటెను -నాకున-నావనమునను-మాలోపలను-మాయందును-వత్తును-వచ్చెదను-వచ్చితిని -వచ్చెను-వచ్చును-వచ్చెడును-ప్రసన్నులయ్యెడును-చేయుతను - కావుతను - కాతను-కొట్టుచున-కొట్టన-కొట్టఁగన-కొట్టినను-తిట్టినను - కొట్టినను-వలెను - పోలెను-ఎంతయును-అయ్యున-కొట్టుడును ఇత్యాదు లూహ్యంబులు

---

ఆ ౪౪౨) చ పాము నీరిలో । ను వెడలకుండి కూర్మమతనుస్థిర (ఆను ౧౭ ఆ ౨౩౨) ఇంతయేల! సూరియు ద్రుత ‘ను’ స్వరూపమునె నిర్వహించుచు వచ్చెను సంధి ౨౦ వ సూత్రమున ద్రుతస్వరలోపమును విధించెను దు<sup></sup>త్రిస్వత్వము ‘న’ స్వరూపమని సంధి ౧౬-౧౭-౧౮ సూత్రములలో నుదాహరించెను ప్రౌఢ వ్యాకర్తయు దు్రితము ‘న’ స్వరూపమనియె సూత్రించెను (ప్రౌఢ సంజ్ఞా ౭ వ సూ) సూరి సుప్, తిఙ్ ప్రత్యయాదుల తుదిని ‘న’ స్వరూపమునె సూత్రించెను

1 ఆశీరర్థకము ‘ఎడు’ ప్రత్యయ మని (క్రియా ౨౬ బాల) సూరి సూత్రించుట పొరపాటు అది ‘ఎడుమ’ ప్రత్యయము (వ్యా-సం ౩౦౪ విష) ‘అయ్యెడున్’ మున్నగు నాశీరర్థకప్రయోగములు తద్ధర్మార్థక ప్రథమ పురుషైకవచనము లననగును (చూ-బాల-క్రియా ౫-౨౨ వ సూ)

2 సూరి భావలక్షణార్థకము నుదాహరింపకుండుట పొరపాటు మఱియు సూరి ‘కొట్టుడున్’ అను నానంతర్యార్థకము నుదాహరించుటయు దానిని సూత్రించుటయు (బా-క్రియా-౪౨ వ సూ) నవిమర్శన కృతములు ‘డు’ అను భావార్థక ప్రత్యయమును గలదు (చూ క్రి ౪౫ వ సూ) (చూ - వ్యా- సం ౩౦౯ విష)చార్థక శబ్దముతోఁగూడిన భావప్రత్యయ మానంతర్యమును బోధించును (చూ-ప్రౌఢ-క్రియా ౧౨వ సూ )(వ్యా-సం ౧౪౩౩-౧౪౩౪పుటలు ౩౦౯ విష )

3 ‘నేను - తాను’ పదంబులు ద్రుతప్రకృతికములు కావు వాని తుది ‘ను’ ప్రత్యయము ప్రథమైకవచనముగాన నవి కళలు వాని తుది

౧ వ వివ వ్యాకరణ విధులచొప్పున నట్టి 'ను' స్వరూప ద్రుతముమీఁది 'ఉ' కారము 'ఇ' కారి మగునపు(తత్స-౨౬ వ సూ )డా 'ని' వర్ణమును ద్రుత మనిపించుకొనును ఉదా హరికి + ను = హరికిని మొ

౨ వ వివ 'నేను-తాను' పదముల 'ను' ప్రత్యయము యొక్కయు, 'చక్కని-చక్కన' మున్నగువానియందలి 'ని-న' ప్రత్యయములయు, 'ఏను'= (అయిదు)మున్నగు మఱికొన్ని శబ్దములయుఁదుదిస్వరము(ఆచ్ఛిక-౨౪ వ సూ ) (బా-ప్రకీ ౧౬) లోపించునపు డామిగిలిన న కారము ద్రుతకార్యముల నందును (౮౨ III వ్యా సం ౨౧౦ II వ్యా సం ) 'ను' అను ద్రుతముయొక్క 'ఉ' కారము సంధి ౨౦ వ సూత్రము చొప్పున లోపించునపు డామిగిలిన 'న' కార మెట్లును ద్రుతమె యగును అట్టి యాచ్ఛికము ౨౪వ సూత్రముచేత స్వరలోపము గల్గినపు డాసూత్రములోని బహుళశబ్దమహిమచేతఁ గొన్నియెడల నా మిగిలిన 'న' కారము ద్రుతకార్యముల నందును, కొన్నిట నామిగిలిన 'న' కారము పూర్వావస్థలోని ప్రథమయొక్క లక్షణము చొప్పునఁ గళయే యగును ఉదా ద్రుతకార్య నేఁజదివితి, తాఁజెప్పె,నే దాసినే(సభా ౨వ ఆ ౩౨), తాఁజరణ మెత్తె (సభా ౨ వ ఆ ౩౦), చక్కంగ(కాశీ ౨వ ఆ), చక్కంబెట్టు (ఉద్యో ౨ వ ఆ ౨౫౦), కమ్మందేనె (నైష ౨ వ ఆ), ఏఁబది, చేసెను = చేసెఁ, చేయును = చేయుఁ చేసెదనున్=చేసెదను = చేసెదన్, కళాకార్య మిన్నె డెన్-అన్సరము మొ

## కందోయి - ఏనిన్

౩వ వివ 'కందోయి' అనుచో 'కన్నుంగవ' (భార-ఆది-౪వ ఆ ౨౫౪ మనుచ ౨వ ఆ ౩౨)మున్నగుచోటులందువలెనె సామాసిక నుగాగమము(సంధి ౨౫ వ సూ ) చేసి యందలి 'న్ను' అను దానికి నిక్కలాది (చూ-సమా-౯౧) స్వరము లోపించుటచే నవి ద్రుతాంతము లగును కం కవదొనలును... ... ఏ । ను విదప డిగియెద . (శల్య ౨వ ఆ ౨౩౩) (వ్యా-సం-౪౩ II విష), 'ఏన' అని దిద్దుట పొరపాటు-అవధారణార్థకము మీద గసడదవాదేశము రాదు క సక౹ .సర్వం । బ కడున్ మేలనఁగ శాంతిపర్వము వెలయుచ (ఆది ౧ వ ఆ ౫౮ వ ప )

సూత్రము చొప్పున లోపము చేయఁగా ''క +ను + దోయి'' అను ద్రుతసహిత రూపము నిల్చును ఆ ద్రుతమునకు సంధి ౧౮-౨౨ సూత్రముల చొప్పున నిండుసున్న చేయఁగా 'కందోయి' అను రూపము సిద్ధించును ఇట్లె 'ఏనియున్' అనుచోట 'యు' అను భాగము లోపింపఁగా (సంధి ౨౧ వ సూ) 'ఏనిన్' అనియు, 'ని' అనునది లోపింపఁగా 'ఏన్' అనియు, చార్థక ద్రుత 'న' కారము నిల్చునని ప్రక్రియ నడపవలయును ఇట్లగుటచేత 'ఏనియున్-ఏనిన్-ఏన్' అనునవి ద్రుతోపజీవిశబ్దము లగుచున్నవి అవ్యయములం దుత్వవిశిష్ట శబ్దాంతిమ 'న' కారము ద్రుతమె యగును గాన సముచ్చయాద్యర్థక 'ను' శబ్దము ద్రుత రూప మని యెన్ననగును ద్రుతప్రకృతికములవలెనె ద్రుతోపజీవి శబ్దములును ద్రుతాంతములయి యుండును శబ్దావయవ ద్రుతము గలవి ద్రుతప్రకృతిక ములు అర్థవిశేషబోధక 'ను' శబ్దముతోఁ గూడినవి ద్రుతోపజీవి శబ్దములు ద్రుతప్రకృతికము లివల కుదాహృతము లయ్యెను

## ద్రుతోపజీవులు - కళలు

ద్రుతోపజీవి శబ్దములు ఎంతయును - కొట్టుడును = (కొట్టినతోడనె) కొట్టుటయును- అయ్యెను మొ (ద్రుత = ద్రవించునది = లోపించునది)

ద్రుతప్రకృతికములుగాని శబ్దంబులు కళ లనంబడు ౧౩ (బా సం ౧౩) (వ్యా సం ౪౨ విష)

రాముఁడు-రాములు-హయము-విష్ణువు-వృద్ధు-హరి-దూత - సీత - గోడ- మేడ-నేను-తాను (ఇవి కళలె) జపముంగూర్చి-అందుండి-వనమునుంచి-రాముని కయి-జ్ఞానముంబట్టి-నాయొక్క-వచ్చిరి-వచ్చితివి - వచ్చితిరి-వచ్చితిమి - వచ్చు చున్నాఁడు-వచ్చుచున్నారు-వచ్చుచున్నావు-రాఁగలఁడు-వచ్చెదము - వచ్చెదవు - వత్తురు-వత్తము-వత్తువు-రమ్ము-రండు-రాకుము-రాకుఁడు-రాఁడు-రారు- రాదు- రావు-రాము-వచ్చెడుమ = (వచ్చుతన్) = వచ్చుఁగాక-వచ్చునది = (రావల యును)-కొట్టక- తిట్టక- ఎత్తిలి- ఒత్తిలి- విశేషణములు కళలె యనఁదగును - తెల్ల- తెల్లనిది నల్ల నల్లనిది చేసిన- చేయుచున్న-చేయఁగల-చేయు-చేసెడు- చెసెడి - చేయని- మొ విశేషణములు నన్నయ మతమున ద్రుత ప్రకృతికములె

యైనను నవి సదా విశేష్యముతో సమసించి కళలవలె ద్రుతలోపము నంది యుండును ఇంచుక-ఐళి-బాపురె- ఔర- ఆహా- అక్కట- కటకట- అప్పుడు- ఇప్పుడు- ఎప్పుడు-ఏల-వాడె-వాఁడ-వాఁడే- ''వచ్చునఁట''-ఊరక - మిన్నక ఇత్యాదు లూహ్యంబులు

౧వ వివ కం. మే । మనుపమ దుఃఖితుల మగుట నాధారములే । కను ..(ఆది. ౨వ ఆ-౧౪౩) ఇందలి 'లేకను' అనునది ద్రుతప్రకృతిక మని భ్రమింపరాదు. 'అనుపమ దుఃఖితుల మగుటను, నాధారము లేకను' అను రీతిని వానిలోని 'ను' శబ్దము సముచ్చయార్థకము (చూ-సంధి-౨౧ వ సూ) చ అతిథుల చొరంగనీ । క తొలంగఁద్రోవు .(శాంతి-౨వ ఆ-౨౫౩) ఇట్టి ప్రాసప్రయోగముచే వ్యతిరేక క్త్వార్థకము కళయె

## హ్రస్వముమీఁది ఖండము

హ్రస్వముమీఁది సిద్ధ సాధ్య పూర్ణములు ప్రాయికముగా ఖండములు సైత మగును* అనిర్దిష్ట బిందువిధాన స్థలములలో హ్రస్వముమీఁదఁ బూర్ణార్ధములు రెండును నగును ౧౪ (బా సం-౧౪) (వ్యా-సం-౪౮- I విష )

సిద్ధ బిందువు అడంకువ=అడఁకువ, అనంటి=అనఁటి, అరంటి= అరఁటి, ఎఱుంగుట=ఎఱుఁగుట, బలంగము=బలఁగము, మగంటిమి= మగఁటిమి మొ సాధ్యబిందువు రాముండు=రాముఁడు, చదువంగలండు= చదువఁ గలఁడు వచ్చెం దండ్రి=వచ్చెఁ దండ్రి

---

* "హ్రస్వముమీఁది ఖండబిందువునకుఁ బూర్ణబిందువు వైకల్పికముగా నగు" అను సూరి సూత్ర ముచ్చారణస్వభావ విరుద్ధము, చింతామణి విరుద్ధము ఖండమును విధించి పూర్ణము దీనిచొప్పునఁ జేయు ప్రక్రియయు లేదు పూర్ణము తేలి ఖండమగుట సహజము కొన్నియెడల ఖండముగాఁ దేలకుండుటయుఁ గలదు ఉదా అపరంజి=(బంగారు), గురివెంద- చేమంతి- కలగుండు- ఆరంజోతి (అరుంధతి) మొ

౧వ వివ ఇఁక-అఁట-చుఁడు (చూడుఁడు శబ్దపు సంక్షేపము-చేయుచు సుఁడీ) శబ్దంబులందుఁ దప్ప మఱెచ్చటను బదము మొదటి హ్రస్వముమీఁది పూర్ణము ఖండముగాఁ దేలదు (చూ-సంధి ౨౨వ సూ) 'ఎఁడు-ఇఁడి' మున్నగునవి ప్రత్యయములు, పదములుగావు గంపెందు=గంపెఁడు వాలిండి=వాలిఁడి(తోఁక లేనిది) నుడి తొలిహ్రస్వముమీఁదఁ దేలని బిందువు స్థలములు ఇంచు(రుచించు), చందురుఁడు-జంత్రము-దండిగ-తంపర-నిండు-పండు-బండి మెండు మొ అట్టి (నుడి తొలిహ్రస్వముమీఁద తేలని) సాధ్యస్థలములు కెందామర-ముంగొంగు-క్రొంబసిఁడి- కందోయి మొ

౨వ వివ : కొన్ని యలంతి స్థలములందుఁ బ్రథమేతర హ్రస్వమునకుఁ దర్వాత సయితము పూర్ణము తేలకుండుట గలదు ఉదా అపరంజి(బంగారు)-అడ్డంకి-ఆరంజోతి (అరుంధతి) - కలగుండు (సంక్షోభము)- గురివెంద-చేమంతి, మొ (చూ-ద్రావి-పరి ౧౭, XVIII విష, వై-పా ౩౨౦వ విష)

'పు-ంపు, టి-ంటి, ఇంచు' అను స్థలములు ప్రత్యేక విధానము గలవిగాన నచట ఖండమునకుఁ బ్రసక్తియే లేదు ఉదా నిద్దంపు=నిద్దపు, పగలింటి=పగలిటి రక్షించు-ప్రే రక్షింపించు అరగించు

## హ్రస్వ దీర్ఘములమీఁద ఖండము

దీర్ఘముమీఁద సాధారణముగాఁ బూర్ణము నిల్వదు అనిర్దిష్ట బిందు విధాన స్థలములలో దీర్ఘముమీఁద ఖండమునె నిల్పవలయును ౧౫ * (బా సం ౧౫వ సూ, వ్యా సం ౪౦-౪౫ విష)

---

* సూరి 'దీర్ఘముమీఁద సాధ్యపూర్ణము లేదు' అని సూత్రించుట సరికాదు దీర్ఘముమీఁద సిద్ధపూర్ణము మాత్రము ప్రచురముగా నిల్చునా ? ఉదా వాఁడు, విఁడు మొ మఱియు "తేంట్లు=(తుమ్మెదలు), ఏండ్లు-పూండ్లు(అనేక), విలుకాంద్రు-ఆంద్రు" మున్నగు పెక్కుచోట్ల సాధ్యపూర్ణములు గలవు

పూర్ణము నిల్వని సిద్ధ స్థలములు సైఁచు-తోఁచు-ఆఁకలిఁ-వేఁడు (ప్రార్థించు) సాధ్య స్థలములు వాఁడు- వీఁడు-రాఁడు- లేఁడు-గోఁగులు-రేఁగులు-కాఁబట్టి-కాఁబోలు-నాతోఁబల్కె- మొ

## దీర్ఘముమీఁది పూర్ణము

నిర్దిష్టపూర్ణ విధాన స్థలములు తేండ్లు-తేంట్లు (తుమ్మెదలు) -ఏండ్లు-పూండ్లు (అనేక)-విలుకాంండ్రు-ఆంండ్రు-మొ వీని సామ్యమునఁ గావలయుఁ గొన్ని సిద్ధ స్థలములు సంయోగపూర్వ పూర్ణములు వెలయుచున్నవి ఉదా శా తంండ్రీ . । తీంఢ్రల్ గల్గిన...(మను చ ౫ ఆ ౧_౨),కం తీంండ్రమగు ..। వేంఢ్రమున...(భాగ ౨వ స్కం శ-ర)

సంయోగ, స్థిరపూర్వకత్వమునఁ బూర్ణము లోపించుటయుఁ గలదు ఉదా (మాండుచు) = మాఁదుచు = మాడ్చు వేసంగి = వేసఁగి = వేసవి పోండిమి = పోఁడిమి = పోణిమి మొ

౧ వ వివ భారతేతర గ్రంథములు కొన్నిటియం దరుదుగ సిద్ధ సాధ్యములు రెండిటను దీర్ఘముమీఁది పూర్ణము తేలక నిల్చుటయుఁ గలదు కం వీంఢె. .సర్వవ । ధ్యుండు ..(నన్ని కు ౨వ ఆ ౨౧౭), కం పోండిగ మూండు జగంబులను బ్ర । హ్మాండము.. (నన్ని-కు ౬వ ఆ ౮౧౩), ద్విపద-పాండురాంగంబైన । పోండిగా- (బసవ ౧వ ఆ ౩౫౩) ప్రగీతి-మూండు సేసి . । పోండిగా .ని । ట్లుండ (కవిజనా-జాత్యధి-౨౧)

౨ వ వివ కొన్నియెడల దీర్ఘమునకుఁ దర్వాత తేలకయె పూర్ణము నిల్చుటయుఁ గలదు ఉదా సిద్ధ ఏకాండము (అఖండమైనది),వేంచేయు, మాందాళి (పట్టుచీర), చాంగుబళా (ప్రశంసార్థకము), ప్రేంకణము (ప్రియాళువృక్షము), (చూ-వై పా-౩౧౭వ విష) సాధ్య వంగు, ప్రేర, వంచు (వాంచు) పూను,ప్రేర,పూంచు కం కాంచనమా లాలంకృత । చంచ త్తను లీల మెఱయు జవనాశ్వములన్ । బూంచిన . (విరా ౪వ ఆ ౪౫) కను, ప్రేర కాంచు (తన్నుఁ గనునట్లుచేయు, వీనిని సకర్మకక్రియ లని కోశములు చెప్పును.)

౩ వ వివ కాలక్రమమున నుచ్చారణ సౌకర్యాపేక్షచేత ఖండానుస్వారము లోపించుచున్నది కావుననె నన్నయేతర కవులు ఖండాఖండ ప్రాసమును ప్రయోగింపసాగిరి (చూ-వ్యా సం ౪౮, V విష) కం కేతనకపి భయదంబై । తోఁతేరఁగ. ।(కర్ణ-౩వ ఆ ౧౭౪)

## ఖండబిందు స్థితిని దెల్పు నుపాయములు

౪ వ వివ : ఉచ్చారణభ్రష్టమగు ఖండమును గ్రహించు నుపాయములు సాధారణముగా హ్రస్వముమీఁది సిద్ధఖండమును దానిచో నిల్చు పూర్ణమునుబట్టి తెలిసికొనవచ్చును సాధ్య ఖండములు వ్యాకరణమువలన సుజ్ఞేయములు ఇంక దీర్ఘపూర్వక సిద్ధ ఖండజ్ఞానము కోశములవలననే తెలిసికొనవలయును సాధారణ ముగ వాడుకలో వచ్చు శబ్దములు అందాఁక, ఆఁకలి, ఆఁడుది, ఆఁదోఁక, ఈఁగ, ఈఁత, ఊఁత ఏఁడు (వత్సర), కాఁక, కాఁగు, కాఁచు (వేఁడిచేయు), కూఁత, కూఁతురు, కోఁట, కౌఁగిలి, క్రోఁతి, గూఁడు, గోఁగు, చీఁదు, చేఁదు (ఆకర్షించు, తిక్తము), తాఁకు, తీఁగ, తూఁగు, తేఁటి, (తుమ్మెద), తోఁక తోఁచు, తోఁట, తోఁపు (తోఁట), దాఁగు, దాఁటు, నాఁడు (ఆదినము), నేఁడు (ఈదినము) పాఁడి, పైఁట, ప్రాఁత, బీఁట, మాఁగు, మాఁడు, మీఁదు, మూఁగ, మూఁడు, మేఁక, మోఁకాలు, మోఁదు, మ్రోఁగు, రోఁకలి, లేఁగటి లేఁత, వీఁగు, వీఁపు, వేఁగు, వేఁచు, వేఁట, వేఁడి, వేఁడు (ప్రార్థించు), సాఁకు సైఁచు, సోఁకు, మొ

## అచ్చతెల్గునఁ బరుష సరళ పూర్వకమె బిందువు

సంస్కృత సమేతరములైన తెలుఁగు శబ్దములయందుఁ బరుష సరళము లకుముందే బిందువు కానంబడుచున్నది ౧౬ (బా సం ౧౬, వ్యా సం ౩౦ విష )

వంకర, కలఁకువ కలఁత (సంక్షోభము), మంచు, త్రాఁచు (పాము) దంట (సమర్థ), జంట, చాఁటు, కొంత, కోఁత, ఇత్యాదు లూహ్యంబులు

౧ వ వివ  ఈ సూత్రపు నియమముచేత బిందు పూర్వకత్వమున 'డ' కారమునకు 'ల' కారాదేశము మున్నగు విధులు వర్తిల్లనేరవు ఉదా ఏఁడులు = ఏండ్లు, బండులు = బండ్లు. ఇట్టియెడల 'ఆచ్చిక' ౧౪వ సూత్రము చొప్పున 'డ' కారమున కేఘు లకారము రానేరదు 'ఏళ్ళు—బళ్ళు' ఇత్యాదులు వ్యావహారిక రూపములు పరుష సరళములకు స్థిరవర్ణ మాదేశ మగునపుడు ముందటి బిందువు కొన్ని యెడల లోపించును. ఉదా వేసంగి= వేసఁగి = వేసవి (ఆచ్చి—౯౯వ సూ) పోండిమి = పోఁడిమి=పోఁడిమి (ఆచ్చి ౪౦ వ సూ ) మొ

౨ వ వివ కొన్ని ప్రత్యేక విధానస్థలములందు బిందుపూర్వక స్థిరము కన్పట్టును ఉదా వచ్చెం ధాత్రీపతి (సంధి—౧౯ వ సూ ), తే గీ ధాధ మిత భేరికా ధ్వానముం ధుళీ ని। నాదము. . (అధర్వణ భార విరా —అప్పక, ౫వ ఆ ౧౫౫), కం దుంరీశు...భైరవుని శితి। కందు...లోలా। ద్యుం రేవ . (కవి సింగరన్నగారి త్రైశంకవోపాఖ్యానము-అప్పక-౫ వ ఆ ౧౫౪) గీ ప్రాసబంధ.. కృష్ణుఁ డుదయించి నం ధరిత్రి (ఛందో-౧ వ ఆ ౫) లయగ్రాహి కమ్మని లతాంతముల కుం మొనసి (౫వ ఆ ౧౩౭ ప , సంధి—౧౯ వ సూ ౨ వ వివ, వ్యా-సం ౭౨ విష), ఇమ్ముగ... లోకవం। ద్యుం ముని .. (ఆది-౧వ ఆ ౨౨) 'కంసాలి' అనునది వ్యావహారిక పదము, 'కమసాలి' గ్రాంథిక పదము 'కమ్మరము' మున్నగువాని నరయునది

'యెవఁడు-యేది' అను రీతి గల పదాది 'య' కారము నన్నయ సమ్మతము, అయినను "వూరు-వుండ-వోడ" మున్నగు శబ్దములందలి పదాది 'వ' కారమునువలెనె దానిని దర్వాతి వైయాకరణు లంగీకరికపలేదు ౧౬* (బా సం ౧౩, వ్యా సం ౫౩ విష)

---

* "య కారంబును 'వు-వూ-వొ-వో' లును దెలుఁగు మాటలకు మొదట లేవు" (బాల సంజ్ఞా ౧౩) అను సూరి సూత్ర మనావశ్యకము ప్రక్రియలో దీని యుపయోగము లేదు పదాదిని వెని 'ఱ-ళ' మున్నగువానికి నిషేధ సూత్రము లేనట్లే యీ నిషేధము నక్కఱలేదు వాడుకలోని యపభ్రంశముల నెల్ల నవ ధింపలేదు గదా.

## అంతస్థముల లఘ్వలఘుతలు

'య-ర-ల-వ' లు లఘువులని, యలఘువులని ద్వివిధంబు లగు ౧౮ (బా సం. ౧౮, వ్యా సం ౫౪ విష), 'య - వ - ల'లు లఘ్వలఘువులు మైత్రింబొరయు, రేఫంబులు పొరయవు ౧౯ (బా ప్రకీర్ణ ౨౪ వ సూ) (వ్యా సం ౫౮ విష)

'హరి యతఁడు' ఇత్యాదులం దాగమ 'య' కారము లఘువు తక్కిన 'య' కార మలఘువు విఱుగు — మెఱుఁగిత్యాదులందలి ఱకార మలఘువు ఇదే శకటరేఫ మని చెప్పఁబడును శకటరేఫము తత్సమములందు లేదు 1 పెరుగు - కరు గిత్యాదులందు రేఫంబు లఘువు "ఏల్లు - పాల్లు - త్రాల్లు" అను రీతిగల[2] బహుత్వమందు 'ర- ల- డ' ల కాదేశమయిన 'ల' కార మలఘువు 'తల-వెల' యిత్యాదు లందలి లకారము లఘువు (చూ సంజ్ఞా ౧ వ సూ ౪ వ విష) అచ్చాంధ్రవర్ణ సమామ్నాయమందలి 'ళ' కార మలఘువు కాదు అయ్యది వర్ణాంతరము గెలుచు + అన్ = గెలు + వ్ + అన్, గెలువన్ చిగురు = చి + వ్ + ఉ + రు = చివురు చతుర్థి = చ + వ్ + ఉ + తి = చవుతి ఇత్యాది స్థలములందు సమాన పదములలో స్వర సంహితయందు 'వ' కారము నిల్చును[3] తక్కిన యెల్లయెడలను స్వర సంహితలో 'య'

---

1 సూరి తద్భవము లందును శకటరేఫము లేదనెను ఒక్క నన్నయ తద్భవములందు శకటమును బ్రయోగింపలేదు కాని పెక్కురు మహాకవులు ప్రయోగించిరి కం వెఱపెట్టిదియో ! పిఱికితనము. (ఉద్యో ౩ వ ఆ ౪ ౦) (పిఱికి శబ్దము "భీరుక" శబ్దభవము మ గఱిదోపఁపన్ (ఉ హరి ౪ వ ఆ ౪-౮), గఱిశబ్దము గరుచ్ఛబ్ద భవము

2 ''ఏళులు-పాళులు-త్రాళులు'' అని సూరి యుదాహరించెను ఇవి యపశబ్దములు, కవిప్రయోగములలో లేవు (చూ-అచ్చి, ౧౩ వ సూ)

3 సూరి 'గసడదవా' ఉ దేశములోని 'వ' కారము లఘువని (అతడు వలికె) వచించెను ఇది నిరాధారము య కారసామ్యమునను సంస్కృత పద్ధతిని (అసావాదిత్యః)స్వరసంహితలోని 'వ' కారమునె లఘువనుట యుక్తము

కారము మాత్రమె నిల్చును (సంస్కృతమందును స్వరసంహితలో నిల్చు 'య' వ'లు లఘువులని చెప్పఁబడెను) అట్టి స్వరసంహితలో నిల్చు వకారము లఘువు తక్కిన చోటులందలి 'వ' కార మలఘువు ఉదా వాఁడు-వీఁడు-వచ్చెను

## లఘ్వలఘు రేఫమైత్రి

౧వ వివ లఘ్వలఘురేఫముల యతి ప్రాస మైత్రి దుష్ట మని నన్నయాథర్వణులు వచించిరి[1] 1 ద్విత్వ రేఫ మెన్నఁడును లఘువు కాదు ఉదా ఇఱ్ఱి, కొఱ్ఱు, జెఱ్ఱి మొ 2 అన్యహల్ సంయుక్త రేఫము లఘువే యగును ఉదా పేర్మి, వ్రటువ, తీర్చు (తీఱుచు), వేర్వేఱు (వేఱు వేఱు), గుర్తు (గుఱుతు) 3 దీర్ఘ పూర్వకమగు లఘురేఫము హ్రస్వపూర్వక మయ్యేనేని గురు రేఫ మగును ఉదా చేకూరు=చేకుఱు 4 తిక్కనాది మహాకవులు 'ర-ఱ' మైత్రిని ప్రయోగించి రనుటకు సమ్మతింపక యాంధ్రలాక్షణికు లుభయ రేఫ ఘటిత శబ్దముల నంగీకరించిరి[2] ఉదా॰ ఱాయి=రాయి కం ఱాయో కాకిట్లు రూపఱక విన నోర్చెన్ (భీష్మ 3 వ ఆ ౪౧౯), క రాతిపయిని నుప్పగొనుట రాత్రి దధి మధూ। పేతంబుగ . (అను ౪వ ఆ, ౧౧౦)

## శకటరేఫ పట్టిక

౨వ వివ అలఘు రేఫ మందలి యలఘుత్వము పైరీతి నానాఁటికి మాసిపోవుచుండుట చేతను, నుచ్చారణ భ్రష్టమగుచుండుట చేతను దానిని దెలిసికొనుట సుకరము కాదు అవి కోశములవలనఁ దెలియఁదగి యుండును కాన

---

1 నాన్యేషాం వైధర్మ్యం। లఘ్వ లఘూనాం రయోస్తు నిత్యం స్యాత్ (ఆం-చిం) అనయో స్సంగతిం యస్తు। కరోతి కవితాకృతౌ। అస్యా అత్యన్త దుష్టత్వా। ద్దుష్కవి స్స హి కథ్యతే॥ (వికృతివివేక, చూ-వ్యా-సం-౫౦ విష)

2 లఘుర్భవే ద్గురుః క్వ త్ర। చి ద్గురుశ్చ లఘుర్భవేత్। ఉచ్చారణస్య కల్ప్యత్వా। న్నిదానం తత్ర సద్వచః (వ్యా-సం-౫౪- I విష)

నిటుగొన్ని ముఖ్యశబ్దములు ప్రదర్శింపబడును అందఱు, అక్కఱ, అఱచు, అఱవము, అఱుఁగు (జీర్ణించు), అఱువది । ఆఱు (షట్ సంఖ్య-ఉపశమిల్లు) ఇందఱు, ఇద్దఱు, ఇఱుకు, ఈదేఱు, ఉఱుకు, ఉఱుము, ఊఱు (ఊటయూఱు), ఎందఱు, ఎఱుగు, ఎఱువు, ఏఱు (నది), ఒఱగు, కఱ (నల్లనిది), కఱచు (కొఱుకు, అభ్యసించు), కాఱు (స్రవించు), కుఱుచ, కొందఱు, కొఱకు (చతుర్థీ ప్రత్యయము-కార్యమునకు), కొఱంత, కొఱుకు, గఱి (ఱెక్క), గఱిక, గీఱు, గుఱుతు, గొఱుగు, చిఱుత, చుఱుకు, చూఱ, చెఱ, చెఱకు, చెఱచు, తఱచు, తీఱు (నశించు), తెఱఁగు, తెఱచు, తెఱపి, తేఱు (మీఁదికిఁ దేఱు), దగ్గఱ, నఱకు, నాఱు, నిగుఱు, నూఱు (శతము-పొడిచేయు), నెఱ (నిండైన), నెఱవేఱు, నెఱి (రమ్య), పఱచు, పఱుచు, పాఱు (ప్రవహించు-పరుగిడు), పిఱుదు, పెఱ (అన్య), బయలుదేఱు, మఱక, మఱచు, మఱుఁగు (చాటు-ఉడుకు), మఱునాఁడు, మాఱు, మీఱు (అతిక్రమించు), మెఱయు, ఱాయి, ఱెక్క, ఱేఁడు, వఱకు, విఱుగు, వెఱ, వెఱచు, వేఱు

## తత్సమ లక్షణము

సంస్కృత ప్రాకృత తుల్యంబగు భాష తత్సమంబు ౨౦ (బా-సం-౧౬, వ్యా-సం-౩౯ విష)

| సంస్కృతము | సంస్కృతసమము | సంస్కృతము | సంస్కృతసమము |
|---|---|---|---|
| రామః — | రాముఁడు | పితా — | పిత |
| విద్యా — | విద్య | గౌః — | గోవు |
| హరిః — | హరి | నౌః — | నావ |
| ధేనుః — | ధేనువు | ద్యౌః — | దివి |
| భూః — | భువి | జగత్ — | జగము |

ఇత్యాదు లూహ్యంబులు

| సంస్కృతము | ప్రాకృతము | ప్రాకృతసమము |
|---|---|---|
| అగ్నిః | అగ్గీ | అగ్గి |
| ఆలిః (పంక్తి) | ఓలీ | ఓలి |
| గౌరవమ్ | గారవం | గారవము |

| సంస్కృతము | ప్రాకృతము | ప్రాకృతసమము |
|---|---|---|
| జటా | జడా | జడ |
| యమః | జమో | జముఁడు |
| రాజ్ఞీ | రాణీ | రాణి |
| శృఙ్గారః | సింగారో | సింగారము |
| శ్రీః | సిరీ | సిరి |

ఇత్యాదు లెఱుంగునది*

## సంస్కృత ప్రాకృత సమములు

౧ వ వివ ఆంధ్రవిభక్తి యోగము, తన్నిమిత్తకము లగు మార్పులును దప్ప నితరము లగు మార్పులు శబ్దావయవమున జరుగని సంస్కృత శబ్దములు సంస్కృత సమములు అట్టి ప్రాకృత శబ్దములు ప్రాకృత సమములు ఉదా సం సమ-రాముఁడు (రామ), పిత (పితృ - పితా), రాజు (రాజన్-రాజా), బుద్ధిమంతుఁడు (బుద్ధిమత్-బుద్ధిమాన్), భువి (భూః), అంతము (అన్తః- చూ-సంజ్ఞా ౪వ సూ ౧ వ వివ )

౨ వ వివ కవిప్రయుక్తములె (చూ-సంజ్ఞా ౨ వ సూ-౩ వ వివ ) ప్రాకృత సమములు గ్రాహ్యములు ప్రాకృత సమములును నాచ్ఛికములె (చూ-ఆచ్ఛి, ౧ వ సూ) సిరి (శ్రీ) మొ

* 'ఆడి ('ఆటీ' పర్యాయశబ్దము, శరారిపక్షి)' శబ్దము సంస్కృతమునఁ గలదు కాని 'ఆడి' సంస్కృత సమమె కావచ్చును సూరి 'ఆడి' అను ప్రాకృతశబ్దము నుదాహరించి 'ఆడి' ప్రాకృత సమ మన నేలః సూరి యుదాహరించిన మిరా (మేర) శబ్దము సంస్కృత కోశములలోఁ గానరాదు. 'కారము' క్షారశబ్ద భవ మని ప్రౌఢవ్యాకర్త యుదాహరించెను (ప్రౌఢ సంజ్ఞా—౧౦ వ సూ) ఇదియు వివాదగ్రస్తమె (చూడు-వ్యా-సం-ॱ IV-దీని విస్తరము) సూరి సంస్కృత సమముగా నుదాహరించిన 'జగత్తు' అను రూపాంతరము కవి ప్రయోగములలోఁ గానరాదు జగ మనియె తత్సమరూపము గనంబడును.

# తద్భవ లక్షణము

సంస్కృత ప్రాకృత భవంబగు భాష తద్భవంబు ౨౧ (బా సం ౨౦వ సూ, వ్యా-సం-౫౯ విష)

| సంస్కృతము | సంస్కృతభవము | సంస్కృతము | సంస్కృతభవము |
|---|---|---|---|
| ఆకాశః | ఆకసము | వక్రః | వంకర |
| కుడ్యమ్ | గోడ | వేసరః | వేసడము (ఆడుగుఱ్ఱము న గాడిదవలనఁ బుట్టినది |
| చన్ద్రః | చందురుఁడు | సముద్రః | సంద్రము |
| తమఙ్గః | తమగము (మంచె) | సూచీ | సూడి |
| తామరసమ్ | తామర=(పద్మ) | స్మరః | మరుఁడు |
| నారాచః | నారసము | హరణమ్ | అరణము |
| నిభః | నెపము = నెవము | హరితాళమ్ | అరిదళము |
| ముఖమ్ | మొకము = మొగము | | |

ఇత్యాదులు గ్రహించునది

| సంస్కృతము | ప్రాకృతము | ప్రాకృత భవము |
|---|---|---|
| అఙ్గారః (నిప్పు) | ఇంగాలో | ఇంగలము (బొగ్గు) |
| అప్సరాః | అచ్చరా | అచ్చర |
| ఆశ్చర్యమ్ | అచ్చేరం | అచ్చెరువు |
| పఞ్చాశత్ (ఏఁబది) | పణ్ణాసా | పనస (మంత్రమం దేఁబది పదము లుండును) |
| పృథివీ | పుఢవీ | పుడమి |
| ప్రయాణమ్ | పయాణం | పయనము |
| ప్రవాళః | పవాళో | పవడము=పగడము |
| మత్సరః | మచ్చరో | మచ్చరము |
| యజ్ఞః | జణ్ణో | జన్నము |

| | | |
|---|---|---|
| లక్ష్మీః | లచ్ఛీ | లచ్చి |
| విష్ణుః | విణ్హూ | వెన్నుఁడు |
| వైద్యః | వేజ్జో | వెజ్జు |
| స్తమ్భః | ఖంభో | కంబము |
| స్థూలమ్ | థోరం | తోరము |

ఇత్యాదులు తెలియునది

## తద్భవములు

౧ వ వివ సంస్కృత ప్రాకృత శబ్దావయవములందు వర్ణాగమ, వర్ణాదేశ, వర్ణలోప, వర్ణవ్యత్యయ, వర్ణప్లుతి, వర్ణభిన్నతాది వికారములు గల్గుటచే నేర్పడునవి తద్భవ శబ్దములు ఉదా ఆగమ-(సం) రథః-(తద్భ) అరదము, పదాదిని 'అ' వర్ణాగమ మయ్యెను ''మిత్రవ దాగమః'' వర్ణవృద్ధి యాగమము ఇందు వర్ణాగమమే కాక 'థ' కారమునకు 'ద' కారాదేశమయ్యెను ''శత్రువ దాదేశః'' ఒక వర్ణముచోట మఱొకవర్ణము నిల్చుట యాదేశము (చూ సంధి-౪ వ సూ) ఆదేశము-(సం) ఆకాశః — (తద్భ) ఆకసము, కకార దీర్ఘమునకు హ్రస్వాదేశమును, శ వర్ణమునకు 'స' కారాదేశము నయ్యెను లోపము-(సం) తామరసమ్-(తద్భ) తామర, 'స' కారలోపము కల్గెను వ్యత్యయము-(సం) పారావతః—(తద్భ) పారువము, పావురము, ఇందు 'ర-వ' లకు స్థాన వ్యత్యయమును స్వరాదేశమును గల్గెను ప్లుతి-ఏడు + పది = దేబది, డెబ్బది, ఇందు 'ఏ' అను వర్ణమునకు డకారముమీఁదికి ప్లుతి గల్గెను, కొన్ని యాదేశములును గల్గెను భిన్నత-(సం) వక్రః—(తద్భ) వంకర- ఇందలి 'క్ర' అనునది 'కర' అను భిన్నత నందెను, అనుస్వారాగమమును గల్గెను సంయుక్తవర్ణముల నడుమ యుచితస్వరము నిల్చుటచే భిన్నత గల్గును

౨ వ వివ "అఙ్గారః—ఇఙ్గాలః" అను రెండు శబ్దములును రెండర్థములందును (అగ్గి-బొగ్గు) సంస్కృతమునఁ గలవని సంస్కృత కోశములు నుడువుచున్నవి (చూ వ్యా సం విస్తర I ౬౦ I విష) ప్రాకృత శబ్దములు సంస్కృతమున ననేకములు చేరినవి ప్రాకృ కల్హార- (సంస్కృత) కహ్లార.

(ప్రాకృ) పట్టణ — (సంస్కృ) పత్తన  సంస్కృతమందును 'కల్హార-పట్టణ' శబ్దములు చేరినవి

౩ వ వివ  "ఖంభో - థంభో'' అను ప్రాకృతశబ్దములు సంస్కృత 'స్తమ్భ' శబ్దమునుండి యేర్పడె నని ప్రాకృత వ్యాకరణములు వచించును  కాని 'కమ్భః' అను సంస్కృత శబ్దమే కలదని సంస్కృత వ్యాకరణములందుఁ గలదు

౪ వ వివ  ప్రాకృతపద్ధతి విలక్షణములగు వికృతులు లేనివి కేవల సంస్కృతభవము లనియుఁ, ప్రాకృతపద్ధతి గల వికృతులు గలవి సంస్కృతభవ, ప్రాకృతభవము లనియు నెఱుంగునది, ఉదా  'సముద్ర' శబ్దము ప్రాకృతము లోనికి వచ్చినచో 'సముద్దో' యగును  తెల్గున 'సముద్దము' కావలెను, అట్లుగాక 'సంద్రము' అయ్యెను గాన నది కేవల సంస్కృతభవముగా నెన్నఁబడెను  ఇట్టి యటి భేదమును గ్రహింపవలెను

## కొన్ని వింత తద్భవములు

౫ వ వివ  మహాకావ్య ప్రయుక్తము లగు  పెక్కు తద్భవ శబ్దములు శబ్దరత్నాకరాది కోశముల కెక్కలేదు  వానిలోఁ గొన్ని గ్రామ్యము లనుచు ననింద్య గ్రామ్యములుగాఁ గోశములం దంగీకరింపఁబడెను

| సంస్కృతము | తద్భవము |
|---|---|
| వాల్మీకేశ- | వాలుమీ కేసుఁడు |
| త్రయోదశ- | తేరస |
| తపోనిధి- | తవనిది |
| తపోరాజ- | తవరాజు |
| పృథివీశ- | పుడమీసుఁడు |
| భక్త- | బగుతుఁడు |
| మజ్జన- | మజ్జనము |
| దాస- | దాసుఁడు, దాసి |
| శంకరదాస- | సంకరదాసి |
| శివుడు- | సివుఁడు |
| రూఢి- | రూడి |
| సంబోధన- | సంబోదన |
| నిర్మృతి- | నిరురుతి |
| ఉపాధ్యాయ- | ఉపాద్దేయుఁడు |
| తథ్యము- | తద్దె |
| నిత్యము- | నిత్య, నిచ్చ |
| ధర్మకపిల- | దమ్మకవిల (ధర్మార్థము విడిచిన కపిలగోవు) |

| | | | |
|---|---|---|---|
| శమ్భుఁడు- | సంబుఁడు | శ్రీమహాదేవుఁడు- | సిరిమహాదేవుఁడు |
| ఈశ్వరుఁడు- | ఈసరుఁడు | కార్యము-కర్జము- | కజ్జము |
| భస్మానన్- | బసుమానన్ | ఉజ్జయని- | ఉజ్జని |
| ఉద్భటుఁడు- | ఉదుబటుఁడు | ఆశ్చర్యము- | అచ్చరువు- |
| విరూపాక్షుఁడు- | విరుపాచ్చుఁడు | | అచ్చెరువు |
| ఉద్దేశించు- | ఉద్దెసించు | కాళహస్తి- | కాళాత్తి |
| నిర్జీవి- | నిజ్జీవి | శ్రీ- | సిరి- తిరు |

ఇత్యాదులు పెక్కు గలవు

# దేశ్యము

త్రిలింగదేశ వ్యవహార సిద్ధమగు తద్భవేతర భాష దేశ్యము* ౨౨ అది రెండువిధములు ౧ ఆంధ్ర దేశ్యము, ౨ అన్యదేశ్యము (బా-సం-౨౧, వ్యా-సం ౫౯ విష) ౧ ఆంధ్రదేశ్యము ఇల్లు, ముల్లు, దూడ, మేడ, కోఁత లేఁత, రెండు, మూఁడు, తావి (పరిమళము), మోవి (క్రిందిపెదవి), ౨, అన్యదేశ్యము తురుష్కలు, ముసలిమానులు, బిబ్బీలు, కుతుపసాహి, సికారు, పాయిదా మొ ఆంగ్ల పీజు, రైలు, రోడ్డు, కలెక్టరు మొ (చూ-సంజ్ఞా ౩వ సూ- ౬వ వివ)

౧వ వివ రసాయన శాస్త్రాదుల నాంధ్రీకరించుటలో నాంగ్ల సంజ్ఞలనె ప్రాయికముగా వాడుట యుక్తము వానికి సరియగు నర్థములు గల తెలుఁగు శబ్దములను గల్పించుట సరికాదు

---

* తత్సమ తద్భవములును త్రిలింగదేశ వ్యవహ్రియమాణములె కాన సూరి 'తత్సమ తద్భవేతర' అను దశము నిల్పకుండుట సరికాదు తన కాలమున విస్తరించి మహా కావ్యములలోఁ జేరియున్న యన్య దేశ్యము నుదాహరింపకుండుటయు సరికాదు

౨వ వివ  కొన్ని తద్భవ శబ్దము లాంధ్రదేశ్యములుగ శబ్దరత్నాకరాది కోశములలోఁ బ్రమాదమున నుదాహృతము లయ్యెను

ఉదా –

| సంస్కృతము | ప్రాకృతము | తద్భవము |
|---|---|---|
| వింశతి | పీసా | పీసము |
| శబర | సవరో | సవర |
| శాప | సావో | చావు |
| మహాన్ | మహో | మగ |
| శీర్షకమ్ | సీసఅం | సీసము |
| షోడశ | సోలస | సోల |
| జ్ఞానమ్ | ణాణం | నాణెము |

ఇట్టివి పెక్కు గలవు

# ఆంధ్రదేశ్యాన్యదేశ్యములు

౩వ వివ  త్రిలింగశబ్ద భవము తెలుంగు, తెలుఁగు "శ్రీశైలము-ద్రాక్షారము-కాళేశ్వరము'' అను క్షేత్రములలోని శివలింగములే యా త్రిలింగములు అవి సరిహద్దులుగాఁ గల దేశము ప్రాచీన త్రిలింగ దేశము (చూ-వ్యా-సం—విస్త III ఉం II విష) ఆంధ్రులనఁగా మహావీరులు శత్రుల నంధులనుగాఁ జేయు శక్తిగలవారు  వీరు ద్రావిడజాతులలోనివారు  విశ్వామిత్ర శప్తులగు తత్పుత్రు లార్యజాతులలోని యంధ్రులు  మనుస్మృతి యార్యజాతుల విభాగమును వచించునది కాన నందలి సంకరజాతి వారగు నంధ్రులు ద్రావిడజాతిలోని యాంధ్రులు కానేరరు ఇట్టి శబ్ద సామ్య భ్రమచేతనె ద్రావిడాంధ్రశబ్దము శాసనముల కెక్కకుండె ననఁదగును

# గ్రామ్యము - అనింద్యగ్రామ్యము

మహాకవి కర్తృక వ్యాకరణ సమ్మతమేని, మహాకావ్య ప్రయుక్తమేనని కాని యట్టిది కావ్యములందు వాడరాదు ౨౩ (బా-సం-౨౨వ సూ, వ్యా-సం-౧ IV విష. ౬౨ విష.)

వస్తాడు, తెస్తాడు, వచ్చేని, తెచ్చేని, వచ్చేటివాడు, తెచ్చేటి వాడు మున్నగునవి కావ్యప్రయోగార్హములు కానేరవు

౧వ వివ 'వస్తాడు' మున్నగునవి నాగరక పండితవ్యవహారములో వెలయుచున్నను నట్టివి ప్రామాణిక వ్యాకరణ సమ్మతములు కామింజేసియుఁ ప్రామాణిక మహాకావ్య ప్రయుక్తములేని కామింజేసియుఁ గావ్యాదిప్రయోగార్హములు కానేరవు ఇట్లనుటచేత నట్టివి రెవిన్యూ వ్యవహారములందును, వార్తాపత్రికలందును, దెలుఁగు పండితులు కానట్టి యపండితులగువారు రచించు రసాయన శాస్త్రాది గ్రంథములందును బ్రయుక్తములైనం గావచ్చును 'తేదీన' మున్నగు వ్యవహారమందును లేని కృతకశబ్దము లెందును బ్రయోజ్యములు గానేరవు మీద నుదాహరించిన వ్యావహారిక భాషా మయ గ్రంథములలో నరసున్నలు, శకట రేఫములు వాడుకలో లేని సరళా దేశములు మున్నగు కావ్య భాషా మాత్ర ప్రయోజ్యముల నచ్చటచ్చటఁ బండితమ్మన్యులు నిల్పుట పొరపాటు. ఇం 'వచ్చి నుండును' మున్నగు సంహితా యకారస్థానీయద్రుతప్రయోగములు మున్న గునవి నిల్పరాదని వేఱ చెప్పనేల?

---

* సామాన్య కవికృత లక్ష్య లక్షణములకు సమ్మతమయినను సాధువు కానేరదు మహాకావ్య ప్రయుక్తముల ననింద్య గ్రామ్యములనుట సరికాదు మహాకావ్య ప్రయుక్తములు గ్రామ్యములు కానేరవు వానిని వ్యాకరణములలోఁ జేర్చుకొనవలసినదే సూరి భ్రమించి 'కపిలగడ్డము' మున్నగునవి యనింద్య గ్రామ్యములని వ్రాయుట పొరపాటు అవి భారత ప్రయుక్తములుము కావు 'కపిల గడ్డము' మున్నగునవి భారత ప్రయుక్త సాధురూపములు 'వస్తాడు' మున్నగునవి గ్రామ్యరూపము లనుచు వానిలో ఖండమును సూరి నిల్పుట యసంగతము

౨వ విధ మహాభారతాది గ్రంథములలోని ప్రక్షిప్త ప్రయోగాదులను బట్టి తత్తత్కవి సమ్మతములు గావనఁదగినవి తత్తత్కవి ప్రయుక్తములని భ్రమింపరాదు ఉదా నన్నయ భారతభాగమున ద్రుత 'ను' స్వరూపము మొ నన్నయ ద్రుతమును 'న' కార రూపముగనే ప్రయోగించెను

ప్రామాణికులు స్పష్టప్రతిపత్త్యాదికమునకై బుద్ధిపూర్వకముగా నిల్పిన లక్షణ విరుద్ధ ప్రయోగము లనింద్య గ్రామ్యము లనఁదగును ౨౪ (బా-సం-౨౩ వ సూ )

'అ ఆ ఇ ఈ' మున్నగురీతిని శాస్త్రీయ సంధికార్యరహితముగా వర్ణసమామ్నాయమును జూపుట, స్పష్టప్రతిపత్తికయి యుద్ధరణ చిహ్నముల నడుమ 'అంది ఉండె' అనురీతిని సంధికార్య విరహితముగఁ బ్రయోగించుట మొ. 'షరా' మున్నగు రీతి నన్యదేశ్యపదములను నర్థస్ఫూర్తికయి తెల్గున వాడునపు డనాంధ్ర వర్ణముల నిల్పుట (అట 'సరా' అని నిల్పినచో నర్థస్ఫూర్తి కలుగదు) 'మక్ఖా' మున్నగువానిలో ననాంధ్రవర్ణ ప్రయోగము చేయుట, యచ్చాంధ్ర కావ్యములలో సంస్కృతసమములను (సంజ్ఞావాచకాది) వాడుట మున్నగునవి యనింద్య గ్రామ్యములు

## ఇది సంజ్ఞా పరిచ్ఛేదము



# బాలవ్యాకరణోద్ద్యోతము-సంధిపరిచ్ఛేదము

వివరణము సంధిశబ్దార్థము౹ు 'I సంధానము, II సంధ్యధ్యాయోక్త వివిధ కార్యములు, III వాక్య గత శబ్దములకు సహజముగా నుండవలసిన యర్ధ మాత్రా కాలిక వ్యవధాన ముండునట్లు పలుకునప్పటి ధ్వనుల సాన్నిధ్యము అను మూఁడర్థములు సంధి శబ్దమునకుఁ గలవు

సంస్కృతమున వాక్యమునందు సంహిత (సన్నిధిగాఁ బల్కుట) యైచ్ఛికము.[1] కాన విసంహితగా ననఁగా నర్ధమాత్రాకాలముకన్న నెక్కువ యెడముగా వాక్యగతపదములను బలుక వచ్చును అనఁగా వక్త కిష్టమగునపుడు సంధికార్యములు వర్తిల్లవు ఉదా "తస్మాత్ ఏవమ్ సః వక్తి" ఇందు సంహితను వివక్షించినచో "తస్మా దేవం స వక్తి"అని సంధికార్య యుక్తముగాఁ బల్కవలయును

తెల్గున నట్లు కాదు వాక్యమున సంహిత నిత్యము కాన వాక్య మధ్యమున సంధి కార్యములు తప్పక వర్తిల్లును (వ్యా-సం-౬౪-౬౪ I విష, చూ సంధి ౩౦ వ సూ) తెలుఁగున స్వరసంధి సాధారణముగాఁ బరరూపసంధి మాత్రమే ॰

## ఉకార సంధి

ఉత్తున కచ్చు పరమగునపుడు పరరూపసంధి నిత్యము ౧ (బా-సం-౧, వ్యా-సం-౬౫-౬౫ I విష)

పూర్వ పర స్వరంబులకుం బర స్వరం బేకాదేశం బగుట స్వరసంధి యనంబడు ఉదా రాముఁడు + అతఁడు = రాముఁ డతఁడు సోముఁడు + ఇతఁడు = సోముఁ డితఁడు మనము + ఉంటిమి = మన ముంటిమి అతఁడు + ఎక్కడ = అతఁ డెక్కడ ఇతఁడు + ఒకఁడు = ఇతఁ డొకఁడు నేను హరిని + అనెను = నేను హరి ననెను వచ్చెను + అతఁడు = వచ్చె నతఁడు [2] మొ

౧వ వివ ఉత్ = ఉత్తు దీని తుది 'త' కార మిద్వర్ణము[3] ఏ

---

1 సంహితైకపదే నిత్యా । నిత్యా ధాతూపసర్గయోః । నిత్యా సమాసే వాక్యే తు । సా వివక్షా మపేక్షతే ॥

2 సూరి "వచ్చెను + అతఁడు = వచ్చెనతఁడు" అను రీతి గల ద్రుతో కార సంధుల నుదాహరింపలేదు 'ను-ని' అనునవే కదా ద్రుత స్వరూపములు ద్రుతమునకు స్వర పరకత్వమున ద్రుతస్వర లోపమున కింతకంటె మార్గాంతరము లేదు గదా ః

3 "తపర స్తత్కాలస్య (౧-౧-౭౦) తః పరో యస్మాత్ స చ తాత్పరశ్చ ఉచ్చార్యమాణ సమకాలస్యైవ సంజ్ఞా స్యాత్"

యచ్చునక్తైనను 'త' కార మిద్వర్ణముగా నిల్చునపు డా యచ్చే కాలమున నుండునో యా కాలమునకే సంజ్ఞ యగును

౨ వ వివ 'హరిని + అనెను = హరి ననెను' మున్నగు చోటులందును నీ సూత్ర పరరూప సంధి విధి వర్తిల్లును 'ను', 'కు' అనువానినుండియే 'ని-కి' (తత్స ౨౽వ సూ ) అనునవి యేర్పడెను

పదాద్యంబులు 'ఋ-ౠ' వర్ణంబులు 'ర-ల' తుల్యంబులు ౨ (బా-ప్రకీ-౧వ సూ, వ్యా-సం-౩౭౭ విష )

అతఁడు + ఋషి = అతఁడు ఋషి ఇట సంధిలేదు ఆ + ఋషి = ఆ ఋషి-ఇట యడాగమము లేదు వచ్చెను + ఋషి = వచ్చె, ఋషి వచ్చెన్ ఋషి, వచ్చెను ఋషి ఇట ద్రుతమునకు లోప సంశ్లేష స్వత్వములు వచ్చెను

## ద్రుతలోప పూర్వకోకార సంధి

"ని-నా-తా శబ్దముల ద్వితీయావిభక్తి రూపములు, చతుర్థ్యాది విభక్తి ప్రత్యయములు, శత్రర్థక 'చు' వర్ణకము అనువాని ద్రుతోకారములకు స్వరము పర మగునపుడు ద్రుతలోప పూర్వక పరరూపసంధి వికల్పముగ నగును ౩ (బా-సంధి-౨ వ్యా-సం-౭౭ I, II విష)*

నన్నును + అడిగె = నన్నడిగె, నన్ను నడిగె నా కొఱకును + ఇచ్చె = నాకొఱ కిచ్చె, నాకొఱకు నిచ్చె నాకును + ఆదరువు = నా కాదరువు, నాకు నాదరువు నాయందును + ఆశ, నాయం దాశ = నాయందు నాశ ఇందును + ఉన్నాఁడు, ఇందున్నాఁడు = ఇందు నున్నాఁడు ఎందును + ఉంటివి = ఎం

---

* బాలవ్యాకరణ పద్ధతిలో 'ను' వర్ణము ద్రుతస్వరూప మగుటచేత 'నాకున్ + ఆదరువు' అనురూపమె యసంభవమగును 'నాకును' అనుదానికి స్వరపరకత్వమునఁ బరరూపసంధి యగునే కాని 'నాకాదరువు' అనురూప మెట్లు కల్గును ? ద్రుతస్వర లోప మెట్లు ?

దుంటివి, ఎందు నుంటివి వచ్చుచున + ఉండెను = వచ్చు చుండెను, వచ్చుచు నుండెను చూచుచును + ఏఁగెను = చూచు చేఁగెను చూచుచు నేఁగెను అంతటను ద్రుతలోపపూర్వక పరరూపసంధి రాని పక్షమున సంధి ౧వ సూత్రము చొప్పున 'ఉ' కార పరరూప సంధి వర్తిల్లును

౧ వ వివ 'వచ్చుచున్నాఁడు' మున్నగు సమాపక క్రియా సమాన పదము లందలి 'చు' వర్ణము శత్రర్థక 'చు' ప్రత్యయము కాదు (చూ-క్రియా ౨౧ వ సూ ) అది ద్రుతప్రకృతికమె కాదు అవట సంధి ౧ వ సూత్రము చొప్పున నిత్య పరరూప సంధియె యగును

౨ వ వివ 'అందును' మున్నగునవి సప్తమ్యర్థకములైన ప్రత్యేక ద్రుత ప్రకృతిక పదములు క ..ఎం। దును (ప్రాసము, శాంతి ౨వ ఆ-౧౨౪, చూ-వ్యా-సం ౬౬ II విష)

౩ వ వివ అచ్చి-౨౩ వ సూత్రము చొప్పున 'నన్నును—మమ్మును' మున్నగు చోటులందలి జడ్డకు స్వరయోగమున లోపము గల్గనేరదు గాన 'ననేలె—మమేలె' మున్నగు ననిష్ట రూపములు గల్గనేరవు

## సంహితా యకారాగమము

సంధి లేని చోట స్వరంబుకంటెఁ బరంబయిన స్వరంబునకు యడాగమం బగు ౪ (వ్యా సం ౬౩ విష, బా సంధి ౩వ సూ)

ఆగమం బనఁగా వర్ణాధిక్యంబు ఉదా మా + అమ్మ = మా యమ్మ మీ + ఇల్లు = మీ యిల్లు మా + ఊరు = మా యూరు

౧వ వివ టకార మిద్వర్ణముగాఁ గలది పూర్వావయవముగాను, 'క' కార మిద్వర్ణముగాఁ గలది యంత్యావయవముగాను నిల్చును *

---

* 'అద్యన్తౌ టకితౌ' (౧-౧-౪౬) టిత్ కితౌ యస్యోక్తౌ తస్య క్రమా దాద్యన్తావయవౌ స్తః (సి కౌ ౩౬వ సూ ) 'మిత్రవదాగమః శత్రువదాదేశః' అను చొప్పున నాగమమున వర్ణవృద్ధి యగును ఆదేశ మొకదానిని ద్రోసివేసి దానిచోట నిల్చును (చూ ౨౧వ సూ-౧ విష-సంజ్ఞా)

౨ వ వివ తమిళాదులందు వలె 'వ' కారము సంహితా వ్యవధాయక ముగఁ బదాంతమునఁ దెల్గున నిల్వనేరదు కాని సమాన పద మధ్యమునఁ గొన్ని యెడల నది నిల్చుట గలదు ఉదా చతుర్థి- చ + ఉ + తి = చవుతి చిగురు చి + ఉ + రు = చివురు గెలుచు + అన్ = గెలు + ఉ + అన్ = గెలువన్ (వ్యా-సం-విస్త II ౬౭ I విష, చూ. ౧౮ సంజ్ఞా) ఇదె లఘు వకారము (చూ-౧౮-౧౯ సంజ్ఞా సూ-వివృతి)

## అకార సంధి

**అత్తునకు సంధి బహుళముగా నగు** ౫ (బా-సంధి- ౪ వ సూ , వ్యా-సం- ౬౮ విష)

౧ వ వివ బహుళ మనఁగా-తఱచుగా I వైకల్పికత, II కొన్ని చోట్ల వర్తిల్లకుండుట, III కొన్నియెడల నిత్యముగావచ్చుట, IV కొన్ని చోటులందు వేఱువిధమగు కార్యము గల్గుట ఈ నాల్గిటిలో నేదైన యథాసంభవముగా వర్తిల్లును బహువిధములగు నర్థములు గలది బహుళ మనఁబడును

౨వ వివ సంధి వైకల్పికత గల చోటులు ౧ వ్యతిరేక క్త్వార్థకము చూడక + ఉండె = చూడకుండె, చూడకయుండె ౨ భావార్థక 'ట' ప్రత్యయము ఉండుట + ఏల = ఉండు టేల ? ఉండుట యేల ? ౩ ధాతుజ విశేషణములు చేసిన + అతఁడు = చేసినతఁడు, చేసిన యతఁడు ౪ మేనాదిశబ్దములు మేన + అత్త = మెనత్త, మేనయత్త ౫ షష్ఠీసమాస స్థలము రాజుల + ఒద్ద = రాజులొద్ద, రాజులయొద్ద చింత (యొక్క) + ఆకు = చింతాకు, చింత యాకు తమ (యొక్క) + అంత = తమంత, తమయంత లే నెల (యొక్క) + అంత = లే నెలంత, లేనెలయంత మేక (యొక్క) + ఎరువు = మేకెరువు, మేక యెరువు. ఈ షష్ఠీ సమాసస్థలములలో ల వర్ణస్థలములు తప్పఁ దక్కినవి భారతాది ప్రాచీన గ్రంథములలోఁ గానరావు

౩వ వివ సంధి వర్తిల్లని చోటులు భారతాది ప్రాచీన గ్రంథములలో శుద్ధ సంస్కృతాకారమునకును, స్త్రీవాచక తత్సమ సంబోధనాంతముల 'అ' కారమునకును సంధి లేదు, అర్వాచీన కావ్యములం దట్టి సంధులు గలవు

శుద్ధ సంస్కృత కం... వరదాయ నమ శ్శంకర శరణనఁ జొచ్చెన్ (నన్ని-కు, ౩వ ఆ-౨౪౭) (శుద్ధ సంస్కృత వాక్య మగుటచే, 'శరణ' అని పదచ్ఛేదము చేయక తీరదు 'శరణు' అని పదమును ఛేధింపరాదు )

## అకారసంధి లేని చోటులు

తత్సమ, స్త్రీ వాచక "మహ త్త + అణగి = మహ త్త యణగి" అని ప్రాచీన పద్ధతి 'మహ త్తణఁగి (బసవ ౬ వ ఆ ౭౪౬, 'మహత్తు' అను నది వ్యావహారిక పదము) 'వా ర్త + అని = వా ర్తయని' అనునది (ప్రా) వా ర్తని(బసవ ౫ ఆ-౪౬౬ప) 'గంగ + అను = గంగ యను' అనునది (ప్రా), గంగను కాసె (ఆము-౨వ ఆ ౯) 'శ్రీరంగభ ర్త + అంచు = శ్రీరంగ భ ర్తయంచు' అనునది (ప్రా) శ్రీరంగ భ ర్తంచు (ఆము-౬వ ఆ). నెలఁత + ఇచ్చె + నెలఁతయిచ్చె (పా్రి), నెల తిచ్చె (ఆము) 'చేష్ట + ఉడిగె = చేష్ట యుడిగె' అనునది (ప్రా). చేష్టుడిగె (ఆము ४వ ఆ)

సంబోధనాంత (అప్ప + అల = అప్పల (ఉ హరి ౨వ ఆ-౧౬) ('ఓ యప్పా'-ప్రా) అమ్మలార + అక్కలార = ''అమ్మలార యక్కలార'' అనునది (ప్రా) అమ్మలా రక్కలార (బసవ ౫వ ఆ-౧౧౫) జయనులార + ఎన్నఁడు = "జయనులార యెన్నఁడు" అనునది (ప్రా) జయనులా రెన్నడు (బసవ ౬వ ఆ-౩౯౨)

౩వ వివ- సంధి నిత్య స్థలములు ప్రత్యయాచ్పరకత్వమందును ('అందు అవ' తప్ప, సీతయందు ఎనిమిదియవ),నాౖమ్రేడిత పరకత్వమందును బూజ్యార్థక శబ్ద ('అన' మొ ) పరకత్వమందును "అ" కార సంధి నిత్యము

ప్రత్యయాచ్ అర్థ + ఇంచు=అర్థించు (ఇది శుద్ధసంస్కృత సంధియు) మూర + ఎఁడు = మూరెడు (చూ సంధి-౧౨వ సూ )

ఆమ్రేడితపరకత్వ ఔర + ఔర = ఔరౌర (చూ సంధి-౧౧వ సూ )
పూజ్యార్థక సిద్ధ + అన = సిద్ధన మల్ల + అన = మల్లన అన్న +

అమ = అన్నమ (ఇవి శుద్ధ సంస్కృతాకారసంధులును, విరా-౧వ ఆ-౧౦౪) నన్న + అయ = నన్నయ (ఆది-౧వ ఆ-౨౬, విరా ౧ ఆ-౬), నన్న + అప = నన్నప (ఆది ౧వ ఆ-౯), తిక్క + అన=తిక్కన

## ఇకార సంధి

### ఏమ్యాదుల యిత్తునకు సంధి బహుళము ౬
'(బా-సం-౫, వ్యా-సం- ౩౦ విష)

౧వ వివ ఇత్తున కనఁగా హ్రస్వమగు 'ఇ' కారమునకు 'కును' అను షష్ఠియె 'కిని' అని తత్స ౨౬వ సూ చెప్పున మాఱును గాన "హరికిని + ఇచ్చె=హరికిచ్చె, హరికినిచ్చె" అను రీతిని సంధి ౩వ సూత్రముచేతనె సిద్ధించును గాన దానిని 'ఏమ్యాదు'లలోఁ జేర్పరాదు, ఏమ్యాది గణ మాకృతిగణము అట్లు పఠించుటకు వీలుకాని ప్రయోగములను బట్టియె తెలిసికొనఁ దగినది 'ఆకృతి గణము.'

౨వ వివ వైకల్పిక స్థలములు ఇది + ఏమి + ఒక్కొ=ఇదియేమి యొక్కొ (అర ౩వ ఆ-౨౧౨) ఇదేమొక్కొ, ఏమి + అపూర్వము=ఏమి యపూర్వము (ఆది ౧వ ఆ-౧౨౬), ఏమపూర్వము, నీపేరేమి + ఈవు = నీ పేరేమీ వెవ్వరి తనూజవు (ఆది ౮వ ఆ-౧౨౯). ఇవి + ఏనున్ = ఇవేనున్, ఇవి యేనున్(ఆది ౧వ ఆ-౧౨౭వ ప) తెలివి + ఒంది=తెలి వొంది, తెలివియొంది, తెలివి + ఆత్మ = తెలివాత్మ (కర్ణ ౩వ ఆ-౨౯౨), తెలివియాత్మ, సవతి + ఆలు=సవతాలు (ఆను ౫వ ఆ-౨౯౨), సవతి యాలు, కుయ్యి + ఆలింపుడు= కుయ్యాలింపుఁడు(విరా-౩ వ ఆ ౨౦),కుయ్యి యాలింపుఁడు, మాట గాని + ఆట గాదు= మాట గాని యాట గాదు, మాటగా నాటగాదు (ఆశ్ర ౧వ ఆ, ౩౪), మట్టి + ఆకు = మట్టి యాకు, మట్టాకు (జైమి-౮వ ఆ-౧౪౦),కట్టిఁడి + ఐన= కట్టిఁడి యైన, కట్టిఁడైన (నిర్వ ౫వ ఆ-౧౦౬), పడతి + అర్ఘ్య = పడఁతియర్ఘ్య= పడఁతర్ఘ్య (బసవ ౪వ ఆ-౭౪) వెండి + ఉంగరము = వెండి యుంగరము, వెండుంగరము (హరవి ), చేయని + అట్టి = చేయనట్టి,

చేయని యట్టి  ఇట్టి 'ఇ' కార సంధులు పెక్కు గలవు  పూజ్యార్థక పరకత్వ మందును 'ఇ' కార సంధ్యభావము గలదు—అమ్మాజియమ్మ (పాండు. ౧ వ ఆ-౭౮ ప)  లక్ష్మి + అమ్మ = లక్ష్మమ్మ (పాండు ౧ వ ఆ-౨౪)  'ఏని' శబ్ద సంధియుఁ బాక్షికమె-హరి నే నబ్ధిజనేని = హరినేని యబ్ధిజనేని (అహో)  ఏని యున్ (సభా ౨ వ ఆ-౫౮), యు లోపము-ఏనిన్ (ఆర ౨ వ ఆ-౨౨౨), శా ఎందే డెందము (మను ౨ వ ఆ-౭౨, ఎందేనియున్ + డెందము) ఇట్టివి ద్రుతప్రకృతికములు కావు ద్రుతోపజీవి శబ్దములు (చూ-సంజ్ఞా ౧౨ వ సూ ౩ వ వివ)

౩ వ వివ  సంధ్యభావ స్థలములు  భావార్థక 'మి' జ్యంతములు, ధాతుజ విశేషణములగు 'ఎడి' ప్రత్యయాంతములు మొ ఉదా  చేయమి + ఉచితము = చేయమి యుచితము, చేసెడి + అతఁడు = చేసెడి యతఁడు మొ  తత్స మేకార సంధులు-క్త్వార్థకేకార సంధులు-షష్ఠీ సమాసేకార సంధులును భారతాది ప్రబంధములలో లేవు  అర్వాచీన కవులు ప్రయోగించుచున్నారు

తత్సమ  శౌరి + ఇచ్చు = శౌరిచ్చు (అహో ౧౮౯ వ పు), అర్చి + ఇడఁగరాదు = అర్చిడఁగరాదు (వసు ౩ వ ఆ-౧౮౦), నళినారి + అఁట = నళినారఁట, సౌరభోద్గారి + అఁట = సౌరభోద్గారఁట (కవికర్ణ ౩ వ ఆ )

క్త్వార్థక  ఎఱింగి + ఎఱింగి = ఎఱింగెఱింగి  (భాగ ౯ వ స్కం), ఎఱిఁగి యెఱిఁగి, (సభా ౨ వ ఆ-౨౦౪) వెఱచి + ఇట్లు = వెఱ చిట్లు (నిర్వ ౫ వ ఆ ౮౮), చెప్పి + అంపఁడె = చెప్పంపఁడె (ప్రభా ౪ వ ఆ-ప్రౌఢ), కలిగి + ఉండు = కలిగుండు (బసవ ౭ వ ఆ-౮౨౭)

షష్ఠీ సమాస 'ఇ' కార  మగని + ఆలు = మగనాలు (కాశీ ౨ వ ఆ-౮౩), మగని యాలు (నిర్వ ౫ వ ఆ-౯౮, విజ్ఞా-ప్రాయ-౧౦౫ ), దీని (యొక్క) + అంఘ్రులు = దీనంఘ్రులు (నైష ౩ వ ఆ-౨౦౨), వాని (యొక్క) + అన్న = వానన్న (నరస ౪ వ ఆ-౭౮)

# సమాపక క్రియల 'ఇ' కారసంధి

సమాపకక్రియలం దిత్తునకు సంధి వైకల్పికము ౭

(బా-సంధి-౬ వ్యా-సం-౭౧ విష )

వచ్చిరి + అప్పుడు=వచ్చిరప్పుడు, వచ్చిరి యప్పుడు చేసిరి + అంత= చేసిరంత, చేసిరి యంత (ఉద్యో ౩ వ ఆ-౩౬ ప) సైరించిరి + ఇట్టి = సైరించి రిట్టి (ఉద్యో ౧ ఆ), సైరించిరి యిట్టి (నన్నయ మాత్రము ప్రథమపురుషము 'ఇ' కారమునకును సంధి నిత్య మనెను అట్లె తన భారత భాగమున వాడెను ) వచ్చితిమి + అప్పుడు=వచ్చితిమి యప్పుడు, వచ్చితి మప్పుడు (ఉద్యో-౩ ఆ ౩౬ ఆది ౫ ఆ ౨౩౯)

మధ్యమ పురుషక్రియలయం దిత్తునకు సంధి నిత్యము ౮

(బా-సంధి-౭ వ్యా-సం-౭౧ విష)

ఏలితివి + అపుడు=ఏలితి వపుడు ఏలితి + అపుడు=ఏలి తపుడు ఏలి తిరి + ఇపుడు=ఏలితి రిపుడు

క్త్వార్థంబైన యిత్తునకు భారతమందు మాత్రము సంధి కానరాదు ౯ (బా-సంధి-౮ సూ, వ్యా-సం-౭౨ - ౭౨ I విష) క్త్వార్థకేకార మేమ్యాదుల లోనిది, ఉదాహృతు లచటంగలవు (చూ-సంధి-౬ సూ, ౩ వివ)

## ద్రుతప్రకృతిక సంధి

ఇంకాదుల కచ్చు పరంబగునపుడు ద్రుతలోపపూర్వక పరరూప సంధి బహుళముగా నగు ౧౦ (బా-సం-౯ సూ, వ్యా-సం-౭౩ - ౭౩ I విష దీనివిస్తర II విష )*

---

* "వచ్చున్ + ఇపుడు" అను రీతిగల సూరి యుదాహృతు లసంభవ ములు అచట "వచ్చును + ఇపుడు = వచ్చునిపుడు" అను నుకార సంధియే (సంధి ౧ సూ) వర్తిల్లును ఇంకాదులకు ద్రుతలోపము కల్గనిదే సూరి పక్షమున సంధి యసంభవము 'కన నయ్యె డనఘ' (హరి న ౪ ఆ-౫౮) సూరియుం, ప్రౌఢయు సాధింపలేదు.

బహుళ మనుటచేత 'ఇఁకను, ఇంకను, ఇఁగను, ఇంగను' అను శబ్దముల కచ్చు పరమగునపుడును, 'ఎట్టకును' శబ్దమునకు 'ఏల-ఏని' శబ్దములు పరమగునపుడును, ''కననయ్యెడును + అనఘ'' మున్నగు మహాకవి ప్రయుక్త స్థలములందును ద్రుతలోపపూర్వక పరరూపసంధి వైకల్పికముగా నగును ఉదా॰ ఇఁకను + ఏల = ఇఁకేల = (ఆది ౨ ఆ ౨౧) ఇఁకనేల ఇంకను + ఐనను = ఇంకైనను (కర్ణ ౩ ఆ ౨౩౦), ఇంకనైనను ఎట్టకును + ఏలకున్ = ఎట్టకేలకున్ (శల్య ౨ ఆ ౪౦౫), ఎట్టకునేలకు ఎట్టకును + ఏని = ఏట్టకేని (శాంతి. ౧ ఆ ౧౬౪), ఎట్టకునేని ఒనర్పుదును + ఉరుమహిమ = ఒనర్పుదురు మహిమ (హరి-న ౨ ఆ ౫౧), ఒనర్పుదు నురుమహిమ దొరయంజేయుదును + ఏను = దొరియఁజేయుదేన(హరి-న-౨ ఆ ౩౮), దొరయఁజేయుదు, నేను కన నయ్యెడును + అనఘ = కననయ్యె డనఘ (హరి-న- ౪ ఆ. ౫౮), కననయ్యెడు ననఘ చెడఁగొఱుకును + ఇంతెకాక = చెడఁగొఱు కింతె కాక (భాస్కర శతక-౧౮), చెడఁగొఱుకు నింతెకాక నగించును + అటుగాక = నగించటుగాక (వేంకటనాథ-పంచ , వ్యా-సం-వి స II ౭౩ I విష , బాలకవి శరణ్య ౨౯౩-౩౦౩ పుటలు), నగించు నటుగాక 'కొలిచి తద్విజను=కొలిచితి నద్విజను చేసి తచ్యుతార్చనము=చేసితి నచ్యుతార్చనము (అహో ౧౯౪ పు, ౧౯౦ పుట )

## ఆమ్రేడిత స్వరసంధి

అచ్చున కామ్రేడితము పరంబగునపుడు సంధి తఱచుగ నగు ౧౧ (బా-సంధి-౧౦, వ్యా-సం-౭౪-౭౪ I విష )

ద్విస్త్రిరుక్తంబుల పరరూపము లామ్రేడితము లనఁబడును 'రక్షింపుమ రక్షిం‌పుమ రక్షింపుమ' (ఆది ౨ ఆ ౨౧౭) తఱచుగ ననుటచేత నొకానొక చోట సంధిలేమియుఁ గలదని యెఱుంగనగును ఉదా ఔర + ఔర = ఔరౌర ఆహా + ఆహా = ఆహాహా ఎట్టూ + ఎట్టూ = ఎట్టెట్టూ ఓహో + ఓహో =

ఓహోహో ఎదుట+ఎదుట=ఎట్ట యెదుట (కాశీ ४ ఆ ౧౮౬) ఇది సంధి లేమి కుదాహృతి యనఁదగును*

## ప్రత్యయాచ్చపరక సంధి

అంద్వవగాగమంబులు దప్ప నపదాది స్వరంబు పరంబగునపు డచ్చునకు సంధియగు ౧౨, (బా-సం-౧౧ సూ, వ్యా-సం-౭౩ I విష )

మూఁడు+ఎఁడు=మూఁడెఁడు పీసె+ఎఁడు=పీసెఁడు అర్థ+ఇంచు=అర్థించు నిర్జి+ఇంచు=నిర్జించు అంద్వవగాగమంబులు పరంబులగునపుడు యథా సంభవముగా గ్రహించునది ఉదా రాములందు, రాములయందు హరియందు ఎనిమిదవది, ఎనిమిదియవది

౧వ వివ 'అందు' సప్తమీ ప్రత్యయము 'అవ' పూరణార్థక తద్ధిత ప్రత్యయము అపదాది స్వరము=అపద మనఁగాఁ బ్రత్యయాదిక స్వరము 'ఏని-ఏసి' శబ్దము లవ్యయములు అపదములు కావు

## కుఱు శబ్దాది సంధి

కుఱు-చిఱు-కడు-నడు-నిడు శబ్దముల 'ఱ,డ' ల కచ్చు పరంబగునపుడు ద్విరుక్త టకారంబగు ౧౩ (బా-సంధి-౧౨, వ్యా-సం-౭౬-౭౮ I వి)

కుఱు+ఉసురు=కుట్టుసురు, చిఱు+ఎలుక=చిట్టెలుక, కడు+ఎదురు=కట్టెదురు, నడు+ఇల్లు=నట్టిల్లు, నిడు+ఊరుపు=నిట్టూరుపు

౧వ వివ ప్రాచీన తమ కాలమున 'ఱ' కారము 'ట-త'మధ్య స్థోచ్చారణము గల్గియుండెడిది కాన నట 'ట' కారము రావలసెను 'కుఱుచ-చిఱుత-

---

* ''ఏమి+ఏమి=ఏమేమి, ఏమి యేమి'' అని సంధిలేమిని సూరి యుదాహరించెను 'ఏమి యేమి' అను సంధ్యభావమునకుఁ బ్రాచీన మహాకవి ప్రయోగ మగపడదు ''ఏమి యేమియొ నాఁడు నీ హృదయమందు'' అను కళాపూర్ణోదయ ప్రయోగమున 'ఏమి' శబ్దంబులు రెండును భిన్నార్థకములు గాన నామ్రేడితస్థలము కాదనఁదగును 'ఏగి యేగి' అనునది భారతమాత్రస్థ క్త్వార్థకార సంధిరాహిత్యోదాహృతి అర్వాచీనులు క్త్వార్థకార సంధిని బ్రయోగించిరి (సంధి ౬ సూ ౩ వివ చూ)

నిడుద-నడుము' అనువాని కాచ్ఛిక సమాసమునఁ దుదివర్ణము లోపింపఁగా 'కుఱు' ప్రభృతు లేర్పడెను అట్టివానికి 'ఉ' కార పరరూప సంధి గాని (సంధి ౧వ సూ ), "టు" గాగమసంధి గాని (సంధి ౨౭ సూ) రానేర వని తాత్పర్యము "ఉసురు" అనునది 'ఆ' కార ఘటితమను 'శ-ర' సరికాదు కన్నడ-ఉసిర్, తమి-ఉయిర్

౨ వ వివ "కడు" శబ్ద డకారమున కాచ్ఛిక సమాసమున ద్విరుక్త "ట" కారము వచ్చును- కట్టెదురు (సభా-౨ ఆ ౯౭), 'కడు నడలున' (సభా ౨ ఆ ౧౨౮) అనునది వ్యస్తస్థలము ఇట 'కడు+ను' అనునది ద్రుతోపజీవి శబ్దము 'ను' శబ్ద మత్యంతాతిశయమును దెల్పును ఇది ద్రుతప్రకృతిక మనెడి 'శ-ర' సరికాదు 'కట్టుగ్రముగ' (బసవ ౩ ఆ-౪౬౭) అను పాఠము ప్రక్షిప్తము 'కట్టుగ్గము గ' అను తద్భవపాఠము కవిప్రయుక్త మనందగును (చూ-౬౦ III విష-వ్యా-సం , చూ సంజ్ఞా ౨౧ సూ ౫ వివ)

## గసడద వాదేశసంధి

ప్రథమమీఁది పరుషములకు 'గ-స-డ-ద-వ' లు బహుళముగా నగు ౧౪ (బా-సంధి-౧౩ సూ., వ్యా-సం-౭౭ మొ ౭౯ I విష )

౧ వ వివ ఈ యాదేశము ప్రథమమీఁదను, ప్రథమాంత శబ్దముల తుది నుండు "దు-వు-రు-వు-ము-ఁడు" మున్నగు ప్రత్యయముల మీఁదను భారతమున నిత్యముగఁ బ్రయోగింపఁబడినది (చూ-వ్యా-సం ౭౭-౭౮ I విష) "మానుగ-తెల్లగ-తెల్లవాఱు-ఇఱువది-అఱువది-ఇరుగడ-నలుగడ" మున్నగువానియందును దీనికి భారతేతర కావ్యములందును నిత్యప్రవృత్తియె (వ్యా-సం ౭౮ II విష)

౨వ వివ కాలక్రమమున మహాకవులు దీనిని బ్రథమ మీఁదనే కాక కళా శబ్దముల మీఁదను నైచ్ఛికముగఁ బ్రయోగించిరి కొన్నిట బ్రథమ మీఁదను జేయలేదు ... బహు ... ప్రవృత్తి యనఁదగును ఉదా ఆ। హా వుట్టింపదె (పిన-శాకుం ౨౩ ౧౮౮), రాజ్య। శ్రీ వాలింపఁగ (ఉద్యో ౧ ఆ ౧౪౨) వయః। శ్రీ చన(మను-౩ ఆ-౧౦౫) వారణనగరి పుర మతల్లి(రాఘవ-౧ ఆ ౧)

సమదాటోపారి పంక్తి రథుడు (రాఘవ-౧ ఆ ౨ ప, నగరి + పురమతల్లి, సమదాటో పారి + పంక్తిరథుడు)

౩ వ వివ అప్రవృత్తి 'అ-ఆ' మున్నగు కాక్వాదిస్వరముల మీఁదను సంబోధనాంతములమీఁదను, క్త్వార్థకముల మీఁదను, ద్వంద్వేతర సమాసముల యందును (చూ-౧౬ సూ-౧ వివ), విశేషించి షష్ఠీ సమాసమందును నీయాదేశమున క్రప్రవృత్తి నంగీకరింపఁదగు (చూ-వ్యా-సం-౭౮ IV విష) క-పర్వం। ఱకడున్(ఆది ౧ ఆ-౫౮), కీ। దే కురువంశమునకు .. (ఉద్యో ౩ ఆ ౧౭౧) సంబో క... కృ।ష్ణా తునిమెద (కర్ణ ౨ ఆ ౩౨౬), మ చూ।చి త గం బొమ్మని . (ఉద్యో ౩ ఆ ౮౦) ఇం।టి కడన యున్కి... (విరా ౩ ఆ ౧౫౧), చ . పి।న్న తునియలై... (సౌప్తి ౧ ఆ ౬౦, వ్యా-సం ౭౮ IV విష)

౪ వ వివ తెనుఁగుల మీఁది సాంస్కృతిక పరుషములకు 'గ-స-డ-ద-వా' దేశము లేదను సూరి సూత్ర మవిమర్శకృతము (చూ-వ్యా-సం-౭౮ IV విష) చ జగము. ఎం। త గుమతులైన ఉద్యో ౧ ఆ ౨౮౬) శా ... వీ। ర గ్లోపించిన (ఉ-హరి-౪ ఆ ౫౩) మ.. ఇ। ట్లు దపంబు .. (నిర్వ-౫ ౬ ౮, వ్యా-సం ౩౮ IV విష, ప్రౌఢ-సంధి ౫ సూ )

## ద్వంద్వ గ-స-డ-ద-వాదేశము

ద్వంద్వంబునం బదంబుపయి పరుషములకు 'గ-స-డ-ద-వ'లగు ౧౫ (బా-సం-౧౫ సూ, వ్యా-సం-౭౬ ౭౬ I విష)

కూర + కాయ = కూరగాయలు, కాలు + చేయి = కాలుసేతులు, టక్కు + టెక్కు = టక్కుడెక్కులు, తల్లి + తండ్రి = తల్లిదండ్రులు, ఊరు + పల్లె = ఊరుపల్లెలు

౧ వ వివ ద్వంద్వ సమాసమున నీ యాదేశము గల్గునని నన్నయయు విశేషించి చెప్పుటచేత ద్వంద్వేతర సమాసములం దిది రానేరదనుట యుక్తము

శబ్ద రత్నాకరాది కోశములలోని 'వెలి దామర - తెలి దమ్మి' మున్నగు శబ్దము లందలి కర్మధారయమునందలి యాదేశములు నిరాధారములు 'పిన్నతునియలు' మున్నగు (సౌప్తి ౧ వ ఆ-౬౫, వ్యా-సం ౨౩౩ పు) ప్రయోగములకు విరుద్ధములు నగుచున్నవి ప్రౌఢవ్యాకర్త నిషేధించిన 'రాక పోకలు' మున్నగు వ్యావహారిక ప్రయోగములు మూలముగాఁ గల నిషేధము నిరాధారము అట్టివి ప్రాసాది గత ప్రయోగములు లేవు

## ద్రుతముమీఁది సరళాదేశము

**ద్రుతముమీఁది పరుషములకు సరళము లగు ౧౬**

**(బా-౧౬ వ సూ, వ్యా-సం-౮౦-౮౦ II విష)**

**ఉదా.** **పూచెను** + కలువలు=**పూచెను** గలువలు, **తోఁచెను** + చుక్కలు = **తోఁచెను** జుక్కలు, **చేసెను** + టక్కులు=**చేసెను** డక్కులు, నెగడెను + తమములు=నెగడెను దమములు, మొగిడెను + పద్మము = మొగిడెను బద్మము. 'ద్రుతముమీఁది పరుషముల' కనుటచేత* ద్రుతోపజీవి శబ్దములమీఁదను నీ యాదేశము గల్గును, ఉదా ఎంతయును + కోపించె=ఎంతయును గోపించె

౧ వ వివ శ్వాసవర్ణ పరక పరుషముల కీ యాదేశము సంభవింపదు ఉదా వచ్చెను + క్షత్త్రియుఁడు=వచ్చెను క్షత్త్రియుఁడు ఇట్టివి స్థిరవర్ణముల వంటివె

౨ వ వివ ద్రుత'ను' స్వరూపముమీఁది యీ సరళాదేశమునకుఁ ప్రాచీన మహాకవి ప్రయోగములు గానరావు తే గీ 'నగరమునకు మహీజాతను గొనివచ్చె' (అప్పక ౫ వ ఆ-౧౪౨) అను ప్రయోగము మాత్రము గలదు అహోబలపతియు నీ ద్రుతస్వత్వముమీఁది సరళాదేశము నంగీకరించెను (౨౦౭వ

---

* సూరి "ద్రుత ప్రకృతికములమీఁది పరుషములకు" అని సూత్రించుట సరికాదు ద్రుతోపజీవి శబ్దములమీఁదను నీ యాదేశాదు లగును ఉదా అదియును గాక మొ.

పు అహో) నేఁడెల్లరును నిట్టి ప్రయోగము నంగీకరించుచున్నారు దీనిని బట్టి దీని (ను) రూపాంతరమగు 'ని' స్వరూపముమీఁదను (తత్స—౨౬ వ సూ ) నీ సరళాదేశము సమ్మతమె యగుచున్నది

## ఆదేశసరళ పరక ద్రుత పరిణామములు

ఆదేశసరళములకు ముందున్న ద్రుతమునకు బిందు సంశ్లేషములు విభాష నగు ౧౭ (బా సంధి ౧౭వ సూ, వ్యా సం ౭౦ II విష)

సంశ్లేష మనఁగా ద్రుత ము కారలోపపూర్వకముగఁ బరహల్లుతో సంయోగించుట* 'ను' స్వరూపమున ద్రుతము నిల్చుట స్వత్వము సూత్రమందలి బిందుశబ్దముచేఁ బూర్ణార్థములు రెండును గ్రాహ్యములు పూచెఁ గలువలు=పూచెం గలువలు, పూచె న్గలువలు తోఁచె జుక్కలు = తోఁచెం జుక్కలు, తోఁచె న్జుక్కలు చేసెఁడక్కులు = చేసెం డక్కులు, చేసె న్డక్కులు నెగడెఁ దమములు = నెగడెం దమములు, నెగడె న్దమములు. మొగిడెఁ బద్మము=మొగిడెం బద్మము, మొగిడె న్బద్మము. బిందు సంశ్లేషములు రాని పక్షమున ద్రుతము స్వస్వరూపముతోనె నిల్చియుండును ఇట్టివి సంధి ౧౬ వ సూత్రమున నుదాహృతము లయ్యెను

౧ వ వివ సంజ్ఞా-౧౫ వ సూత్రము చొప్పున దీర్ఘముమీఁద నిండు సున్న రూప ముండరాదు రాను + చూచెను = 'రాంజూచెను' అని కానేరదు 'రాఁ జూచెను' అని మాత్రమె నిల్చును సంధి ౨౨ వ సూత్రము చొప్పున నుడి తొలిహ్రస్వముమీఁద నరసున్న నిల్వదు, కాన 'కెంపు + తామర=కెఁదామర' అని కానేరదు, ఇంక ''కెందామర'' అని మాత్రమె యగును (సంధి ౩౮ వ సూ) ప్రకృత సూత్రములోని 'విభాషా' శబ్దము వ్యవస్థిత విభాష గావున నుడి తొలి

---

* సూరి "సంశ్లేషమనఁగా మీఁదిహల్లుతోఁ గూడికొనుట" అని వివరించుట సరికాదు సూరి పక్షమునందును ద్రుతము 'ను' స్వరూపమె కదా చింతామణిపక్షమున మాత్రము ద్రుతము నకారపు పొల్లు

హ్రస్వముమీఁద సంశ్లేషమును రాదు, ఉదా 'కెంపు + తామర = కెన్దామర' అనియుఁ గానేరదు ఇట్టియెడల నకారమును స్థిరపఱచు ప్రయోగములు లేవు

## సరళ స్థిర పరక ద్రుతసంధి

ద్రుతంబునకు సరళస్థిరంబులు పరంబు లగునపుడు లోపసంశ్లేషంబులు విభాష నగు ౧౮ (బాల సంధి-౧౮, వ్యా సం ౮౧ II విష)

వచ్చెను + గోవులు = వచ్చె గోవులు, వచ్చెన్గోవులు, వచ్చెను గోవులు
మెఱసెను + ఖడ్గము = మెఱసె ఖడ్గము, మెఱసె న్ఖడ్గము, మెఱసెను ఖడ్గము

౧వ వివ :- వెనుకటి సూత్రములోని సరళము లాదేశ సరళములు, ప్రకృత సూత్రములోని సరళములు సహజ సరళములు

వెనుకటి సూత్రమున వివరించిన రీతిని శ్వాసాక్షరపరక పరుషములు ద్రుతమునకుఁ బరములగునపు డీసూత్రముచొప్పున ద్రుతలోప సంశ్లేష స్వత్వములె యగును ఉదా వచ్చెను + క్షత్రియుఁడు = వచ్చె క్షత్రియుఁడు, వచ్చెన్ క్షత్త్రియుఁడు, వచ్చెను క్షత్త్రియుఁడు సంధి ౨వ సూత్రముచొప్పున 'ఋ-ౠ' వర్ణ పరకత్వమునను ద్రుతమునకు లోప సంశ్లేష స్వత్వము లగును ఉదా వచ్చెను + ఋషి = వచ్చెఋషి, వచ్చె నృషి, వచ్చెను ఋషి సంధి ౨౨వ సూత్రముచొప్పున నుడి తొలిహ్రస్వముపైన ద్రుతలోపము లేదు ఉదా ''కన్ + దోయి = కదోయి'' అనరాదు, ''కన్దోయి, కందోయి'' (సంధి ౧౯వ సూ) అనియె యనవలెను ప్రకృతసూత్రముచొప్పున వచ్చు ద్రుతసంశ్లేషమునకు ఉ ఇచ్చటన్ । మెచ్చగు పీరిదైన సుఖనిద్రకు . (ఆది ౬వ ఆ ౨౦౦ ప) సమాసమున నీద్రుతమునకు స్వత్వము లేదు (సంధి ౨౬వ సూ) ఆదేశసరళ పరకత్వమందు వలెనె యిందును ప్రాఁతాది సూత్రసిద్ధ ద్రుతమునకు సంశ్లేషము లేదు 'కెంపు + దూళి = కె + ను + దూళి = కెందూళి' అని మాత్రమె యగును, ఇందలి సంశ్లేషమును నిర్వహించు ప్రయోగము లేదు

# వర్గయుక్ సరళపరక ద్రుతసంధి

వర్గయుక్సరళములు, మకారమును బరంబులగు నపుడు కొన్నియెడల ద్రుతమునకుఁ బూర్ణబిందువును గానంబడియెడి ౧౯ (బా సంధి-౧౯వ సూ వ్యా సం-౮౨ I. II విష)

వచ్చెను + ధాత్రీపతి = వచ్చెంధాత్రీపతి, పాడెను + గంధర్వుఁడు = పాడెం గంధర్వుఁడు, కన్ + దోయి = కందోయి, లతాంతములకును + మొనసి = లతాంతములకుం మొనసి (ఆది ౫వ ఆ-౧౩౮)

౧వ వివ యుక్కు లనఁగా సమసంఖ్య గలవి వర్గయుక్కు లనఁగా వర్గాక్షరములలో సమసంఖ్య గలవి ఉదా ఖ-ఘ-ఛ-ఝ మొ సూత్రములోని సరళ శబ్దమునకు సహజసరళము లనియె యర్థము, సూత్రములోని 'పూర్ణబిందువును' అనుచోటి సముచ్చయార్థక 'ను' శబ్దముచేతఁ బూర్ణబిందువే కాక వెనుకటి సూత్రముచొప్పున "లోప సంశ్లేష స్వత్వములును" నగు నని గ్రహింపవలెను ఉదా పాడెను + గంధర్వుడు = పాడెంగంధర్వుఁడు, పాడె గంధర్వుఁడు, పాడె గ్గంధర్వుఁడు, పాడెను గంధర్వుఁడు ఇట్లె తక్కినచోటులందును నుదాహృతుల నెన్నవలయును సంజ్ఞా ౧౭వ సూత్రముచొప్పున స్థిరపరక బిందు వుండ రాదనుట కీ సూత్ర మపవాదమగుచు బాధకమగుచున్నది

౨వ వివ 'బిన్దుం ప్రవదన్తి తం క్వచి త్కేచిత్' అను నన్నయ సూత్రమును బట్టియుఁ బ్రకృత సూత్రములోని 'కొన్ని యెడల' అను దానిని బట్టియుఁ నీ సూత్రము యథాప్రయోగముగ నెన్నఁదగు నని గ్రహింపవలెను నన్నయ 'మ' కార పరకత్వమున మాత్రమే పూర్ణబిదువును బ్రయోగించెను ఉ ఇమ్ముగ ..వం। ద్యుం ముని నప్పరాశర(ఆది ౧వ ఆ-౭౮), లయుగ్రాహి కమ్మని లతాంతములకుం మొనసి (ఆది ౫వ ఆ-౧౩౮) ఇది యనునాసిక ప్రాసమని యప్పకవి యుదాహరించెను (అప్పక ౩వ ఆ-౩౪౨వ ప) పై విషయములను గ్రహింపక ప్రౌఢవ్యాకర్త 'ప్రాసంబున మకారంబు పరంబగుచో

ద్రుతంబునకు మకారాదేశంబగు' (ప్రౌఢ-సంధి-౨౨వ సూ) అని మార్గాంతరము నుద్రొక్కుట సరికాదు ప్రాసంబున నన్నయయే ప్రయోగించునపుడు తక్కిన యెడలఁ జెల్లకుండునా? ప్రాసమున మాత్రము ద్రుతమునకు మకారాదేశమగు ననుట యసంగతము

తర్వాతి వారీ పూర్ణమును (మ కారేతర పరకత్వమున) ధారాళముగఁ బ్రయోగించిరి ఉ వే।సెం జ్వరుఁడు మం।టం జ్వలనంబు. (ఉ హరి ౭వ ఆ-౮౮వ ప), గీ బంధమగు కృష్ణుఁ డుదయించినం ధరిత్రి (ఛందోద ౧వ ఆ-౫౧వ ప), క కందోయి చల్లగా నిటు। కందోయి...(సారం-౩వ ఆ), ...కర।ణిం జనియించు (ఆము ౧వ ఆ-౯౧), గీ ధ్వాంధమిత భేరికాధ్వాన। ముం ధులీ నినాదము. . (అధర్వణ భారత-విరాట, అప్పక-౫వ ఆ-౧౫౫), లోలా।ర్కుం రేవ.. . (కవి సింగరన్నగారి త్రిశంకవోపాఖ్యానము, అప్పక, ౫వ అ-౧౫౪)

## అవసాన ద్రుత లోప సంధి

అవసానంబునందు ద్రుతస్వరంబునకేని ద్రుతంబునకేని లోపంబు విభాషగా నగు ౨౦ (బా-సంధి-౨౦, వ్యా-సం-౮౩ II విష)

వాఁడు వచ్చెన్-వాఁడు వచ్చె-వాఁడు వచ్చెను ఈ లోపంబు పద్యాంతము లందు గణానుసారంబుగ వ్యవస్థితం బయియుండు *

౧వ వివ అవసాన మనఁగా నర్ధమాత్రా కాలిక వ్యవధానమున కన్న నధిక కాల వ్యవధాన ముండుట ఇట్టి వ్యవధానము గద్యములలో వాక్యాంతమందును, బద్యముల తుదిని, నుద్ధరణ చిహ్నములను నిల్పు స్థలములందును దెలుగుఁన సంభవించును ఉదా ఉద్ధరణ అది చూచి 'ఏల వచ్చె' అని నీవడిగితివి మొ

* "గుర్వవసాయి యగు పద్యంబు తుదను స్వత్వంబు లేదు అతిశయముగ బుద్ధిమంతుఁ డగు బుధసేవన్" ఈ సూరి వాక్యము లనావశ్యకములు

# ద్రుతముమీఁది ద్రుతము

కొన్ని యెడల ద్రుతంబు మీఁద ద్రుతంబు గానం బడియెడి ౨౧ (బా-సం-౨౧, వ్యా-సం ౮౪-౮౪ I విష)

'ను' శబ్దము సముచ్చయా ద్యర్థ విశేష బోధకమును, గొన్ని యెడల నిరర్థకమును నై యుండును ఇది సుబంతముల మీఁదఁ దఱచుగను దిజంతముల మీఁద నరుదుగను నిల్చును ఇయ్యది కళలమీద 'యును' లేదా 'ను' అనురూప ముతోను, ద్రుతముల మీఁదను, 'ఉ' కారాంతముల మీఁదను "నును" లేదా"ను" అను రూపముతోను నిలుచును కొన్ని యెడల సముచ్చయా ద్యర్థ విశేష మావశ్యకమైయున్నను నిది నిల్వక లోపించియె యట్టి యర్థముల నిచ్చును (ప్రౌ-శబ్ద-౧౧౬వ సూ)

# ద్రుతద్విత్వ సంధి

సుబంతములమీద అదియునుంగాక- ఇట మీఁదఁజెప్పిన దాని కతిశ యము సముచ్చయార్థము దివంబునుంబోలె- ఇట స్వర్గాధిక్యతాతిశయము సము చ్చయార్థము ఇట్టివెల్ల నిరర్థకములును పాదపూరణార్థకములును నని బాలవ్యా కర్తయుఁ ప్రౌఢవ్యాకర్తయు (ప్రౌఢ శబ్ద-౧౧౬) దలంచుట సరికాఁదు యు వర్ణ పూర్వకతా రాహిత్యము కం ఏ। మిని జేయఁగనీమి (ఉద్యో ౨వ ఆ-౧౩) తిజంతముల మీఁద వినఁడును గానఁడున్ మఱియు. (ఉద్యో ౨వ ఆ-౧౪) లోపించుట క అతిమానుష మత్యద్భుత। మతి దుష్కరమైన కేశవార్జున కృతి...(అది ౮వ ఆ-౩౧౯) ఒకచో నుండి మఱొ కచో లోపించుట చ విను మఱేఁ జంపనుం జెరుప వేఁచుట లెస్స (శాంతి ౩వ ఆ-౨౦) నిరర్థకముగా నుచ్చారణ సౌకర్యమునకై నిల్చుట అతఁడును నితఁడును వచ్చిరి అదియును నిదియును గలవు వీనిలో మొదటి 'ను' శబ్దము సముచ్చయార్థము తర్వాతిది యుచ్చారణ సౌకర్యార్థము- కం.. అనవుడును నయ్యధోముఖ విప్రుల్ (ఆది ౨వ ఆ-౧౪౨) ఇట్టియెడలనె ద్రుతద్విత్వస్థితి సంభవించును 'ను-ని-న' అను ద్విత్రి 'న' వర్ణముల స్థితిలో నుచ్చారణ

సౌకర్యమునకై పూర్వ 'న' కారముమీఁది స్వరము వికల్పముగ లోపించును అట్టియెడల 'న' కార ద్విత్వము భాసిల్లును ఇట్టి ద్రుత ద్విత్వమును నన్నయ పలుతావులలో వాడెను తిక్కయజ్వ తన విశాల భారత భాగమున వాడనే లేదు తర్వాతి కవులు పెక్కురు వాడిరి నన్నయ వృత్రుఁ డన్నసుర (అర ౩వ ఆ-౩) ఇట నన్నయపక్షమున లుప్తస్వరక శబ్దావయవ నకారమును ('అను' అనెడిదాని 'అన్' అనురూపము) ద్రుతమె ధైర్యవృత్తికి న్నరుదుగ (అర ౧వ ఆ-౩౨౧), మత్త ఎన్నఁడు న్నేని. (ఆది ౨వ ఆ-౧౪౨), అన్నిష్టసఖి నూఁది యున్నదాని (ఆది ౩వ ఆ-౧౪౦), నందిని యన్నేటి తరంగలన్ (ఆది ౧వ ఆ-౭౯), తంద్రి పంపున। న్నివ్వన భూమి (అర ౪వ ఆ-౩౨౪) ఇట్లుగ నెఱ్ఱాప్రెగడ మున్నగువారును ప్రయోగించిరి ప్రౌఢ-సంధి ౩వ సూత్రమునొద్ద నితరకవుల ప్రయోగములు పెక్కుదాహృతము లయ్యె సర్వ మసహ్య మన న్నెఱుంగివే (మనుచ ౩వ ఆ) వీనిని దుస్సంధులని కవిజనాశ్రయాప్పకవీయ నరసభూపాలీయములు వచించుట పొరపాటు మఱియు "కను + ఆకు=కన్నాకు (ముఖ్యుఁడు), పలు + అఱపులు=పల్లఱపులు (జల్పితములు)" మున్నగు చోటులు యథా ప్రయోగముగ నెన్నునది

## పదాది ద్రుతలో పాభావము

'ఇఁక-ఇఁగ-అఁట-చుఁడు' అను శబ్దంబులం దప్ప నుడి తొలిహ్రస్వంబు మీఁద ఖండబిందువును ద్రుతంబునకు లోపంబునులేవు ౨౨ (బా సంధి-౨౨, వ్యా-సం ౧౫ II విష)

నుడి=మాట నుడి తొలిహ్రస్వము=పదాది హ్రస్వము 'అఁట' కిలార్థకము 'చుఁడు' శబ్దము 'చూడుఁడు' శబ్ద సంక్షేపము ఇట్లె 'చూడుము' శబ్ద సంక్షేపము 'చుమ్ము' అనునది ఈ సూత్రముచే 'క్రొత్త + పసిఁడి = క్రొ + ను + పసిఁడి = క్రొంబసిఁడి' అగునే కాని 'క్రొఁ బసిఁడి' అని కానేరదు (చూ సంధి ౩౫వ సూ ) కన్ను + దోయి = కన్ను + ను + దోయి (సంధి ౨౪ సూ) = కన్నుందోయి=క + ను + దోయి (న్ను లోపించి ద్రుత 'ను' శబ్దము మిగిలినది) కందోయి ('కదోయి' అనరాదు) అఁట గీ దాతవఁట నీవు

మేము సంధాతల మఁట। గౌరియంట. శంభుఁడంట. (హరవి ౪వ ఆ-౬౫) 'అఁట-అంట' అని యుండఁదగిన చోటులందెల్ల భారతమున 'అటె-అట్టె' అనునవి సంస్కర్తలచే నిల్పఁ బడినవి ద్విపద-ఇఁగ మెడఁ దునిమెద విది యేమి పుట్టె। జగములలో (బసవ, ౫వ ఆ-౬౦) క వనట యుడుగు మిఁక దుర్మతి। యను బోలెను.. (అశ్వ ౧వ ఆ-౮) క భయం। కర మూర్తులు దాల్చి యుండఁగావలయుఁ జుఁడీ (విరా ౧వ ఆ-౧౭౬) అనునవి 'ఇఁగ-ఇఁక-చుఁడు' అనువాని ప్రయోగములు

౧వ వివ తాను, నేను పదంబులకు సంశ్లేషము లేదను సూరి సూత్రము భ్రాంతిమూలకము (బా-సంధి ౨౩వ సూ, వ్యా-సం-౮౬ I విష) "వినా ద్వితీయ" మ్మిత్యా ద్యథర్వణ కారిక వీరి యీ భ్రాంతికి మూలమై యుండును 'తాన్ చదివె' తాన్ వినె' అను సంశ్లేషరూపము లుండవు గాని 'తాన్జదివె-తాన్వినె' అను ద్రుత స్వత్వరూపములు సమ్మతములె యని యీ యథర్వణ కారికకుఁ దాత్పర్యము నన్నయాథర్వణుల స్వత్వ సంశ్లేషముల స్వరూపము తెలి యని కారణమున నట్లు సూరి సూత్రింపవలసెను బాలవ్యాకరణ వ్యాఖ్యాత లింకను ప్రామాదికముగా దీర్ఘముమీఁదనె సంశ్లేషముండ దని వ్రాసిరి, క ఏన్బ ర్వంబులను (ఆది ౧వ ఆ ౪౬), ఉ ..నాలుగే। న్బాడికుఱ్ఱుల నీఁడె. (ఆది ౫ ఆ-౨౧౮ప) నన్నయాథర్వణ పక్షమునందలి ద్రుత సంశ్లేష స్వత్వములు రెంటియందును ద్రుతము 'న' కార వ్యంజన రూపమె అది పూర్వాచ్చున కంగమై దానిని నత్తియుండుట సంశ్లేషము పరాచ్చున కంగమై పరహల్లుతో సంయోగించుట స్వత్వము )

## సామాసిక ద్రుతలోప ద్రుతాగమములు

సమాసంబునందు ద్రుతంబునకు లోపంబగు ౨౩
(బాల-సంధి-౨౪, వ్యా-సం-౮౭-౮౭ I విష)

రాముని యొక్క + గుణములు = రాముని + న్ + గుణములు = (చూ

సఘూ—౩-౨వ సూ) = రాముని గుణములు *

సమాసంబుల నుదంతంబులగు స్త్రీ సమంబులకుం బు, ంపు లకుం బరుష సరళంబులు పరంబు లగునపుడు నుగాగమం బగు ౨౪ (బా-సంధి-౨౫వ సూ; వ్యా సం-౧౬౮-౧౭౧ I-II విష)

ఇచటం బరుషంబులు పరంబు లగునవుడు ద్రుతంబునకు బిందు సంశ్లేష ములచే (సంధి ౧౭వ సూ) మూఁడు రూపంబులు సరళంబులు పరంబు లగు నపుడు లోప సంశ్లేష పూర్ణబిందువులచే (సంధి ౧౮-౧౯వ సూ) మూఁడు రూపంబులు విధాన సామర్థ్యము వలన సంధి ౨౩వ సూత్రముచే లోపంబులేదు వక్ష్యమాణవిధిచే (౨౫వ సూ) దీనికి స్వత్వంబు లేదు చిగురు + కైదువు = చిగురుఁగైదువు చిగురుంగైదువు, చిగురున్గైదువు, తళుకు + గజ్జెలు = తళుకుం గజ్జెలు, తళుకు గజ్జెలు, తళుకు న్గజ్జెలు సింగము + కొదమ = సింగపుఁగొదమ, సింగపుం గొదమ, సింగపున్గొదమ ఈ యుదాహృతిచే నీ నుక్కును, పుం-పులును "సమాసంబులన్" అను బహువచనమున కనుకూలముగ శేష షష్ఠీ సమాసమందును నగునని యెఱుంగునది "కన్నుం గవ" (ఆది ౪వ ఆ ౨౫౪, మనుచ ౨వ ఆ ౩౨) సాహసంబు తఱియె మేదినీశ యిది బుద్ధి. (శల్య ౨వ ఆ ౧౧౪) అను చొప్పున 'పుం-పు'ల రామియుఁగలదు ఉన్నతము + గొడుగు = ఉన్నతంపుం గొడుగు, ఉన్నతంపు గొడుగు, ఉన్నతంపు న్గొడుగు, ఇందలి సంశ్లేషమును నిర్వహించు ప్రయోగములు లభింపలేదు

---

* సూరి యిట్లుదాహరింపక మార్గాంతరగామి యయ్యెను 'ఎల్ల' శబ్దము ద్రుతాంతమగు నవ్యయ మనుచు 'ఎల్లన్ + అర్థములు = ఎల్ల యర్థములు' అని యుదాహరించెను 'ఎల్ల' శబ్ద మాచ్ఛిక సర్వనామ ప్రథమైకవచనము అవ్యయము కాదు-ఎల్లరు, ఎల్లరకు, ఎల్లయందు, మొ 'ఎల్లన్ శిష్యులు' మున్నగునవి చార్థక 'ను' శబ్దయోగమున ద్రుతోపజీవి శబ్దములు షష్ఠీతత్పురుషమునందలి షష్ఠి ద్వితీయా నకారముగా నిల్చుననుటయు, నది దీనిచే లోపించుననుటయు నన్నయ పద్ధతి 'షష్ఠీ భవే ద్ద్వితీయా తుల్యా। తత్పురుష సంస్థితా నామ్నామ్' ఆం చిం) సూరి యీ మార్గమునె విడుచుట పొరపాటు

౧ వ వివ  సంఖ్యావాచకముల పయి నీ యాగమము రాదు  మూఁడు కృతులు (విరా ౧వ ఆ-౬) ఐదు ప్రొద్దులు (ఆది ౧వ ఆ-౬౧) నలుగ దలు--ఇరుగడలు-మొ

౨ వ వివ  ఉదంత తద్ధర్మార్థక విశేషణములు స్త్రీ సమములై యైనను వానిపై నీ యాగమము భారతాది ప్రాచీన గ్రంథములందు లేదు ఉదా  ముద్దు సేయు కొడుకు (విరా ౧వ ఆ ౯౧) అర్వాచీనకవుల గ్రంథములలోఁగలదు శా వాలారుం గొనగోళ్ళ . (మనుచ ౩వ ఆ-౫౭) చె। కుక్కలఁ బోలుం దెలనాకులు (పాండు ౧వ ఆ-౨౬) మొ

౩ వ వివ  కొన్నియెడల స్త్రీ సమములపైని నీ యాగమము లేకుండుట కలదు  చేటు కాలము (శాంతి ౪వ ఆ-౪౩౫), కీడు ప। ల్కొక్కఁడు  లేదు (ఉద్యో ౨వ ఆ-౬౩, అహో  ౨౨౧వ పుట) ఈ ప్రయోగములు ప్రాస గతములు లభింపలేదు

౪ వ వివ  స్త్రీ సమముల కనుటచేత నీ విధి యాచ్ఛిక  సమాసములందే వర్తిల్లును  ఉదా  కడుం జెడుం దెఱఁగు (ఉద్యో ౩వ ఆ ౩౪౪) చెడుం బ్రవర్తనము' అనరాదు  పుంపుల పట్ల సంస్కృత సమముల మీదను, మిశ్ర సమాసములందును నుక్కు వచ్చును  ఉదా  వరవుడ పుంజరిత్రము (అను ౧ ఆ-౨౦౯ ప)

౫వ వివ  స్థిరపరశత్వమందును నీ 'నుక్కు' అరుదుగ నగపడుచున్నది సిబ్బెపున్ । మే తెలి  (కవి పితామహుని యుత్పల మాలిక)  గరువపు న్మరువు (బాల వ్యా సంధి ౨౫)

## సామాసిక స్వత్వ సంశ్లేష నిషేధము

సమాసంబులందు ద్రుతంబునకు స్వత్వము లేదు ౨౫ (బా స౦-౨౬వ సూ. వ్యా సం ౮౯-I విష)

సామాసిక ద్రుతాగమమునకు స్వత్వమే కాక సంశ్లేషమును ప్రయోగారూఢముగ నగపడదు 'తళుకుమ గజ్జెలు' అనరాదు సరేకదా 'తళుక్గజ్జెలు' అను సంశ్లేషమును నిర్వహించు ప్రయోగము నగపడదు

తలఁబ్రాలు మొదలగు సమాసంబుల ద్రుతంబునకు లోపంబు లేదు ౨౬ (బా సం-౨౭, వ్యా సం ౯౦-I విష)

సంధి ౨౩వ సూత్రము చెప్పిన సిద్ధించుచున్న ద్రుతలోప మీ సమాస స్థలములలోఁ గల్గ దని తాత్పర్యము తలఁబ్రా ల్వాదులు మధ్యమపద లోపి సమాసములు ఉదా తలను + ప్రాలు = తలఁబ్రాలు, తలంబ్రాలు (వివాహ కాలమున వధూవరులు పరస్పరము తలలమీఁదఁ బోసికొనెడి (కడుగుళ్ళ) యక్షతలు వీనిలోని ద్రుతము సప్తమ్యర్థక ద్వితీయా సంబంధి ఇట్లె-ఒడిని + ప్రాలు=ఒడిఁబ్రాలు- (మంగళార్థము నూతన వధువున కొడిలోఁ గట్టు బియ్యము), సేసను + ప్రాలు = సేసఁబ్రాలు (దేవతా నిర్మాల్యమునుండి కొనివచ్చు నక్షతలు, శేషాశబ్దభవము సేస) ఊరను + పంది = ఊరఁబంది (ఊరిలోఁదిరిగెడి పంది) 'ఊరఁ బిచ్చిక' అనుదానికి నిట్లె తోడను + పుట్టువు=తోడం బుట్టువు తోను + పుట్టువు = తోఁబుట్టువు ('తోడను – తోను' అనునవి ద్రుతాంతావ్యయములు) ఒడను + పాటు = ఒడఁబాటు (సమ్మతి) ఒల్లను + పాటు=ఒల్లఁబాటు (అపేక్షలేమి, చూ-క్రియా ౧౧౧వ సూ ) ఇత్యాదులు ఆది శబ్దముచే ఒల్లఁబోవు (మూర్ఛిల్లు) మొ॥

## టుగాగమ సంధి

సమానాధికరణ సమాసములందును, శేష షష్ఠీ సమాసములందును, సంఖ్యావాచకాది భిన్నములగు 'ఉ' దంత విశేషణములకును, 'పు-ంపు'లకును, నచ్చు పరంబగు నపుడు 'టు' గాగమము బహుళముగ నగు ౨౭* (బా సంధి ౨౮-౨౯వ సూ , వ్యా సం ౯౧ మొ ౯౨-III విష)

---

* సూరి శేష షష్ఠి స్థలములందలి టుక్కును సూత్రింపలేదు 'పేరుటురము' అనుచు వైభాషిక టుక్కును సూరి విధించెను అట్టి ప్రయోగమే లేదు కం పేరాఁకలి పేరామని। పేరాముదపాకు లనఁగఁ బేరం పనఁగన్ (అం భూ ౧౨౬వ ప)

'శ్వేత వస్త్రము' మున్నగు చోటులందు శ్వేతత్వ, వస్త్రత్వములు రెండును వస్త్రమందె యుండును గాన నవి రెండును సమానాధికరణము లనిపించుకొనును సమానాధికరణ సమాస మనఁగా విశేషణ విశేష్యముల సమాసము

కలుకు + ఎలుక = కలుకు టెలుక, (అర ౨వ ఆ ౯౧) ఏపు + అడవి = ఏపు టడవి (అర-౧వ ఆ-౨౯౪) సన్నము + ఈఁక = సన్నపు టీఁక (ఉద్యో ౩వ ఆ-౨౯౮) దుష్కరంపు + ఏఁడు = దుష్కరంపుటేఁడు (విరా ౩వ ఆ-౧౩౧) రూపకాది సమాసములును గర్మధారయ భేదములే! ఉదా చెక్కుటద్దములు (చెక్కులనెడి యద్దములు) పొదరుటిల్లు (పొద రనెడి యిల్లు) షష్ఠీసమాస పసరపు టెంప ప్రోవులు (శాంతి ౩వ ఆ-౨౮౪), ఐక్యంపు టెలుక (శాంతి, ౪వ ఆ-౨౪౩)

## టుగాగమ విశేషములు

౧వ వివ బహుళ మనుటచేత 'పు-ంపు' ల పైని రాకుండుటయుఁ గలదు క్రపపనఁటులు (యయా ౪వ ఆ-౨౮), ఆముదపాకు (ఆం భూ ౧-౨౬వ ప) నిబ్బరపుబ్బగు గబ్బిగుబ్బలు (కవితా పితామహుని యుత్పల మాలిక) పట్టపేనుంగు (పాండు ౧వ ఆ-౭౭) బహుళ మనుటచేత దీనికి వైకల్పికత్వమును గలదు చిగురు + ఆకు = చిగురుటాకు (అను ౧వ ఆ-౫౧౦), చిగురాకు (ఉ హరి-౫వ ఆ-౫౬) వాలుటమ్ము (శల్య ౧వ ఆ-౧౬౭), వాలంప తాఁకునకు (రాఘ ౧వ ఆ-౨౨, భీష్మ ౨వ ఆ) బహుళ మనుట చేతనె తద్ధర్మాద్యర్థక విశేషణముల 'ఉ' కారమునకు 'టుక్కు' రాదు, 'నుక్కే' వచ్చును చేయు నతిథిపూజ (అర ౬వ ఆ-౧౬౪)

౨వ వివ తెల్గున సంఖ్యావాచక పూర్వక సమాసము ద్విగువె కాని సంస్కృతమున 'సప్తర్షయః' అనురీతివి కర్మధారయములు కాన స్పష్టతకై సూత్రమున ''సంఖ్యావాచకాది భిన్నములగు'' అని నిల్పఁబడెను ఉదా ఏడక్షౌహిణులు (ఆది ౧వ ఆ-౬౯) మూఁడాశ్రమములు (శాంతి ౧వ ఆ-౫౬) సూత్రమున ''సంఖ్యావాచకాది'' అను నాదిశబ్దమును నిల్పుటచేత 'పెక్కు-తక్కు' మున్నగు స్థలములందును 'టుక్కు' రాదు ఉదా పెక్కేఁడల

(ఉద్యో ४ వ ఆ-౨౪౬), తక్కన్నిగర్భములు (సౌప్తి ౨ వ ఆ-౧౦ ప)

౩ వ వివ ''కన్ (కన్ను), పెన్ (పేర్ద), పల్ (పలు-పెక్కు)'' మున్నగు నేక హ్రస్వాచ్చ హలంత శబ్దముల (ఉత్వలోపము) పై నచ్చు నిల్చుటచేత సహజముగా నచటి హల్లు ద్విత్వమునందును; ఈ టుక్కురాదు, ఉదా కన్నాకు (శ్రేష్ఠుఁడు, మీఁదఁ గన్నట్టు తమ్ములపాకు, భీష్మ, ౧ వ ఆ-౩౬), పెన్నుద్ది (పెద్దసాటి, పాండు ౩ వ ఆ), పల్లజపులు (జల్పితములు, హరిశ్చం ४ వ ఆ ప్రౌఢ-సంధి ౬ వ సూ)

४ వ వివ ''దుక్కి టెద్దు-మిద్దెటిల్లు'' అను శబ్దరత్నాక రాంగీకృత ములు సాధువులు కావు అట్టి కవి ప్రయోగములు లేవు, ''దుక్కియెద్దు, మిద్దెయిల్లు, తేనెయీఁగ'' అనియె ప్రయోగింప నగును

## రుగాగమ సంధి

పేదాది శబ్దంబుల కాలు శబ్దంబు పరంబగునపుడు
కర్మధారయంబునందు రుగాగమంబగు ౨౧ (బా-
సం ౩౦ వ సూ వ్యా-సం-౬౩-I విష)

పేద + ఆలు = పేదరాలు, బీద + ఆలు = బీదరాలు పేద, బీద, ముద్ద, బాలెంత, కొమ (చక్కనిది, కొమరుశబ్ద సంక్షేపము), జవ, అయిదువ, మనుమ, గొడ్డు-ఇట్టివి పేదాదులు ఇందలి 'జవ' శబ్దము 'జవ్వని' శబ్దాదేశము ఏకాంత మునందు నున్న జవరాండ (మనుచ ౨ వ ఆ-४౧) ఐదువరాలు (సుమంగలి, పుస్తె,పసుపు, కుంకుమము, గాజులు, చెవ్వాకు గలది)

కర్మధారయంబునం దత్సమంబుల కాలు శబ్దము
పరంబగునపు డత్వంబున కుత్వంబును, రుగాగమంబు
నగు ౨౬ (బా-సంధి ౩౧ వ సూ, వ్యా-సం ౬౩-
II విష )

ధీర + ఆలు = ధీరురాలు[1], గుణవంత + ఆలు = గుణవంతురాలు, బల్లిద + ఆలు = బల్లిదురాలు (చూ-ఆచ్ఛిక, ౩ వ సూ). సంస్కృత తుల్యత్వావస్థలో సైత ముత్వము వచ్చును[2]

౧ వ వివ "ఇల్లుయొక్క + ఆలు=ఇల్లాలు" అను శేషషష్ఠీ సమాసమును సంబంధార్థ వివక్షచేఁ గర్మధారయముగ భావింప నగును గాని యట్టి రూపములు కవి ప్రయోగాధీనములు గాన నట రుగాగమము రాదు

౨ వ వివ ఈ సందర్భము నందలి సమాసము లెల్ల జ్ఞాపక సిద్ధము లని యెఱుంగునది (సమా ౭౧ వ సూ) మిశ్ర కర్మధారయము సామాన్య సమాస శాస్త్ర సిద్ధము కాదు గాన నిట్టివి సూత్రారంభ సామర్థ్యమున సిద్ధించును మిశ్ర కర్మధారయమునఁ బుంవద్భావ మసంభవము

౩ వ వివ కద్రువ నిర్దయురాలై (ఆది ౧ వ ఆ-౧౩౬), పాపజాతురాలవు (ఆర ౬ వ ఆ-౩౦౭, పాపజాత + ఆలు )

## 'పుంపు' ల విధానము

కర్మధారయంబులందు 'ము' వర్ణకంబునకు 'పుంపు' లగు ౩౦ (బా-సం-౩౨, వ్యా-సం-౬౪ I-II విష )

---

1 'ధీర + ఆలు' మున్నగు చోటులందు సూరి వచించిన "కర్మ ధారయంబు త్రిక ౯" (సమా ౯ వ సూ-బాలవ్యా ) అను కర్మధారయ మెట్లు సరిపడునని యాతఁడు తలంచెనో ?

2 'ఇచట వృత్తియం దాలు శబ్దము స్త్రీ మాత్రపరము' అని సూరి వచించుట సరికాదు చ కలుచుట దోసమే మగలఁ గల్వక యాండురు దొల్లి యాండురం గలుతురె . (నన్ని-కు,౮ వ ఆ-౧౯౧ అలు శబ్దమునకు స్త్రీ యను నర్థమె కలదు

సరసము + మాట=సరసపుమాట, సరసంపుమాట సరసములు + వచనములు=సరసపు వచనములు, సరసంపు వచనములు కయ్యముయొక్క + వెరవు = కయ్యపు వెరవు. మొ

౧ వ వివ 'కర్మధారయంబులందు' అను బహువచనపు మహిమచేత సాంస్కృతికాచ్ఛిక మిశ్రములందును షష్ఠీ సమాసమందును నీ విధి వర్తిల్లును ఉదా ఘోరపు మృగములు (శ్రీ-౧ వ ఆ ౪౩) శోకార్తపు టొడలులతో (శ్రీ ౨ వ ఆ-౧౨౪) అగ్గలంపు సందడి (ఆశ్వ ౪ వ ఆ-౩ ప) సంబంధార్థ క్రీడి క। య్యపు వెరవు (కర్ణ ౩ వఆ-౨౩౧, శల్య ౧ వ ఆ-౨-౨౧) ప్రాస స్థలములు.

౨ వ వివ 'ము వర్ణకమునకు విధించు కార్యము ము గా గమంబునకు నగు' (తత్స-౪౨ వ సూ ) అను చొప్పున 'శోకార్తపు టొడలులతో' (శ్రీ ౨వ ఆ-౧౨౪) అను రీతిని ము గాగమమునకును పు-ంపు లగును ప్రకృత సూత్రపు జ్ఞాపక మహిమచేత సమాస పూర్వావయవ విభక్తి వచనాదుల లోపమును ము గాగమము వచ్చుటయు దానికి 'పు-ంపు' లాదేశ మగుటయు (ఉత్తర పదస్థ విభక్తి లోపించి సామాసిక ప్రకృతి యేర్పడుట) సామాన్యశాస్త్ర సిద్ధమే సంభవించును (చూ సమా ౭౧ వ సూ )

౩వ వివ ఈ 'పు-ంపు' లు నిల్వకుండుటయు నచట 'ము' వర్ణకమె నిల్చుటయు నరుదుగఁ గన్పట్టును, క వాత్సల్యం। బున మత్స్యమైన రూపం। బున .. (ఆర ౪ వ ఆ-౨౩౨) 'మత్స్యపురూప' మనలేదు చ...లో। కము సమరంబు లట్లు (విరా ౫ వ ఆ-౩౩౭), లోకపు సమరము లనలేదు * మువర్ణము ప్రాసస్థలము

---

* 'తామరము' అను శబ్దమే లేదు గాన 'తామరపాకు' అనునది వ్యావహారిక రూపము దీని నాధారముగఁ గొని ప్రౌఢవ్యాకర్త 'పు' గాగమమును విధించుట (ప్రౌఢ-సంధి ౮వ సూ) సరికాదు- కం .. నీ। ప్రజ తామరయాకు నీటి భంగి తలంకెన్ (ద్రోణ ౪వ ఆ-౩౦౯)

# మహద్వివక్షాది స్థలములు

౨వ వివ శేషుఁడు మున్నగు నాగములు, హిమవన్మేఘ సముద్రాదులును, ప్రాణాదివాయువులును మహత్తులుగ వివక్షింప నగును అవి పుంలింగములై కాన వానికిని ద్వైరూప్యము కవిసమ్మతము ఉదా జంగమములు, జంగములు (జంగమలింగములు, శివభక్తులు) ఉరగులు, ఉరగములు ప్రాణు నపానునందు(ఆను ౫వ ఆ ౨౬౦) నాగులు కలుచుచున్నవి (హరి-పూ-౪వ ఆ ౨౮)

౩వ వివ శ్రేష్ఠతావివక్షయందమహత్తులకు మహద్వివక్ష కవి సమ్మతము ఉదా అశ్వోత్తమున్ (ఆది ౨వ ఆ ౩౦), వాయసుఁడు వెగడొందెన్ (కర్ణ ౨వ ఆ ౭౪ వ ప) 'అశ్వరాజు' అనునపుడు మహద్వివక్షలేదు (చూ-తత్స-౭౯వ సూ)

౪ వ వివ ఆరోపణమున నమహత్తులకును మహద్వివక్ష గలదు ఉదా పురుషసింహముల న్నిజేశుల (సభా-౨వ ఆ ౨౬౭వ ప) మనుజసింహులు(ఆది ౮వ ఆ ౨౮౯)

౫ వ వివ స్త్రీ పురుష సాధారణ వాచి జన శబ్దమునకు ద్వైరూప్యము గలదు ఉదా జనులు, జనములు

౬వ వివ రాముఁడు ప్రధానము, ప్రధానుఁడు సావిత్రి ప్రధాన (అశ్వ-౨వ ఆ ౧౬౧) లలామశబ్దమున కిట్టివాడుక లేదు 'భూమిజ కాంతాలలామ' అనరాదు 'కాంతాలలామము' అనవలెను రాముఁడు పురుషలలాముఁడు, పురుషలలామము

౭ వ వివ మహత్సమూహార్థక శబ్దంబమహత్కార్య యుక్తం బయ్యెం దద్విశేషణ క్రియలు మహత్కార్య యోగ్యంబులు విభాష నగు (ప్రౌఢ-శబ్ద ౧౭వ సూ) గీర్వాణగణంబు ఖర్వపరాక్రము లుద్ధతులై రణము చేసిరి (ఆర ౩వ ఆ ౪౧) పటుబాహులు దైత్యదానవ గణంబులు దివ్యమహాస్త్రకోటు లుద్భవించె (ఆర ౬వ ఆ ౪౯ మొ)

జిత్తు బిందుపూర్వకం బగు ౧౯ (బా తత్స-౧౯, వ్యా-సం-౧౨౭ విష)

జకార మిద్వర్ణముగాఁ గలదానికి ముందు బిందువు నిల్చునని యర్థము కార్యార్థము ప్రత్యయాదులందు నిబద్ధమై ప్రయోగించునపుడు మానంబడు వర్ణ మిత్తు నాఁబడు ఉదాహరణము మీఁద స్పష్టము

౧ వ వివ 'సానునాసికోచ్చారణం జిత్' అనెడి ప్రాకృత వ్యాకరణ ప్రసిద్ధ జిత్త్వఫలము తెల్గున వర్తిల్లదని యీ సూత్రము విశదీకరించుచున్నది. రాముఁడు మున్నగు చోటులందలి 'డుజ్ఞు' నందలి డకారముమీఁది 'ఉ' కారము సానునాసికమని ప్రాకృత వ్యాకరణము చెప్పున గ్రహింపవలయును ఇట నట్లుకాదు

౨ వ వివ ఇందలి యిత్వర్ణ లక్షణము పాణినీయ ప్రసిద్ధము కాదు ముగ్ధబోధాదీతర సంస్కృతవ్యాకరణ ప్రసిద్ధము కాన నిందులో నేదేని వర్ణము కాని, వర్ణసంఘాతముకాని కార్యాంతరసూచక మగుచు నిద్వర్ణము కావచ్చును

## డు మంతము

డుజ్వర్ణకంబునకుఁ బ్రకృతియైనది డుమంతంబు నాఁబడు ౨౦ (బా-౨౦, వ్యా-సం-౧౨౮ వి)

౧ వ వివ ప్రత్యయము నిల్వఁదగినది ప్రకృతి ఇది రెండువిధములు, 1 ప్రాతిపదికము 2 ధాతువు

౨ వ వివ ప్రథమైకవచన డుజ్ఞు లోపించిన శబ్దము 'డుమంత' మని పించుకొనదు ఉదా 'గ్లౌ' దీనికి తత్స-౨౩వ సూత్రము చెప్పున 'ని' గాగ మము రాదు గ్లౌనున్ (చంద్రుని) 'గ్లౌని కులజులు' తప్పు వృద్ధు-ప్ర వృద్ధు నున్—ద్వితీ వృద్ధుఁడు-ప్ర వృద్ధునిన్—ద్వితీ

పుంలింగంబయి మహద్వాచకంబయిన నామంబు తుది యత్వంబున కుత్వంబగు ౨౧ (బా ౨౧, వ్యా-సం-౧౨౯ I విష)

నామంబనఁగాఁ బ్రాతిపదికము * డిద్ధ, రామ, భార్గవ, రాజపురుష (సంజ్ఞా కృత్తద్ధిత సమాస ప్రాతిపదికములు) -వీని కుత్వము రాఁగా డిద్ధు, రాము, భార్గవు, రాజపురుషు

పుంలింగంబగు మహద్వాచకంబునకు 'డు' జ్ఞగు ౨౨ (బా-౨౨, వ్యా సం ౧౩౦ I విష )

ఇచ్చట 'డు' జ్ఞను దానియందు జకార మిత్తుగావున 'జిత్తు బిందుపూర్వ కంబగు' (తత్స-౧౯) అను సూత్రముచేత 'డు' వర్ణకమునకు ముందు సున్న వచ్చును జకారము లోపించును ఉదా డిద్ధుఁడు,డిద్ధుండు, రాముఁడు, రాముండు మొ

౧వ వివ పై రీతిగల స్థలములలో నెల్ల సంస్కృత విభక్తులగు 'సు' మున్నగువానిని నిల్పి వానికి 'డు' జాదు లాదేశములుగాఁ బ్రక్రియ నడప వలెను (చూడు తత్సమ పరిచ్ఛేదాది వివృతి) ఇచ్చటి పుంలింగమనఁగా ''పారిభాషిక పుంలింగము''

౨వ వివ ''హాహా (ఒక గంధర్వుఁడు), విశ్వపా (విశ్వమును బాలించువాఁడు)'' ఇత్యాది దీర్ఘాంత ప్రాతిపదికముల దీర్ఘమునకు తత్స ౫౪ వ సూత్రము చొప్పున హ్రస్వము కాఁగా 'హాహ, విశ్వప' మున్నగు ప్రాతిపదికము లేర్పడును

## నిగాగమము

డుమంతంబునకు ద్వితీయాద్యేక వచనంబు పరంబగునపుడు 'ని' గాగ మంబు సర్వత్ర విభాష నగు ౨౩ (బా-౨౩, వ్యా సం ౧౩౦ I విష)

---

* అర్థవ దధాతు రప్రత్యయః ప్రాతిపదికమ్ (౧-౨-౪౫) ధాతుం ప్రత్యయం ప్రత్యయాన్తం చ వర్జయిత్వా అర్థ వచ్ఛబ్దరూపం ప్రాతిపదిక సంజ్ఞం స్యాత్ 'కృత్తద్ధిత సమాసాశ్చ' (సి-కౌ-౧౭౮- ౧౭౯) 'శబ్దానుకరణం చైవ నామ పఞ్చవిధమ్' (శబ్దా-విం) అను చొప్పున 'అనుకరణ' శబ్దమును ప్రాతిపది మె

రామునినిన్ రామునిన్, రామునిచేతన్ రాముచేతన్, రామునికిన్ రామునకున్ సర్వత్ర యనుట న గాగమ బాధనార్థము ఇవి యెల్ల(సంధి ౨౨వ సూ ) నవసాన ద్రుతస్వర లోపము నందిన యుదాహృతులు

## ని గాగమోదాహృతులు

౧వ వివ ఈ సూత్రమందలి విభాషను వ్యవస్థిత విభాషగ నంగీకరించి ద్వితీయైకవచన 'ను' వర్ణకమునకు యథా ప్రయోగముగ (బహుళముగ) లోపమును జేయవలయును. ఉదా రామునినిన్ (ఇందు నిగాగమము, ద్వితీయా 'ను' ప్రత్యయము, దాని ద్రుతమును గలవు) రామునిన్ (ఇందు 'ని' గాగమము గలదు ద్వితీయా 'ను' ప్రత్యయము లోపింపఁగా దాని ద్రుతము నిల్చినది) రామున్ (దీనియందు నిగాగ మాభావమును ద్వితీయా 'ను' ప్రత్యయ లోపమును గలవు) ఇట్లె సీతనును (ఇందు ద్రుతాంతమగు ద్వితీయా 'ను' ప్రత్యయి మున్నది) సీతను (ఇందుఁబై రీతిని ద్వితీయా 'ను' ప్రత్యయము లోపింపఁగా దాని ద్రుతముమాత్రము నిల్చినది) ఇట్లె-హరినిని, హరిని (ఇందు తత్స ౨౬వ సూ చొప్పున 'ను' వర్ణములమీఁది 'ఉ' కారముల 'ఇ' కారము లయ్యె) కం 'ఆతని నాతనిన్' (కర్ణ ౧వ ఆ ౧౧౦) అనుచో (చూ వ్యా సం ౧౩౧ I విష) 'అతఁడు' శబ్ద మాచ్ఛికము గాన 'ని' గాగమము తత్స-౨౪వ సూత్రము చొప్పున నిత్యము 'ఆతనినిన్' అనుచో మొదటి 'ని' అనునది 'ని' గాగమము తర్వాత నుండఁదగిన ద్వితీయా 'ను' ప్రత్యయము పయిరీతిని లోపించినది కాన దాని ద్రుతమును, సముచ్చయార్థక 'ను' శబ్దమును 'నిన్' అను రూపముతో నిల్చినవి

౨వ వివ 'రాము+నున్' అను నిగాగమాభావమందలి ద్రుతాంత ద్వితీయా 'ను' ప్రత్యయస్థితియందును ద్వితీయా 'ను' ప్రత్యయము యొక్క 'ఉ' కారము తత్స-౨౬వ సూత్రము చొప్పున 'ఇ' కారము కాఁగా 'రామునిన్' అనియే రూప మేర్పడును

## ఆచ్ఛిక డుమంతములు

అనుదంతమగు నాచ్ఛిక డుమంతమునకు 'ని' గాగమము నిత్యముగా నగు ౨౪ (బా-౨౪, వ్యా-సం-౧౩౨ I విష)

మగనినిన్ — మగనిన్ మగనిచేతన్, మగనికిన్ (సంధి ౨౦వ సూత్రము చొప్పున నవసాన ద్రుతస్వరలోపము). అనుదంతం బను పర్యుదాసముచేత "అల్లునిచేతను, అల్లుచేతను, బల్లిదునిచేతను, బల్లిదుచేతను" ఇత్యాదులందు "తత్స-౨౩వ సూత్రము" చొప్పున 'ని' గాగమంబు పాక్షికంబని యెఱుంగునది 'తమ్ముచేసిన (తమ్మునిచేసిన) దురితములు (ఆర ౩వ ఆ ౨౮౯) 'మగనిన్' అనుచో 'ని' గాగమమును, ద్వితీయా 'ను' ప్రత్యయ లోపముచేత దాని ద్రుతమును గలవు

౧వ వివ నఞర్థము క్రియతో నన్వయించునప్పుడి నిషేధము ప్రతిషేధ మనఁబడును అది నామముతో నన్వయించునప్పుడి నిషేధము పర్యుదాస మనఁ బడును

'డు' మంతంబుమీఁది 'ను' వర్ణంబు 'ఉ'త్వంబున కిత్వంబగు ౨౫ (బా-౨౫, వ్యా-సం-౧౩౩ విష)

ఈ సూత్రముచేత డుమంతముమీఁద 'ను' నిల్వనేరదని తేలుచున్నది 'రాముని వీక్షించె' అను రూపము తప్పని భావము

## కు-ను మున్నగువాని 'ఇ'త్వము

ఇకారంబుమీఁది 'కు-ను-వు-క్రియా విభక్తుల' యుత్వంబున కిత్వం బగు ౨౬ (బా-౨౬, వ్యా-సం-౧౩౪ వి)

హరినిన్—హరికిన్ శ్రీనిన్—శ్రీకిన్ వారినిన్—వారికిన్

౧వ వివ 'కు-ను-వు' లయుఁ, గ్రియావిభక్తులగు 'ను—ము—వు—రు' లయు 'ఉ' కారము 'ఇకార' మగు నని యర్థము ఉదా. రక్షించితిని-రక్షించి

తిమి—రక్షించితివి-రక్షించితిరి కవిని (నేను) కవివి (నీవు) మొ క్రియా విభక్తు లనుదాని సాహచర్యమున నీ విధి ప్రకృతులయందు వర్తిల్లదు ఉదా చివుకు-కికురించు మొ

## 'కు-ను' మున్నగువాని 'ఇ'త్వాభావము

'ఈ'ధాతు యుష్మదర్థంబుల మీఁది వాని యుత్వంబున కిత్వంబు రాదు ౨౩ (బా-౨౭, వ్యా-సం-౧౩౪ I వి) ఈరు (ఇయ్యరు)— ఈవు-ఈను-ఈము ఈకున్-నీకున్-మీకున్

౧వ వివ తపరకరణము (చూ సంధి ౧వ సూ ౨వ వి) లేమింజేసి 'ఇ' కారము మీఁదనే కాక 'ఈ' కారము మీఁదసైతము ౨౬వ సూ వర్తిల్లును కావుననే యీవిధి (తత్స ౨౭వ సూ) యారంభింపబడెను తత్స ౬౫వ సూత్రము చొప్పున 'ఐ' కారముమీఁద సైతము ౨౬వ సూ వర్తిల్లును

౨వ వివ 'ఈ' అను ధాతురూపముననే యీ నిషేధముచెల్లును 'ఇచ్చు' ధాతువున కీనిషేధము చెల్లదు ఉదా ఇచ్చితిని, ఇచ్చితిరి మొ

కు వర్ణంబు పరంబగునపుడు 'ఉ' కారంబునకుఁ బ్రాయికముగను, 'ఋ' కారంబునకు నిత్యముగాను 'న' గాగమం బగు ౨౮ (బా ౨౮, వ్యా-సం-౧౩౬ I విష)

రామునకును-విష్ణువునకును—సవితృనకును 'డు' మంతములకు 'ని' గాగమము విభాషను వచ్చునుగాన నట్టియెడల 'ఇ' కారపూర్వకముగాన 'న' గాగమము రానేరదు నిగాగమము నగాగమబాధకము (చూ తత్స-౨౩వ సూ) కాన 'సవితృనికిని' మున్నగు రూపములు నిర్బాధములు దీర్ఘమగు 'ఊ' కారము మీఁదను నీ విధి వర్తిల్లును ఉదా భ్రూవునకును మొ

౧వ వివ ప్రాయిక మనుటచేతఁ గవిత్రయేతర ప్రయోగములందు 'ఉ' దంతంబులకు 'న' గాగమము రాకుండుటయుఁ గలదు 'ఉత్సవము కేఁగెడు క్రియ' (ఉ-హరి-౬వ ఆ ౧౪౦) 'నీతూపుకోర్వక' (కవిక ౩వ ఆ ౧౧౯)

ఇట్లు 'వు' వర్ణాంతములమీఁదను 'న'కు్క రాకుండుట గలదు (చూ-ప్రౌఢ-శబ్ద-౧౯వ సూ ; చూ-వ్యా-సం-౧౩౬ II విష )

## నకు్క, నుకు్కల వివరణము

'కంటె, అందు, అను విభక్తులు పరంబగునపుడును నమహత్తుల 'ఉ' కారమునకుఁ దర్వాతఁ గొన్ని యెడల నగాగమంబు చూపట్టెడి ౨౯ (బా-తత్స-౨౮, వ్యా. సం-౧౩౬ III విష)

క్రతుశతంబున కంటెన్ (ఆది ౪వ ఆ-౯౪), తనువునయందున్ (ఆర ౩వ అ-౧౦౫, చూ-ప్రౌఢ-శబ్ద-౨౦-౨౧ వ సూ)

**ఉకార ఋకారముల కందు వర్ణకము పరంబగునపుడు 'ను' గాగమంబగు** ౩౦ (బా-తత్స-౨౯, వ్యా సం- ౧౩౭ I విష)

తత్స ౨౩వ సూత్రము చెప్పిన 'ని' గాగమము రానిపక్షమందే యీ 'ను' గాగమము వచ్చును ఉదా రామునందును, రామునియందును విష్ణునందును, విష్ణునియందును, విష్ణువునందును విధాతృనందును, విధాతృనియందును మొ

ఆగమ 'ము' వర్ణకంబున కందు వర్ణకము పరంబగునపుడు 'ను'గాగమంబు విభాషనగు ౩౧ (బా తత్స-౩౦వ సూ, వ్యా సం-౧౩౮ I విష )*

వనమునందును, వనమందును వనమ్మునందును, వనమ్మందును వనంబునందును, వనంబందును "యౌవనమందు" (మను-౧ వ ఆ - ౫౩) ఇట్టివి భారతమున లేవు

౧ వ విప ఈ సందర్భమున సూరి 'న' వర్ణకము నుదాహరింపనే లేదు (కార ౧౮-౨౩ సూ) వనమునను, వనమునందును దీనికిఁ దృతీయార్థమును గలదు వనమునను, వనముచేతను మొ

---

* ఆగమ 'వు' వర్ణకంబుపైని సయితము 'నుకు్క' పాక్షికమని సూరి వచించెను సూరి యుదాహరించినట్లు ''ధేనువందును'' అనురీతి గల ప్రయోగములు లేవు

ఈ 'న' వర్ణక మేకత్వమున మాత్రమే ప్రయుక్తమగును (తత్స- ౧౧వ సూ)

## లట్టు వివృతి

బహుత్వంబున ద్వితీయాది విభక్తులకు లడాగమంబగు ౩౨ (బా ౩౧వ సూ, వ్యా సం-౧౩౮ వి) రాములను-రాములచేతను-విధాతృలను-విధాతృలచేతను

౧ వ వివ కొన్నియెడల బహువచన 'ల'కారముచోట రేఫము నిల్చును ఇది ముందు సూత్రింపఁబడును (తత్స-౩౯వ సూ) బాలురు-బాలురను వారు-వారిని మొ కొన్నియెడల మాదేశాదు లగు మేము-మా చేతను మొ

## సంబోధన ప్రథమ విధులు

సంబోధనంబునం దేకార్థంబయిన పదంబు తుది 'ఉ' కారంబునకు 'అ' కారంబగు ౩౩ (బా-తత్స-౩౨, వా సం-౧౩౯ I విష)

ఓ రాముఁడ - ఓవృక్షమ - ఓశంభువ - ఓకొడుక

౧వ వివ సంబోధన మనఁగా నభిముఖీకరణము కావున విశేష విధులు లేనపుడు ప్రథమైకవచన బహువచన రూపములె సంబోధన రూపము లగును ఉదా ఓ హరి, ఓక్ష్మా, ఓస్త్రీ, ఓనవలా మొ

సంబోధనంబునందుఁ బదంబు తుది యకారేకారంబులకు దీర్ఘంబు విభాష నగు ౩౪ (బా-తత్స-౩౩, వ్యా సం-౧౩౯ I విష)

ఓరాముఁడా, ఓరాముఁడ, ఓహరీ, ఓహరి

౧వ వివ ఆంధ్రవర్ణ సమామ్నాయమందె ప్లుతములేదు దూరాహ్వాన రోదనాదులందును హ్రస్వ దీర్ఘములె ప్రయుక్తము లగుచున్నవి కానఁ దెల్గున దూరాహ్వాన రోదనాదులందును బ్లుతములేదు హా మహారాజ నిషధరాజాగ్రణీ (ఆర ౨వ ఆ ౮౧), ఓ జనులార! యిద్దపడరో సురలార! (భాస్కర యుద్ధ ४౧ ప)

అకారేకారములకే దీర్ఘవిధిగాన 'వదినే' అను దీర్ఘము తప్పే కృతోత్కం బగు సంస్కృతనామంబు సంబుద్ధి 'డు' జ్ఞునకు లోపంబు విభాషనగు ३३ (బా తత్స-३४, వ్యా సం-౧४० I విష)

ఓరామ-ఓరాముఁడ పూర్వ సూత్రముచేత (తత్స-३४వ సూ) బాక్షిక దీర్ఘంబు ఓరామా-ఓరాముఁడా సంస్కృతనామం బనుటం జేసి "ఓతమ్ముఁడ, ఓ బల్లిదుడ" (చూ-అచ్చి-३వ-సూ) ఇత్యాదులందు లోపంబులేదు కృతోత్క-మనుటచేత 'ఉ' దంత సంస్కృతనామంబున కీవిధి చెల్లదు ఓ శంభుఁడ 'ఓ శంభ' అని కానేరదు.

## 'ఇగా' ప్రత్యయము

౧వ వివ : వాత్సల్య నీచతాద్యర్థములందుఁ గొన్ని నామముల తుది నేకత్వంబున 'ఇగా' ప్రత్యయము నిల్చును 'దీనిడుజ్ఞు' సంబోధనంబున నిత్యముగా లోపించును దీని దీర్ఘము పాక్షికముగా హ్రస్వమగును ఉదా గోపాలిగాఁడు, ఓ గోపాలిగా ఓ గోపాలిగ

ఉదంత సంస్కృతనామంబు 'డుజ్ఞు' సంబోధనంబున వైకల్పికముగ లోపింపఁగా మిగిన పదము తుది 'ఉ' కారము దీర్ఘ మగును ३౬ (బా తత్స ३३, వ్యా సం ౧४० I విష) *

ఓవిష్ణూ, ఓవిష్ణుఁడ, ఓవిష్ణువ, ఓవిష్ణుఁడా, ఓవిష్ణువా, 'జరత్కారూ జగన్మాన్య' (ఆది ౨వ ఆ-౧३४)

సంబోధనంబునందు బహువచనంబునకు 'అర' గాగమంబగు ३౭ (బా తత్స సూ ३౬ వ్యా సం ౧४౨ I విష)

---

* సూరింహాంధ్ర వర్ణ సమామ్నాయముననే లేని ప్లుతమును విధించుట సరికాదు చింతామణిలోని ప్లుతశబ్దమునకు దీర్ఘమె యర్థము "ఉదంత సంస్కృత నామంబు మీఁది సంబుద్ధి 'డుజ్ఞు' నకు 'ఊ' కారంబు ప్లుతం బాదేశంబగు" అని సూత్రించెను

ఓ రాములార, దీనికి (తత్స ౩౪వ సూ ) దీర్ఘంబగు ఓరాములారా

మధ్యమ పురుష యోగంబునం దారగాగమంబు విభాషనగు ౩౮ (బా తత్స ౩౭, వ్యా సం ౧౪౩ I విష)

వినుఁడు బాలకులు=వినుఁడు బాలకులార వచ్చితిరి కాంతలు = వచ్చితిరి కాంతలార. 'అన్నలార మిమ్ము నడిగెద నొక్కమాట' అనుచో సంబోధ్య యుష్మదర్థము కర్తగాలేదు కాన మధ్యమ పురుషయోగము లేదు కావున నిట 'ఆర' గాగమము నిత్యమె 'వృక్షములార' మున్నగు చోట్ల సంబోధనముచేతనే వృక్షాదులకుఁ జేతనత్వము వివక్షిత మని విశదమగుచున్నది కాన వాని సంబోధనము విరుద్ధము కాదు

౧వ వివ క్రియ బహువచనముతో నున్నను దానిపై నున్న అమ్మాదు లేక వచనాంతములె యగును ఉదా 'చూచి వత్తమమ్మ సుదతులార' (భాగ-౧౦వ స్కం. పూ )

అదంతంబయి దీర్ఘపూర్వ లోపధంబయిన తత్సమ మహత్తుమీఁద విభక్తి లకారంబునకు రేఫంబగు ౩౯ (బా తత్స ౩౮, వ్యా సం ౧౪౪ I వి)

బాలురు, బాలురను, బాలురచేతను నృపాలురు * తుదివర్ణమునకు ముందటివర్ణ ముపధ యనంబడు బాలా-బాలలు బాలాశబ్ద మదంతము కామిం జేసి రేఫాదేశము రాదు దీర్ఘపూర్వ మనుటచేత 'మహా బలులు' అనుచో 'ర' త్వము లేదు ఆచ్ఛికమగుటచేత 'బేలలు' అనుచో రేఫాదేశము లేదు 'మాలః' (చండాలుఁడు) అను సంస్కృత శబ్దమున్నను దానికి 'మాలుఁడు' అనురీతి గల తత్సమప్రయోగము లేదు

---

* సూరి 'దయాళురు' అనునదియుఁ గలదని వ్రాసెను కాని యట్టి కవి ప్రయోగము లేదు 'బా-గు-ప్ర' కర్త 'దయాం లాతీతి దయాలః' అని వ్యుత్పత్తి చెప్పి 'అదంతతను' సాధించెను గాని యట్టి శబ్దము లప్రయుక్తములు 'దయాలా' అను సంబోధనమును జూపలేరు గదా !

౧వ ౪వ 'మలినురు' అను యుద్ధమల్లుని బెజవాడ శాసనప్రయోగము ప్రామాదికము రామాభ్యుదయములోని "మ అరరే . మల్లురకు . " అను ప్రాసప్రయోగముచేత 'మల్లురు' అను చోటి 'ర'త్వము పాక్షికముగా సాధువనఁ దగును కాని తిక్కయజ్వ స్థలద్వయమునందును ప్రాసస్థలమున 'ల' కారమునే నిల్పెను చ వలసిన...మల్లుల.. (విరా-౧వ అ-౨౨౩) చ...మల్లుల విఱుచున్.. విచ్చలవిడి...(విరా-౫వ ఆ-౩౨౩)

## 'ము' వర్ణక విధానము

**అమహన్నపుంసకముల**[1] ప్రథమైక వచనమునకు 'ము' వర్ణక మాదేశ **మగు**[2] **౪౦ (బా-త-౩౮, వ్యా-సం-౧౫౫ I వి)**

వృక్షము - ఋక్షము (నక్షత్రము) - దైవము - కళత్రము-అన్నెము (అన్య)-పున్నెము (పుణ్య) - నాణెము - నాడెము - విడెము-పళ్ళెము- సాము (సగము) - గాము (గ్రహము) - గీము (గృహము) - దీము (దీమము) -ఏతాము - గోతాము (సంచి) మొ క్లీబంబులు మిత్రాదులను సూత్రంబునఁ బాక్షికంబుగఁ బుంలింగత్వం బతిదేశించుటంజేసి మిత్రాది శబ్దములకు ద్వైరూప్యంబు ఉదా మిత్రుఁడు, మిత్రము, శరణుఁడు, శరణము, (చూ-తత్స-౧౦వ సూ) "సౌమ్యుఁడు మిత్రము" అను రీతిగల ప్రయోగములు సాధువులె "ఇతఁడు స్తుతి పాత్రము" (విరా ౫వ ఆ-౩౨౬) అన్యులు పాత్రములు గారు (శాంతి-౧వ ఆ ౧౮)

---

1 'అన్నెము-పున్నెము-గాము-గీము' మున్నగు ననేకోదాహృతులను బట్టి సూరిగారి 'అదంతములకు' అను దళ మనర్థక మనఁదగును

2 'అమహన్నపుంసకములకు' అనుచోఁ గర్మధారయమనెడి 'బా-గు-ప్ర' వాదమును 'వృక్షము-దైవతము' అను ప్రయోగములే నిరాకరింపఁజాలును (చూ-వ్యా-సం-విస్త-౧౪౫ I విష) "అన్నెము- పున్నెము - గాము - గీము' మున్నగు నుదాహృతులను జూచికొనక 'బాలవ్యాకరణ' కర్త 'అదంతములకు ము వర్ణకంబగునని' సూత్రింపఁ గడంగుట మిక్కిలి పొరపాటు

౧ వ వివ 'దారములు' (భార్యలు-అహో ౩౪౬వ పు) అనునది కవి ప్రయోగములం గానరాదు 'దారలయందు' (అను-౪వ ఆ ౯౩, భాగ-౧౧వ స్కం ౯౬) అనియె ప్రయోగములు చూపట్టుచున్నవి 'చీర' అనునది వైకృతము 'చీరము' అనియుఁ గలదు "మ. ఒకర్తు చీరము కృష్ణాజినమున్'' (నిర్వ-౫వ ఆ-౪వ ప) 'పత్తనము' అనియె కాక 'పట్టణము' అనియుఁ గలదు "రణవిజయముఁ గైకొని పట్టణము. . (నిర్వ-౫వ ఆ-౭౯వ ప)

'ఇహము-పరము-ఆబాలగోపాలము' మున్నగునవియుఁ గలవు- "ఇహపరముల నెసక మెసఁగ" (శాంతి-౫వ ఆ-౨౫౭) 'చెడు నిహముం బరంబు (ఆది ౧వ ఆ ౨౩౯) ఆబాలగోపాలము (మను ౧వ ఆ ౩౪వ ప)

## ము గాగమము

వానికి మువర్ణకేతరంబయిన విభక్తి పరంబగునపుడు 'ము'గాగమం బగు ౪౧ (బా-తత్స-౪౦, వ్యా-సం-౧౪౬ విష) వృక్షములు-వృక్షమును - వృక్షములచేతను-దైవములు-దైవమును-దైవములకును మొ

౧ వ వివ సూత్రములోని 'వాని' కనఁగాఁ బ్రథమైక వచనమున 'ము' వర్ణకమువచ్చు శబ్దముల కని యర్థము 'చరిత్ర-చరిత్రలు (తత్స-౫౯వ సూ) లత-లతలు ( తత్స-౫౦వ సూ)-గోడ-గోడలు (చూ-తత్స-౪౨) మున్నగు 'ము' వర్ణకము నిల్వని శబ్దములకు 'ము' గాగమమును రానేరదు 'ముదము-ముదమున' (తత్స-౭౫వ-సూ) మున్నగు 'ము' వర్ణకము వచ్చు శబ్దములకు 'ము' గాగమమును వచ్చును

మువర్ణకమునకు విధించు కార్యము 'ము' గాగమంబునకు నగు ౪౨ (శా-౪౧, వ్యా-సం-౧౪౭ విష )

'ము' వర్ణకమునకు విధించు లోపాదేశాది కార్యములు 'ము' గాగమంబునకు సహితము వచ్చునని యర్థము ఉదా చరిత్ర-చరిత్రలు- లత-లతలు- గోడ-గోడలు మొ

## మ్ము-ంబులు

ము వర్ణకంబునకు మాముడియేనిం బూర్ణబిందు పూర్వక 'బు' వర్ణకంబేని విభాషనగు ౪౩ (బా-తత్స-౪౨, వ్యా-సం-౧౪౭ విష)

వృక్షము, వృక్షమ్ము, వృక్షంబు వృక్షములు, వృక్షమ్ములు, వృక్షంబులు

౧ వ వివ దీర్ఘపూర్వక పూర్ణము నిల్వదు (చూ సంజ్ఞా ౧౫) తత్ సమాన న్యాయమున 'మ్మ' వర్ణకమును నిల్వదు- ఏతాము 'ఏతాంబు-ఏతామ్ము' అనునవి లేవు

## 'ము' వర్ణకలోప దీర్ఘములు

'లు-ల-న' లు పరంబులగునపుడు 'ము' గాగమంబునకు లోపంబును దత్పూర్వాక్షరంబునకు[1] దీర్ఘంబును విభాషనగు ౪౪ (బా-తత్స - ౪౩ వ్యా-సం- ౧౪౮ I విష) [2]

వోనాలు (ఉద్యో-౩వఆ-౨౭) చట్టాలకున్ (ఉద్యో-౧వ ఆ-౧౨ ప), ప్రాణానన్ (ద్రోణ-౧వ ఆ-౨౬౨ ద్రోణ ౩వ ఆ-౩౪౫) దెందానన్ (ఉద్యో-౩వ ఆ-౧౭) కయ్యానకున్ (ఉద్యో ౪వ ఆ-౨౬౬) బసుమానన్ (బసవ ౭వ ఆ-౨౧౭) వైరానన్ (నన్ని కు-౪వ ఆ- ౪౧౭) సూత్రములోని 'న'

---

1 సూరి సూత్రమున 'తత్పూర్వ స్వరంబునకు' అని నిల్పరాదు అట్టి యపమార్గముచేతనే 'కొండేలు-ముత్తేలు' మున్నగు వానిని గొందఱు సాధింపం జూచుచున్నారు

2 ఇట్టి రూపములు గవి ప్రయోగములలో ధారాళముగా నుండుటంజేసి సూరి 'ఒకానొకచో' అని సూత్రించుటయు, "ఒకానొకచో ననుటచే " మున్నగు వివరణము వ్రాయుటయు యుక్తముయి యుండలేదు

## బహువచనము—'ఉ' కారము

ఇత్తునకు బహువచనంబు పరంబగునపుడు 'ఉ' త్వంబగు ౪౬ (బా తత్స-౪౫వ సూ, వ్యా సం-౧౫౦ I ౨)

**హరులు, గిరులు 'యామినులు-భామినులు' ఈ రెండును నాచ్ఛికములు కామింజేసి తత్స ౪౭వ సూత్రము చొప్పున నుపోత్తమేత్త్వమునకు 'ఉ' త్త్వము రాదు తపరకరణంబుచే దీర్ఘంబునకు 'ఉ' త్త్వంబు లేదు ఉదా శ్రీలు-స్త్రీలు-లకోరీలు మొ॥**

౧ వ వివ 'గతాశులు, జితాశులు, ఆశ్రయాశులు' మున్నగు చోటులందు వలెనె 'రాశులు' మున్నగు చోటులందును 'శ' వర్ణస్థితియె సాధువు, 'రాసులు' అనునది తద్భవ పదము

## ఉపోత్తమేత్త్వమునకు 'ఉ' త్త్వము

వికృతియందు దికారాంతముల యుపోత్తమేత్వంబునకు బహువచనంబు పరంబగునపుడు 'ఉ' త్త్వంబగు ౪౭ (బా తత్స ౪౬, వ్యా సం ౧౫౧ I ౨)

ఇచ్చట వికృతిశబ్దంబుచేత సంస్కృత సమేతరంబును గ్రహింపవలయును మూఁడిటికిఁ దక్కువకాని యక్షరములు గల 'ఇ' దంత శబ్దములలోని తుది యక్షరమునకుఁ బూర్వాక్షరముమీఁది 'ఇ' కారమునకు 'ఉ' కారాదేశం బగు నని యర్థము, ఉదా కలికి, కలుకులు, ములికి, ములుకులు, చెలిమి, చెలుములు, బలిమి, బలుములు ఉపోత్తమేత్త్వమున కనుటచేత 'జిగి-సిసి' ఇత్యాదులందు ఉత్త్వంబులేదు జిగులు, సిసులు మున్నగువానియందలి తుది 'ఇ' కారమునకు తత్స ౪౫ వ సూత్రముచేతనె 'ఉ' కారాదేశం బగును

రలడోపధ నవార్థామిం నుపోత్తమేత్త్వమునకు 'ఉ' త్త్వం [illegible] బగు ౪౮ (బా-తత్స-౪౭ వ్యా- సం- ౧౫ I ౨)

రుదిపర్ణమునకు ముందటి వర్ణము వధ' (చూ సంజ్ఞా ౧౦౨ సూ) పూర్వ సూత్రమునకపవాదము పందరులు (పందిరి), పిడికిలులు (పిడికిలి) రాపిడులు (రాపిడి), తొమ్మిదులు (తొమ్మిది), ఎనిమిదులు (ఎనిమిది) మొ

౧ వ విమ రారాపిళ్ళ (మనుచ-౪వ-ఆ-౩౬), 'మేలైన రెండు తొమ్మి దులు విద్యలయందు (కాశీ ౩ ఆ ౧౮౧), ఈ ప్రయోగమును బట్టి నవార్థాదులని గణము చేయఁబడెను 'మొదలైన రెండు తొమ్ముదులు' అనునది ప్రక్షిప్త పాఠము (వ్యా-సం-౫౪౭ వ పుట)

## వు వర్ణక, వు గాగమములు

ఉకారాంత గోశబ్దంబుల కంతట 'వు' వర్ణకంబగు ౪౫ (బా-తత్స౪౮, వ్యా-సం-౧౫౨ I విమ)

తరువు-ధేనువు-మధువు-గొవు అంతట ననుట స్త్రీ లింగ ప్రథమైక వచన లోప (తత్స ౫౮ వ సూ) బాధనార్థము ఉదా వధువు-ధేనువు మొ

౧ వ విమ వు' వర్ణకము సంస్కృత సమములకు మాత్రమే యగును ...దువు-పుట్టువు-వెలువు' మన్నగువాని తుదివర్ణము ప్రథమైకవచన 'వు' ప్రత్యయము కాదు ఆ శబ్దా ... అట్టి శబ్దము లెల్ల స్త్రీ ... మములు

౨ వ విమ అత్స ౮౧ వ సూత్రము చొప్పున ప్రాతిపదికాంత 'స' కారము లోపింపఁగా మిగిలిన 'ఉ' కారాంతమగునపుడు దానికిని 'వు' వర్ణకాది విధులు చెల్లును ఉదా ధనుస్-ధనువు, ఉపసర్జనత్వమున 'ఓ' దంతము 'ఉ' దంతమగును అచట ప నీ విధులు చెల్లును ఉదా పూర్ణ + గో (నిండిన గోవులు గల యిల్లు) = పూర్ణ ...వు

౩ వ విమ తపరకరణ రాహిత్యమున నిది 'ఊ' కారాంతములకును ... ఉదా భ్రూ... (కనుబొమ్మ), 'బాహుప్పళి...వి' (విరా ౨ వ ఆ ౩) ... ... ... వి' అని ... ... సంధి విరుద్ధము కాదు

(చూ-సం-౪ వ సూ) ఈ ప్రయోగముచే 'బాహు =బాహువు' అని 'వు' వర్ణక లోపము నంగీకరింపరాదు

౪ వ వివ స్మృత + ఉ (శంభు)'స్మృతో'శబ్దాదులు తెల్గున నప్రయుక్తములు గోవులు=ఆవులు, సూర్యకిరణములు కం గోవులు సూర్యుని యుజ్జ్వల గోవుల (అను-౨వ ఆ ౪౬౧) ఉపసర్జనత్వమున నిది 'ఉ' కారాంతమెయగును ("చిత్రాః + గావో యస్య సః") చిత్రగువు, చిత్రగుఁడు (సూర్యుడు చూ-తత్స ౩౧ వ సూ)

'వు' వర్ణ కేతరవిభక్తి పరమగుచో నమహ దుదంతములకు వికల్పముగాను, జరత్కారూ శబ్ద భిన్న స్త్రీ వాచ కోదంతములకును, నూదంతములకును, గోశబ్దమునకును నిత్యముగాను 'వు' గాగమంబగును* ౩౦ (బా-తత్స-౪౮, వ్యా-సం-౧౩౩ I విష)

తరువులు—తరులు, ధేనువులు—ధేనులు, రజ్జువులు—రజ్జులు, జరత్కారువులు— జరత్కారులు "జరత్కారున్ మదీయానుజన్" (ఆది-౨వ ఆ-౧౩౪), వధువులు-భ్రూవులు-గోవులు

ఉకారాంతంబగు మహత్తునకు 'వు' వర్ణకము వైకల్పికము 'మను-కటు-పటు' శబ్దములకు నిత్యము ౩౧ (బా తత్స-౩౦వ సూ, వ్యా సం-౧౩౪ I విష)

విష్ణువు-విష్ణుఁడు, శంభువు-శంభుఁడు మహత్పుంలింగ మగుటచే 'వు' వర్ణకాభావ పక్షమున 'డుజ్జు' వచ్చును వటువు-వటుఁడు 'డుజ్జు' వచ్చనీ రూపము దీని కర్వాచీనము 'చండసూర్పార్తి వటుండు కాంచె' (భాగ ౮వ స్కం ౩౨౮) రాహుశబ్దము వృద్ధాదులలోనిది గాన డుజ్జు లోపమును గలుగును రాహువు-రాహుఁడు-రాహు (చూ తత్స ౩౭ వ సూ)

---

* ప్రయోగములనుబట్టి యిట్లు నిర్ణయింపఁదగి యుండఁగా సూరి బహుళ విధి నాశ్రయించుట సరికాదు

మనువు (స్వాయంభువాది) పటువు (సమర్థుఁడు) కటువు (చేదైనవాఁడు, అనిష్టుఁడు) ఆ వె మనువు ధర్మశాస్త్రమతమున మిక్కిలి। కటువు బిరుద వినుతి కరణములకుఁ జాలఁ బటువు ధరణి సంగీత సాహిత్య సరణి విశ్వనాథ చక్రవర్తి (కావ్యాలంకార ఉల్లా-౩౦వ ప)

"విష్ణు సాక్షాత్కరించె ఖండపరశు శిరః కంపంబుచేసె" (రంగనాయాని ముద్ర-౨౩-౭౩ పుటలు) ఇట్టి సామాన్య కవి ప్రయోగము లితర ప్రామాణిక కవుల గ్రంథములలో లేమింజేసి యిట్టివి సాధువు లనరాదు

కద్రువ నాగమాత ౫౨ (బా తత్స ౫౧, వ్యా సం-౧౫౫-౧౫౫ III విభ)

కద్రువ, కద్రువలు, కద్రువను, కద్రువలను

౧వ విభ సీ వరుసన యా కద్రువకు వినతకుఁ బుట్టె (ఆను ౧వ ఆ-౧౬౭) తిక్కయజ్వ ప్రయోగములచేఁ గశ్యపపత్నియగు నాగమాత యర్థమగునపుడు 'వు' వర్ణక 'వు' గాగమములచో 'వ' అను రూపము నిల్చునని యీ నిపాత సూత్రమున కర్థము అల్పసంజ్ఞా రూపసాధనమున సిద్ధరూపములను బేర్కొనునది నిపాత సూత్రము పింగళవర్ణ మర్థమగునపుడు 'కద్రువు' అనియే యగును

## ఋకారాంత శబ్దవిధి

ఋకారాంతంబున కత్వంబును స్త్రీ వద్భావంబు నగు ౫౩ (బా తత్స-౫౨, వ్యా సం-౧౫౬ I విభ)

స్త్రీ వద్భావమున స్త్రీలింగ ప్రథమైకవచన (తత్స ౫౮వ సూ) లోపాదికమగును

భ్రాత-జామాత (అల్లుఁడు), కర్త (చేయువాఁడు, చేయునది), హర్త (హరించువాఁడు, హరించునది), గంత (పోవువాఁడు, పోవునది), హంత (చంపువాఁడు, చంపునది)

౧ వ వివ ఋకారాంత స్త్రీలింగములును ఋకారాంత స్త్రీవాచకములును సాధారణముగా తత్స ౮౬-౮౭వ సూ చెప్పిన ఙ్యంతములై యనఁగా 'ఈ' కారాంతములై యగును ఉదా కర్త్రి (చేయు స్త్రీ, చేయు లతాది), హర్త్రి (హరించునట్టిది), గంత్రి (పోవునది), హంత్రి (చంపునది), 'స్వసృ-ననాందృ-దుహితృ-యాతృ-మాతృ' శబ్దములు మాత్ర మట్లు ఙ్యంతములు కావు వానికి 'అత్వ, స్త్రీత్వ' ములై యగును స్వస (తోఁబుట్టిన స్త్రీ) ననాంద (మగనితోఁ బుట్టిన స్త్రీ) దుహిత (కూఁతురు) యాత (తోడికోడలు) మాత (తల్లి)

విధాతృ, ధాతృ, మాంధాతృ* దాతృ, సవితృ, నేతృ శబ్దంబులకు మహత్తుల కత్వ స్త్రీ వద్భావంబులు విభాష నగు ౫౪ (బా త ౫౪, వ్యా సం ౧౫౭ విష)

విధాత-విధాతృడు ధాత-ధాతృఁడు (బ్రహ్మ) మాంధాత-మాంధాతృఁడు (ఒకరాజు) దాత-దాతృఁడు సవిత—సవితృఁడు (సూర్యుఁడు) నేత-నేతృఁడు(పాలించువాఁడు), అత్వ స్త్రీత్వములు రానపుడు మహత్పుంలింగములకు 'ఉత్వ, డుజ్జులు' వచ్చును

౧ వ వివ మహత్తులగు విధాత్రాదులకే యనుటచేత "ప్రాచీనకర్మమె జనుల కష్టసుఖములకు విధాత" అనుచో 'ఉత్వడుజ్జులు' రానేరవు

## దీర్ఘమునకు హ్రస్వము వచ్చుట

సంస్కృత ప్రాకృత ప్రాతిపదికముల తుది దీర్ఘమునకు హ్రస్వంబగు ౫౫ (బా తత్స-౫౪, వ్యా సం- ౧౫౮ I వి)

రమా-రమ, వనితా-వనిత, విద్యా-విద్య, లతా-లత, లక్ష్మీ-లక్ష్మి, సేనానీ-సేనాని (కుమారస్వామి), హాహా-హాహ (ఒక గంధర్వుఁడు) సిరీ-సిరి,

---

* 'మాంధాతృఁడు' (ఆర ౩వ ఆ-౧౯౮, శాంతి ౬వ ఆ-౫౫౬) నా సూరి దీనిని విధాత్రాదులలోఁ జేర్చకుండుట సరిగాదు.

ఇది ప్రాకృతసమము ఇట్లు కృత హ్రస్వంబులకు హ్రస్వాంతంబులకుం బోలెఁ గార్యంబు లగు ఉదా రమలు-లక్ష్మలు-సేనానులు హౌహూఁడు సిరులు, (లక్ష్మలు)

౧ వ వివ దేశ్యము వ్యవహార ప్రవాహసిద్ధముగాన 'నవలా' (స్త్రీ) మున్నగు దీర్ఘాంతములవలెనె 'నవల'(స్త్రీ) మున్నగు హ్రస్వాంతములును సిద్ధించు ననఁదగును * 'విలుకాఁడు' మున్నగు 'కా' ప్రత్యయాంతాదులకు హ్రస్వము లేదు (చూ తద్ధి-౧౧-౧౫-౨౩ సూ)

౨ వ వివ యమునా నది తుంగ తరంగ (ఆది-౮వ ఆ-౨౩౨) 'గౌరి వల్లభుఁడు' మున్నగు చోటులందలి హ్రస్వము సాధ్య షష్ఠీ సమాస సిద్ధము

౩ వ వివ ఉపసర్జన హ్రస్వము వచ్చునపుడును, 'క' ప్రత్యయాదులు వచ్చునపుడును నీసూత్రమునకుఁ బ్రసక్తియే యుండదు ఉదా వచస్సుధానిధి ఛంగి (హరిహరనాథుఁడు, మహాప్ర-౧వ ఆ-౭౭) అతినువు (అతిక్రమించిన యోడ గలది, బ్రాహ్మణకులము), ప్రద్యువు (ప్రకృష్టమగు స్వర్గము గలది, సుర కదంబము), చిత్రగువు (చిత్రములైన కిరణములు గలవాఁడు, సూర్యుఁడు) జితసేనానీకుఁడు (జయింపఁబడిన కుమారస్వామి గలవాఁడు, పరశురాముఁడు)

## ప్రాతిపదికాంత దీర్ఘమునకు హ్రస్వ తదభావములు

ఏకాక్షరక శబ్దంబులకు హ్రస్వంబు లేదు ౫౬ (బా తత్స-౫౫, వ్యా సం-౧౫౯ విష)

క్ష్మా (భూమి), శ్రీ, స్త్రీ, హ్రీ (లజ్జ), ధీ (బుద్ధి), భీ (భయము) భ్రూవు (కనుబొమ), క్ష్మాను (భూమిని) మొ

---

* నతనాభి న్నవలాను (మనుచ-౨౨ ఆ-౨౫), క అన్నవల ముద్దు మోమును (విక్ర ౫వ ఆ, శ-ర) సూ-రా-నిఘంటువున నీశబ్దమే లేకుండుట వింత !

౧ వ వివ ఉపసర్జనత్వమున (బహుప్రీహ్యాదులను) 'క్ష్మా' ప్రభృతి స్త్రీ ప్రత్యయాంతములకు హ్రస్వము కల్గును విజితక్ష్ముఁడు (జయించిన భూమి గలవాఁడు) 'శ్రీ-హ్రీ-ధీ-భీ-భ్రూ' శబ్దములు స్త్రీ ప్రత్యయాంతములు కావు [1] వాని కుపసర్జనత్వమున హ్రస్వము గలుగదు ఉదా. సుశ్రీలు, సుశ్రీకులు 'సుధి' అను 'శ-ర' తప్పు 'భ్రూవు' అనుచో తత్స-౪౯-౫౦వ సూ చొ వువర్ణక, వుగాగమములు

## డు లోప నిత్యత

నన్నయభట్టాది శబ్దములకు నిత్యముగాను, వృద్ధాదిశబ్దములకు వికల్పము గాను 'డుజ్జు' లోపించును ౫౨ (బా-తత్స-౫౬, వ్యా-సం ౧౬౦ I విష) [2]

నన్నయభట్టు (ఆది ౧ ఆ ౨౫) నారాయణభట్టు (ఆది ౧ ఆ ౨౪) కంకభట్టు (విరా ౫ ఆ ౨౫౦) వృద్ధు-వృద్ధుడు, మూర్ఖు-మూర్ఖుడు, నీచు-నీచుడు, ధూర్తు-ధూర్తుడు, రాహు-రాహుఁడు రాహువు, 'సీతు' మున్నగునవి తద్భవములు

## స్త్రీ లింగప్రథమైకవచన లోపము

స్త్రీ లింగంబులకి ప్రథమైక వచనంబునకు లోపంబగు ౫౭ (బా-తత్స ౫౭ వ్యా-సం-౧౬౧ I విష)

---

1 అపీ-తస్త్రీ-తరీ-లక్ష్మీ- శ్రీ-హ్రీ-ధీ-భ్యాది శబ్దతః । అనీ బన్తతయా సే (సో) ర్న । లోపో గౌణ్యే న హ్రస్వతా (ముగ్ధ-౧౫౪వ సూ, దుర్గా వ్యాఖ్య)

2 సూరి భారత ప్రయుక్తములగు 'నన్నయభట్టాది' శబ్దముల నిత్యతను (ఉత్వేనైవ భవన్త్యన్యే-అధర్వణకారిక) సూత్రింపకుండుటయు, మహాకవి ప్రయుక్తములు కాని 'గృహస్థు-చార్వాకు' శబ్దముల పాక్షికతను నుదాహరించు టయు వింతగా నున్నది

3 సంస్కృతమున 'స్త్రీ లింగ, స్త్రీ వాచక' శబ్దములు పర్యాయములుగ వాడఁబడునుగాని తెలుఁగున నట్టి వాడుకలేదు 'స్త్రీ లింగ' శబ్దము పారిభాషిక లింగపరముగాను, స్త్రీ వాచక శబ్దము మహతీ వాచకముగాను వాడుట తెలుఁగు సంప్రదాయము కావుననే యహోబలపతి "దారశబ్దస్య స్త్రీవాచకత్వేఽపి స్త్రీ లింగత్వాభావాత్" (అహో ౩౪౬ పు) అని వ్రాసెను (చూ-వ్యా-సం-విస్తర II ౧౬౧ I విష)

రమ-క్షమ-వనిత-ఘనత-విద్య-దేవత-మీన నేత్ర

౧ వ వివ సూత్రమందలి స్త్రీ లింగ శబ్దము పారిభాషిక లింగ పరము. కావున 'దేవతా' శబ్దమునకును నీ విధివర్తిల్లును దీనికి 'డు-ము-వు' అనువానిలో నేదియుఁ బ్రాప్తింపదు కాన సంస్కృత 'సు' ప్రత్యయమునె నిల్పి ప్రకృత సూత్రముచే లోపమును జేయవలయును (చూ-తత్సమ ప-వివృతి ౪వ వివ '*' గుర్తు టిప్పణము) రమాదిశబ్దములకుఁ దత్స ౫౫ వ సూత్రముచే హ్రస్వముచేసి తత్స ౪౦వ సూత్రముచే వచ్చు 'ము' వర్ణకమునకు దీనిచే లోపమును జేయవలయును ఉపసర్జసత్వమున మీననేత్రశబ్దము శాస్త్రీయ (పారిభాషిక స్త్రీలింగము) స్త్రీలింగ మయ్యెను సంపద-ఆపద మున్నగు హలంతముల విషయముననను నీవిధి వర్తిల్లును

౨ వ వివ తత్స-౪౯ వ సూత్రమునందలి 'అంతట' నను దశముచే 'ఉ వర్ణాంత' స్త్రీ లింగములయెడల నీవిధి వర్తిల్లదు ఉదా వధువు-భ్రూవు మొ

౩ వ వివ 'బ్రహ్మ-విశ్వకర్మ-అశ్వత్థామ-భ్రాత-దూత' మున్నగువాని యెడ (తత్స-౭౭-౭౮-౫౩-౬౩ సూ) స్త్రీ త్వాతిదేశముచేత నీ సూత్రము వర్తిల్లును ఇట్లె స్త్రీ సమాచ్ఛికశబ్దముల యెడలను నీ సూత్రము వర్తిల్లును ఉదా తల్లి-తండ్రి-అన్న-గోడ-చెఱువు-పుట్టువు-మనువు (మన్నుట) మొ

## ము లోపము దర్భాదులకు నిత్యము

దర్భాదులకు నిత్యముగాను, జరిత్రాదులకు వికల్పముగాను 'ము' వర్ణకము లోపించును ౫౯ (బా-తత్స-౫౮ వ సూ, వ్యా-సం-౧౬౨ I విష)

'దర్భ-కుశ-పనస' ఇవి దర్భాదులు చరిత్ర-చరిత్రము చరిత-చరితము అలకలు-అలకములు, అక్షతలు — అక్షతములు భ్రమ-భ్రమము, వధ-వధము, హంస-హంసము ఇత్యాదులు చరిత్రాదులు ఇది ఆకృతిగణము*

---

* సూరి చరిత్రాద్యుదాహృతి సరిగాలేదు 'అభిలాష-ఘోష' శబ్దముల 'ము' లోపమునకుఁ బ్రయోగము కానరాదు 'తరఁగ-తరంగ' అనునవి 'తరంగము' అనుదాని వికృతులు ఇట్లె 'వేగ' అనునది 'వేగము' అనుదాని వికృతి "మహాతరంగ-మహావేగ" అను ప్రయోగములు లేవు 'స్ఫురణము-విజృంభణము' మున్నగునవి 'ల్యుట్' ప్రత్యయాంత నపుంసకములు "స్ఫురణ-విజృంభణ'' అనురీతివి 'యుచ్' ప్రత్యయాంత స్త్రీ లిం రూప ములు ఇవి కృదంతములు కాన నిట్టివానిని 'చరిత్రా'దులలోఁ జేర్పరాదు

౧ వ వివ "లు గ్భవేత్ కుశాదే ర్మ్కః'' అను చింతామణి చొప్పున 'కుశ' శబ్దము దర్భాదులలోఁ జేర్పఁబడెను 'పనస' వైకృత మనెడి శబ్దరత్నా కరము సరికాదు "పనసః-పుం-కణ్టకి ఫలే (శబ్దా-చిం)'' అను చొప్పున 'పనస' శబ్దము సంస్కృతము కాన నిది సూరి చెప్పినట్లు దర్భాదులలోని దను టయె యుక్తము (పంచాశ చ్ఛబ్దభవము 'పనస' శబ్దము తద్భవము)

౨ వ వివ చరిత్రాదు లాకృతిగణముగాన 'ప్రయాగ-ప్రయాగము సంసర్గ-సంసర్గము, నిశ్శంక-నిశ్శంకము, చామరలు-చామరములు, లాజలు-లాజములు (పేలాలు) నిత్య-నిత్యము, తథ్య-తథ్యము, ప్రశ్న-ప్రశ్నము స్పర్శ-స్పర్శము మొదలైనవి గ్రాహ్యములు ఈ చరిత్రాదులింకను మహాకవి ప్రయోగములనుబట్టి యెన్ననగును ఉదా ప్రాస, అంతస్థలు, ఊష్మలు, చిహ్న, విమర్శ, మధ్య, నిష్కర్ష, అంశ మొ

## 'ధర్మువు-రూపు' మొ. సాధువులు

ధర్మాదిశబ్దముల 'ము' వర్ణకమునకు 'ఉవు' అను నాదేశమును, రూపాది శబ్దముల 'ము' వర్ణకమునకు 'ఉ' అను నాదేశమును వికల్పముగ నగును ౬౦ (ప్రౌ శబ్ద-౨౫వ సూ, వ్యా సం-౧౬౩ I విష)

ధర్మువు-ధర్మము, కర్మువు-కర్మము, వర్మువు-వర్మము (కవచము) అర్ఘువు-అర్ఘము మొ రూపు-రూపము శరణు-శరణము బీభత్సు-బీభత్సము, వర్గు-వర్గము [1]

౧ వ వివ ప్రయోగములు చ అవని సర్వథ ౹ ర్మువులు... అర్ఘువులు (ఆది ౪వ ఆ-౨౫౦) చిత్రరూపుల భంగి(ఉద్యో-౪వ ఆ-౧౧౬) బహురూపులు (బసవ ౪వ ఆ ౫౧౫) శరణు వేఁడిన (అను-౫వ ఆ-౩౮౮) గీ-బీభత్సు (శివరా)

---

1 సూరి 'ధర్మువు', 'రూపు', 'శరణు' మున్నగు ప్రామాణిక ప్రయోగ సిద్ధరూపములనైన సంగ్రహింపకుండుట సరికాదు

## 'సురలు-అసుర-దూత-భువి' శబ్దములు

సుర శబ్దము తెల్గున నిత్య బహువచనాంతము, స్త్రీ సమము నగును సిద్ధ సమాసమున నట్లు కానేరదు ౬౧ (బా తత్స-౫౯-౬౦, వ్యా సం-౧౬౪ I వి) [1]

సురలు-ఎల్ల సురలు నిఖిల సురులు-భూసురుఁడు

౧వ వివ 'సుర' శబ్దము తెల్గున 'దేవతా' పరార్థమందె కవి ప్రయుక్తము "సుర-పుం-దేవే-సూర్యే-పణ్డితే" (శబ్దస్తో)

అసురశబ్దము వికల్పముగా స్త్రీ తుల్యంబగును ఇదియు సిద్ధసమాసమున నట్లు కాదు ౬౨ (బా తత్స-౬౦, వ్యా సం-౧౬౪ I, II విష)

అసుర-అసురుఁడు ఎల్ల యసురలు-ఎల్ల యసురులు రావణాసురుఁడు నిఖిలాసురులు

దూతాదులకు స్త్రీత్వము వైకల్పికము ౬౩ (బా తత్స-౬౧వ సూ, వ్యా సం-౧౬౪ I, II విష)

దూత-దూతుఁడు ఉత్తమదూత-ఉత్తమదూతుఁడు 'కేవలయోధవే' (ఉద్యో-౩వ ఆ-౬౧) సింగంబు దూతుఁడు జంబుకంబు [2] దూత-యోధ-శంర- ఇవి దూతాదులు

---

1 దేవశబ్దము నిత్యైకవచనాంతముగ సూరి వచించెను రాచవారలుం I దేవులు (భోజ ౫వ ఆ-౩౩)

2 దూత శబ్దమున కమహత్త్వమున స్త్రీత్వము నిత్య మనెడి సూరి ప్రభృతుల వాక్యములు నిరాధారములు 'దూతుఁడగు జంబుకము' అనియుఁ జెప్పవచ్చును అశ్వసేనుఁడను భుజంగమము (ఆది ౧వ ఆ-౨౬౩)

పృథ్వీవాచి 'భూ' శబ్దంబునకు 'భువి' యగు ౬౪ (బా తత్స ౬౨ వ సూ, వ్యా సం-౧౬౫ I విష) భువి, భువులు, భువిని, భువులను

౧ వ విభ స్త్రీ లింగ ప్రథమైక వచన లోపము (తత్స-౫౧వ సూ) 'భువి నవార్యబలుండు' (ఆది-౪వ ఆ-౨౬౦) పృథ్వీవాచి యనుటచేత 'ఆత్మభూ, స్వయంభూ' మున్నగుచోట్ల 'భువి' అని నిలువదు

## నావ-రై-రో-గ్లా-గ్లో-రైని ము.

"నౌ" శబ్దంబునకు "నావ" యగు ౬౫ (బా-తత్స-౬౩వ సూ, వ్యా సం-౧౬౬ I విష)

**నావ-నావలు, మహానావ (తత్స-౫౧వ సూ-ప్రథమైకవచన లోపము, నౌ శబ్దము స్త్రీ లింగము) ఉపసర్జనత్వమున 'అతినువు-అతినౌకుడు'-(నావ నతిక్రమించినవాఁడు)*** "స్త్రోఽవావౌ రై నా వోః" (అం-చిం)

'రై-గ్లౌ' శబ్దంబుల కోత్వంబు విభాషనగు ౬౬ (బా-తత్స-౬౪ వ్యా-సం-౧౬౬ I విష) "స్త్రోఽవా వౌ రై నావోః" (అం-చిం)

'రై-రో' శబ్దములకు 'ము' వర్ణకమును, గ్లౌ గ్లో-(చంద్రుఁడు) శబ్దమునకు 'డుజ్ఞు'ను బ్రాప్తించుచుండఁగా వానికి 'ఇ-గ్లౌ-రా' సూత్రముచే(తత్స-౪౫) లోపము గల్గును రై-రో (ధనము) "నివు నాకు రో యిడుము" (ఆర ౨వ ఆ ౨౨౨), గ్లౌ-గ్లో-(చంద్రుఁడు) (అహో ౩౨౩వ పుట) 'గ్లౌ' శబ్దము 'డు' మంతము గామింజేసి (ఉత్స-౨౩౭ సూ) 'గ్లౌని కుల నృపతుఁడు' (కావ్యాలం-ఉల్లా-౩౭) అను ప్రయోగము ప్రామాదిక మని చెప్పవలసియున్నది

---

* 'నావి' అని సూరి యంగీకరించిన రూప మేకోశమునందును గానరాదు 'నవ' అను [illegible] గా [illegible] సఖు టువున వ్రాయఁబడెను రూపమందఁగాని [illegible] పుడు తద్భవత్వాంగీకార మేల? 'నావ' సంస్కృతసమ మనుటకు చింతామణియే ప్రమాణము

ఐకారం బీ తుల్యంబు ౬౭ (బా-తత్స-౬౫ వ్యా-సం-౧౬౭ విష)

రై నిని-రై కిని కై ని-కై కిని పైని-పైకిని, (చూ-తత్స-౨౬వ సూ) ఐకారం బి తుల్యమని సూత్రించినచో 'రై + లు = రులు' కావలసి వచ్చును (చూ-తత్స-౪౬వ సూ) ఈ విధి యాచ్ఛికములందును వర్తిల్లును కావుననే "కై-పై" శబ్దము లుదాహృతములయ్యె

## కంధ రాదులు

**కంధరాదులు క్లీబతుల్యంబులు విభాష నగు, విధా శబ్దమున కీ విధి నిత్యము ౬౮ (బా-తత్స-౬౬, వ్యా-సం-౧౬౮ I విష) ***

**కంధరము-కంధర (మెడ) విధము 'కంధరా-నాసికా-భిక్షా-దంష్ట్రా గ్రీవా-పాదు కోల్కా ప్రభృతులు' కంధరాదులు ఇది ఆకృతిగణము**

౧వ వివ తత్స-౫౫వ సూ చొప్పున హ్రస్వతయు, ౫౮వ సూ చొప్పునఁ బ్రథమైకవచనలోపమును రాఁగా 'కంధర' యున్నగు స్త్రీ లింగరూపము, లేర్పడును ప్రకృతసూత్రముచేఁ గ్లీబత్వాతిదేశము పాక్షికముగఁ జేయఁబడుట చేత 'కంధరము' యున్నగు రూపము లేర్పడును (చూ-తత్స-౨౦వ సూ) కంధ రాదు లాకృతిగణముగాన సీమ-సీమము (ఆర-౭వ ఆ ౧౭) = (సరిహద్దు) దామ-దామము (పూలదండ)

## తెల్గున విభక్తియోగము లేనివి

ద్వి-త్రి-తిసృ-చతసృ ప్రభృతులగు నల్పసంఖ్యా వాచకములకును 'స్మృతో' ప్రభృతి శబ్దములకును దెల్గునఁ దత్సమరూప విభక్తియోగము లేదు ౬౯ (బా-తత్స-లేదు, వ్యా-సం-౧౬౯ II విష)

---

* విధాశబ్దము నిత్యముగాఁ గ్లీబతుల్యమనుటకై సూరి యీ విధిని బహుళ మనుట సరికాదు

ప్రత్యయాంతర యోగమున 'ద్వి-త్రి' ప్రభృతులకు విభక్తియోగము గలదు ఉదా ద్వికము-ద్వయము, త్రికము - త్రయము - త్రితయము మొ ద్వ్యాదులనుటచేత 'ఏకంబు' అను రూపము గలదు 'స్మృత + ఉ = స్మృతో' (స్మరింపఁబడిన శంభువు గలవాఁడు) 'స + ఇ = సే' (మన్మథునితోఁ గూడిన వాఁడు) ఋూదంతశబ్దములు, ౠ దంత, ఌా దంత శబ్దములు మున్నగువి స్మృతో ప్రభృతులు

ఇ ది య జ ం త ప్ర క ర ణ ము

---

# హ ల ం త ప్ర క ర ణ ము

హలంతంబు ప్రథమైక వచనాంతతుల్యం బిందు నామం బగు ౨౦ (బా తత్స-౬౭వ సూ, వ్యా సం-౧౬౯ మొ ౧౭౦ II విష)

ఢంక్ (కాఁకి), రాట్ (రాజు), కర్మ, వర్మ(కవచము) మొ శబ్దములు, శ్వశబ్దంబు దప్ప నకారాంతంబు లెల్లఁ బ్రథమైక వచనాంత తుల్యంబులె యగును*

## హలంత తత్సమశబ్దముల ప్రాతిపదికములు

౧ వ విప సంస్కృత శబ్దములలో నజంతములు మాత్రమె తత్సమము లగునపుడు సంస్కృత ప్రాతిపదిక రూపము తెల్గునిల్చియాంధ్రవ్యాకరణకార్యముల నందును హలంతములకో గొన్నిటికి సంస్కృత ప్రథమైకవచన తుల్యరూపము ప్రాతిపదికమై నిల్చును కొన్నిటికి సంస్కృత ద్వితీయైకవచన తుల్యరూపము

---

* సూ. [illegible] ధువెను ఉపపెలితముగ ''మరుత్-వీరుత్'' మున్నగు వానిని ప్రథమైకవచనాంత [illegible] ప్రయోగములు లేవు 'మరుత్తు-వీరుత్తు' [illegible]

ఐకారం బీ తుల్యంబు ౬౭ (బా-తత్స-౬౫ వ్యా-సం-౧౬౭ విష)

రై నిని-రైకిని కైని-కైకిని పైని-పైకిని, (చూ-తత్స-౨౬వ సూ) ఐకారం బి తుల్యమని సూత్రించినచో 'రై + లు = రులు' కావలసి వచ్చును (చూ-తత్స-౪౬వ సూ) ఈ విధి యాచ్ఛికములందును వర్తిల్లును కావుననే "కై-పై" శబ్దము లుదాహృతములయ్యె

## కంధ రాదులు

**కంధరాదులు క్లీబతుల్యంబులు విభాష నగు, విధా శబ్దమున కీ విధి నిత్యము ౬౮ (బా-తత్స-౬౬, వ్యా-సం-౧౬౮ I విష) ***

**కంధరము-కంధర (మెడ) విధము 'కంధరా-నాసికా-భిక్షా-దంష్ట్రా గ్రీవా-పాదు కోల్కా ప్రభృతులు' కంధరాదులు ఇది ఆకృతిగణము**

౧వ విష తత్స-౫౫వ సూ చొప్పున హ్రస్వతయు, ౫౮వ సూ చొప్పునఁ బ్రథమైకవచనలోపమును రాఁగా 'కంధర' మున్నగుస్త్రీ లింగరూపము, లేర్పడును ప్రకృతసూత్రముచేఁ గ్లీబత్వాతిదేశము పాక్షికముగఁ జేయఁబడుట చెత 'కంధరము' మున్నగు రూపము లేర్పడును(చూ-తత్స-౫౦వ సూ) కంధ రాదు లాకృతిగణముగాన సీమ-సీమము (ఆర-౭వ ఆ ౧౭) = (సరిహద్దు) దామ-దామము (పూలదండ)

## తెల్గున విభక్తియోగము లేనివి

ద్వి-త్రి-తిసృ-చతసృ ప్రభృతులగు నల్పసంఖ్యా వాచకములకును 'స్మృతో' ప్రభృతి శబ్దములకును దెల్గునఁ దత్సమరూప విభక్తియోగము లేదు ౬౯ (బా-తత్స-లేదు, వ్యా-సం-౧౬౮ II విష)

---

* విధాశబ్దము నిత్యముగాఁ గ్లీబతులంమనుటకై సూరి యీ విధిని బహుళ మనుట సరికాదు

షుఁడు మొ కర్మన్-కర్మము (కర్మ, కర్మణీ, కర్మాణి) వర్మన్-వర్మము (కవచము, వర్మ, వర్మణీ, వర్మాణి, చూ ౭వ వివ్ర) మఘవన్-మఘవుఁడు (ఇంద్రుఁడు మఘవా, మఘవానౌ, మఘవానః) మఘవుండు వానికి మారొక్క-సంగ (ఆది ౦వ ౩-౪౬) "మఘవాన్, మఘవన్తౌ మఘవన్తః" (ప్రథ) అనురీతి రూపములుగల శబ్దమునకుఁ దెల్గున విభక్తియోగము లేదు

'సఖిన్' అను నకారాంత ప్రాతిపదికము గలదను శబ్దరత్నాకరము ప్రామాదికము అది 'సఖి' అని 'ఇ' కారాంతమే హరిశబ్దమువలెనె దాని రూపములు తెల్గున నుండుటను 'సఖ' అను 'అ'కారాంత ప్రాతిపదికమును గలదు ఉదా సఖుఁడు "పథిన్ (మార్గము), మథిన్ (కవ్వము), ఋభుక్షిన్ (ఇంద్రుఁడు)" అను సంస్కృత శబ్దములకుఁ దెల్గు విభక్తుల యోగము లేదు 'పథము-మథము-ఋభుక్షుఁడు' అను రీతిని 'అ'కారాంతములై యవి తెల్గున వాడఁబడును

శాంతములు దిక్కు (దిశ-దిక్, దిశౌ, దిశః)

సాంత నపుంసకములు సకారాంతములగు నపుంస కామహచ్ఛబ్దములు ప్రథమైకవచనాంత తుల్య ప్రాతిపదికములె యనఁదగును అవి యంత్య సకార లోపము గల్గియు లేకయుఁ దెల్గున వాడంబడును ఉదా (ఉరస్-ఉరము-ఉరస్సు, సదస్- సదము-సదస్సు, "పయస్- పయస్సు, వయస్-వయస్సు" అను నీ రెంటికి నంత్యలోపము లేదు మొ

## ద్వితీ యైకవచన తుల్యములు

౩ వ వివ తక్కినవి ద్వితియైకవచన తుల్య ప్రాతిపదికము గలవై యుండును నకారాంతములలో నొక్క శ్వ శబ్దము మాత్రమె ద్వితియైకవచన తుల్య

ప్రాతిపదికము- ఉదా శ్వానము (శ్వానమ్, శ్వానౌ, శునః, ద్వితీ 'శ్వన్' శబ్దము)

జాంతములు ప్రథమైక వచనమున 'కా'ంతములై యుండు జకారాంతములు ద్వితీయైకవచన తుల్య ప్రాతిపదికములై యుండును రుజ (రోగము) (రుక్ - రుజౌ - రుజః - ప్రథ, రుజమ్ - రుజౌ - రుజః - ద్వితీ) స్రజము (పూలదండ స్రక్- స్రజౌ- స్రజః- ప్రథ- స్రజమ్- స్రజౌ- స్రజః- ద్వితీ) విశ్వసృజుఁడు- బ్రహ్మ విశ్వసృక్ (ముగ్ధ-వ్యా ౨౧౧ వ సూ-దుర్గా)- విశ్వసృజౌ, విశ్వసృజః- ప్రథ విశ్వసృజమ్, విశ్వసృజౌ, విశ్వసృజః- ద్వితీ విశ్వసృజులను మునులచే (శాంతి-౨ వ ఆ-౨౬)

**తాంత-దాంత - ధాంత - హాంత - వస్వంతములు ద్వితీ యైకవచన తుల్య** ప్రాతిపదికములె యగును తాంత గుణవత్ - గుణవంతుడు (గుణవాన్, గుణవన్తౌ, గుణవన్తః- ప్రథ గుణవన్తమ్, గుణవన్తౌ, గుణవతః ద్వితీ), శ్రీమత్ - శ్రీమంతుఁడు (శ్రీమాన్, శ్రీమన్తౌ, శ్రీమన్తః- ప్రథ శ్రీమన్తమ్, శ్రీమన్తౌ, శ్రీమతః - ద్వితీ) మరుత్ - మరుతులు (దేవతలు-వాయువులు) (మరుతమ్, మరుతౌ, మరుతః- ద్వితి 'మరుత్తు-మరుత్తులు' తప్పులు) నివృత్ - నీవృతియు (దేశము) 'నీవృత్తు' - తప్పు పరీక్షిత్ - పరీక్షితుడు (అశ్వ ౩ వ ఆ ౧౬౬ - ఒకరాజు), పరీక్షిత్తు తప్పు దాంత ఆపద్ - ఆపద (ఆపదమ్, ఆపదౌ, ఆపదః- ద్వితి) సంపద్-సంపద (సంపదమ్, సంపదౌ, సంపద - ద్వితీ) సుహృద్ - సుహృదుఁడు (స్నేహితుఁడు సుహృదమ్, సుహృదౌ, సుహృదః - ద్వితీ) బ్రహ్మవిద్ - బ్రహ్మవిదుఁడు (బ్రహ్మజ్ఞాని బ్రహ్మవిదమ్, బ్రహ్మవిదౌ, బ్రహ్మవిదః, ద్వితీ) బ్రహ్మవిదుల (సభా-౨వ ఆ ౧౨౭) ధాంత వీరుధ్ - వీరుధము (లతాకుంజము) (వీరుధమ్, వీరుధౌ, వీరుధః, ద్వితీ) హాంత అనడ్వాహ్, అనడ్వాహము (ఎద్దు - అనడ్వాహమ్, అనడ్వాహౌ, అనడుహః, ద్వితీ) తురాసాహ్- తురాసాహుఁడు (ఇంద్రుఁడు - తురాసాహమ్, తురాసాహౌ, తురాసాహః, ద్వితీ) తురాసాహుఁడు (శ - ర) తప్పు హవ్యవాహ్ - హవ్యవాహుఁడు (అగ్ని

హవ్యవాహమ్, హవ్యవాహౌ, హవ్యవాహః ద్వితీ) ఉపానహ్ - ఉపానహము (చెప్పు, పాదరక్ష-ఉపానహమ్, ఉపానహౌ, ఉపానహః-ద్వితీ)

వసు ప్రత్యయాంత విద్వస్ - విద్వాంసుఁడు (విద్వాంసమ్ విద్వాంసౌ, విదుషః- ద్వితీ ఇది కృదంతము )

## ఉభయ రూపములు

౪ వ వివ ఉభయరూపములు సత్యజిత్ - సత్యజిత్తు (ఒక రాజు), సత్యజితుఁడు (సత్యజిత్, సత్యజితౌ, సత్యజితః, ప్రథ సత్యజితమ్, సత్యజితౌ, సత్యజితః, ద్వితి) ఆ వె సత్యజిత్తు మేన సాయక దశకంబు (ద్రోణ-౧వ ఆ ౨౧౮) క కినిసి వెసన్ సత్యజితుని। ధనువు నఱికిఁ (ద్రోణ ౧వ ఆ ౨౧౯) క శౌర్యో। పేతుఁడు సత్యజితుం డను (ఆది-౭వ ఆ-౮౧), ఇట్లు నన్నయ దీనిని ద్వితీయైకవచన తుల్య ప్రాతిపదికముగనె వాడును ఇంద్రజిత్తు, ఇంద్రజితుఁడు సకారాంత మహన్మహతీ రూప శబ్దము లకు ప్రథమైకవచన తుల్య రూప పక్షమున సంత్యలోపము అంగిరుఁడు ద్వితీయైక వచన తుల్యరూపపక్షమున 'అంగిరసుఁడు' మహతీరూప అప్సర-అప్సరసలు

## హలంత శబ్దముల విశేషములు

౫ వ వివ అలంతి యగతిక స్థలములందు సంస్కృత హలంత ప్రాతి పదికమె నిల్చును అప్ - అప్పు (జలము) ఆపః-ప్ర బ అపః ద్వి బ నిత్యబహువచనము కించిత్-కించిత్తు-ఇంచుక అవ్యయము కిమ్-కిమ్ము (ఏమి-అవ్యయము)

౬ వ వివ సంస్కృత ప్రథమైక వచనము తుదిహల్లు చర్త్వముతోను (చర్-సంస్కృత ప్రత్యాహారము, 'పరుషములతోను' అనుట సుకరము), జస్త్వ ముతోను ('జస్' సంస్కృత ప్రత్యాహారము-'సరళములతోను' అనుట సుకరము)

నున్నపు డందలి చర్త్వ (పరుష) రూపము నంజిదె తెల్గునఁ బ్రాతిపదికాంత వాల్లయి యుండును ఉదా రుక్ – (రుగ్, రుచౌ రుచః-ప్రథమ) రుక్కు, (కాంతి) మొ

౭ వ వివ సంస్కృత శబ్దమునకుఁ బుంలింగరూప మున్నపు డితర లింగ రూపము లున్నను బుంలింగరూపము వంటిదే ప్రాతిపదిక మగును ఉదా శ్రీమంతుఁడు-శ్రీమంతురాలు-శ్రీమంతము (కులము) గుణవంతుడు-గుణవంతురాలు-గుణవంతము (వంశము) స్త్రీత్వమున వీని జ్యంతములు ప్రత్యేకప్రాతిపదికము లగును ఉదా శ్రీమతి = శ్రీమంతురాలు గుణవతి = గుణవంతురాలు

కర్మాదిశబ్దములకుఁ బుంలింగరూపమే యుండదు అవి నిత్య నపుంసకములు కాన నపుంసక లింగ తుల్యరూపమె వాని ప్రాతిపదిక మగును ఉదా కర్మన్ – కర్మము (కర్మ-కర్మణీ-కర్మాణి), వర్మన్-వర్మము (కవచము) (వర్మ-వర్మణీ-వర్మాణి) మనస్ (మనః-మనసీ-మనాంసి) ఇట్లే 'అప్సరస్' శబ్దము నిత్యస్త్రీలింగము-అప్సరస్ - అప్సరి - అప్సరస (అప్సరాః-అప్సరసౌ-అప్సరసః-ప్రథ అప్సరసమ్-అప్సరసౌ – అప్సరసః-ద్వితీ)

## హలంత శబ్దరూప సాధనము

ఉగాగమంబును ద్విత్వంబును మధిహల్లున క ప ౭౧

(బా-తత్స-౬౮, వ్యా-సం-౧౬౯ మొ ౧౭౦ II వి)

ఉగాగమాంతంబులకు 'ఇ-గ్లౌ' సూత్రముచేతఁ బ్రథమైకవచన లోపం బగు రుక్కు (కాంతి), రాట్టు (రాజు) ఉగాగమంబు లేమింజేసి నాంతంబుల నత్రిలింగములకుం బ్రథమైకవచన లోపంబు లేదు సుధన్వుఁడు (ఒకరాజు), సుత్రాముఁడు (ఇంద్రుఁడు), వర్మము (కవచము), కర్మము మొ

దీర్ఘంబుమీఁది హల్లునకు ద్విత్వంబు వైకల్పికంబు ౨౨ *

(బా-తత్స-౬౯ , వ్యా-సం-౧౬౯ మొ ౧౨౦ II వి)

వాక్కు-వాకు (మాట). స్వరాట్టు-స్వరాటు (పరమేశ్వరుఁడు) దీని కింద్రుఁ డని యర్థము వ్రాయుట (శ-ర) సరికాదు స్వారాట్టు - స్వారాటు (ఇంద్రుఁడు)

తక్కిన మతుబాదికంబు ద్వితీయైకవచనాంత తుల్యంబు నామం బగు ౨౩ (బా-తత్స-౨౦ , వ్యా-సం-౧౨౧ I వి)

శ్రీమన్తమ్-గుణవన్తమ్-విద్వాంసమ్ - అనడ్వాహమ్-శ్వానమ్ - ఉపానహమ్-అప్సరసమ్ ఇత్యాదులు

వాని యంతిమ మకారంబునకు లోపంబగు ౨౪

(బా-తత్స-౨౧, వ్యా-సం ౧౨౧ I విష)

శ్రీమంత-గుణవంత-విద్వాంస-అనడ్వాహ ఇత్యాది వీని కజంతంబుల కుం బోలె డుజాదులు యథాయోగ్యంబుగా నగు అతఁడు శ్రీమంతుఁడు ఇతఁడు గుణవంతుడు వాని వంశము శ్రీమంతము వీని వంశము గుణవంతము విద్వాంసుడు-విద్వాంసము అనడ్వాహము-శ్వానము-అప్సరస వక్ష్యమాణ లక్షణము చే (తత్స-౧౬వసూ) స్త్రీత్వంబున మతుబాదికంబులు ఙ్యంతంబులె యిందు గ్రహింపఁబడు శ్రీమతి-గుణవతి-విదుషి-శుని మహతి వాచ్యం బగునపుడు ''శ్రీమంతురాలు (సంధి-౨౯వసూ)- గుణవంతురాలు-విద్వాంసురాలు'' అనియుఁ బ్రయోగింపఁదగు

---

* సూరి ముఖ్యుల గ్రంథముల యందుఁ బ్రయోగము కానరాదు

౧వ వివ వెనుక వివరించిన రీతిని (తత్స ౭౦వ సూ ౩ వివృతి) న కా రాంతాదు లిందుఁ జేర్పనగును వీని సంస్కృత ద్వితీయా విభక్తి రూపములు వెనుక నుదాహృతము లయ్యెను (తత్స-౭౦-౩వ వివరణము)

## కొన్ని హలంతముల విశేషములు

ముదాదులకుఁ బ్రథమైకవచన లోపము లేదు ౭౫

(బా-తత్స-౭౨వ సూ , వ్యా-సం-౧౭౨ I వి)

ముదము-స్రజము-ఉపానహము (పాదరక్ష-చెప్పు)

౧వ వివ ముదాదులు స్త్రీ లింగములు వీనికి తత్స-౫౮వ సూత్రముచేఁ బ్రథమైకవచన లోపము గల్గును గాన దాని కపవాదముగా నీ సూత్రము వచింపఁ బడెను ఇవి ద్వితీయైకవచన తుల్య ప్రాతిపదికము గలవి (ముదమ్-ముదౌ-ముదః-ద్వితీ స్రజమ్-స్రజౌ-స్రజః-ద్వి ఉపానహమ్-ఉపానహౌ-ఉపానహః-ద్వితీ )

౨వ వివ ఋత్విగాదులకుఁ బ్రథమైకవచనతుల్య ప్రాతిపదికములు లేవు 'ఋత్విక్కు - నీవృత్తు' అను కవిప్రయోగములు లేవు ఇవి ద్వితీయైకవచనతుల్య ప్రాతిపదికములు మాత్రమె గల్గియుండును *

---

* సూరి యుదాహరించిన ఋత్విక్కు, నీవృత్తు, పీరుత్తు మున్నగునవి కవి ప్రయోగ దృష్టములు కాలేదు "స్రుక్కుల విఱిచి ఋత్విక్కుల బాధించి" (వరాహపురాణము ౫ వ ఆ ౧౧౫) అను పాఠమగుపడుచున్నది ఇట "స్రజములఁ జెఱిచి ఋత్విజులను బాధించి" అని కవి ప్రయుక్త పాఠమై యుండును ఇట్టి యర్వాచీన కవుల ప్రయోగములు వీలైనచోదిద్దుటలెస్స భారతమం దంతటను "ఋత్విజుఁడు" అనియే ప్రయుక్తమైయున్నది లేదా దీని "నింద్ర జిదాదులలోఁ జేర్పవలెను ఇవెల్ల ద్వితీయైక వచనతుల్య ప్రాతిపదికములు గలవి గాన

౩వ వివ హనుమానుఁడు-భగవానుఁడు-ప్రశానుఁడు (శాంత) మున్నగు రూపములు కవి ప్రయోగములందు లేవు వీని ప్రథమైక వచనము లోపించిన 'ఉ' గాగమాంతములపైని మరల 'డుజ్ఞు' నిల్చుట యసంభవము హనుమంతుడు మొ సాధువులు

## కొన్ని నకారాంతముల స్త్రీ త్వాతిదేశము

అశ్వత్థామాదులకు స్త్రీ త్వంబగు ౨౬ (తత్స-౮౫ వ సూ. వ్యా-సం-౧౨౫ I సూ )*

నకారాంతములగుటచే (తత్స-౬౨వ సూ) నీ యశ్వత్థామాదులు ప్రథమైక వచనతుల్య ప్రాతిపదికములై స్త్రీ త్వాతిదేశముచేత 'ఉత్వ-డుజ్ఞులు' లేవని యెఱుంగునది అశ్వత్థామ (ద్రోణ-౫వ ఆ ౩౧౫), యువ (యౌవనముగలవాఁడు),

---

"ఋత్విజుఁడు-వివృతము-విరుధము" మున్నగు రూపములు మాత్రమె సాధువులు ఋత్విజుఁడు (సభా ౧వ ఆ ౧౧వ ప, సభా ౨వ ఆ ౪వ ప), "గమికర్మీకృత నైక నీవృతుఁడనై" (నైష ౨వ ఆ ౨౧వ ప) కాన "ఋత్విగాదులు ద్వితీయైక వచనాంతతుల్యములు విభాష నగు" (బాల-తత్స-౭౩ వ సూ) అను సూత్రము ప్రత్యాఖ్యాత మయ్యెను అట్లె "హనుమానుఁడు-భగవానుఁడు-ప్రశానుఁడు" మొదలైనవియు నపశబ్దములె కాన "ఒకానొకచో మహత్త్వంబునందు మతుప్రకారంబున కానాదేశంబు విభాష నగు" (బా-తత్స-౭౪) అనునదియుఁ బ్రత్యాఖ్యేయమె అహోబలుఁడు, కూచిమంచి తిమ్మకవి మున్నగువారి యనురోధమున నిట్టి ప్రమాదములు గల్గియుండును

* సూరి విశ్వకర్మాదుల కని సూత్రించెను విశ్వకర్ముఁ డనియుఁ గలదు గా విశ్వకర్మ శబ్దము 'ఆత్మా'దులవోనిది (ప్రౌఢ-శబ్ద-౨౭వ సూ) విశ్వకర్ముని (ఉ-హరి ౪ వ ఆ ౪౫ వ ప)

యజ్వ (మనుచ-౧ వ అ ౫౩-యజ్ఞము చేసినవాఁడు), కృష్ణవర్త్మ (అగ్ని, వసు ౪వ అ ౩౬) ఇత్యాదులు

మహద్వాచకమై పుంలింగంబగు బ్రహ్మ శబ్దమునకు స్త్రీత్వంబగు ౭౭ (బా-తత్స-౭౬, వ్యా-సం-౧౭౬ వి)

బ్రహ్మ- ఈ శబ్దము చతుర్ముఖ (బ్రహ్మదేవుడు) ఋత్విగ్విప్రులకు వాచకము తత్వ-తపో-వేద-యోగ (విష్కంభాది) వాచకంబగునేని 'బ్రహ్మము' నాఁబడు

## ఆత్మాది శబ్దములు

ఆత్మాదులకు స్త్రీత్వంబు వైభాషికంబు ౭౮ (బా తత్స-౭౭, వ్యా సం ౧౭౭వ విష) *

ఆత్మాదిక మాకృతిగణము ఆత్మఁడు (ఆశ్వ ౨వ అ-౧౭), ఆత్మము, ఆత్మ (శాంతి ౫వ అ-౬౦౩) విశ్వకర్మ (ఆది-౮వ అ-౭౧), విశ్వకర్ముఁడు సీ విశ్వకర్మని కూఁతు (ఉ హరి ౪వ అ-౪౫) పూషుఁడు-పూష (కాశీ) సూర్యవర్ముఁడు-సూర్యవర్మ కేతువర్ముఁడు-కేతువర్మ తిక్కశర్ముఁడు-తిక్కశర్మ అణిమము-అణిమ (అణుత్వము), గరిమము-గరిమ (గొప్పతనము) మొ ఇమనిజంతము లెల్ల

సుత్రామాదు లాత్మాదులలోను నశ్వత్థామాదులలోను జేరమింజేసి వానికి స్త్రీసమ రూపములు లేవు ఉదా సుత్రాముఁడు, సుధన్వుఁడు, కర్మము, వర్మము మొ

---

* "విశ్వకర్మ-పూష" మున్నగువానికిని స్త్రీత్వము వైభాషికమె కాననివి 'ఆత్మాదుల' లోనివె సీ విశ్వకర్మనికూఁతు (ఉ హరి ౪వ అ- ౪౫), విశ్వకర్మ (ఆది-౮వ అ-౭౧) పూష మకరసుఁడు (కాశీ) ఇట్లగుటచేతనే సూరిసూత్రము సరికాదు దీనిలో బహుశ్రప్రయోజనమును లేదు.

## రాజ శబ్దము.

పుంలింగమును జేతనార్థకమును నయి స్వార్థపరంబగు రాజ శబ్దము 'రాజు' నాఁబడు ౭౯ (బా తత్స-౭౮వ సూ, వ్యా సం-౧౩౮ I వి )*

రాజు (ఱేఁడు) ఖగరాజు (గరుత్మంతుఁడు) రాజుచేత-ఖగరాజుచేత మొ 'అశ్వరాజు' (అశ్వశ్రేష్ఠము ఆర ౩వ ఆ-౬౩ ప ఇచట మహద్వివక్షయు లేదు అమహత్తగు నశ్వరూపమె వివక్షితము) కేవలము నచేతనత్వమున మాత్రమె 'వృక్షరాజము'అని 'ము' వర్ణకాంతమై యుండును స్వార్థపరము కానపు డనఁగా నుపసర్జనత్వమున ('రాజు' అనుదానికిఁ గ్రియాన్వయము లేనపుడు బహు వ్రీహ్యాదులలో) 'రాజు' అను నిపాత మూఁదదు ఉదా హత రాజుఁడు పరశురాముఁడు వచ్చెను (హతరాజుఁడు= చంపఁబడిన రాజులు గలవాఁడు) పుంలింగ మనుటచేత ''రాజ్ఞి-సురాజ్ఞి'' అని స్త్రీత్వమున నుండును

౧ వ వివ తత్పురుషాదులలో వచ్చు 'టచ్' అను సమాసాంత ప్రత్యయము వచ్చునపుడును రానపుడును 'రాజు' అను నిపాత రూపమే నిల్చును రాజు, ఖగరాజు, అశ్వరాజు మొ

౨ వ వివ 'రాజు-హతరాజుఁడు' మున్నగునవి సంస్కృత సమములు గాన వానిలోని 'జ' కారము తాలవ్యమె, రాజు శబ్దభవ మగు 'రాజు' అను వికృతి రూపములోని 'జ'కారము మాత్రమె దంత్యము (చూ సంజ్ఞా-౧౦వసూ)

---

* సూరి 'మహత్త్వంబున' అనుటచేత ''అశ్వరాజు'' (ఆర-౩వ ఆ-౬౩) అను నన్నయ ప్రయోగమె కుదురదు ఈ ప్రయోగమునందు మహద్వివక్షయు లేదు అశ్వశ్రేష్ఠ మని యర్థ మున్నను నమహత్తుగానే యున్నది పురుషతా వివక్షయే లేదు

## జగదింద్ర జిచ్ఛబ్దములు

జగచ్ఛబ్ద 'త' కారమునకు నిత్యముగాను* నింద్రజిచ్ఛబ్ద తకారమునకు వైకల్పికముగాను లోపంబగు ౧౦ (బా తత్స-౭౯ వ సూ, వ్యా సం-౧౭౯ I వి)

జగము ఇంద్రజి-ఇంద్రజిత్తు తకారలో పాభావపక్షమున దీనికి సత్య జిచ్ఛబ్దమునకు వలెనె ద్వితీయైక వచనతుల్య ప్రాతిపదిక రూపమును గలదు ఇంద్రజితుఁడు (తత్స ౭౦ వ సూ ౧-౪వ వివ ఇంద్రజిత్, ఇంద్రజితౌ, ఇంద్రజితః- ప్రథ ఇన్ద్రజితమ్, ఇన్ద్రజితౌ, ఇన్ద్రజితః- ద్వితీయావిభక్తి)

౧ వ వివ ప్రథమైకవచనము లోపించిన 'ఉ' గాగమాంతములపై (చూ-తత్స ౪౫-౭౧ సూ) ఖరల 'డుజ్జు' నిల్చుట కేవలము నసంభవమగుటచే 'ఇంద్రజిత్తుఁడు' అను రూపము సరికాదు కాని కొందఱు సామాన్యకవు లద్దానిని ప్రయోగించిరి అట్లయినను నట్టి 'డు' మంతరూపము గ్రాహ్యముగాదనుటయె లెస్స సామాన్యకవి ప్రయోగములు చ గొ న కొ ని.. యింద్రజి । త్తుని తల (భాస్కర యుద్ధ-౧౩౭౭ అయ్యలార్యునిది) ఆ వె ఇంద్రజిత్తుఁడప్ప డినకులోద్భవునిచే (మొల్లరా-యుద్ధ 'బా-గు-ప' తత్స ౭౯వ సూ) ద్విపద శ్రీమించు నయ్యింద్రజిత్తుని నగరు (రంగ-రా సుందరకాం ౨౭౯ వ పు యూని-ముద్రణ )

౨వ వివ జరచ్ఛబ్దము నీ సూత్రమందుఁ జేర్పనక్కఱ లేదు 'ఉ । శనుఁ డతనికి శాపమిచ్చె జరుఁడై యుండన్' (వి-పు- ౬ వ ఆ) అను పద్యమున 'జరుఁడు' అనునది కవి ప్రయుక్తపాఠము కాదు 'జరియై' అనునది కవి ప్రయుక్తము ''జరీ త్రి వృద్ధే ఇతి హేమ చన్ద్రః'' (శబ్దా-చిం)

---

* 'జగత్తు' అను రూపము నంగీకరించి దీని 'త' కార లోపమును వైకల్పికమె యని సూరి సూత్రించెను కాని యట్టి ప్రయోగము కానరాదు 'జగతు' అనునదియు నపశబ్దమె యననగును

## సాంతామహత్తులు

సాంతంబుల తుది సకారంబునకు లోపంబు వైకల్పికంబు పయః ప్రభృతులకు సకారలోపంబు లేదు ౮౧ (బా-తత్స ౮౦వ సూ, వ్యా-సం-౧౮౦ వి )[1]

**ఉరము - ఉరస్సు వక్షము - వక్షస్సు అర్చి - అర్చిస్సు ధనువు - ధనుస్సు ఆయువు - ఆయుస్సు హవి - హవిస్సు పయః ప్రభృతులకు· పయస్సు—వయస్సు—అయస్సు (ఇనుము) 'సరస్సు - సరము' అను దానికి సకారలోప మర్వాచీనము చ ..కో। మలినగు చంద్రికా విసర మాసరమా సరమా సునాభి (సత్యభా-౧వ ఆ)**

౧వ వివ 'అర్చిష్-ధనుష్-ఆయుష్' మున్నగువానికి షత్వము గల్గ కుండఁగనే యీ ద్విత్వోత్వములుగాని సలోపముగాని వర్తిల్లును ఉరః ప్రభృతులు నిత్యనపుంసకములు గాన నపుంసక ప్రథమైకవచనతుల్యరూపమే వానికిఁ ప్రాతిపదికము నిల్చును (చూ-౽౦వ సూ ౽వ విప ఉరః-ఉరసీ-ఉరాంసి-ప్రథ) సకారాంతముల సకారమునకు ద్విత్వోత్వములు గల్గుట కనుకూలముగా నట్టి సకారమును విసర్గము చోట గ్రహింపవలెను (ఇచటి'బా-గు-ప' సరికాదు చూ వ్యా సం ౧౮౦ విష )

## సాంత మహన్మహతీ వాచకములు

మహన్మహతీ వాచకములగు[2] సాంతంబుల కంత లోపంబేని ద్వితీయైక వచనాంత తుల్యత్వంబే నగు ౮౨ (బా-తత్స ౮౧వ సూ, వ్యా-సం ౧౮౧వి)

---

1 ఇట్లు వివరించి చెప్పుటకు వలనుపడియుండఁగా సకారాంతముల కెల్ల సకారలోపము బహుళమని సూరి సూత్రించుట సరికాదు

2 సూరి మహతీవాచకములకును మహత్తులవంటి కార్య మగునని సూత్రింపకుండుట సరికాదు 'అప్సర-అప్సరస' (ఆది- ౫ వ ఆ ౧౯౫) తపన తేజ=తపనతేజస (ఆర — ౨వ ఆ ౨౫౯)

అంగిరుఁడు—అంగిరసుఁడు ఉగ్రశ్రవుఁడు-ఉగ్రశవసుఁడు ఊర్ధ్వరేతుఁడు - ఊర్ధ్వరేతసుఁడు అప్సర-అప్సరస 'దుర్వాస' మున్నగు (దుర్వాఁసుడు) 'అ'కారాంతశబ్దములును గలవు

౧వ వివ ఏతత్సూత్ర విధానమె వీని కంత్యలోపాభావ ద్విత్వోత్వములు (మహన్మహతీ వాచకములకు) గల్గనేరవని విశదీకరించుచున్నది 'విశ్రవసు' (భాస్కర — యుద్ధకాం — ౧౨౭౮ మతొక ప్రతిలో ౧౨౮౩ ప అయ్యలార్యునిది) అను రీతిగల సామాన్య కవి ప్రయోగములు సాధువులు కానేరవు 'నత సుమనస్సునకు' (ఆము—౬వ ఆ — ౯౯) అనునది కవి ప్రయుక్త పాఠము కాదు 'నత సుమనస్కునకు' అనునది కవి ప్రయుక్తపాఠమై యుండును "ఆవిర్భావమును బొందె విశ్రవస్సు" (కాశీ ౪వ ఆ-౧౩౮) అనునది కవి ప్రయుక్తము కాదు "ఆ విర్భావమును బొందె విశ్రవసుఁడు" అనునది కవి ప్రయుక్త పాఠ మనఁదగు

## వేధ పురోధ మనస్సు (మనసు)-దివి

వేధ-పురోధ ౮౩ (బా తత్స ౮౨ వ్యా -
సం - ౧౮౨ I విష)*

"వేధస్-పురోధస్" అనువానికి నిత్యముగా 'స' లోప స్త్రీత్వములు దీనిచే నిపతింపఁబడినవి

౧వ వివ (వేధాః, వేధసౌ, వేధసః-ప్రథమా , పురోధాః, పురోధసౌ, పురోధసః—ప్రథమా - పురోహితుఁడు) వేధ (శాంతి, ౨వ ఆ ౨౩౨), పురోధ (శాంతి ౨వ ఆ ౩౧౬)

---

* 'పురోధసుఁడు' అని రూపాంతరమును సూరి యంగీకరించి నిపతించెను, కాని దానికి మహాకవి ప్రయోగము కానరాదు,

మనః ప్రభృతుల 'స' కారంబునకు ద్విత్వంబు
విభాష నగు ౧౪ (బా తత్స ౧౩, వ్యా, సం, ౧౧౩
I వి)

మనసు-మనస్సు (రాఘ ౧వ ఆ ౩౧), శిరసు-శిరస్సు, సదసు-సదస్సు వీనికి 'స' లోప పక్షమున శిరము, సదము మొ

౧వ వివ హ్రస్వముమీఁది హల్లునకును ద్విత్వము పాక్షిక మగుట విశేషము (చూ తత్స, ౭౨వ సూ)

'దివ్' అను శబ్దమునకు 'దివి' యగు ౧౫
(బాల, తత్స, ౧౪, వ్యా, సం, ౧౧౪ I వి)*

దివి-దివులు (స్త్రీలింగ ప్రథమైకవచనలోపము) 'ద్యో-దివ్' అను రెండు శబ్దములు గలవుగాని 'ద్యో' శబ్దమున కాంధ్ర విభక్తియోగము లేదు 'దివికిఁ జనిన (ఆది ౭వ ఆ ౧౩౩)

## స్త్రీ ప్రత్యయములు

స్త్రీలింగంబు లెల్ల స్వ స్వ నియతంబులగు స్త్రీ
ప్రత్యయంబులం గూడి యుండుఁ బ్రవర్తిల్లు ౧౬
(బా-తత్స-౧౫, వ్యా-సం-౧౧౫ I విశ)

---

* సూరి 'హృది' అను శబ్దము నంగీకరించి "ద్యుహృచ్ఛబ్దంబులకు 'దివి హృది' యగు" అని సూత్రించెను ఇది నిరాధారము 'హృది' శబ్దము కవి ప్రయోగ సమ్మతంగాదు 'దివి-దివులు' తద్భవము ననెడి యాంధ్రనామ సంగ్రహము తప్పు "భూ దివోస్తుజౌ యతత్" (ఆం-చిం)

| నామము | స్త్రీ ప్రత్యయాంతము | తత్సమరూపము |
| --- | --- | --- |
| కర్తృ | కర్త్రీ | కర్త్రి |
| జనయితృ | జనయిత్రీ | జనయిత్రి |
| భాగ్యశాలిన్ | భాగ్యశాలినీ | భాగ్యశాలిని |
| బుద్ధిశాలిన్ | బుద్ధిశాలినీ | బుద్ధిశాలిని |
| శ్రీమత్ | శ్రీమతీ | శ్రీమతి |
| గుణవత్ | గుణవతీ | గుణవతి |
| విద్వస్ | విదుషీ | విదుషి |
| వనజముఖ | వనజముఖీ | వనజముఖి |
| | వనజముఖా | వనజముఖ |
| మీననేత్ర | మీననేత్రీ | మీననేత్రి* |
| | మీననేత్రా | మీననేత్ర |

౧వ విప 'ఆ-ఈ-ఊ' మున్నగు స్త్రీ ప్రత్యయములు సంస్కృత వ్యాకరణ ప్రసిద్ధములు 'ప్రాతిపదిక గ్రహణే లింగ విశిష్టస్యాపి గ్రహణమ్' అను న్యాయము చొప్పున స్త్రీత్వమున స్త్రీ ప్రత్యయాంత ప్రాతిపదికములనె గ్రహించి, యట్టి 'ఆ-ఈ-ఊ' అను దీర్ఘములను తత్స-౫౫వ సూత్రము చొప్పున హ్రస్వములు చేసి ప్రక్రియ నడపుట సంప్రదాయము కృత్తద్ధితాంతముల వలెనె యీ స్త్రీ ప్రత్యయాంతములను సంస్కృత వ్యాకరణమునుండియె గ్రహింపనగును అట్టి స్త్రీ ప్రత్యయములు దిఙ్మాత్రముగ నిటఁ గొన్ని వివరింపబడును (వ్యా-సం- ౧౦౫ I వి) అట్టి స్త్రీ ప్రత్యయములె (తత్స-౧౬వ సూ) వెనుకటి సూత్రపు వివరణమునఁ గొన్ని ప్రదర్శింపఁబడినవి వానిని మున్ముందు వివరించెదను

---

* పాణినీయము ననుసరించి సూరి ''మీననేత్రి-పద్మనేత్రి'' మున్నగునవి యసాధువులని తలంచుట సరికాదు ముగ్ధబోధ వ్యాకరణము ౨౬౫వ సూత్రపు వ్యాఖ్యలో 'నేత్ర' శబ్ద మంగాదులలోఁ బేర్కొనఁబడెను

## ఋదంతములు

స్వస్రాది భిన్నములగు 'ఋ' కారాంత శబ్దములు స్త్రీత్వమున 'ఈ' ప్రత్యయము నందును ౧౭

ఉదా కర్తృ-కర్త్రీ - కర్త్రి (చేయునది) జనయితృ - జనయిత్రీ-జనయిత్రి (తల్లి) 'స్వసృ' మున్నగు ఋకారాంతముల కిట్లు 'ఈ' ప్రత్యయము రాదు స్వస్రాదులు స్వసృ (స్వసా-స్వసారౌ-స్వసారః) - స్వస-(చెల్లెలు) ననాన్దృ-ననాన్దా - ననాంద (మగని తోఁబుట్టువు) దుహితృ-దుహితా దుహిత (కూఁతురు) యాతృ-యాతా-యాత (తోడికోడలు) మాతృ-మాతా-మాత (తల్లి) వీనికెల్ల-తత్స-౫౩ వ సూ-చొప్పున అత్వము వచ్చును

నకారాంతములకు స్త్రీత్వమున 'ఈ' ప్రత్యయ మగును ౧౮

ఉదా భాగ్యశాలిన్ — భాగ్యశాలినీ — భాగ్యశాలిని బుద్ధి శాలిన్-బుద్ధిశాలినీ - బుద్ధిశాలిని మొ

"ఉ-ఋ" అనునవి యిద్వర్ణముగాఁగల కృత్తద్ధిత ప్రత్యయాంతములు స్త్రీత్వమున 'ఈ' ప్రత్యయము నందును ౧౯

'మతు-వతు-వసు' మున్నగునవి 'ఉ' వర్ణ మిద్వర్ణముగాఁ గలవి ఉదా శ్రీమతీ శ్రీమతి గుణవతీ-గుణవతి విదుషీ - విదుషి 'శతృ' ప్రత్యయము ఋవర్ణేత్తు పచన్తీ - పచన్తి (వండుచున్నస్త్రీ)

## మఱికొన్ని స్త్రీప్రత్యయములు

అసంయోగోపధకములగు స్వాంగవాచకముల కుపసర్జనత్వమున (అన్య పదార్థ ప్రాధాన్యముఁ గల బహువ్రీహిని) స్త్రీత్వమున 'ఈ' ప్రత్యయము వైకల్పి

కముగా నగును ఈ ప్రత్యయము రానిపక్షమున '౯౩వ సూ' చొప్పున 'ఆ' ప్రత్యయము వచ్చును—౯౦

వనజముఖీ- వనజముఖి (పద్మమువంటి ముఖము గలది) వనజముఖా- వనజముఖ మీననేత్రీ - మీననేత్రి (చేపవలె సొగయగు కన్నులు గలది), మీననేత్రా-మీననేత్ర

అంగాది శబ్దములు సంయోగోపధకము లయ్యు నట్టి స్వాంగవాచకత్వమున నుపసర్జనత్వమున స్త్రీత్వమున 'ఈ' ప్రత్యయమును వైకల్పికముగా నందును. పక్షమున 'ఆ' ప్రత్యయము నందును (౯౩ వ సూ) ౯౧ (చూ సంజ్ఞా ౧౦వ సూ టిప్ప ఉపధ)

కృశాఙ్గీ - కృశాంగి కృశాఙ్గా - కృశాంగ (కృశించిన యంగములు గలది) "అంగ-ఆంత్ర (ప్రేవులు) - దంత-కంఠ-శృంగ (కొమ్ము)-కర్ణ-ఓష్ఠ (పెదవి) - పుచ్ఛ (తోక)-నేత్ర-గాత్ర (అవయవము) -జంఘ (పిక్క)" అనునవి యంగాదులు (చూ- ముగ్ధ-వ్యా ౨౬౫౨వ సూ-వ్యాఖ్య)

నాసి కోదర శబ్ద భిన్నములగు త్ర్యాద్యచ్చులుగల స్వాంగవాచకమున కుప సర్జనత్వమున స్త్రీత్వమున 'ఈ' ప్రత్యయము రాదు రానపుడు 'ఆ' ప్రత్యయమే వచ్చును (చూ ౯౩వ సూ) ౯౨

సుజఘనా-సుజఘన (లెస్సయిన నడుము గలది) నాసికోదర తుఙ్గ నాసికీ - తుంగనాసికి తుఙ్గనాసికా - తుంగనాసిక కృశోదరీ - కృశోదరి కృశో దరా-కృశోదర (కృశించిన 'ఉదరము' గల స్త్రీ).

అకారాంత ప్రాతిపదికములకును 'అజా'ది శబ్దములకును స్త్రీత్వమున 'ఆ' ప్రత్యయ మగును ౯౩

'అజా' దులకు జాతివాచకత్వాదులచే (తత్స-౧౦౨వ సూ) 'ఈ' ప్రత్య యము వచ్చును గాన నందుల కపవాదముగా 'ఆ' ప్రత్యయము దీనిచే విధింప బడెను

ఉదా ఖట్వా ఖట్వా - ఖట్వ (మంచము) , అజ - అజా - అజ (మేక), అశ్వ-అశ్వా -అశ్వ (ఆఁడు గుఱ్ఱము)

కొన్ని హలంతములకు స్త్రీత్వమున 'ఆ' ప్రత్యయ మగును ౯౪

ఉదా దిక్-దిశ్-దిశా దిశ, వాక్, వాచ్, వాచా-వాచ (వసు-౩వ ఆ- ౧౦౧)

'అన్' అనునది తుదిని గల బహువ్రీహికిని, 'మన్' అనునది తుదిని గల వానికిని (నకారాంతములయ్యు) 'ఈ' ప్రత్యయము రాదు వీనికి 'డా' ప్రత్యయము వైకల్పికముగ నగును ౯౫

ఇందలి 'డ' కార మిద్వర్ణము డకార మిత్తుగాఁ గలది పరమగు నపుడు ముందటి శబ్దపు తుదియచ్చు మొదలుకొన్న భాగము లోపించును ఉదా (సీమన్-సీమ్ + ఆ-సీమా) సీమ (సరిహద్దు) (సురాజన్ + ఆ - సురాజ్ + ఆ-సురాజా) సురాజ (మంచిరాజు గల భూమి) 'డా' రాని పక్షమున నవి నకారాంత స్త్రీలింగములుగనే నిల్చును ఉదా (సీమన్-సీమా) సీమ (సురాజన్ సురాజా) సురాజ

ఉపధాలోపము గల 'అన్' అనునది తుదిని గల శబ్దములకు స్త్రీత్వమున 'ఈ' ప్రత్యయ మగును ౯౬ (చూ ఉపధ సంజ్ఞా ౧౦ సూ-టిప్పణము)

ఉదా (సురాజ్ఞీ) సురాజ్ఞి ఉపధాలోపము లేనప్పుడు మీఁద సూత్రము చొప్పున 'సురాజ' అనియే యగును

ఉకారాంతములగు 'బహు' మున్నగు శబ్దములకు స్త్రీత్వమున 'ఈ' ప్రత్యయము విభాష నగును ౯౭ ఉదా బహ్వీ-బహ్వి బహుః - బహువు మొ

'క్తిన్' ప్రత్యయభిన్నమగు కృదంతేకారమునకు 'ఈ' ప్రత్యయము వైకల్పికముగా నగు ౯౮

రాత్రిః-రాత్రీ - రాత్రి క్తిన్నంతములకు కృతి (కార్య), వసతి (స్థానము)-వీనికి 'ఈ' ప్రత్యయము రాదు

పురుషవాచకమునకుఁదదీయ భార్య యర్థ మగునపుడు 'ఈ' ప్రత్యయ మగును ౯౯

ఉదా గోపీ-గోపి (గోపుని భార్య) ఇంకను విశేషములు గలవు ఉపాధ్యాయుని భార్య-ఉపాధ్యాయాని మాతులుని భార్య మాతులాని ఇంద్రునిభార్య-ఇంద్రాణి,యౌవ్వనముగల స్త్రీ-యువతి అంతర్వత్నీ-అంతర్వత్ని-గర్భిణిస్త్రీ మొ

'ష' కారము టకారము నిద్వర్ణముగాఁగల ప్రత్యయముతోఁ గూడిన శబ్దములకు స్త్రీత్వమున 'ఈ' ప్రత్యయమగును ౧౦౦

ఉదా షిత్తు నర్తకీ-నర్తకి (నాట్యముచేయు స్త్రీ) ఇది నృత్ ధాతువు మీఁద 'ష్టుల్' ప్రత్యయము నిల్చునది - టిత్తు (పఞ్చమీ) - పంచమీ (అయిదవది) ఇది 'పఞ్చన్' శబ్దము యొక్క పూరణార్థక 'మట్' ప్రత్యయాంత రూపము టకారమిత్తు తద్ధితాంతము

'గౌర' మొదలగు శబ్దములకుస్త్రీత్వమున 'ఈ' ప్రత్యయమగును ౧౦౧

ఉదా గౌర-గౌరీ-గౌరి, నద-నదీ-నది మొ

జాతి వాచకములగు 'అ' కారాంతములకు స్త్రీత్వమున 'ఈ' ప్రత్యయ మగును ౧౦౨

ఉదా మృగ-మృగీ - మృగి(ఆఁడు లేడి) హంస - హంసీ-హంసి(ఆఁడు హంస) నిత్య స్త్రీ లింగముల కిదిరాదు బలాకా బలాక (ఆఁడు కొంగ) యకారోపధక శబ్దములకు రాదు క్షత్రియా - క్షత్రియ (రాజస్త్రీ)

## మహతీతర స్త్రీలింగ విశేషణములు

ఉకారాంత గుణ వాచకములకు స్త్రీత్వమున 'ఈ' ప్రత్యయము విభాష నగును ౧౦౩

ఉదా మృదు-మృద్వీ-మృద్వి-మృదువు యకారోపధకము కానట్టి 'ఉ' కారాంత మనుష్య జాతి వాచికి స్త్రీత్వమున 'ఊ' ప్రత్యయ మగును ౧౦౪

ఉదా కురూః-కురువు - కురుదేశ రాజస్త్రీ మనుష్యేతర జాతికిరాదు ధేనుః-ధేనువు (ఆవు) యకారోపధకమునకు రాదు అధ్వర్యుః-అధ్వర్యువు (అధ్వర్యు శాఖాధ్యాయిని యగు స్త్రీ)

రజ్జు ప్రభృతి శబ్ద భిన్నములగు నప్రాణిజాతి వాచకములయిన 'ఉ' కారాంతములకు స్త్రీత్వమున 'ఊ' ప్రత్యయమగును ౧౦౫

ఉదా కర్కన్ధూః-కర్కంధువు (రేగు) రజ్జ్వాదులకు 'ఊ' ప్రత్యయము రాదు రజ్జుః-రజ్జువు (త్రాడు)

మహతీతరంబులగు స్త్రీలింగంబుల విశేషణంబులకుఁ గ్లీబత్వంబు ఎచ్చ నగు ౧౦౬ (బా-తత్స-౧౬౮ సూ, వ్యా-సం-౧౬౬ III, IV వి)

పద్మలత మనోహారి-పద్మలత మనోహారిణి హృద్యంబగు విద్య-హృద్య యగు విద్య మొదవులలోఁ గపిల వరిష్ఠంబు-కపిల వరిష్ఠ

౧ వ వివ సంస్కృత విశేషణము విశేష్య లింగకమె కావలసియుండ నపుంసకత్వమును గల్గు నని దీనిచేతఁ బాక్షికముగా విధింపఁబడెను ఉదా గోవు పవిత్రంబు (అను ౩వ ఆ-౨౧వ ప) గోవు పవిత్ర

౨ వ వివ పాల్కురికి సోమనారాధ్యుఁడు మహతీ వాచక విశేషణము నకును నిట్టి క్లీబత్వమును బ్రయోగించెను ఉదా ద్విపద వనిత యపూర్వ లాంఛనధారి గాఁగ (బసవ ౩వ ఆ-౨౨౭)

భవచ్ఛత్రాదుల కిందుఁ బ్రయోగంబు లేదు ౧౦౭ (బా-తత్స-౧౬౭, వ్యా-సం-౧౬౭ I విష)

# భవచ్ఛత్రాదులు

౧ వ వివ 'భవత్' అనునది (భవాన్-భవన్తౌ-భవన్తః-ప్రథ-నీవు) మున్నగు శబ్దములకును, 'శతృ' ప్రత్యయాంతాదులకును నాంధ్ర విభక్తియోగము లేదు 1 "మహత్" (మహాన్-మహన్తౌ-మహన్తః-గొప్ప) "పథిన్" (పన్థాః) దారి, మథిన్ (మన్థాః) కవ్వము, ఋభుక్షిన్ (ఋభుక్షాః)-ఇంద్రుఁడు" అను వానికిఁ దెల్గువిభక్తి యోగములేదు యుష్మద్ (త్వమ్-యువామ్-యూయమ్-ప్రథ-నీవు) అస్మద్ (అహమ్-ఆవామ్-వయమ్-ప్రథ-నేను) త్వద్ (నీవు)-మద్ (నేను) - తద్ (ఆ) - యద్ (ఏ) - ఇదమ్ (ఈ) - అదస్ (ఈ)" అనునవి మొదలగు సర్వనామములకును దెల్గువిభక్తుల యోగము లేదు రేఫాంతములకు గీర్ (వాక్యము), ధూర్ (భారము), చతుర్ (నాలుగు, చూ-తత్స ౬౯వ సూ) అను రేఫాంతములకును, దశావర సంఖ్యావాచకములగు పఞ్చన్ మొదలగు వానికిని దెల్గు విభక్తుల యోగము లేదు ఇవెల్ల సమాస పూర్వావయవములై తెల్గున వాడఁబడ నగును భవద్గుణములు (నీ గుణములు), త్వదాశ్రయము (నీ యాశ్రయము), మత్పుణ్యము (నా పుణ్యము), ధూర్వహము (భారమును వహించునది) మొ "మహత్తణఁగి-మహత్+అణఁగి" అని పదచ్ఛేదము (బసవ ౬వ ఆ- ౭౪౬) 'మహత్తు' (గొప్పది) అనునది వ్యావహారిక శబ్దము 'మహత్తు' అనునది సంజ్ఞావాచి గ్రాంథికమె 'అణువు మహదాదులకును దా నతిమహత్తు' (ఉ-హరి ౧వ ఆ-౩౨౨) ఇట్లె 'కిత్తు-టిత్తు-జిత్తు-ఋత్తు-ఇత్తు' మున్నగు సంజ్ఞావాచులు గ్రాంథికములె 2 శతృ ప్రత్యయాంతాదులు భవత్ (భవన్-భవన్తౌ భవన్తః-అగుచున్న), పచత్ (పచన్-పచన్తౌ-పచన్తః-వండుచున్న), లసత్ (లసన్-లసన్తౌ-లసన్తః-ఒప్పుచున్న - ఇవి వర్తమాన శతంత్రములు) ఇవియు సమాస పూర్వావయవములై ప్రయోగింపఁబడును లసద్రూపము-భవిష్యత్కాలము ఇందలి 'భవిష్యత్'(భవిష్యన్-భవిష్యన్తౌ-భవిష్యన్తః-కానున్న) అనునది భావి శతృ ప్రత్యయాంతము

౨వ వివ పైని వ్రాసినవి తద్ధిత ప్రత్యయాంతము లగునపుడును దెల్గు విభక్తుల నొందును ఉదా చతుర్-చతుష్కము (నాలుగు) పఞ్చన్-పంచకము (అయిదు) షట్-షట్కము (ఆఱు) సప్తన్-సప్తకము (ఏడు)

అష్టన్-అష్టకము (ఎనిమిది) నవన్-నవకము (తొమ్మిది) దశన్-దశకము (పది), పఞ్చ-పంచమము (అయిదవది), అదస్-అదసీయము (దీని సంబంధి) మొదలగునవి

ఇది తత్సమ పరిచ్ఛేదము



# బాలవ్యాకరణోద్ద్యోతము

## ఆచ్ఛిక పరిచ్ఛేదము

సంస్కృత సమేతరంబైన యీ భాష యచ్ఛ యనంబడు ౧ (బా-ఆచ్ఛి-౧. వ్యా-సం-౧౮౦ I విష)

అచ్ఛ యనఁగా నచ్ఛ తెనుఁగు సంస్కృతసమము తప్పఁ దక్కిన "ప్రాకృత సమము (అగ్గి-సిరి, చూ-సంజ్ఞా ౨౦వ సూ), సంస్కృతభవము (చందురుఁడు-సంద్రము చూ-సంజ్ఞా ౨౧వ సూ), ప్రాకృతభవము (లచ్చి-జన్నము-చూ-సంజ్ఞా ౨౧వ సూ), దేశ్యము (మేడ-పాయిదా-రైలు, చూ-సంజ్ఞా ౨౨వ సూ)" అనున వెల్ల నాచ్ఛికములె

ఆచ్ఛిక భాషయందుఁ బారిభాషిక లింగము లెదు

స్త్రీలింగ సమములును నపుంసకలింగ సమములును నరుదుగఁ బుంలింగ సమములును నై యుండును ౨ (బా-ఆచ్ఛి-౨, వ్యా-సం-౧౮౯ I విష)

స్త్రీలింగ సమము లనఁగాఁ బ్రథమైక వచన తోపాదికము గలవి ఉదా తండ్రి-తల్లి-అన్న-చెఱువు-చావు-పూవు* - వదినె-జేజే-నవలా-మత్తో మొ నపుంసక లింగ సమము లనఁగాఁ బ్రథమైక వచనమున 'ము-మ్ము-ంబు' అను వానిలో నేదేని నిల్చు శబ్దములు ఉదా సున్నము-సన్నము-బియ్యము-నెయ్యము (స్నేహము)-పున్నెము-గాము (గ్రహము)-వేము (వేఁపచెట్టు)-ప్రేమము-గీము (గృహము)-ఇనుము మొ పుంలింగ సమము లనఁగాఁ బ్రథమైక వచనమున 'డుజ్జు' నిల్చు శబ్దములు ఉదా కొమరుఁడు(కొమర)-చందురుఁడు(చందుర)-జముఁడు (యమ, తద్భ-జమ)-మరుడు(మర-స్మర-ప్రకృ)-తమ్ముడు (తమ్మ)-అల్లుడు (అల్ల) -బల్లిదుఁడు (బల్లిద)-మగఁడు (మగ)-సాలీడు-ఱేఁడు (ఱే) మొ 'కొమరుఁడు' మున్నగునవి మహత్తులును, బుంలింగ సమములును గాన 'రాముఁడు' మున్నగువానికి వలెనె 'ఉత్వ-డుజ్జు'లు వచ్చినవి ''అచ్చి-౺వ సూత్రపు'' నిషేధముచే 'మగఁడు' మున్నగువాని కుత్వము లేదు

కొన్ని స్త్రీ సమములు పుంలింగ సమములు నగును ఉదా ముదుకఁడు-ముదుక గొల్లఁడు-గొల్ల మొ

కొన్ని స్త్రీ సమములును నపుంసక సమములును నగును ఉదా ఏవ-ఏవము మోస-మోసము మొదలగునవి

## బల్లిదాదులు

బల్లిదాదులు సంస్కృత తుల్యంబులు ఇవి ''తత్స-౧౬వ సూ ౪వ వివృతి'' చొప్పున మహద్విశేషణము లగునపుడు పుంలింగ తుల్యములును, నమహద్విశేషణము లగునపుడు నపుంసలింగ సమములును, మహతీ విశేషణము లగునపు డాలు శబ్దముతో సమసించునవియు (సంధి ౨౬వ సూ) నగును ౩ (బా-అచ్చి-౩వ సూ-వ్యా-సం-౧౯౦ I విష)

---

* అహోబలపత్యాదులు వ్రాసినట్లు 'చెఱువు' మున్నగునవి 'వు' అను ప్రథమైకవచనము గలవి కావు అవి స్త్రీలింగ సమములు కావుననె వానికి 'చెఱుఉ' మున్నగు లుప్త 'వు' వర్ణక రూపాన్తరములు లేవు

సంస్కృత తుల్యత్వాతిదేశమున్నను "శ్రీరామ దేవత బల్లిద" అని కాని, 'బల్లిదురాలు' అని కాని కానేరదు 'శ్రీరామదేవత బల్లిదుఁడు' అనియె యగును 'కళత్రము బల్లిదురాలు' అనియే యగును, గాని "కళత్రము బల్లిదము" అని కాని 'బల్లిద' అని కాని కానేరదు [1] బల్లిదాదులు బల్లిద (బలిష్ఠ), అక్కజ (అక్షయ, అధిక), కావల (దుర్మద), బెట్టిద (ఉద్ధత), మిసిమింత (అలసిన) మొక్కల (ముష్కర), ప్రల్లద (దుష్ట), నెయ్య (మిత్ర), ఒడయ (అధిప) ఇత్యాదులు వీనిలోఁ గొన్నిటికి నపుంసక సమ రూపములు కన్పట్టవు 'మిసిమింతము, ఒడయము' అను ప్రయోగములు లేవు బల్లిదాదులు సంస్కృత తుల్యము లనుచు 'బల్లిద' అని సంబోధన రూపమును ప్రయోగింపరాదు 'బల్లిదుఁడ' అనియే యనవలయును "బల్లిదున్ రామున్" అను డుమంత రూపము ండును

## మగాదులు

మహత్తులగు మగాదులకు నేకార్థకాద్యమహత్తులకును 'డుజ్ఞు' అగు, ఉత్వంబు గాదు ౪ (బా-అచ్చి-౪ వ్యా-సం-౧౬౧ విష)

మగఁడు-ఒకఁడు (ఒక పురుషుడు) మొ ఏకార్థకాద్యమహత్తులు ఒకఁడు (ఒకటి)-కత్తళఁడు (అశ్వము పేరు)-పులియఁడు (ఒక కుక్క పేరు) మగాదులు మగ-ఒక-మనుమ-రాయ-పాప (బాలుడు) మున్నగునవి [2] ఇది

---

1 సూరిగారి సంస్కృత తుల్యత్వాతిదేశ మాత్రమున నిట్టి యర్థము లభింపనేరదు కొన్ని యనర్థములును సంభవించును కాన వలసిన యర్థము సూత్రమందే చేర్పఁబడెను

2 వ్రేఁడు(గొల్లడు)-ఱేఁడు (రాజు), 'ఈ' ప్రత్యయాంతములు (సాలీఁడు-సాలెపురుగు), 'కా' ప్రత్యయాంతములు (విలుకాఁడు) మున్నగువానిని "మగా"దులలోఁ జేర్పనక్కఱలేదు పుంలింగ సమత్వముచేతనే వానికి 'డుజ్ఞు' లభించును ఉత్త్వమునకుఁ బ్రసక్తియే లేదు 'కొమ్ము కాఁడు-సాలీఁడు' మున్నగునవి పుంలింగ సమము లయినను మహద్వాచకములు కావు కాన 'డుజ్ఞు' ప్రాప్తికయి యేకాద్యమహత్తులలోఁ జేర్పఁబడెను,

యాకృతి గణము ఏకార్థకా ద్యమహత్తులు ఒక (ఒక వస్తువు), కత్తెళ (తెల్లని గొరిజయుఁ దోఁకయుఁ గల నల్లని యశ్వము, శ-ర), కయిర (ఒక యశ్వము పేరు), పులియ (ఒక కుక్క పేరు), కొమ్మికా(ఁడు)-అడవిపంది సాలీ(ఁడు)-సాలెపురుగు మొ ఇదియు నాకృతి గణమె 'మహత్తులగు' అనుట చేత "మనుమరాలు-పాప (బాలిక)" మున్నగువానికి 'డుజ్జు' రాదు 'రాయుఁడు అని 'ఉ' త్వమును జేయరాదు 'కృష్ణరాయుఁడు' అను రీతిని సమాసమునం దుత్వమగును కాననే 'కృష్ణరాయ' అను సంబోధనము సిద్ధించును

పగతాదుల బహువచన లకారంబునకు రేఫంబగు ౫
(బా-అచ్చి-౫, వ్యా-సం-౧౯౨ I విష)

బహువచన 'లు-ల' లకు 'రు-ర' లగునని యర్థము పగతురు-అల్లురు-నెయ్యురు-కాల్వురు-బలియురు-మార్తురు మొ ఇది యాకృతి గణము ఇవి మహత్తులును బుంలింగ సమములును గాన వీనికి 'ఉత్వ-డుజ్జులు' వచ్చును పగఁతుఁడు మొ ఇయ్యది నిత్యవిధిగాన 'పగతుల-జగతుండ్రు-అల్లుళ్ళు-అల్లుండ్రు మున్నగు రూపములు సాధువులు కావు "నెయ్యుఁడు-నెయ్యురు-నెయ్యురాలు-నెయ్యము" అను రూపములు గలవు గాన నీశబ్దము బల్లిదాదులలో నిదియుఁ గా వచ్చును 'మల్లురు' అనునది సంస్కృత సమము (చూ-తత్స ౩౯ వ సూ)

## రు-ర-లు-'ండ్రు' అనునవియు వచ్చుట

బహువచన 'లు-ల' లలో 'రు-ర' లును, వానికి ముందు పూర్ణబిందు పూర్వక 'డు' వర్ణంబును గొన్నిట నిత్యముగాను, గొన్నిట వికల్పముగాను నిల్చును ౬ * (వ్యా-సం-౧౯౨ II విష)

---

* సూరి యిట్లు సూత్రించి దీనిని నిత్యవిధిగాఁ దలంచెను "గండండ్రు-మిండండ్రు" అని మాత్ర ముదాహరించెను "మిండలయ్యేడన్" (కవిక), సీ నంకూబరాదులు ననుపు మిండలు(కాశీ,గాణ-అచ్చి-౬వ పద్య-౨౩౯వ కారి)

ఒకరు-ఒకండురు ఉల్లోపము - ఒకంఁడ్రు పదురు-పండురు - పంఁడ్రు వారు-వాండురు-వాంఁడ్రు ఇట్టివి వైకల్పిక స్థలములు నిత్య ఎనమండురు - ఎనమంఁడ్రు తొమ్మండురు - తొమ్మంఁడ్రు అహోబలపత్యాదులు 'ఎల్లంఁడ్రు-అల్లుంఁడ్రు' అని యుదాహరించిరి ఇవి నిరాధారములు 'ఎల్లరు నంత మేలుకొని' (రామా-౨ వ ఆ ౧౦౭) 'అల్లరు' పగతాదులలోనిది.

## విలుకాండురు - విలుకాంఁడ్రు - విలుకాఁడు

'కా' ప్రత్యయంబు మీఁది బహువచన 'ల' కారంబునకు లఘ్వలఘు రేఫంబులును, లఘురేఫంబునకు ముందు పూర్ణబిందుపూర్వక 'డు' వర్ణంబు నగు ౭ * (బా-ఆచ్ఛి-౩, వ్యా-సం-౧౯౪ విష)

విలుకాండురు - ఉల్లోపము - విలుకాంఁడ్రు (ఆచ్ఛి-౧౨ వ సూ)- విలుకాఁడు వేడుకకాండురు - వేడుకకాంఁడ్రు - వేడుకకాఁడు ''నిత్యం లులౌ రురౌ స్యాతా। ముల్లోపో బహుతా డుజామ్" అని యిట్లథర్వణాచార్యుఁడు 'డుజ్జు' నే విధించెను కం ఆడెడు వారల కిమ్చను। । వేడుక కాండురకు నిచ్చు...(విక్ర-౨ వ ఆ) ఇట్టి యెడల ప్రౌఢవ్యాకర్త 'వేడుక కాంఁడ్రురకు' (అపశబ్దము, ప్రౌఢ-శబ్ద ౪౮) అను రూపము నంగీకరించి సమర్థించెను 'వేడుకకాంఁడ్రురు', 'వేడుకకాంఁడ్రురకు' అపశబ్దములు అహోబలపతి "అపి సంయుక్త సమాప్తో। భూయోఽన్తే 'లు'ః ప్రదృశ్యతే నామ్నామ్'' అను చింతామణీ సూత్రములోని 'లు' అనునది 'రు' అనుదాని కుపలక్షణ మనుచు(చూ ఆచ్ఛి-౧౭ వ సూ) 'రు' అను పునరుక్త బహువచనమును సాధించెను ముఖ్యార్థ బాధ లేనిదే (మహాకవి ప్రయోగరూప) లక్షణకుఁ బ్రసక్తి యేమున్నది॰ ప్రామాణికులు పునరుక్త బహువచన 'లు' ప్రత్యయమును వచించిరి కాని యట్టి 'రు' ప్రత్యయము నెవ్వరును జెప్పలేదు

---

* సూరి పూర్ణబిందు పూర్వక 'డ' కారంబు నిట్లు విధించుచు "అండురు అసాధువు, 'అంఁడ్రురు' సాధువు" అని తలంచెను "విలుకాండురు అసాధువు, విలుకాంఁడ్రురు సాధువు'' అని తలంచెను, ఇది సరికాదు (చూ-ఆచ్ఛి-౧౧)

తే[1] శబ్దపు బహువచనమునకు ముందు డుజ్జగు ౮ (బా-ఆచ్చిక-సూ, వ్యా-సం-౧౯౫ వి) తేఁడులు (తత్స-౧౯ ఖండము మాత్రము) ఉల్లోపము (ఆచ్చి ౧౨ వ సూ) తేఁడ్లు (ఆచ్చి ౧౫ వ సూ)

## కూఁతులు - కూఁతురులు

కూఁతు శబ్దమున కేకవచన బహువచనములు పరమగునపుడు[2] 'రు' వర్ణకము వైకల్పికముగ నగు ప్రథమేత రైకవచన పరకత్వమున రు వర్ణోత్వమిత్వమొందును ౬ (బా-ఆచ్చి ౬, వ్యా-సం-౧౯౨ విష, ౧౯౬-౧౯౬ I విష )

కూఁతు—కూఁతురు కూఁతులు—కూఁతురులు — కూఁతుఖ్ను కూఁతును-కూఁతురిని మొ

౧ వ వివ "ఏకత్వే చ భవేద్వారు। స్తథా లౌ చ భవేత్ క్వచిత్ (వ్యా-సం-౧౯౨-౧౯౬ విష ),"తయో శ్శసాదౌ రేమాత్ర । ఉదతోః ప్రాయ శోఽత్ర ఇత్" (వ్యా-సం-౧౯౬ విష) అని యధర్వణాచార్యులు వచించిరి. "పరఁగఁ గూఁతురు శబ్దంబుపై రుకార। మొక్క పలుకునఁ బైనైన నుండుఁ బాయుఁ। బెక్కు పలుకులపై నైనఁ దక్కిపోవు" (కావ్యాలం ౬ వ ఉల్లా ౧౧౧వ ప)

౨ వ వివ ప్రయోగ నాకూఁతురి నటె (ఉ హరి ౫ వ ఆ ౨౧౭) కూ। తురి చెలువంపుతేని (బహుళా-౧ వ ఆ ౮) ప్రథమా బహువచనమున 'రు' వచ్చుట కథర్వణుఁడె యంగీకరించెను కవులు ద్వితీయాది బహువచనము

---

1 తే ప్రభృతులనుటకు (సూరి) మఱొక్క శబ్దము నేని యుదాహరింపలేదు

2 సూరి సూత్రమును, వివరణమును బ్రయోగవిరుద్ధము లగుటచే వానిని విడిచి యథా ప్రయోగముగ రచింపఁబడెను,

లందును బ్రయోగించిరి కూఁతురులన్ (రామాభ్యు-౪ వ ఆ-౯౬ వ ప-సూ-రా-ని) రాచకూఁతురుల గాలికి (చంపూ-రా-౨ వ ఆ ఆం-భా-అ-ప్రయోగ విశేష ప్రక ౧౮ వ సూ) 'కూఁతురులు' శబ్దమునుండి 'కూఁతుర్లు-కూఁతుళ్ళు' అని యేర్పడుట వింతకాదు

౩ వ విభ · ప్రాణివాచకము లౌప విభక్తికములు కానేరవు కావున 'కూఁతురిచే' అనుచోటి 'ఇ'త్వ మౌప విభక్తిక సంబంధి కాదు తృతీయాసప్తమ్యేకవచనములందు 'కూఁతురన్' అనుప్రయోగమును లేదు (చూ-ఆచ్ఛి-౧౦వ, ౫౧-౮౦ సూ) 1

'పగఱు-చూపఱు' శబ్దములందు బహువచన 'ల' కారమునకు నిత్యముగా 'ఱ' కార మాదేశ మగును ౧౦(బా-ఆచ్ఛి-౧౦వ సూ, వ్యా-సం-౧౯౭ విష) 2

పగఱు (పగవారు)-పగఱను చూపఱు (చూచువారు)-చూపఱన(చూపరి అందమైనవాఁడు)

౧ వ విభ కం కఱకంట వరము నాకుఁ బ । గఱఁ బరిమార్ప(సౌప్తి-౧ వ ఆ-౧౨౦) కం పఱపెడు వాలమ్ములు చూ । పఱను (కర్ణ-౩ వా ఆ-౨౭౮) కం కొఱవియుఁ గొఱవియు చూ । పఱు (భీష్మ-౧వ ఆ-౨౮౮) "చూపఱుం చూడ్కికి" (కళా-౫వ ఆ-౭౬) అనియు నగపడుచున్నది (చూ-ఆచ్ఛి-౧౭ వ సూ)

## 'ఆంధ్రుడురు' అపశబ్దము - 'ఆండురు' సుశబ్దము

ఆల్వాదుల బహువచన లకారంబునకు రేఫంబును ముందటి 'లు' వర్ణంబు

---

1 సూరి యీ 'ఇ' త్వమును సంగ్రహింపనే లేదు

2 సూరి 'పగఱు-చూపఱు' శబ్దములను వచింపలేదు అతఁడు సూత్రించిన 'చైవులు' శబ్దమునకు మహాకవి ప్రయోగము లేదు

నకు బిందుపూర్వ 'డు' * వర్ణంబు నగు ద్వితీయాద్యేకవచన పరకత్వమున వీని తుది 'ఉ' కారము 'ఇ' కార మగును ౧౧ (బా-అచ్చి-౧౧, వ్యా-సం-౧౯౮ I వి)

అండురు (ఉల్లోప-అచ్చి ౧౭వ సూ)-అంౘ్రడు అండురను-అంౘ్రడను-

అలిని అల్వాదులు అలు - చెల్లెలు - కోడలు - మఱఁదలు - ఇవి యాల్వాదులు

అల్వాదులు ప్రాణివాచకములు గాన వీనిలోని 'ఇ'త్వ మౌపవిభక్తిక సంబంధి కాదు (చూ-అచ్చి ౭౧వ సూ) 'అలన్' అని తృతీయా సప్త మ్యేక వచన ప్రయోగమును లేదు (అచ్చి ౮౦వ సూ, చూ-అచ్చి-౯వ సూ) ఆ వె ఏను బంధువ్యక్తులకు నాలితనముతో (రాఘ-౭ వ ఆ ౮౩) అలితనము-భార్యాత్వము-భార్యతా నాలితనము-కొంచెపుందనము-రామాయ ఉ కొంకక తోడఁబుట్టువులు కూరిమి చెలెలి కిచ్చి రిద్దఱున్(శృం-నై-౭వ ఆ-౧౧) క ఏలిన వానిని దైవము। నాలిని (ఉద్యో ౨వ ఆ ౩౩వ ప) దీనిని సూరి సంగ్రహింపనే లేదు

---

* సూరి 'అండురు' అను రూపమును సాధింపనే లేదు 'అండురు' అనునది తాళపత్ర మాతృకలలో నున్నది "సలలో ర్బిందుయుతో డు ర్వా లుల యోః । నిత్యం దా గాదేశ్చ స్యా । ల్లో ర్లు లయో రురౌ చ తత్ర స్థః'' అని 'డు' వర్ణమే చింతామణిలో విధింపఁబడెను సూరి 'డ'కారమును విధించుట నిర్మూలము కం 'ఇక్కురువరు నాండురలో'అను రీతిగల యీ ప్రయోగములను 'ఇక్కురువరు నాంౘ్రడురలో' అను నపశబ్దముతో నింపి యీ పక్షమువారు సమర్థించుచున్నారు (చూ-అచ్చి-౧౫వ సూ) "అపి సంయుక్త సమాప్తో భూయోఽన్తే లుః ప్రదృశ్యతే నామ్నామ్'' అని పునరుక్త బహువచనము 'లు' అనునదే కాని 'రు' కాదు అహోబలపతి 'రు' అనుదానికి 'లు' ఉపలక్షణ మనుట సరికాదు కవి ప్రయోగరూపముఖ్యార్థబాధ లేనిదే లక్షణాప్రసక్తియె లేదు మఱియు "అపి సంయుక్త సమాప్తో భూయోఽన్తే లుః ప్రదృశ్యతే నామ్నామ్" అను చొప్పున "అంౘ్రడురలో'' మున్నగువానియందు సంయుక్తసమాప్తత యెట్లు కుదురును ? భూయశ్శబ్ద ప్రయోజన మేమి ?

# 'ళు' తప్పు - 'లు' సాధువు

బహువచనము పరంబగునపుడు 'డ-ల-ట-ర' ల 'ఉ' త్త్వంబునకు లోపంబు బహుళంబుగ నగు ౧౨ (బా-అచ్చి-౧౨, వ్యా-సం-౧౮ I II విష)

గుండ్లు-గుండులు గిండ్లు - గిండులు, కాల్లు (కాళ్ళు) - కాలులు [1] మొసల్లు (ళ్ళు)- మొసలులు (అచ్చి-౧౪వ సూ), గొంట్లు-గొంటులు తుంట్లు-తుంటులు గోర్లు-గోరులు సీవిర్లు-సీవిరులు (వింజామరలు) బహుళ గ్రహణ ముచేత పిల్లులు, పులు లిత్యాదులందు లోపంబు లేదు [2]

సూరి యీ విధి తత్సమములందును వర్తిల్లు ననుట పొరపాటు [3]

---

1 'కాళ్ళు' మున్నగు రీతి నపభ్రష్టముగా నిట్లు ద్రావిడ 'ళ' కారము వాడుక కెక్కినది ఇట్టియెడల 'కాల్లు' అని యలఘు లకారము లుండవలయును దంత్యమగు లకారముయొక్క యలఘూచ్చారణము ద్రావిడ ళకారమునకుఁ గొంత సన్నిహితమగుటచే నది వాడుక కెక్కినది అలఘు లకార లిపి 'ల' అను నది ''దన్త్య చజౌ గురురలౌ చ బిన్దుయుతౌ'' (ఆం-చిం-వ్యా-సం-౨౯ II విష) సూరి యీ సందర్భమున నెల్ల 'ళ' అని (చూ-అచ్చి-౧౪) వ్రాయును

2 సూరి 'పిల్లులు' అను దానితో పాటు 'విల్లులు' అనియు వ్రాసెను ఇది సరికాదు విల్లు(ళ్ళు) అని యుండనగును ''సలోలోశ్చ'' అని లవర్ణ సహిత 'లు' వర్ణమునకు నుల్లోపమును జింతామణి విధించుచున్నది ఈ చింతామణి సూత్రమునకు 'అంబళ్గాచి' అనునది లక్ష్యమని యహోబలపతి వ్రాయుట పొరపాటు 'విల్లు (ళ్ళు)'-'ముల్లు (ళ్ళు)' అను రీతివె లక్ష్యములు

3 సూరి 'కోట్లు' మున్నగు తత్సమములందును వర్తిల్లునని వ్రాయుట సరికాదు "సుర పితృ కోట్లుం పూర్వా! ." అను పాఠము సరికాదు "సుర పితృకోటులు పూర్వా! " (శాంతి ౨౫ ఆ ౨౩) అనునది కవి ప్రయుక్త మనందగును సూరి వ్రాసిన 'పిప్పళ్ళు' అనునది వ్యావహారికము 'దృష్ట్లు' అను దానిని ముద్రిణ సంస్కర్తలు భారతమున నింపిరి అట్టిచోట 'దృష్టి' అని మాత్రమె గ్రహింపవలయును

౧వ వివ  ద్విరుక్త 'డ ల ట' లందును పి 'ఉ' ల్లోపము గల్గును కాని హలంతర సంయుక్తమగు ద్విత్వములో నొకటి లోపించును ఉదా తెడ్డు-తెడ్డులు (తెడ్డ్లు)-తెడ్లు చెట్టు-చెట్టులు (చెట్ట్లు)-చెట్లు విల్లు - విల్లులు (విల్ల్లు)-విల్లు(ళ్ళు)-విండులు విండ్లు (అచ్చి ౧౬వ సూ) ముల్లు-ముల్లులు-(ముల్లు, ళ్ళు) ముల్లు (ళ్ళు) ముండులు-ముండ్లు (అచ్చి-౧౬వ సూ)

౨ వ వివ  సూత్రమునందలి 'ర' అనునది కొన్ని యలఘు అకారములకును నుపలక్షణము ఉదా నూఱు-నూఱులు-నూర్లు 'ఏఱు-ఏఱులు-ఏర్లు, సీ అలయ నాది ప్రవాహములైన యేర్ల వంకలు దిద్దుచే వివేకంబు కలిమి (నరస-౫వ ఆ ౧౭౩)

## 'త్రాళులు' మున్నగునవి యపశబ్దములు

బహువచన శ్లిష్టమగునపుడే (ఉల్లోపముచేత) రేఫమునకుఁ గొన్ని యెడల నలఘు లకారాదేశ మగును ౧౩ (బా-అచ్చి--౧౩, వ్యా-సం-౨౦౦ వి) *

---

* సూరి "బహువచనము పరమగునపు డసంయుక్తంబులయి యుదంతంబులయిన 'డ-ల-ర'ల కలఘు ళకారంబు బహుళంబుగా నగు" (బా-అచ్చి-౧౩వ సూ) అని సూత్రించి "త్రాళులు-మొగిళులు-ఊళులు" మున్నగువాని నుదాహరించెను 'ళ' అను ద్రావిడ శకార మెట్లును తప్పే! 'ల' అని వ్రాయవలెను అది యట్లుండఁగా- "త్రాలు(ళు)లు-మొగిలు(ళు)లు = ఊలు(ళు)లు"అను రూపములును నిర్మూలములు అట్టి చోటుల నలఘు'ల'కారమును నిర్వహించు ప్రామాణిక (ప్రాసాది గత) ప్రయోగము లేదు అట్టి యలఘు లకారమును ప్రామాణిక వైయాకరణు లెవ్వరును సాధింపలేదు మీఁదు మిక్కిలి నన్నయ సూత్ర మిందులకు విపరీతము బహువచన లకార సంయుక్త రేఫమునకె నన్నయ యలఘు లకారము నాదేశించెను అధర్వణుఁడును నుత్వలోపమందే యలఘు లకారము వచించెను (వ్యా-సం-౧౯౯ విప)

## ఊర్లు,-ఊళ్లు-గోర్లు, గోళ్లు

ఊరులు—ఊర్లు- ఊళ్లు (ళ్ళు) గోరులు—గోర్లు—గోల్లు(ళ్ళు)* కొన్ని యెడల ననుటచేత "తేరులు—తేర్లు,రెండుసారులు—రెండుసార్లు'' మున్నగు చోటు లందు నలఘు లకారాదేశము లేదు

౧ వ వివ మఱికొన్ని యలఘు లకారాదేశ స్థలములు పేర్లు—పేల్లు(ళ్ళు) పందిర్లు—పందిల్లు (ళ్ళు), వెదుర్లు—వెదుల్లు (ళ్ళు) మఱి కొన్ని యలఘు లకారా దేశము రాని స్థలములు దారు-దార్లు (మార్గములు) ఆఱు—ఆర్లు నూఱు— నూర్లు ఏఱు—ఏర్లు

౨ వ వివ 'ఏళ్ళ నీళ్ళను నొండె', "వేన్నీళ్లనొండె" అను పాఠము సరికాదు 'ఏర్ల నీల్ల(ళ్ళ)ను నొండె వేన్నీర్ల నొండె' (మార్యం ౩వ ఆ) ప్రౌఢ-సంధి ౧౨ వ సూ) అని కవి ప్రయుక్తపాఠము

## లాదేశము

బహు వచన శ్లిష్టంబులైన 'డ' కార 'ల' కారంబుల కలఘు లకారంబు నిత్యంబుగ నగును అలఘు లకార పూర్వక(అవ్యవహిత పూర్వక, సంయుక్త) లఘు లకార మలఘు లకారంబగు ౧౪ (వ్యా-సం—౨౦౧ విష బా—అచ్చి ౧౪వ సూ)

త్రాడులు (త్రాడ్లు)—త్రాల్లు (ళ్ళు) కాలులు—కాల్లు (ళ్ళు) అద్విరుక్తం బులనుటచేత ''తెడ్డు—గ్రుడ్డు-తెల్లు-కల్లు (మద్యము) మున్నగు శబ్దంబులం దట్లు లాదేశము గల్గదు

---

* సూరి చింతామణి సాధించిన ('రోలో' వ్యా-సం—౧౯౯ వి) నీల్లు (ళ్ళు), ఊళ్ల (ళ్ళ) మున్నగు రూపములను సాధింపకుండుటయు, చింతా మణి సమ్మతము కానట్టియు, ప్రయోగ ప్రాచుర్యమేని లేనట్టియు 'నీళులు- ఊళులు' మున్నగ వానిని సాధించుటయు వింతగా నున్నది

౧ వ వివ నన్నయ కాలమున 'గుడి-గుడులు-గుడ్లు' అనునవె సాధువులుగా నుండెడివి గుడ్లు-'గుల్లు' (ళ్ళు) అను లాదేశము దిక్కయజ్వ నాఁటికిఁ గాలక్రమమునఁ గల్గెను, 'కాలు-కాలులు-కాల్లు' (ళ్ళు) మున్నగు చోట్ల 'లా' దేశమె పల్కఁబడెడిది ఇచట యీ యలఘూచ్చారణమునకు వెలుగ విధి యనావశ్యకము గోళ-గరళాదిశబ్దములందు వలెనె యీ ఘూచ్చారణము లోక ప్రసిద్ధమె కాననె చింతామణిలో 'రోలః' అని రేఫకు మాత్రమె లాదేశము విధింపఁబడెను (వ్యా-సం-౧౯౯ విష ౭౩౬వ పుట)

౨ వ వివ తెలుఁగున స్థిరపరక పూర్ణ ముండనేరదు గాన (సంజ్ఞా ౧౬వ సూ) ఏండ్లు-పూండ్లు (అనేకములు) మున్నగు స్థలములందుఁ బ్రకృత సూత్రము చొప్పున నలఘు లకారాదేశము రానేరదు ఈ న్యాయముచేతనే మూల్లు (ళ్ళు), పల్లు (ళ్ళు, ఫలములు), బల్లు (ళ్ళు, శకటములు) మున్నగునవి యసాధువులు వ్యావహారిక మాత్రములు 'మూండ్లు-పండ్లు-బండ్లు' అనునవే గ్రాంథిక రూపములు, సాధువులు తే గీ "విల్లు పట్టిన పసిచేను నాల్ల (ళ్ళ) లోన" (కాళ ౩వ ఆ 'శ ర') అను కవి ప్రయోగ ముండుటచేత "నాల్లు" (ళ్ళు) అను దాని కర్వాచీనముగ నిపాత న్యాయమున సాధుత్వము నంగీకరింప నగును "నాఁడులు- నాండ్లు" అనునవి సాధువు లనుట పర్వివాదమె

## ఎడ్లు-వడ్లు-తేంట్లు-అనంట్లు-తీంండించు

౩ వ వివ తే గీ డుత్వ మబ్బు నెద్దునకు వరికి । నెడ్లు వడ్లును నాఁజను (కావ్యాలం ౯వ ఉల్లా ౯౦౧ ప) "గీ కడఁక నెడ్లను దఱిమి (అను ౪వ ఆ-౩౧౮) కం రెన్నెల్లలోన నాకున్ । (భాస్కర-సుందర-౨౦౪వ పద్య, సూ-రా-ని)" అను ప్రమాణమును బట్టి 'ఎడ్లు (ఎద్దులు), వడ్లు (ధాన్యము), నెల్లు (నెలలు)" అనునవి సాధువు లనఁదగును * "సీ నట్టింట దేవల్ల (ళ్ళ) పెట్టెఁ బెట్టిన తిన్నె" (శుక ౩వ ఆ ౫౦వ ప సూ-రా-ని) అను చొప్పున "దేవరలు-దేవల్లు (ళ్ళు)" అనియు సాధువు లనఁదగును

---

* "ఎడ్లు-వడ్లు-నెల్లు-దెవల్లు (ళ్ళు)" అను వానిని సూరి ప్రభృతులు సాధింపలేదు

సమాస పదంబునందు సంయోగంబు పరంబగు నపు డెల్లచో ఖంత బిందు వునకుం బూర్ణం బగు ౧౫ (బా-అచ్చి-౧౫, వ్యా-సం ౨౦౨ I వి) సమాస పదము — అఖండపదము

అనఁటులు-అనంట్లు పనఁటులు-పనంట్లు (కుండలు) గోఁటులు-గొంట్లు (ఒయ్యారములు) తేఁటులు-తేంట్లు (తుమ్మెదలు) ఏఁడులు-ఏండ్లు(వత్సరములు) కాఁడులు-కాండ్లు (నాగలి మున్నగువాని యుగములు)

౧ వ వివ పయిరీతిని బహువచన పరకత్వమున నీ విధి యవ్యభి చరితమె యైనను దద్భిన్నస్థలములందు బహుళముగా ననఁగా యథాప్రయోగ ముగ నెన్నఁదగును ఉదా తీఁడిరించు-తీంౘ్రించు మాఁడుచు-మాడ్చు (ఇట బిందులోపము) స్థిరపరకత్వ రూపాంతర మందును బిందువు లోపించుట గలదు ఉదా వేసఁగి-వేసవి పోఁడిమి-పోఁడిమి మొ

## ఔపవిభక్తిక లివర్ణ సల లువర్ణాంత శబ్దములు

ఔపవిభక్తికంబుల (అచ్చి-౨౦-౨౧వ సూ, టి-ంటి) లివర్ణ-సల లువ ర్ణంబులకు బహువచనంబు పరంబగు నపుడు పూర్ణబిందు పూర్వక డువర్ణంబు బహుళముగా నగు ౧౬ (బా-అచ్చి-౧౬వ సూ వ్యా-సం-౨౦౩ I, II విష)

లివర్ణ కొడవలి-కొడవండులు ఉల్లోపము(అచ్చి-౧౨వ సూ) - కొడ వండ్లు పక్షంబునం దలఘు లకారంబు కొడవల్లు (ఖ్న)- కొడవలులు (మా- అచ్చి ౧౪వ సూ) రోఁకలి ప్రభృతులకును నిట్లై ద్వివిధ రూపంబుల నెఱుంగునది 'కొడవలి' శబ్దము భారతకాలమున కనౌపవిభక్తికమె యయ్యు నర్వాచీనము గా నౌపవిభక్తిక మయ్యెను "ఒలయు వైరాగ్య మను కొడవఁగొని కాపె" (శాంతి- ౪వ ఆ-౧౬౨వ ప) "కొడవఁ గోయు నురపకి (వరాహ-౧-౨- -౨)"

సలలు వర్ణ ఇల్లు-ఇండులు-ఉల్లోపము (అచ్చి ౧-౨వ సూ)- ఇండ్లు-ఇల్లులు పక్షంబున-ఇల్లు (ళ్ళు, ఇంటికిన్-బొప) ఇట్లు "కల్లు (ఱాయి) - పల్లు (దంత)-ముల్లు-విల్లు" మున్నగు శబ్దంబులకును ద్వివిధ రూపంబులను గ్రహింపవలెను [1] "కల్లు (మద్యము), పల్లు (పల్లము)" మున్నగునవి యనౌప విభక్తికములు గాన వాని కీ సూత్రము వర్తింపదు

బహుళ గ్రహణముచేత 'పెండిలి' మున్నగు వానియందును నీ కార్యము చూపట్టుచున్నది ఉదా పెండిలి-పెండిండులు, ఉల్లోపము-పెండిండ్లు, "ద్విపద-పెండిండ్ల నోములఁ బేరంటములను । బండుగు దినముల (బసవ-౩వ ఆ-౩-౨౬వ ప)

ఒకా నొకచో నామంబు 'లు' ప్రత్యయాంత తుల్యంబయి [2] 'లు' ప్రత్యయంబు నెనయు ౧౭ (బా-అచ్చి-౧౭వ, వ్యా-సం ౨౦౪ I విష)

---

1 ఈ సూత్రపు వివరణమున సూరి 'ఇల్లు' ప్రభృతి సల లుకర్ణంబులకు బిందుపూర్వక డు వర్ణము రానిపక్షమున్ అచ్చి-౧-౨-౧౪వ సూత్రముల చొప్పున ఉల్లోపము-అలఘు లకారాదేశమును నుదాహరింపలేదు బహుళ విధానఫలముగా నట్లు చెసెనేమొ ? "సలో లో శ్చ" అను చింతామణి చొప్పున "ఉల్లోపము" రాఁగా 'ముల్లు' అని 'కాల్లు' అను దానివలెనె యేర్పడును లకా రాలఘూచ్చారణము లోకప్రసిద్ధినిబట్టి సిద్ధింమను కాల్లు (ళ్ళు) అను దానివలెనె (చూ-౧-౨వ సూత్రము-ఉదాహృతులు) ముల్లు (ళ్ళు) అనియును సిద్ధించును

2 సూరి "సంశ్లిష్ట బహువచనాంత తుల్యంబయి" అని సూత్రించి "కొడవండ్లులు-కొడవళ్ళులు-కొడవండ్లులన్-కొడవళ్ళులన్" అని యుదాహరించెను చింతామణి సూత్రమును బ్రయోగములను బట్టి ద్విరుక్త 'లు' ప్రత్యయమె నిల్వవలెనుగాని 'డల' సంయోగముండరాదు 'లుః' ప్రద్మ్యతే అపుట చేత 'లన్' అను ద్వితీయ నిల్వరాదు భారతకాలమునాఁటికి 'కొడవలి' శబ్దమౌప విభక్తికమే కాదు గాన "కొడవండ్లు" అను రూపము భారత ప్రయోగములలో నుండనెరదు (అచ్చిక ౧౬వ సూ చూ)

సీల్లు(ళ్ళ)లు మొసల్లులు(ళ్ళ)లు — ఇట్లు ప్రయోగ దృష్టంబులు గ్రాహ్యంబులు "అపి సంయుక్త సమాప్తౌ। భూయోఽన్తే లుః ప్రదృశ్యతే నామ్నామ్" అనుచు 'లు' ప్రత్యయ మాత్రమే మరల నిల్చునని చెప్పఁబడుట చేతను (చింతామణి యందు), ప్రయోగములందును 'లు' అనునది మాత్రమే మరల నిల్చుట కన్పట్టుచుండుటచేతను 'సీల్లు(ళ్ళ)లన్' మున్నగునవి సాధువులు కానేరవు

౧ వ వివ ప్రౌఢ వ్యాకరణములో నహోబలపండితీయము చొప్పున "కోదండ్రురయందు" (ప్రౌఢ-శబ్ద-౪౮వ సూ) మున్నగునవి యుదాహరింపఁబడుట కేవలము పొరపాటు 'రు-ర' లు పునరుక్త బహువచనములగుట నిరాధారము ప్రయోగ బాధ లేనపుడు లక్షణకుఁ బ్రసక్తియే యుండదు గాన 'లుః' "ప్రదృశ్యతే" అను 'లు' వర్ణకము 'రు' వర్ణకమున కుపలక్షణము కానేరదు అచట తాళపత్ర మాతృకలచొప్పున "కోదండుర యందు" మున్నగు పాఠములు కవి ప్రయుక్తములయి యుండును (చూ-ఆచ్చి-౧౧వ సూ)గానఁ బ్రయోగ బాధ లేదు ''కోదండ్రురు-కోదండ్రుర యందు'' మున్నగునవి యపశబ్దములు "రథో। దారులగుచు నెనమండురు" (ద్రోణ-౩వ ఆ ౨౧౬) 'ఎనమండ్రురు' అపపాఠము

౨ వ వివ ప్రయోగ మొసల్లు(ళ్ళ)లు లోఁగొనున్ (ఆది-౮వ ఆ-౧౪౮), సీ. సీతనూభవులు కన్నీల్లు(ళ్ళ)లు దొరఁగ (ద్రోణ ౪వ ఆ-౩౩౩), ఊల్లు(ళ్ళ) లిట్టమర (హరి-పూ-౨వ ఆ-౫౪ ప)

## కలన్వాదుల బహుత్వమందలి ''కుజ్జు''

కలన్వాదుల 'ను' వర్ణకంబునకు బహువచనము * పరంబగునపుడు 'కు' జ్జగు ౧౮ (బా-ఆచ్చి ౧౮వ సూ, వ్యా-సం-౨౦౫ I విష )

---

* సూరి యేకవచన పరకత్వమున 'కుజ్జు' వికల్పముగా నగునని సూత్రించెను ఇందులకు మహాకవి ప్రయోగ ప్రామాణ్యము లేదు చింతామణి విరుద్ధము ఆంధ్రభాషార్ణవ (క్రీ శ ౧౬౩౦, కోశమున మాత్ర మేకవచనమున 'కుజ్జు' గలదు (సూ-రా-ని, శ-ర)

కలఁకులు-కలంకులు కలన్వాదులు కలను (కళ్ళము, యుద్ధభూమి), కెలను (పార్శ్వము), కొఱను (బీడునేల), కొలను, గవను (ద్వారము), నెఱను (మర్మస్థానము), వరను (చిక్కు), వలను (దిక్కు, ఉపాయము, కుడిప్రక్క), ప్రమాను ఇది పరితగణము కలన్వాదు లోపవిభక్తికములు 'ఇ' అనునది విభక్తు లకు ముందు నిల్చును ఉ ప్రమానను జాతనుం గలదె మాంసము (ఆను-౨వ ఆ-౨౯౪వ ప)

౧ వ వివ ఇది తమిళ 'కళ్-కు + లు' ప్రత్యయ వికృతి యనియు నేకవచనపు 'కుజ్జు' ప్రాచీన ద్రావిడభాషలోఁ గలదనియు డా కాల్డు వెల్లుల్‌గారి ననుసరించి శ్రీ కోరాడ రామకృష్ణయ్య పంతులుగారు, M A వ్రాయుట సత్య విదూరము (ద్రా పరి ౫౮ I విష)

౨ వ వివ కొంద అర్వాచీనులు బహుత్వమందును 'కుజ్జు' నుజ్జగించుట గలదు ఉదా నూఱులు వెలు మ్రోయగ వసుల్ వడి వెల్వడి (రామాభ్యు-౯వ ఆ-౬౯-సూ-రా-సి), ...సలిమూ ల్గా(శ్లేషఘటితము ఒను-౧వ ఆ-౪౫వ ప)

అట్లు రెం గొం ఒద్దిమిం 'పెద్దయిందం పొంత్తయిం 'గు'జ్జగు ౧౯ (బా-అచ్చి-౧౯, వ్యా-సం-౨౦౬ ఎ)

ఁగొలు-గోఁలు (౦౬-బధిరి - గొను-జనుము) దీని కేకత్వమందలి వాక్షిక 'గుజ్జు'న కాంధ్రభాషార్ణవ మాత్రమే యాధారము 'గోఁగునార' మున్న గునవి యేకత్వ గుజ్జు సాధకము లనిరాదు "గోఁగులయొక్క + నార = గోఁగు నార రేఁగులయొక్క + మ్రాను = రేఁగుమ్రాను" అని విగ్రహము నెన్ననగున 'వెల్పుటావు-వేల్పుమ్రాను' మున్నగునవి లేవా ? (వేల్పులయొక్క + మ్రాను)

## చేలు-పేలు-మీలు

బహువచనంబు పరంబగునపుడు 'చేను-పేను-మీను' శబ్దంబుల 'ను' వర్ణంబు లోపించు ౨౦ (బా-అచ్చి-౨౦, వ్యా-సం-౨౦౭ I విష)

చేను-చేలు పేను-పేలు మీను,మీలు (చేఁపలు) 'చేను-పేను-మీను' శబ్దములకే యనుటచేతఁ, గౌనులు (నడుములు)-వీనులు (చెవులు)-మేనులు (శరీరములు) మున్నగువాని యందలి 'న' వర్ణము లోపింపనేరదు

౧ వ వివ ఆచ్చి ౨౪వ సూత్రము చొప్పున నీ చేన్వాది 'ను' వర్ణాంతముల తుది 'ఉ' కారము పాక్షికముగా లోపించును మీన్పొలవల్చు (ఆది ౩ వ ఆ-౪౦), చేన్మేసిన (ఉ-హరి-౫వ ఆ ౪౨), ''గండు మీనులన్ (కవిక-౨వ ఆ ౨౮) అను నపపాఠము నంగీకరించి మీను శబ్ద 'ను' వర్ణలోపము పాక్షికమనరాదు అచట 'గండుమీలనున్' అని కవి ప్రయుక్తమై యుండును

౨ వ వివ 'పేను-మీను' శబ్దంబులు ప్రాణివాచకములు గాన నౌపవిభక్తికములు కానేరవు 'చేను' శబ్ద మౌపవిభక్తికమె! సీ చేనఁ బండిన విత్తు చేసికె (నన్ని-కు-౧వ ఆ-౪౯)

## యి వర్ణాంత శబ్దముల రూపభేదములు

బహువచనంబు పరంబగునపుడు 1 'రేయి' ప్రభృతుల 'యి' వర్ణంబు లోపించును 2 రాయి శబ్దపు 'యి' వర్ణమునకు లోపముగాని 'లు-తి' అను వానిలో నేదేని యాదేశమగుటగాని సంభవించును 3 'గోయి' ప్రభృతుల తుది 'యి' వర్ణమునకు "తి'' వర్ణాదేశము నిత్యముగా నగును (ఏకత్వమున నౌపవిభక్తిక 'తి' వర్ణము వక్ష్యమాణ మగును ఆచ్చి-౫౦వ సూ) 4 దోయి శబ్దము తుది 'యి' వర్ణమునకు లోపము వైకల్పికము ౨౧ (బా-ఆచ్చి-౨౧వ సూ వ్యా-సం-౨౦౮-౨౦౮ I విష) *

---

* సూరి యిట్లు సూత్రింపనే లేదు ఇతఁడు 'గోతులు (గోయి)' మున్నగువాని నౌపవిభక్తిక ప్రకరణమున సాధించుట సరికాదు ఔపవిభక్తికత బహువచన విషయమే కాదు 'గోతిచేత' మున్నగు వీని యేకవచనపు 'తి' వర్ణ మౌపవిభక్తికము కావుననే యథర్వణాచార్యుఁడు "క్వచిత్త్యాదేశ ఏవ స్యాత్" అని బహువచనపు 'తి' వర్ణాదేశమును వేఱుగ విధించికొనెను (వ్యా-సం-౨౦౮ విష ) సూరి 'ఱాయి' శబ్దమును రేయి ప్రభృతులలోఁ (బా-ఆచ్చి-౨౧వ సూ) జెప్పుట చేతను గోయి ప్రభృతులలోఁ జెప్పమి చేతను "ఱాతులు" మున్నగు రూపముల నథర్వణాచార్య విరుద్ధముగా సంగీకరింపలేదు

1 'యి' లోపనిత్యత రేయి-రేలు-రేలన్ వేయి-వేలు-వేలన్ వ్రాయి-వ్రాలు పాయి-పాలు

2 ఱాయి-ఱాలు (ఱాలులు)-ఱాల్లు (ళ్ళు) ఉల్లోపము నిత్యము (ఆచ్చి-౧-౨వ సూ)-ఱాతులు 'రాలు-రాల్లు (ళ్ళు)-రాతులు' అని యిట్లుగ నిది సాధు రేఫముతోను నుండును (ద్విరేఫకము), ఈ శబ్దము 'తి' వర్ణము వచ్చు నౌప విభక్తికము గాన 'రాతన్-ఱాతన్' ఇత్యాది రూపములును నుండును "రాతి పయిని నిసుము గొనుట రాత్రి దధి (అను-౪వ-ఆ-౧౦౦) ఉ ప్రమానను ఱాత నుం గలదె మాంసము (అను-౭వ ఆ-౨౯౪వ ప) "కేషాం చిద్ య్యన్తశబ్దానాం । లు తీ స్యాతాం యథోచితమ్" (అధర్వణాచార్య, వ్యా-సం-౨౦౮ విష)

3 గోయి-గోతులు-గోతులన్ చేయి-చేతులు-చేతులన్ గోయి-చేయి-దాయి (సమీపము) నూయి-నేయి-వాయి (నోరు) రోయి (భస్మము)—ఇత్యాదులు

4 దోయి (ద్వయము)—దోయులు-దోలు "రెండుచే । దోల ... (కావ్యాలం-౫వ ఉల్లా ౯౦౮వ ప)

౧వ వివ కుయి (మొఱ్ఱ) ప్రభృతులకుఁ బై కార్యము లెవ్వియుఁ గలుగవు, ఉదా కుయి-కుయులు, 'ఆ-వె-అధిప వినఁగఁ దగదె యాఁడు కుయులు ।... (భాగ ౧౦వ స్కం పూ ౯౯౫వ ప) పొయ్యి-పొయ్యి-పొయులు ను

౨వ వివ గోయి ప్రభృతులలోఁ గొన్నిటికిఁ బ్రథమైకవచనమున "గొయ్యి-చెయ్యి-నయ్యి-నెయ్యి" అను రూపాంతరములు గలవు 'పొయి-పొయ్యి' అనియుఁ గలదు

## కొన్నిటి యంత్యలోపము

బహువచనంబు పరంబగునపుడు 'అవు' ప్రభృతుల తుది యక్షరంబునకు లోపంబు విభాషనగు ౨౨ (బా-ఆచ్చి-౨౨వ సూ, వ్యా-సం-౨౦౯ I వి)

ఆవులు-ఆలు, జాములు-జాలు చుట్టములు-చుట్టలు-చుట్టాలు (తత్స-౪౪ చూ) నీ చుట్టాలకున్ (ఉద్యో ౩వ ఆ ౧౨) మీసములు-మీసలు-మీసాలు (మీసాలపైఁ దేనియర్ (మనుచ-౨వ ఆ-౬౫) ఆవు శబ్దమునకు సమాసమున నుగాగమము గల్గును ఉదా ఆఁదోఁక (ఆవు తోఁకవలె నుండు), ఆవు + పోతు-ఆఁబోతు ఆవు-దూడ-ఆదూడ మొ

## ఇయాంత శబ్దములు - పదాంత 'ఉ' కార లోపము

ఇయకు మాఱుగా నామంబులం దెత్వం బు [1] బహుళంబుగా నగు ఇయలోని 'ఇ' కారము లోపించుటయుఁ గలదు [2] 'ఎ-ఏ' శబ్దంబుల చోట 'ఇయ' నిల్చుటయుఁ గలదు ౨౩ (బా-అచ్చి-౨౩, వ్యా-సం-౨౧౦-౨౦౦ I విష)

"ముత్తియము-ముత్తెము-ముత్యము" జన్నియ-జన్నె (జన్నె కట్టు=మీఁదుగట్టు) వన్నియ-వన్నె కొంచియము-కొంచెము కొండియము-కొండెము-కొండ్యము ('కొండేలు'-అపశబ్దము, శ్రీరంగ-౫వ ఆ ౩౪, చూ-వ్యా-సం-విస్త I ౧౪౮ విష) దివ్వియ-దివ్వె-దివ్వ (అను-౪వ ఆ౧౧౯) కళ్ళియము-కళ్ళెము-కళ్యము (విరా ౧వ ఆ ౯౫, కర్ణ ౧వ ఆ ౧౪౦) కన్నియ-కన్నె-కన్య (రాఘవ-౧వ ఆ-౭వ ప) పళ్ళియము-పళ్ళెము-పళ్యము (కాశీ ౫వఆ) పీడియము పీడెము-పీడ్యము (పాండు-౩వ ఆ)-విడెము నిత్తియము-నిత్తెము-నిత్యము-నిత్య (బసవ-౨వ ఆ-౪౩౨)

'ఎ-ఏ' లచో 'ఇయ' నిల్చుట అంతే-అంతె-అంతియ (ఆది ౫వ ఆ ౧౧) ఇంతే-ఇంతియ (ఉద్యో-౧వ ఆ-౩౨౧) ఇంతియ కాలంబగునట్టి నీ మనము శాంతిం బొందఁగా నేర్చునే (ఉద్యో-౪వ ఆ-౪౭)

---

1 సూరి నామాంతమం దనుట సరికాదు ఉదా చెల్లియలు-చెల్లెలు మొ

2 'ఇయ' శబ్దంబునందలి 'ఇ' కార లోపము 'ముత్తియ' శబ్దమందు మాత్రము గలదనుట సత్యవిదూరము దివ్వియ-దివ్య కన్నియ-కన్య పళ్ళియము-పళ్యము మొ,

# ౖమాన్పడెన్-ఇంౖదున్వెలెన్-నన్-నిన్_తన్

పదాంతంబులగు 'ను-లు-రు'ల యుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు ౨౪ * (బా-ౖపకీ-౧౬వ సూ, వ్యా-సం-౨౧౦ III విష).

ౖమాను + పడె = ౖమాన్పడె మిన్ను-మిను + పడె-మిన్పడె అను + పురము-అన్పురము (సభా-౧వ ఆ-౧౫౩) నేను-నేన్ నన్నున్-నన్ నిన్ను-నిన్ తన్నున్-తన్ తాను-తాన్ ౖదోహిన్ + కాను ౖదోహింగాన్ వత్తురు + వారు-వత్తుర్వారు కారు + కొనియె-కార్కొనియె మీరు + వలదు-మీర్వలదు (అర ౫వ ఆ ౩౮౩) నీరు + వావిరి-నీర్వావిరి(అను-౩వఆ-౩౧౬) సహింతురు-సహింతుర్ (సభా ౨వ ఆ-౧౪౧) విల్లు-విలు + పూనె = విల్పూనె రాములు-రాముల్, వనములు-వనముల్ (చూ-వ్యా-సం-౭౯౧ పు)

౧ వ విష బహుళౖగహణముచే 'ను-రు-లు' అనువానికి భిన్న స్థలములందును స్వరలోపము 'మాఱు + ప్కున్—మార్పల్కున్'(కల్యా-౧వ ఆ-౬౧) కీడు + పెడిల్లు = కీడ్పెడిల్లు (ౖశీ-౨వ ఆ-౫౮) చేటు + పాటు = చేట్పాటు (విరా—౪వ ఆ-౯౫) గుండు + రాయి = గుండ్రాయి(ఉ హరి ౨వ ఆ-౧౬౭) వెల్లి + విఱియన్ = వెల్విఱియన్ (బసవ ౧వ ఆ ౨౬౬) వెల్ల + వెల్ల = వెల్వెల్ల(కల్యా-౧వఆ-౪౦) వెల్వెలంబాఱె(మను చ ౩వ ఆ ౫౬) అయి + ఉను= అయ్యును (ఆది-౨వ ఆ-౨౦౯) నీరుకోళ్ళు = నీరు కోళ్ (ఆము ౧వ ఆ-౭౧) అఱువుళ్ళు=అఱువుళ్ (భాస్క-యుద్ధ-౫౪౮)

---

* ఇట్టి యాచ్ఛిక విధులు పెక్కు ౖపకీర్ణము లనుచు సూరి సూౖతించెను మఱియు సూరి యీ ౖపకీర్ణసూౖతమున "అసంయుక్తంబు లయిన" అను దశము నిడెను గాని సంయుక్తంబులందును నీ లోపము గలదు ఉదా నీరుకోళ్ళు-నీరుకోళ్ (ఆము-౧వ ఆ-౭౧) అఱువుళ్ళు-అఱువుళ్ (భాస్కర-యుద్ధ-౫౪౮) మఱియు నీ విధి హల్పరకత్వమందే 'ను-రు' లకు వర్తించునని సూరి ౖవాసెను అది సరికాదు ఉ ముదంబును బొందితి నీకు ౖదోహిగాన్ (కాపు, పద్యాంతము) ఎట్లు సహింతుర్ (సభా-౨వ ఆ-౧౪౧) పద్యాంతము

౨ వ వివ బహుళగ్రహణము చేతనే 'ఏమి-ఇంద్రుని' మున్నగు వాని తుది 'ఇ' కారాదులు లోపించును "నీకే బ్రాఁతియే (హరి-పూ-౩౨వ ఆ-ప్రౌఢ-సంధి-౧౬౪వ సూ, నీకేమి బ్రాఁతియే), ఇంద్రున్వలెన్ (ఇంద్రుని వలెన్, ఉ రా ౨వ ఆ-ప్రౌఢ-సంధి-౧౭౭వసూ), పల్కుల్వంటి (పాండు-౧వఆ-పల్కుల వంటి)

ఱకారంబు క్రింది ఱకారంబునకుం దుది 'ను-లు' ల క్రింది 'న-ల'లకును లోపంబు బహుళంబుగా నగు ౨౫ (బా-ప్రకీ-౫వ సూ, వ్యా-సం-౨౧౦ IV విష)

అఱ్ఱు-అఱు (మెడ) గొఱ్ఱియ-గొఱియ కన్ను-కను నన్నున్-ననున్ నిన్నున్-నినున్ తన్నున్-తనున్ పల్లు-పలు విల్లు-విలు మొ

## అక్కటాదుల జడ్డకు లోపము

అక్కటాదుల జడ్డకు లోపంబు విభాష నగు ౨౬ (బా-ప్రకీ ౦వ సూ, వ్యా-సం-౨౧౦ V విష)

అక్కట-అకట అక్కటాదులు అక్కట-అట్టిక (కుండ) అట్టుక (అటుక) అట్టె (అంట+ఎ) అయ్యో-అయ్యారె అవ్వారి (సమృద్ధి)-ఇట్టిక (ఇటిక) ఉప్పవడము (మేల్కొనుట) ఉమ్మి-ఎక్క సక్కియము-ఎక్కిరింత (వాహనము)-ఎడ్డ (హృదయము)- ఎన్నిక-ఎమ్ముక-కజ్జాయము (భక్ష్యము)-కట్టా-కట్టిక (వెండిబెత్తము వాఁడు)-కప్పురము- కమ్మటము (ఆగసాలెవాని కుంపటి)-కమ్మతము (పెక్కురు చేరి చేయు పని)-కువ్వాడము (కపటము)-కొట్టిక (గ్రామము)-కొమ్మ-కొయ్యగూర-గయ్యాళము (ధిక్కారము)-గిజ్జిగాఁడు (పచ్చపిట్ట)-గుజ్జరాతి-చిట్టి-చిన్న-చిమ్మట-చెన్నటి-చెప్పము-చెప్పుడు-చెమ్మట-చెల్లియలు-జవ్వాజి-జాబిల్లి-తమ్మటము (తప్పెట) - తమ్ములము-తల్లి-తుమ్మికి-తువ్వర (తుంపర)- తెల్ల-దవ్వు-దివ్వియ-నవ్వు - నిద్దుర-నివ్వరి-నివ్వాళి-నువ్వులు - నెట్టిక (వేళ్ళు కీళ్ళు చప్పుడు)-నెమ్మిలి - పవ్వళించు-పిన్న - పుల్లియ (విస్తరాకు)-పువ్వు-పెద్ద - పొట్టి - ప్రాకెన్న (పెండ్లిమూఁడవనాఁటి బువ్వము) - ప్రెగ్గడ-బెగ్గడు-బొమ్మ-బొమ్మికము-బొమ్మిడికము-బొమ్మిడీకను

(కిరీటము) మజ్జా (ప్రశంసార్థకము) మత్రాబు-మల్లారము (మట్టి గాజుల గుది)-ముక్కు-ముద్దియ-మెట్టిక (సోపానము)-మొక్కరము (స్తంభము)- మొగ్గరము (వ్యూహము), మొల్లాము (బంగారు లోనగు పూఁత)-రడ్డి (రెడ్డి)-లొట్టిపిట్ట-వట్టి-వయ్యాళి (విహారము)-సన్నియ(సన్నెకల్లు) - సవ్వడి - సివ్వంగి - అట్టు - ఇట్టు - ఎట్టు -అప్పుడు-ఇప్పుడు-ఎప్పుడు-అన్ని-ఇన్ని-ఎన్ని-కొన్ని-మమ్ముౘ్-మిమ్ముౘ్-తమ్ముౘ్-అమ్మ-అక్క-అవ్వ-అయ్య-అన్న-అప్ప-అచ్చొటు-ఇచ్చొటు ఎచ్చొటు-అచ్చటు-ఇచ్చటు-ఎచ్చటు-అద్ది-ఇద్ది-ఎద్ది-ఎవ్వఁడు-ఎవ్వాఁడు ఇత్యాదు లక్కటాదులు

## అత్తె త్తె-కన్న దరె-అడపము

జడ్డకారంబుతోఁ బదాది స్వరంబు గూడుచో ౨౫-౨౬ (అచ్చి) సూత్రములకు లక్ష్యములగు జడ్డలకు లోపము లేదు ౨౭ (బా-ప్రకీ-౯వసూ, వ్యా-సం-౨౧౦ V వి)

అత్తె త్తె-కన్నదరె-నన్నడిగె-పల్లొత్తె-విల్లందె '౨౫-౨౬ సూత్రములకు లక్ష్యములగు' అనుటచేత ''మన సేకాగ్రత (శాంతి-౫వ ఆ-౧౨౧)'' మున్నగునవి విరోధింప నేరవు

హాదులయు, నీలుగు ప్రభృతులయుఁ బదాది హల్లు విభాషను లోపించు ౨౮ (బా-ప్రకీ-౧౦వ సూ, వ్యా-సం-౨౧౦ VII వి)

హడపము-అడపము (వక్కలాకుల తిత్తి) హరిదళము -అరిదళము (హరితాళ శబ్దభవము) హళఁది-అళఁది (హరిద్రా వర్ణము) నీలుగు - ఈలుగు (ఒడలు విఱుచుకొనుచు వచ్చు) నీలుగు-నెగయు-పొందు-పొనరు-పూను-పొదవు (సంభవించు, కలుగు)

## కిన్క-అ్రబము-విన్మ-అ్రదుచు

అచ్చికంబులం బదమధ్యంబుల 1 'న-ల-డ-ర'ల మీఁది 'ఉ'త్వంబునకు లోపంబు విభాష నగు 2, తద్భిన్నాక్షరముల మీఁదను 'ఉ' కారేతర స్వరంబు

లును గొన్ని యెడల లోపించును 3 ప్రత్యయపూర్వ స్వరంబులును యథా ప్రయోగంబుగ లోపించును ౨౯ (బా-ప్రకీ-౧౮-౧౯ సూ, వ్యా-సం-౨౧౦ XI వి)

1. కినుక-కిన్క, కానుక-కాన్క, చిలుక-చిల్క, కాలువ-కాల్వ; కడుగు-కడ్గు, ఈడుచు-ఈడ్చు పెరుఁగు-పెర్గు, కూరుకు-కూర్కు మొ

2 అబ్బురము-అబ్రము (ఆచ్చి ౨౬ వ సూ బకార లోపము) కప్పురము-కప్రము, నెత్తురు-నెత్తు అప్పుడు-అప్డు ఇప్పుడు-ఇప్డు, ఎప్పుడు-ఎప్డు మొ వలచు-వల్చు, కలికి-కల్కి, పొలితి-పొల్తి, ములికి-ముల్కి, బుడిపి-బుడ్పి మొ

3 వినుము-విన్ము (ఆది-౧వ ఆ-౧౪౮, శాంతి-౩వ ఆ-౩౪౧), భాను సమాన విన్ (కవిజ వృత్తా ౧౦౨) నిలుము-నిల్ము (హరి-ఉ-భా-౪వ ఆ-౨౨౪) చనును-చన్ (చనును+ఎ=చన్నె, సభా ౨వ ఆ-౨౨౮-౨౬౩) నెగడుతన్-నెగడ్తన్ (నన్ని-కు-౩వ ఆ-౨౪౪) వలదు-వల్దు (ద్రోణ-౫వ ఆ-౩౨౪) చెడక-చెడ్క (ఉ-హరి-౬ వ ఆ-౧౪౩) కాలుదుము-కాల్దుము (బసవ-౫ వ ఆ-౫౪౬)

౧ వ విధ ప్రథమా బహువచన 'లు' ప్రత్యయ పరకత్వము నందలి 'ఉ' త్వ లోపము (ఆచ్చి-౧౨వ సూ), ప్రేరణ 'చు' వర్ణ కాది పరత్వమునందలి లోపాగమాదేశాదులు (క్రియా-౫౦వ సూ), శత్రర్థక 'చు' వర్ణక పరకత్వమందలి 'ఉ' త్వ లోపాదికము (క్రియా-౬౫ వ సూ), క్రియా ప్రత్యయ 'రు' వర్ణక పరకత్వమందలి 'ఉ' త్వ లోపము (క్రియా-౭౨ వ సూ) మున్నగునవి వేఱుగ సూత్రింపఁబడును కాన వాని నిం దుదాహరింపరాదు.

'చు' పరక 'రు' వర్ణకంబునకు ముందటి 'దు' వర్ణంబు 'ఉ' త్వంబునకు లోపంబు విభాష నగు అగుచోఁ దత్పూర్వ స్వరంబు గురువు కాదు ౩౦-౩౧(బా-ప్రకీ-౨౦వ సూ వ్యా-సం-౨౧౦ XI విష ౩౨౮ I విష)

అదురు-అదురుచు-అద్రుచు, ఎదురుచు-ఎద్రుచు, విదురుచు విద్రుచు (విదలించు), పదురుచు-పద్రుచు (పేలు-త్వరపెట్టు చూ- ఉ హరి-౪వ - ఆ-౧౦౯వ చూ-౧ వ ప విధ)

౧ వ వివ పీనిలో 'అదురుచు' అ[ప్రేరణము అ[దుపన్ 'చు' అవ యవికము 'ఎదురుచు—ఎదిరించు' అనునవి యాగమములె యయ్యు[ప్రేరణార్థ కములు కావు ఎ[దుచున్-ఎ[దుపన్ ''వి[దుచు-ప[దుచు" అనునవి [ప్రేరణ రూపములు వి[దుపన్ — ప[దుపన్ — మొ * (చూ-వ్యా-సం-౩౨౮ I విష. ౧౩౮-౨వ పుట) (చూడు-సంజ్ఞా పరిచ్ఛేదము-౧వ సూ ౬వ వివ) చ ఎ[ది చిన..... । అ[దిచిన .. । వి[దుఁపగ... । చి[దుపలు.. ..(ఉ హరి ౪వ ఆ-౧౦౯వ ప) ఇందలి 'చి[దుపలు' అను దానిని మా[త్రము శిథిలద్విత్వ ముగా నెన్నవలెను 'క[దువ' లోని 'క' వర్ణము గురువె

## నల్లేరు-నల్లెరు, ఊయెల-పయ్యెద-తాయెతు

అచ్చిక సమాన పదంబులం దుత్తమంబులగు 'రు-లు-డు'ల ముందఱి 'ఏ' త్వంబునకు [హ్రస్వంబు విభాషనగు ౩౨ (బా-[ప్రకీ-౨వ సూ, వ్యా-సం-౩౭౮ విష)

నల్లేరు-నల్లెరు (ఉత్తమ—మూఁడు వర్ణములు గల పదములోని మూఁడవ వర్ణము-చూ-తత్స-౪౭-౪౮ సూ) - పల్లేరు—పల్లెరు-పెన్నేరు — పెన్నెరు (అశ్వగంధ) - మానేరు — మానెరు (జ్యోతిష్మతీ లత) - ఆడేలు—ఆడెలు (శరారిపక్షి) - కుందేలు — కుందెలు-తోడేలు — తోడెలు - నాఁగేలు—నాఁగెలు - నేరేడు = నేరెడు - మారేడు — మారెడు-పూరేడు — పూరెడు (పక్షి విశేషము) తంగేడు-తంగెడు ఇత్యాదులు

'ఊయేల-పయ్యేద-తాయెతు'లం [దిక్కృ నామంబులందు 'యా' కుఁ దాలవ్య వ[క యోగంబు లేదు ౩౩ (బా-[ప్రకీ-౩వ సూ, వ్యా-సం-౩౪౯ I విష)

---

* ఇవెల్ల [ప్రేరణార్థక 'చుకృ'తోఁ గూడిపవె యను సూరి [వ్రాఁత సరి కాదు,

త్రిక్కాన్-తక్కాన్ ఈ మూఁటియందుఁ దప్పఁ దక్కిన సమాన పద మధ్యమునందలి 'య' కారమునకు 'ఎ-ఏ' ల యోగము లేదని యర్థము "ఊచు + హేల-ఏల - ఎల - ఊయెల, పయి + ఎద - పయ్యెద తాయి + ఎత్తు-ఎతు-తాయెతు" అని భేద మనియు నివి సమానపదములు కావనియుఁ జెప్పెడి యప్పకవ్యాదుల వ్రాఁత సరికాదు "ఎల-ఎతు" శబ్దములు తెలుగున నప్రసిద్ధములు "పయ్యెద" లోని ద్విత్వమునకు విధిలేదు 'పయ్యెధ' అను రూపము లేదు

## 'ఊయ్యేల' మొ. తొలియచ్చుమీఁది ద్విత్వము

**ఊయేల-యూయాల చాపుల నొంటొంటికిం గుఱుచ యౌండె నగు ౩౪ (బా-ప్రకీ-౪, వ్యా-సం-౩౭౯ I విష)**

ఉయేల-ఊయేల-ఊయెల-ఊయాల-ఉయాల-ఊయల('ఉయెల'అనరాదు, వక్ష్యమాణంబు యద్విత్వంబు, ఆచ్ఛి-౩౬ వ సూ) — ఉయ్యేల-ఉయ్యెల-ఉయ్యాల-ఉయ్యల (వీనియందు సమా ౭౬ వ సూత్రపు ద్విత్వ పరక హ్రస్వము గల్గుచున్నది)

పయ్యెద-ప య్యెద ౩౫ (బా-ప్రకీ-౫వ సూ, వ్యా-సం-౩౭౯ I)

ఊయేలాదులం దొలియచ్చుమీఁది హల్లునకు ద్విర్వచనం బొండె నగు ౩౬ (బా-ప్రకీ-౬ వ్యా-సం-౩౭౯ I విష)

ఉయ్యేల-ఊయేల ఉయ్యెల-ఊయెల ఉయ్యాల-ఊయాల ఉయ్యల-ఊయల ఆయెను-అయ్యెను ఆయెదను-అయ్యెదను ఆయెడిని-అయ్యెడిని-ఆయెడునది-అయ్యెడును ఏలిదము-ఎల్లిదము (చులకఁదనము) ఓయన-ఒయ్యన-ఒయ్య (ఋజువు) ఓయారము-ఒయ్యారము కోపు-కొప్పు (ధను రగ్రము) జాజర-జజ్జర (మోసము) తినియ-తిన్నియ తీయము-తియ్యము తేప-తెప్ప (ప్లవము) తేమ-తెమ్మ తోయలి-తొయ్యలి దివియ-దివ్వియ నూవు-నువ్వు నోవి-నొవ్వి (నొప్పి) నోవు-నొవ్వు (నొప్పి) పూవు-పువ్వు పేయ-పెయ్య

మోక-మొక్క మోటిక-మొట్టిక మోవు-మొవ్వు వీయము-వియ్యము ఇత్యాదు లూయేలాదులు

## ఆరటము

ఆరాటాదులం బ్రథమేతర దీర్ఘంబునకు హ్రస్వంబు విభాష నగు ౩౭ (బా-ప్రకీ-౧౧; వ్యా-సం-౩౮౦ వి)

ఆరాటము-ఆరటము(పరితాపము) కక్కూఱితి-కక్కుఱితి కేళాకూళి-కేళకుళి - కేళాకుళి - కేళకూళి (క్రీడా సరస్సు-ఖేలాకూల శబ్దభవము) కొమారుఁడు కొమరుడు - కొమారిత-కొమరిత గంబూరము - గంబురము (కర్పూరము) పెండారము-పెందరము-పెండేరము-పెండెరము (అందె) బంగారము -బంగరము బేహారము - బేహరము (వాణిజ్యము-వ్యవహార శబ్దభవము) వీటతాటము (వీటతటము-తార్మాఱు) సంతోసము-సంతొసము మొ

## ఓయారము-ఒయారము

ఓయారాదులం దొలిదీర్ఘంబునకు హ్రస్వంబు విభాష నగు ౩౮(బా-ప్రకీ-౧౨వ సూ, వ్యా-సం-౩౮౧వ విష),

ఓయారము-ఒయారము కేళాకూళి-కెళాకూళి కోలె-కొలె (మొదలుకొని), గూడారము-గుడారము (పట కుటీరము) గోరువంక పక్షి - గొరువంక పక్షి జోహారు-జొహారు (నమస్కారము) నీలుఁగు-నిలుగు (చచ్చు) పేఁడ-పెండ (సంధి-౨౨వ సూ ) బేహారము-బెహారము (దీర్ఘ మధ్యంబు) మాఱు-మఱు (తడవ) మూలుగు-ములుగు (వేదనచేత మూలుగు) మోఱకు-మొఱకు (మూర్ఖ శబ్దభవము) వీట తాటము-విటతాటము వీడియము-విడియము(వీటికా శబ్దభవము) ఇత్యాదు లోయారాదులు-

## ఏతము-ఏతాము

ఏతాములకు 'ము' వర్ణకంబు పరంబగునపుడు దీర్ఘంబు విభాషనగు ౩౯ (బా- ప్రకీ-౧౩, వ్యా-సం ౩౮౨ వి)

ఏతము-ఏతాము (యన్త్ర శబ్ద భవము) కళ్ళము-కళ్ళాము గాలము-గాలాము గుడ్డము-గుడ్డాము గోణము-గోణాము (కౌపీనము) గోతము-గోతాము (చిన్న గోనె సంచి) జాజము-జాజాము (పాలికలం దలి నవధాన్యముల నారు) జుంజము-జుంజాము (దీపావళి నాఁటి బాలురు కాల్చు కాష్ఠదీపిక) జోతము-జోతాము (నమస్కారము) తణగము-తణగాము (ఎద్దుమీఁది నీళ్ళ తోలుసంచి), బొండ్లము-బొండ్లాము (బొనికతోడి టెంకాయ). మండము-మండాము (చేఁపలఁ బొడుచు చిల్లకోల) లాతము-లాతాము (సన్యాసుల చేతి దండము) వీణము-వీణాము ఇత్యాదులు

## అణఁగు-దక్కు (డక్కు)-జూజము-అచ్చుటు-ఇరులు మొ.

అడంగ్వాదుల 'డా'కు 'ణ'కారంబు విభాషనగు ౪౦ (బా-ప్రకీ ౧౩వ సూ, వ్యా-సం-౩౦౪ విష)

అడఁగు-అణఁగు కడఁగు-కణఁగు (యత్నించు), చిల్లాడము-చిల్లాణము (బాకు), తడగము-తణగము (ఎద్దుమీఁది నీరు తెచ్చు తోలు సంచి) నాడెము-నాణెము పోఁడి-పోణి (ఒప్పిదము) మిడుఁగు-మిణుఁగు(మిణుఁగురు పురువు), మిడుఁగులు-మిణుఁగులు (అగ్ని కణము-మిడుఁగు),వడఁకు-వణఁకు ఇత్యాదులు

దక్కులోనగు వాని 'దా'కు 'డ' కారంబు విభాషనగు ౪౧ (బా-ప్రకీ-౧౪వ సూ, వ్యా-సం-౩౦౪ విష)

దక్కు-డక్కు, దగ్గఱు డగ్గఱు (సమీపించు), దాఁగు-డాఁగు దాకిలి-డాకలి (సూరి ప్రపదమ ముద్రణమం దిది నిర్బిందువు), దిగు-డిగు దిగ్గియ-డిగ్గియ (దీర్ఘికా శబ్ద వైకృ), దూయు-డూయు, దెందము-డెందము, దెప్పు-డెప్పు (మర్మోద్ఘాటనము చేయు), దెప్పరము-డెప్పరము (దుష్టవచనము), దొంగ-డొంగ దొప్పు-డొప్పు ఇత్యాదులు

జూదాదుల 'దా' కు 'జ' కారంబు విభాష నగు ౪౨ (బా-ప్రకీ-౨౧ వ్యా-సం-౩౦౪ విష

జూదము-జూజము (ద్యూత-వైకృ) అవుదు-అవుజు (పంకము) జవాది-జవాజి జాది-జాజి (జాతి శబ్దభవము) జాను-జాజు (రక్తవర్ణము), విరవాది-విరవాజి (నవమాలిక-విరజాజి)

అక్కడాదులు నిత్యైకవచనాంతములు ౪౩ (ప్రౌఢ-శబ్ద-౨౮, వ్యా-సం-౨౧౧ III విష)

అక్కడ-ఇక్కడ-ఎక్కడ-అక్కడికిన్-ఇక్కడికిన్-ఎక్కడికిన్ అచ్చటు-ఇచ్చటు-ఎచ్చటు అచ్చటికిన్-ఇచ్చటికిన్-ఎచ్చటికిన్ ఆది శబ్దముచే 'ఇరులు' మొదలగువాని నెన్నవగును "ఇరులున నొంటిఁబో" (విజ్ఞా-ప్రాయ ౧౦౪), 'కేలు' శబ్ద మిట్టిది కాదు "పెడకేళ్ళు" (అర-శవ ఆ ౧౧౧).

## జాత్యేకవచ నాదులు

జాతి వివక్షయందు బహుత్వమున నేకవచనము నిల్వ వచ్చును ౪౪ (అహో-౪౨౫ వ పు వ్యా-సం-౨౧౧ III వి)

పువ్వు పరిమళించును-పువ్వులు పరిమళించును స్తనము-స్తనములు మొ

సస్య వాచకములు, లోహ వాచకములు, కతిపయ సంభార వాచకములు నిత్యైకవచనాంతములు ౪౫ (ప్రౌఢ-౨౯-౩౧వ సూ, వ్యా-సం-౨౧౨ IIIవిష దిని విస్తరము III)

వరి (వరిచేను), చోడి-అరుగ-వెండి-బంగారము-ఇనుము-ఇంగువ-ఉప్పు-చమురు మొ *

---

* ప్రౌఢ శబ్ద-౩౨వ సూత్రము "సమానార్థక " అను సూత్రము వ్యర్థము కారక ౩౦వ సూత్రముచేతనె యట్టి యేకత్వము సిద్ధించును 'కూడు-ఎన' శబ్దములు సమానార్థకములును గావు ప్రౌఢ శబ్ద-౩౩వ సూత్రము చెప్పిన గుణవాచకములు నిత్యైకవచనాంతములు కావు 'తెలుపుల-నలుపులు' అని యుండవచ్చును గీ నలుపు తెల్లను దెలుపు గగ్గెజెసి (సుము-౩వ ఆ-౨౩వ ప)

## క్రీడా వాచకాదులు

అదరులు లోనగు శబ్దములును, ధాన్య వాచకములును, క్రీడా విశేష వాచకములును, సంబంధార్థమందలి యుష్మదస్మదాత్మార్థక శబ్దములును నిత్య బహువచనాంతములు ౪౬ (ప్రౌఢ శబ్ద-౩౬-౩౭-౩౮-౪౬ సూ, వ్యా-సం-౨౧౧ III విష)

అదరులు (మిడుఁగుఱులు), ఎండువులు (ఎండఁబోసిన ధాన్యములు), మిడుఁగుఱులు మొ ధాన్యవాచక అళ్ళు-చోళ్ళు మొ క్రీడా విశేష. గుజ్జన గూండ్లు-గొబ్బిళ్ళు-కనుమూసి గంతలు-వెన్నెల ప్రోవులు మొ సంబంధార్థక. మీయిల్లు (నీయిల్లు) మాయిల్లు (నాయిల్లు) తమ మామ (తన మామ) అస్మత్పతులు (నాపతులు, విరా-౧ వ ఆ-౩౨౯) "మిన్నక కినువడక పొమ్ము మీ గృహమునకున్" (విరా-౪వ ఆ-౨౧౮, కినుపు + పడు = కోపపడు)

## పూజ్యతా బహుత్వము

పూజ్యతా వివక్షయందు మహత్తుల యేకత్వమున బహువచనము విభాషనగు ఔచితినిబట్టి కవికి రుచించు నెడల సస్మదర్థకమునకును బూజ్యతా బహువచన ముండును పూజ్యతా వివక్షయం దేక వచనాంతము పయిని 'గారు' శబ్దమును, డుమంత బహువచనాంతములపై 'వారు' శబ్దమును షష్ఠీ సమాస గతములయి నిల్చును కొన్ని యెడల నేకవచనాంతములపైని 'వారు' శబ్దము నిల్చుటయుఁ గలదు ౪౭ (ప్రౌఢ. శబ్ద-౩౯-మొ ౪౩ , వ్యా-సం-౨౧౧ IV విష)

1 పూజ్యత గురువులు (గురువు, విరా-౩వ ఆ-౧౨౦) 2 కవికి రుచించినచో మేము వచ్చితిమి (నేను వచ్చితిని· ఆది-౪వ ఆ- ౨౭-దుష్యంత వాక్యము) గారు శబ్దము రాజుగారు (రాజుయొక్క + గారు—రాజున్ + గారు—రాజుగారు అత్తగారు-మామగారు-తండ్రిగారు మొ వారు శబ్దము స్వాములవారు-రాములవారు మొ ఏకవచనముమీఁది వారు శబ్దము అత్తవారు-అమ్మవారు-రావువారు-పూసపాటివారు-రాచవారు-ఆర్వీటివారు మొ

## పూజ్యతాతిశయము

పూజ్యతాతిశయంబున యుష్మద్బహువచనమున నాత్మార్థక బహువచనము నిల్చును ౪౮ (ప్రౌఢ శబ్ద-౪౫ వ్యా-సం-విస్త-౨౧౧ IV విష)

''స్వామీ ! తాము దయ చేయవలయు'' మొ.

అజ్ఞాత వస్తుప్రశ్నమునందును, నిర్దేశించి చెప్ప వీలు లేని వస్తువు నుద్దేశించునపుడును నేకత్వమున బహువచనము తఱుచుగా నిల్చును ౪౯ (ప్రౌఢ శబ్ద-౪౭, వ్యా-సం-విస్త-౨౧౧ IV విష)

అజ్ఞాత ఎవ రక్కడ ? నిర్దేశించి చెప్ప వీలులేని : సీతా రాములలో నెవరుముందు వచ్చిరి ? ఒకరి వెనుక నొకరు వచ్చిరి వీరిలో నొకరి నంపెదను నీ వెవ్వరు? (విరా-౧ వ ఆ) తండ్రి పే రెవ్వరు ? (జై-౬ వ ఆ) అది యెవ్వరు (నైష-౩ వ ఆ, చూ-ప్రౌఢ-శబ్ద-౪౭ వ సూ)

## అన్న్యాది మహత్త్వ బహుత్వము

'అన్ని-ఇన్ని-ఎన్ని-కొన్ని-పలు-పెక్కు' శబ్దంబులయు, ద్వి ప్రభృతి సంఖ్యావాచకంబులయు, మహన్మహత్యర్థకంబులు నిత్య బహువచనాంతములు అన్న్యాదుల యమహదర్థకంబులు (సమూహార్థకముల వలెనె) నిత్యైకవచనాంతంబు లగుచు బహుత్వమును బోధించును ౫౦ (బా-అచ్చి-౨౪వ సూ, వ్యా-సం-౨౧౧ II వి)

అన్ని-అన్నిటిని (వస్తువులను) అందఱు (పురుషులు-లేదా స్త్రీలు)-అందఱన్-ఇన్ని-ఇందఱన్ మొ

౧ వ వివ "వాని యన్నింటికంటె" (అను ౪ వ ఆ-౪౩) అను రీతిని "అన్న్యాదు'' లౌపవిభక్తికములగుటంజేసి యివి యేకవచనాంత రూపమున నుండి బహుత్వార్థమును బోధించును 'ఆవులు మూఁడు వచ్చుచున్నవి' అను రీతి నివి యేకవచన రూపమున నుండి బహువచన విశేషణ క్రియలతో నన్వయించు

చుండును "జాతులు" మూఁటన్ (అను ౧ వ ఆ-౯౫) అన్వాద్యులవలెఁ గాక ద్విప్రభృతి సంఖ్యావాచకముల కమహత్త్వమునందును బహువచన రూపము లరుదుగఁ గలవు తొమ్మిదులు (చూడు తత్స-౪౦ వ సూ), రెండు వేలు (చూడు-ఆచ్ఛి-౨౧వ సూ), శరము లాఱయిదుల్ (కర్ణ-౧ వ ఆ-౧౧౧)

౨వ వివ పలు శబ్దమున కమహత్త్వమున వ్యస్త ప్రయోగము లేదు పెక్కు శబ్దమున కమహత్త్వమున నేకవచన బహువచన రూపములు రెండును గలవు. ఉదా పలు పలుకులు మాటలు పెక్కేల ? మాటలు పెక్కు లేల ? మహత్త్వమున 'పలువురు-పెక్కురు - పెక్కండురు - పెక్కండ్రు' అని యుండును

## అన్వాద్యుల సిద్ధరూపోదాహృతియె సుకరము

అన్ని ప్రభృతుల* విభక్త్యంత రూప సాధన ప్రక్రియను సూత్రించుట కన్న వాని సిద్ధరూపముల నుదాహరించుట లెస్స ౫౧ (బా-ఆచ్ఛి-౨౪, వ్యా-సం-౨౧౧ I, II విష )

"అన్ని-ఇన్ని-ఎన్ని-కొన్ని-పెక్కు-పలు-అ-ఈ-ఏ-నీ-నా - మన-తా శబ్దములును సంఖ్యావాచకములును" అన్ని ప్రభృతులు వీనికిం గొన్ని సిద్ధ రూపంబులు మాత్రము చూపెదను శేషం బూహించుకొన నగును వీనిలోని దుమంతంబుల కెల్ల న్యాగమంబు పూర్వోక్తంబు (తత్స ౨౦ వ సూ) స్మరించునది కొన్నిటి బహువచన లకారంబునకు రాదేశంబును బూర్వాగమంబును నెఱుంగునది

---

* సూరి సంస్కృతానుకరణంబున వీనికి సర్వనామ సంజ్ఞ నంగీకరించి "అన్ని ప్రభృతులు సర్వనామంబులు" అని సూత్రించి (బా-ఆచ్ఛి-౨౪వ సూ), "అన్ని - ఇన్ని - ఎన్ని - కొన్ని - పెక్కు - పలు-అ- ఈ-ఏ-నీ-నా-మన-తా-సంఖ్యావాచకంబులు అన్ని ప్రభృతులు" అని వివరించెను ప్రాచీనాంధ్ర వ్యాకర్తలు సర్వనామ సంజ్ఞ నంగీకరింప లేదు

సంస్కృతమున సర్వాది శబ్దముల పయిఁ గొన్ని సుబ్విభక్తులు నిల్చినపుడును, గొన్ని తద్ధిత ప్రత్యయములు నిల్చునపుడును, బుంవద్భావాది సామాసిక విషయములందును, దక్కిన నామములకంటె రూప వైలక్షణ్య ముండుటం జేసి వాని కట్టి ప్రత్యేక సంజ్ఞ ప్రక్రియా లాఘవమునకయి సంస్కృత వైయాకరణులచేఁ గల్పింపఁ బడెను విభక్తి రూపాదు లందలి యట్టి ప్రత్యేకత తెల్గున "అన్ని" ప్రభృతులకు లేదు కొంద ఱాధునికులు చూపు ప్రత్యేకత యీ క్రింది రీతి నవిమర్శ మూలక మనఁదగి యున్నది

## ప్రాచీన మతమున సర్వనామ సంజ్ఞ లేదు

1 బహుత్వమున 'లు-ల' ల చోట 'రు-ర'లు (ఱు-ఱ) వచ్చుట ఉదా వారు-ఇరువురు-ఇరువురన్-అందఱు మొ ఈ లక్షణము సర్వనామేతర నామములందును గలదు ఉదా పగతురు పగతురన్-అల్లురు-అల్లురన్-విలుకాండ్రు-విలుకాఱు-చూపఱు మొ

2 బహుత్వమున మహద్రూపముల వంటివె "మహతీ వాచకముల కగుట ఉదా వారు-ఆ పురుషులు-ఆ స్త్రీలు, అమహన్మహత్యేకవచన రూపము లొక్క రీతినె యుండుట అది ఇది ఇదియు సర్వనామేతర నామములందును గలదు ఉదా హరి-నది-గురువు-వధువు, వచ్చిరి-పురుషులు లేదా స్త్రీలు, పక్షి వచ్చెను మొదలగునవి

3 'సర్వనామ సంఖ్యాభిధాన తద్విశేష్యంబులం దెయ్యది ముందుఁ బ్రయోగింపఁబడు దాని ద్వితీయాదులకుం బ్రథమ బహుళంబుగా నగు' (బా-కార-౨౮వ సూ) ఇట్టి వ్రాఁత యవిమర్శన మూలకము "మా యేవురందు (శల్య-౨వ ఆ-౧౦౦) వాని యన్నింటికంటె (ఉద్యో-౨వ ఆ-౭౫)" అని పయి సూత్రమునకు విరుద్ధముగఁ బ్రయోగములు గలవు మఱియుఁ బై సూత్రపు పద్ధతి సర్వనామేతర నామములందును గలదు ఉదా తల్లి ద్రౌపది తొడన్ (జై-౧వ ఆ-చూ-ప్రౌఢ-కార-౨౨వ సూ) సుగుణాభిరాముఁడు రామునకున్ (చూ-కార-౩౨వ సూ)

4 ఔపవిభక్తికత్వము ఇది సర్వనామేతర నామములకుఁ బెక్కిటి కమహ దేకత్వమునఁ గల్గును సర్వనామములకును నన్నిటికిని లేదు ఉదా నీటిని-నీటిన్-దానిన్-దానిచేతన్-ఆపక్షి తన చేతన్-ఓపక్షి నీచేతన్ మొదలగునవి

మఱియు సర్వనామ తాంగీకారమున సంస్కృత విలక్షణముగను నీ యాధునికుల యాశయము వెలయుచున్నది పీరి మతమున 'తా' శబ్దము సర్వ నామము తదర్థక సంస్కృత 'ఆత్మన్' శబ్దము సర్వనామము కాదు సంస్కృ తమున ''ఏక-ద్వి'' శబ్దములు తప్పఁ దక్కిన సంఖ్యావాచకములు సర్వనామ ములు కావు ఆధునిక మతమున సంఖ్యావాచకము లెల్ల సర్వనామములె (చూ-బాల-అచ్చి-౨౪వ సూ)

ఇంతియ కాక సూరి 'ఎల్లన్' అనునది యవ్యయ మని కంఠోక్తముగా వచించెను (చూ-బాల-సంధి-౨౪వ సూ) 'ఎల్లరు' సర్వనామ మని సూరి యుదాహరింపకున్నను ప్రౌఢ వ్యాకర్త 'ఎల్లరు-ఎల్లరన్' మున్నగునవి సర్వ నామము లని సూత్రించి యుదాహరించెను (చూ-ప్రౌఢ-శబ్ద-౧౬వ సూ) తదాది శబ్ద సంబంధు లగు 'అతఁడు' మున్నగునవి సర్వనామము లని చెప్పియు సూరి తదాది శబ్ద సంబంధులె యగు ''అంత-ఇంత-ఎంత-అందు-ఇందు-ఎందు ఆపుడు-ఇపుడు'' మున్నగు వానిని సర్వనామములుగా నుదాహరింపలేదు ఇంతే కాక అంద్వాదు లవ్యయములనియు నాధునికులు తలంతురు 'శ-ర' కోశమునం దును సూ-రా-నిఘంటువునందును బైవానిలోఁ గొన్ని సర్వనామములుగా వ్రాయ బడెను

''అందఱు-ఇందఱు'' మున్నగువాని వంటి రూపములె కల 'చూపఱు-పగఱు' అనునవి అందఱ్వాదులవలె సర్వనామములు కావు

## సర్వతాప దాద్యర్థకములు

సర్వతాప దర్థకము ౩౨ (బా-౩/౨౪ I అచ్చి, వ్యా-సం-౨౧౨-I విష) ఇది 'ఆ' శబ్దమూలకము

| | మహ న్మహత్యర్థకము | అమహదర్థకము |
|---|---|---|
| ప్రథ | అందఱు-అందొఱు | అన్ని—అని (అచ్చి-౨౬వ సూ) |
| ద్వితీ | అందఱన-అందొఱను-అందఱిని | అన్నిటిని-అన్నింటిని-మొ |

౧ వ వివ 'అంత + వారు, అందఱు ఇంత + వారు-ఇందఱు మున్నగు ప్రౌఢ వ్యాకరణోక్త (ప్రౌఢ శబ్ద-౮౮వ సూ) వ్యుత్పత్తి సరికాదు అర్థ సందర్భము లేదు కాన నిది 'ఆ' శబ్ద సంబంధి యని మాత్రము చెప్పనగును

౨ వ వివ అం। దొఱకు నిట్టులనియె ద్రుపద విభుఁడు (ఆది-౬వ ఆ-౨౭౪) అందఱ। కును మెలపునఁ జెప్పి వగలఁగుందుచు(శల్య-౧వఆ-౧౨వ ప) అందఱి। కిని దానవ బాధఁ దీర్చి కృతకృత్యుండై (పినవీర-శకుం-బాలక ౧౨౪వ పుట )

౩ వ వివ సర్వతావదర్థక- సర్వార్థకమును, 'తావ' దర్థకమును నని యర్థము

ఇయ దర్థకము ౨౩ (బా-అచ్చి- ౩/౨౪ II వ్యా-సం-౨౧౩ వివ 'ఈ' శబ్ద మూలకము ఇయచ్ఛబ్దార్థకము)

| | మహ న్మహత్యర్థకము | అమహదర్థకము |
|---|---|---|
| ప్రథ | ఇందఱు | ఇన్ని-ఇని (అచ్చి-౨౬వ సూ) |
| ద్వితీ | ఇందఱను-ఇందఱిని | ఇన్నిటిని-ఇన్నింటిని మొ |

కియద్యావ దర్థకము ౨౪ (బా-అచ్చి-౩/౨౪ III వ్యా-సం-౨౧౩ విష సంస్కృత-కియ చ్ఛబ్దార్థకము సంస్కృత యావ చ్ఛబ్దార్థకము ఏ శబ్ద మూలకము)

| | మహన్మత్యర్థకము | అమహదర్థకము |
|---|---|---|
| ప్రథ | ఎందఱు | ఎన్ని-ఎని (అచ్చి ౨౬వ సూ) |
| ద్వితీ | ఎందఱను ఎందఱిని | ఎన్నిటిని-ఎన్నింటిని మొ. |

౧ వ వివ  కియ దర్థము ప్రశ్నార్థము, యావ దర్థము సంబంధార్థము ఉదా  పీ రెందఱు, ఇవి యెన్ని, ఎన్నిగలవో యన్నియు, ఎందఱు గలరో యందఱును మొ

కతిప యార్థకము ౨౫ (బా-అచ్చి-౩/౨౪ IV, వ్యా-సం-౨౧౩ విష ఒక శబ్ద మూలకము ఒక = అల్ప 'కొంచెము' శబ్దపు మూలక మనెడి 'శ-ర', 'సూ-రా-ని' కోశములు సరికావు)

| | మహ న్మహత్యర్థకము | అమహ దర్థకము |
|---|---|---|
| ప్రథ | కొందఱు ......... .. | కొన్ని-కొని (అచ్చి-౨౬వ సూ) |
| ద్వితీ | కొందఱను-కొందఱిని | కొన్నిటిని-కొన్నింటిని మొ |

౧ వ వివ  సంస్కృత కోశముల చొప్పున "కతిపయ" శబ్దము కతి శబ్దార్థకము  మహాకవి ప్రయోగములలో నది యల్పార్థకమై యున్నది  కతిపయ దివసైః (నైష ౪వ సర్గ-౧౨౭వ శ్లో) "కతిపయ దివసైః-ద్విత్రై రేవ దివసైః" (నారాయణీయ వ్యాఖ్య)

౨ వ వివ  'అందఱు-ఇందఱు-ఎందఱు-కొందఱు' శబ్దముల వలెనె "చూపఱు-చూపఱన్ (చూచువారు) పగఱు (పగవారు)-పగఱన్" అను వానిని సాధించికొన వలయును

బహ్వర్థకములు ౨౬ (బా-అచ్చి-౩/౨౪ VI, వ్యా-సం-౨౧౪ విష, 'పెక్కు-పలు' శబ్దములు)

| | మహ న్మహత్యర్థకములు | అమహ దర్థకములు |
|---|---|---|
| ప్రథ | పెక్కండురు-పెక్కండ్రు | పెక్కు-పెక్కులు |
| ద్వితీ | పెక్కండురను-పెక్కండ్రను | పెక్కిటిని-పెక్కింటిని |

| | |
|---|---|
| ప్రథ పలువురు-పలుగురు<br>పలువుండురు-పలుగుండురు<br>పలువుంద్రు-పలుగుంద్రు<br>ద్వితీ పలువురను-పలుగురను<br>పలువుండురను-పలుగుండు<br>రను- పలువుంద్రను - పలు<br>గుంద్రను | దీని కమహత్త్వమున వ్యస్తస్థితి లేదు 'పల పలుకులు' మున్నగు రీతివి సమాసగతమె యిది యగును |

## తచ్ఛబ్దార్థక రూపములు

తదర్థకము 'ఆ' శబ్దము ౨౭౭ (బా-అచ్చి-౪/౨౪, వ్యా-సం-౨౧౨ I విష 'ఆ' శబ్దము-వాడు, అది మొ)

| | మహద్వాచక రూపములు ఏ | బ | మహతీవాచకములు ఏ | బ |
|---|---|---|---|---|
| ప్ర | వాఁడు<br>అతఁడు<br>ఆతఁడు | వారు-వారలు-వాండ్రు<br>('వాంద్రురు' అపశబ్దము) | అది-వారు, | వారలు |
| ద్వి | వానిని<br>అతనిని<br>ఆతనిని | వారిని-వారలను-<br>వాండురను-వాండ్రను<br>('వాండ్రురను' అసాధువు) | దానిని | వారిని<br>వారలను |

### అమహద్వాచకములు

| | ఏక | బహు |
|---|---|---|
| ప్ర | అది-అద్ది-ఆయది-అయ్యది | అవి-అవ్వి-ఆయవి-అయ్యవి |
| ద్వి | దానిని-ఆదానిని అద్దానిని | వానిని-ఆవానిని-అవ్వానిని |
| తృ | దానిచేఁ-ఆదానిచేన్-అద్దానిచేన్ దానన్ (ఇది తృతీయా సప్తమ్యర్థకము) | వానిచేన్-వానన్ (ఇది తృతీయా సప్తమ్యర్థకము) |

౧ వ వివ  తదర్థకము-సంస్కృత తచ్ఛబ్దార్థకము  నామ పునర్గ్రహణమందును యచ్ఛబ్ద సంబంధమునందును నిది వాడఁబడును  ఉదా  నామః రాముఁడు వచ్చె, వాఁడు గొప్పవాఁడు సంబంధ  ఏరాముడు వచ్చెనో వాఁడు గొప్పవాడు  నామ పునర్గ్రహణమునందును నామమునే వాడుట యరుదుగఁ గలదు  దేవతలను మాని, నలుని వరించుట వేల్పులు కోపించిరి (అర-౨వ ఆ ౧౧౪) నామ పునర్గ్రహణమున 'ఈ' శబ్దము నిల్పుటయుఁగలదు ఉదా · పురుషునకుఁ దేజంబు కర్మంబు, దీని విడిచి (సభా-౨వ ఆ-౨౬౯)

౨ వ వివ  అంత (ఆ పరిమితి)-అందు (ఆ చోటు)-అప్పుడు (ఆ కాలము)-అట్టు-అటు (ఆ విధము)-అటన్ (ఆ చోటియందు)-అల్ల (నిర్దేశార్థకము) మున్నగునవి 'ఆ' శబ్ద మూలకములు  వీనిలోఁ గొన్నిటికిఁ గొన్ని విభక్తులందు మాత్రము వాడుక గలదు  అంత  అంతన్-అంతటన్-అంతలు-అంతకున్-అంతనుండి-అంతకంటెన్-అంతలోన్- మొ  అందు  అందుకయి-అందులకున్ అందుకున్-అందున్-అందుండి-అందులోన్  మొ  అప్పుడు  అప్పటినుండి-అప్పటికంటెన్-అప్పటిలోన్-అప్పటికిన్ మొ  అట్టు-అట్టులు-అటులు-అట్టులన్-అట్లు-అట్లన్ మొ  (''అక్కడ-అచ్చటు'' అనునవి సమాసములు)

౩ వ వివ  'ఆ' శబ్దము తచ్ఛబ్దార్థకమే యైనను వాని వాడుకలలో భేదము గలదు 'తస్య+పుత్రః-తత్పుత్రః' అని యైనట్లు ''వాని యొక్క + కొడుకు-ఆ కొడుకు'' అని కానేరదు 'వాని కొడుకు' అనియే యగును (చూ-సమా-౭౨వ సూ)

౪ వ వివ  'ఆ' శబ్ద రూపములు కొన్ని యెడల నర్థశూన్యము లగును. ఉదా  ఒక్క సత్క్రతు వది మేలు (ఆది ౪వ ఆ ౯౪) పువ్వుల యవ్విధంబునన్ (ఆది ౧వ ఆ ౭౬)

౫ వ వివ  అల్ల శబ్దము నిర్దేశవాచక మగును  ఉదా  అల్ల యతి ధవళంబైన యశ్వంబు ఆది-౨వ ఆ-౩౧)

౽వ వివ 'అ-ఈ' శబ్దముల ప్రథమాంతముల మీఁద 'ఎ' శబ్దము నిల్చిన నవి నిర్దేశవాచకము లగును ఇవి ప్రాచీన రూపములు వీఁడె వచ్చెం గంతీసుత మధ్యముండు (విరా ౪వ ఆ ౯౫) వాఁడె-అదె-ఇదె-అవె-ఇవె-వారె-వీరె మొ 'అ-ఈ' శబ్దముల ప్రథమాంతముల పైని 'కొమ్ము' రూపాంతర మగు 'కో' శబ్దము నిల్చినను నిర్దేశవాచకములె యగును ఇవి యర్వాచీన రూపములు వాఁడుగో-వీఁడుగో - వారుగో-వీరుగో - అదిగో-ఇదిగో-అవిగో - ఇవిగో (అడుగో-ఇడుగో-అరుగో-ఇరుగో-అదుగో-ఇదుగో మొదలగునవి వ్యావహారిక రూపములు) ఇది 'కొమ్ము' శబ్దరూపాంతరము గాన "కళ" "అదిగో కానం బడియె (వరాహ-౬వ ఆ-౧౪-సూ-రా-ని)" ఇది ద్రుతప్రకృతికముగాను వాడఁబడును "ఇది గోఁ బురుషాయితము (కళా-౧వ ఆ-౩౫" ఈ పక్షమున నిది 'కొను' ధాతువుయొక్క 'తుము'న్నంతరూప మనఁదగును "నీ వెట్టి బంగారు గాను" అను దానివలెనె యర్థ విశేషబోధ మనఁదగును 'ఇదె కొనుఁగాక' అని దీని కర్థ మెన్నునది కళ యగునపుడు "ఇదె కొమ్ము" అని యర్థము చేయనగును "వీఁడు గొమ్మని చెయి సాచి (ఉ-హరి-౫వ ఆ-౧౪౮) "ఇదియో" (ఆది-౬వ ఆ - ౧౭౩) ఇది యపపాఠము 'ఇదియౌన్' అని కవి ప్రయుక్త మనఁదగును కాన 'ఇదియో' అనునది 'ఇదిగో' అను దాని పర్యాయ మనరాదు

## 'ఇదమ్' శబ్దార్థక రూపములు

ఇదమర్థకము 'ఈ' శబ్దము ౫౮ (బా-అచ్చి-౫/౨౪, వ్యా - సం ౨౧౬ విష)

| మహద్వాచకము | | మహతీవాచకము | |
|---|---|---|---|
| ఏ | బ | ఏ | బ |
| ప్ర-వీఁడు, ఇతఁడు, ఈతఁడు | వీరు - వీరలు - వీండురు-వీండ్రు (వీండ్రురు అసాధువు) | ఇది | వీరు-వీరలు |
| ద్వి-వీనిని, ఇతనిని, ఈతనిని | వీరిని-వీరలను-వీండురను-వీండ్రను (వీం డురను అపశబ్దము) | దీనిని | వీరిని-వీరలను |

## అనుహదర్థక రూపములు

| ఏ | బ |
|---|---|
| ప్ర-ఇది-ఇద్ది-ఈయది-ఇయ్యది | ఇవి-ఇవ్వి-ఈయవి-ఇయ్యవి |
| ద్వి-దీనిని | వీనిని |
| తృ-దీనిచేన్ | వీనిచేన్ |
| తృ,సప్త-దీనన్ | వీనన్ (తృ, సప్త) |

౧వ వివ ఇది 'ఇదమ్-అదస్-ఏతద్' అను సంస్కృత శబ్దముల యర్థము గలది 'పురోవర్తిని-సమీప వర్తిని' దెలుపును నామ పునర్గ్రహణమున 'ఈ' శబ్ద రూపములను వాడుటయుఁ గలదు (చూ ౩౩ వ సూ ౧వ వివ) పురుషునకుఁ దేజంబు కర్మంబు, దీని విడిచి(సభా-౨వ ఆ-౨౬౯)

౨వ వివ ఇంత (ఈ పరిమితి),-ఇందు (ఈ స్థలము)- ఇప్పుడు (ఈ సమయము) 'ఇక్కడ-ఇచ్చట' అనునవి 'ఈ' శబ్దకముతోడి సమాసములు 'ఇట్టు'-ఇటు (ఈ విధము) - ఇల్ల (ఈ సమీప స్థలము-నిర్దేశ వాచకము)-ఇటన్ (ఈ స్థలమందు) మున్నగునవి 'ఈ' శబ్ద మూలక రూపములు వీనిలో గొన్నిటికిఁ గొన్ని విభక్తుల రూపములు మాత్రము గలవు ఇంత ఇంతన్ — ఇంతటన్-ఇంతలు - ఇంతకున్-ఇంత నుండి - ఇంతటి నుండి-ఇంత కంటెన్ - ఇంతలోన్ మొ ఇందు · ఇందుకై - ఇందులకై - ఇందులకున్-ఇందున్-ఇందుండి-ఇందులోన్ మొ ఇప్పుడు ఇప్పటి నుండి-ఇప్పటి కంటెన్-ఇప్పటికిని-ఇప్పటిలోన్ మొ ఇట్టు-ఇటు ఇట్టులు-ఇటులు ఇట్లు-ఇట్టులన్-ఇటులన్-ఇట్లన్ మొ

౩వ వివ 'ఈ' శబ్ద మిద మాద్యర్థకమె యైనను వాడుకలో భేదము గలదు "ఏతస్య + పుత్రః -ఏతత్పుత్రః" అన్నట్లు "వీనియొక్క + కొడుకు-ఈ కొడుకు" అని కానేరదు "వీని కొడుకు'' అనియే కావలయును

౪వ వివ 'ఈ' శబ్ద రూపములును నడుడుగ నర్థ శూన్యములుగా వాడఁబడును ఉదా . ఈ మునిపల్లె నుండు టిది యేలం"(ఆది ౪వ ఆ-౫౪)

‘ఈ’ శబ్ద మత్యంత సామీప్యమును దెల్పును ఉదా. ఈ యున్న పౌష్య ప్రోలికి (ఆది ౧వ ఆ—౧౧౭)

౫వ వివ ‘ఇల్ల’ శబ్దము నిర్దేశ వాచకము “ద్విపద ఇల్ల కప్పడి సంగమేశ్వరంబందు (బసవ- ౧వ ఆ-౫౫౧) ఇతర ద్రావిడ భాషలలో విస్తారముగా వాడుక యున్నను దెల్గున (‘ఉ’ దూర సమీప మధ్యస్థ వాచి) ‘ఉ’ శబ్దమునకు ‘ఉల్ల’ శబ్దము మాత్రము గలదు ఉల్ల తెల్లని తురగోత్తము వాలంబు (ఆది ౨వ ఆ-౩౪)

౬ వ వివ ‘ఆ’ శబ్దము నుండి వలెనె (ఆచ్చి-౫౭ వ సూ-౯వ వివ) ‘ఈ’ శబ్దము నుండియు వివిధము లగు నిర్దేశ వాచకములు బయల్వెడలును. వీఁడె - వీరె - ఇదె - ఇవె (ఇవి ప్రాచీన రూపములు-వీడుగో - వీడుగోవ్ వీరుగో - ఇదిగో - ఇవిగో మొ ఇడుగో - ఇరుగో- ఇదుగో - ఇవుగో - వ్యావహారిక రూపములు ఇవి యర్వాచీన రూపములు)

## యత్కిమర్థక రూపములు

యత్కిమర్థకము ‘ఏ’ శబ్దము ౫౬ (బా ఆచ్చి ౬/౨౪ ౭/౨౪ సూ, వ్యా సం- ౨౧౭ విష)

మహద్వాచక రూపములు

| | ఏ | బ |
|---|---|---|
| ప్ర. | ఏఁడు-ఏవాఁడు-ఎవ్వాడు-ఎవ్వఁడు- ఎవఁడు-వేఁడు (ఎతఁడు-ఏతఁడు- వీనికిఁ బ్రయోగములు లేవు) | ఏరు- ఏవారు- ఏవారలు-ఏ వాండురు-ఏవాండ్రు- ఎవ్వారు- ఎవ్వారలు- ఎవ్వాండురు ఎవ్వాండ్రు)-ఎవ్వరు-ఎవ్వండురు-ఎవ్వండ్రు- ఎవరు- ఎవండురు-ఎవండ్రు-వేరు |
| ద్వి | ఏనివి- ఏవానిని -ఎవ్వానిని ఎవ్వనిని -ఎవనిని - వేనిని (ఎతనిని-ఏతనిని-ప్రయోగములు లేవు) | ఏరిని-ఏవారిని - ఏవారలను - ఏవాండురను - ఏవాండ్రను - ఎవ్వారిని-ఎవ్వారలను-ఎవ్వాండురను- ఎవ్వాండ్రను- ఎవ్వరిన్-ఎవండురను-ఎవ్వండ్రను - ఎవరిని-ఎవండురను- ఎవండ్రను-వేరిని |

## మహతీ వాచక రూపములు

| | | |
|---|---|---|
| ప్ర. | 'ఏది' (ఏస్త్రీ) అనెడి 'శ ర' 'సూ-రా-ని' కోశ ములు ప్రామాదికములు మహతి వాచ్యంబగు నే నేకత్వంబున యత్క్రియార్థక శబ్దంబు "ఎవ్వరిత ఎవ్వ ర్త-ఎవ్వత-ఎవరిత-ఎవ ర్త-ఎవత-ఎవ్వరితి-ఎవ్వ ర్తి-ఎవ్వతి-ఎవరితి-ఎవ ర్తి-ఎవతి-ఎవ్వరితె-ఎవ్వ ర్తె-ఎవ్వతె -ఎవరితె-ఎవ ర్తి-ఎవతె-ఎవ్వర్తుక - ఎవ్వతుక - ఎవర్తుక-ఎవతుక'' అని యిరువది రెండు రూపంబులు వడయును | ఏరు-ఏవారు-ఏవారలు-ఎవ్వారు - ఎవ్వారలు-ఎవ్వరు - ఎవరు-వేరు |
| ద్వి | ఎవ్వరితను- ఎవ్వ ర్తను- ఎవ్వతను- ఎవరితను-ఎవ ర్తను- ఎవతను- ఎవ్వరితిని-ఎవ్వ ర్తిని-ఎవ్వతిని-ఎవరితిని-ఎవ ర్తెని- ఎవతిని మొదలగునవి | ఏరిని-ఏ వారిని-ఏవారలను- ఎవ్వారిని- ఎవ్వారలను- ఎవ్వరిని- ఎవరిని-వేరిని |

## అమహద్వాచక రూపములు

| | ఏ | బ |
|---|---|---|
| ప్ర | ఎది-ఏది-ఎద్ది- ఏయది-ఎయ్యది | ఎవి - ఏవి - ఎవ్వి-ఏయవి-ఎయ్యవి |
| ద్వి | దేనిని-ఏదానిని-ఎద్దానిని | వేనిని - ఏ వానిని - ఎవ్వానిని |
| తృ. | దేని చేతన్....... .. . . | వేని చేతన్ |
| తృ | సప్త దేనన్ (దీనికిఁ బ్రయోగములు లేవు) | వేనఁ (దీనికిఁ బ్రయోగము లేదు) |

౧వ వివ సంస్కృత మందలి యచ్ఛబ్దము తచ్ఛబ్ద సంబంధమును దెల్పును కిం శబ్దము ప్రశ్నార్థకము తెలుఁగున నీ రెండర్థములను నొక్క "ఏ" శబ్దమె యొసంగును కాన నిది యత్క్రియార్థక మయ్యెను ఉదా ఏది హృద్యమో యది మా కిష్టము (అర ౧వ ఆ-౩౦) ఎవ్వరు కురు పాండవులలో మొదట రణమునకు దిగిరి (భీష్మ ౧వ ఆ-౨౩౨)

౨వ వివ 'వేఁడు' శబ్దము మహాకవి ప్రయుక్తము క పార్థుఁడు వేఁడీ

(ద్రోణ- ౩వ ఆ-౪౯) వేఁడు రాముండు (రామా- ౭వ ఆ-ప్రౌ- శబ్ద-౫౩) వేఁడీ డాఁగె నాకో (ద్రోణ-౧వ ఆ-౩౭౪) వేఁడి దయోదార విమల మానసుఁడు వేఁడి...। వేఁడి. (రంగ-రా- ౧౨౨౧-౧౨౨౨వ పద్య-౧౪౦వ పుట యాని-ముద్ర)

౩వ వివ 'ఏ' శబ్ద రూపములు'ను'శబ్దాంతములై సాకల్యముం దెల్పును. ఉ ఎవ్వరుం జెప్పరు ఎవ్వరి కంటెను (అర ౨వ ఆ-౩౪౧) 'అందఱును-అందఱ కంటెను' అని యర్థములు

౪వ వివ 'ఇ-ఈ'లతోఁ గూడిన 'ఏ'శబ్ద ప్రథమా రూపములు'ఎక్కడ నున్నాఁడు' మున్నగు నర్థ విశేషముల నిచ్చును "క పార్థుడు వేఁడీ (ద్రోణ-౩వ ఆ-౪౬), ఏది యేదీ యిది చాలఁ గ్రొత్త(కళా-౧వ ఆ - ప్రౌఢ-శబ్ద-౦౭).

౫వ వివ ఇది యత్కామర్థకమె యయ్యు వాడుకలో భేదము లున్నవి "యస్య+పుత్రః -యత్పుత్రః" అనునట్లు"ఎవ్వనియొక్క + కొడుకు-ఏ కొడుకు" అని కానేరదు "ఎవ్వని కొడుకు'' అనియే యగును

౬వ వివ "ఎంత (ఏ పరిమితి),ఎందు(ఏచోటు) ఎప్పుడు(ఏ సమయము, 'ఎక్కడ-ఎచ్చటు' అనునవి 'ఏ' శబ్ద ఘటిత సమాసములు), ఎటఁ (ఏ స్థలమందు)" మున్నగునవి 'ఏ' శబ్ద మూలకములు వీనిలోఁ గొన్నిటికి-గొన్ని విభక్తుల రూపములు మాత్రము గలవు ఎంత ఎంతన్-ఎంతటఁ) ఎంతకున్ - ఎంతలోఁ - ఎంతటినుండి - ఎంతనుండి ఎందు ఎందుకున్-ఎందులకున్ - ఎందున్ - ఎందుండి - ఎందులోన్ ఎప్పుడు ఎప్పటినుండి-ఎప్పటికిన్-ఎప్పటికంటెన్-ఎప్పటిలోన్ ఎట్టు, ఎటు ఎట్టులు-ఎటులు-ఎట్లు-ఎట్టులన్-ఎట్లన్ మొ

## పూజ్యార్థకత-యుష్మదర్థకశబ్దము

తద్ధాదులు మహతీవాచకంబులు "ఆమె-ఆపె-ఆకె ఈమె-ఈపె-

ఈకె ఏమె-ఏపె-ఏకె" అను పూజ్యార్థక రూపంబులు వడయు ౬౦ (బా-ఆచ్చి-౮/౨౪ వ్యా-సం ౨౧౮ విష) *

'అతఁడు-ఆతఁడు-ఇతఁడు-ఈతఁడు' అను మహద్వాచకముల కిట్టి పూజ్యార్థకత లేదు "అతగాఁడు-ఆతగాఁడు-ఇతగాఁడు-ఈతగాఁడు" అను రూపము లర్వాచీనములు 'ఆయన-ఈయన' మున్నగు సమాస రూపము లుత్తరపదముల శక్తిచేఁ బూజ్యార్థకములు కానోపును 'ఏమె' (ఏ పూజ్యురాలు) అను వాడుకకుఁ గవి ప్రయోగము లభింప లేదు

యుష్మదర్థకము 'నీ' శబ్దము ౬౧ (బా-ఆచ్చి - ౬/౨౪ వ సూ వ్యా-సం-౨౧౯ I విష)

| | ఏ | బ |
|---|---|---|
| ప్ర | నీవు, ఈవు (అర-౧వ ఆ-౪౬) | మీరు, మీర్, మీరలు - మీరల్ - ఈరు - ఈరలు (ఆది - ౭ వ ఆ-౨౧౯) |
| ద్వి | నిన్నునున్, నిన్నున్, నినున్, నిన్ (ఆది ౬ వ ఆ-౧౪౫) | మిమ్మున్, మిమున్ ('మిమ్ములన్' అపశబ్దము) |
| తృ | నీ చేతన్ | మీ చేతన్ |
| చ | నీకున్, ఈకున్ (చంద్రా-౩ వ ఆ-౧౧౮) | మీకున్, ఈకున్ (శివరా-౪ వ ఆ-౬౩ |

* 'అతఁడు-ఇతఁడు' మున్నగునవియుఁ బూజ్యార్థకములె యని సూరి వ్రాసెను కాని కవి ప్రయోగములం దట్టి పూజ్యతా నియమము లేదు "ఏమి సేసె నితఁ డీతని తమ్మునిఁ గూలనేసి యు। క్కెక్కిన పార్థుపై గవిసెనే. .। అక్కడ వీఁడు లేఁడె" (ఉద్యో-౨ వ ఆ-౧౯౨ వ ప) "వాఁడిట వచ్చునాఁడొ యే। నందుల కేఁగుదాననొ రయంబున నాతని నిశ్చయింపగా" (అర-౨ వ ఆ-౨౦౩) దమయంతి నలుని విషయమున వాడిన వాడుక లివి

# అస్మ దాత్మార్థకములు

అస్మదర్థకము 'నా' శబ్దము ౬౨ (బా-అచ్చి-౧౦/౨౪వ సూ, వ్యా-సం-౨౧౯ I విష)

| | ఏ | బ |
|---|---|---|
| ప్ర | నేను-ఏను-నేన్-ఏన్ | మేము-ఏము-నేము (శ్రీరంగ-౩ వ ఆ-౫౯౧ వ ప) |
| ద్వి | నన్నునున్-నన్నున్-ననున్-నన్ (అను-౩ వ ఆ-౨౬౨ వ ప) | మమ్మున్-మమున్ ("మమ్ములన్" అపశబ్దము) |
| తృ | నా చేతన్......... | మాచేతన్ |

ఉభయార్థకము 'మన' శబ్దము ౬౩ (బా-అచ్చి-౧౧/౨౪వ సూ, వ్యా-సం-౨౧౯ I విష)

'నీవును నేనును' అని యర్థము నిత్యబహువచనము

ప్ర మనము ద్వితీయ మనలను (ఆది-౧ వ ఆ-౬౩) తృతీ మనచేతన్ మనలచేతన్ (ఇది నన్నయ సమ్మతము కాదు ఉ-హరి-౬ వ ఆ-౫౪)

ఆత్మార్థకము 'తా' శబ్దము ౬౪వ (బా-అచ్చి-౧౨/౨౪వ సూ వ్యా-సం-౨౧౯ I విష)

| ఏక | బహు |
|---|---|
| ప్ర తాను ..... | తాము-తారు-తమరు (ఇది నన్నయ సమ్మతము కాదు, కృష్ణ-౨వ ఆ-౩౮, సూ-౭-ని) ఇట 'తారు' అనియు నిల్పనగును |
| ద్వి తన్నునున్-తన్నున్-తనున్-తన్ (ఆది ౩వ ఆ ౧౧౦) | తమ్ముఁన్-తమున్ |
| తృ తన చేతన్ .. . .. | తమ చేతన్ |

## 'తా' శబ్దము ఏకార్థకము

౧ వ వివ 'తా' శబ్ద మర్థ విశేష బోధకము నగు (నామాస్మదర్థాభిధాయి, ప్రౌఢ శబ్ద-౭౮) తనకు మఱి తాన చుట్టంబు (ఆది-౪వ ఆ-౫౮ తనకు-స్త్రీకి) తన కిష్టుఁడున్ (ఆది-౧వ ఆ-౨౫, తనకున్-నాకున్) నామ పునర్గ్రహణంబునందును 'తా' శబ్దము నిల్చుట గలదు ఉదా విదురుఁడు తాను ప్రబోధించె (ఆది-౬వ ఆ-ప్రౌఢ-శబ్ద-౭౯వ సూ)

౨వ వివ కర్తృ బహుత్వంబున 'తన తనకు' 'తమతమ' యగు తమ తమ పుత్త్రుఁడుగా (ఆది-౩వ ఆ-ప్రౌఢ-శబ్ద-౭౯), తన తన (శల్య-౨వ ఆ-౧౮౦)

౩ వ వివ 'తా' శబ్ద బహువచనము సంబంధార్థమునందును నిల్చును "ద్విపద-తమ యన్న... । అమల మానసుఁడు...రంగ-రా-అయోధ్యా-౧౩౨వ పుట, యూని-ముద్ర, చూ-వ్యా-సం-౨౧౧, IV విష ౮౪౦వ పుట)

ఏకార్థక సంఖ్యావాచి 'ఒక' శబ్దము ౬౫ (బా-అచ్చి-౧౩-౧౪-౧౫/౨౪ సూ, వ్యా-సం-౨౨౦ I II విష)

## మహ దర్థక రూపములు

| ఏక | బహు |
|---|---|
| ప్ర ఒకఁడు | ఒకరు-ఒకండురు-ఒకంద్రు |
| ఒకొఁడు | ఒకొరు-ఒకొండురు-ఒకొంద్రు |
| ఒక్కఁడు | ఒక్కరు-ఒక్కండురు-ఒక్కంద్రు |
| ఒకొక్కఁడు | ఒకొక్కరు-ఒకొక్కండురు-ఒకొక్కంద్రు |
| ఒకరుఁడు | ఒకరులు-ఒకర్లు-ఒకళ్ళు |
| ఒకొరుఁడు | ఒకొరులు-ఒకొర్లు-ఒకొళ్ళు |
| ఒక్కరుఁడు | ఒక్కరులు-ఒక్కర్లు-ఒక్కళ్ళు |
| ఒకొక్కరుఁడు | ఒకొక్కరులు-ఒకొక్కర్లు-ఒకొక్కళ్ళు |
| ఒకరువుఁడు | ఒకరువులు |
| ఒకొరువుఁడు | ఒకొరువులు |
| ఒక్కరువుఁడు | ఒక్కరువులు |
| ఒకొక్కరుఁవుడు | ఒకొక్కరువులు |
| ఒరుఁడు | ఒరులు (ఇతరార్థకము, ఏకార్థకము) |
| ఒరువుఁడు | ఒరువులు ( ,, ) |
| ఒండు | ఒండులు-ఒండ్లు ( ,, ) |
| ఒడ్డు | ఒడ్డులు-ఒడ్లు ( ,, ) |

౧వ వివ ఒకొఁడు సీ అతిగించుకొనఁడె భూదేవుఁ డొకొక్కరుఁడు గినిసి (అర-౫వ ఆ-౨౦) కం-కురిసినఁ దత్ క్షణమె యొకొక్కొనిపై నేచున్ (అర-౪వ ఆ-౬౧) ఒకళ్ళు ఒరువులు కం-గిరిజయు గిరీశుఁడును నొం డొరువులకై తప మొనర్చి యొకరు నొకళ్ళన్ (అను-౩వ ఆ-౧౪౧) ఒరులు-ఇతరులు కం మాయ ట్లిడుమలఁబడిన నరులు గలరె యొరులు పరమ మునీంద్రా (అర-౨వ ఆ ౩వ ప) ఒకళ్ళు-స్త్రీ వాచకము చం .. ఒకళ్ళొకళ్ళకై యెదురుగ వచ్చి యొక్కయిద్దఱు ముద్దియ లొత్తిరవ్విభున్ (నైష-౩వ ఆ-౧౭౬ వ ప) ఈ శబ్దము రూపముల కెల్లఁ బ్రయోగము లియ్యలేదు గాన యథా ప్రయోగముగ నెన్నునది

## మహత్త్వర్థకములు

(వీనిని సైతము యథా ప్రయోగముగ నెన్నునది)

| | ఏక | బహు |
|---|---|---|
| ప్ర | ఒకరిత-ఒకర్త-ఒకర్తు - ఒకర్తుక-ఒకత-ఒకతుక-ఒకోరిత-ఒకోర్త-ఒకోర్తు-ఒకోర్తుక-ఒకోత-ఒకోతుక- ఒక్కరిత-ఒక్కర్త-ఒక్కర్తు-ఒక్కర్తుక-ఒక్కత-ఒక్కతుక-ఒక్కోరిత-ఒక్కోర్త-ఒక్కోర్తు-ఒక్కోర్తుక - ఒక్కోత-ఒక్కోతుక-ఒకరితి-ఒకర్తి-ఒకతి-ఒకోరితి-ఒకోర్తి-ఒకోతి-ఒక్కరితి-ఒక్కర్తి-ఒక్కతి-ఒక్కోరితి-ఒక్కోర్తి-ఒక్కోతి-ఒకరితె-ఒకర్తె-ఒకతె-ఒకోరితె-ఒకోర్తె-ఒకోతె-ఒక్కరితె-ఒక్కర్తె-ఒక్కతె-ఒక్కోరితె-ఒక్కోర్తె-ఒక్కోతె-ఓర్త-ఓర్తి-ఓర్తు-ఓర్తుక | ఒకరు-ఒక్కరు-ఒకోరు-ఒక్కోరు - ఒకరులు-ఒకర్లు-ఒకళ్ళు-ఒకోరులు-ఒకోర్లు-ఒకోళ్ళు మొదలగునవి |

## అమహద్వాచక రూపములు

| | ఏక | బహు |
|---|---|---|
| ప్ర | ఒకటి-ఒకోటి-ఒక్కటి-ఒకఁడు-ఒకోఁడు-ఒక్కఁడు-ఒక్కోఁడు-ఒండు 'ఎక్కటి-ఒంటి' అనునవి యసహాయార్థకములై యేకత్వమును బోధించును 'ఒకఁడు-ఒకోఁడు-ఒక్కఁడు-ఒక్కోఁడు-ఒండు' అనునవి యౌపవిభక్తికములు ఉదా ఒకటన్-ఒకంటన్ మొ | అమహత్త్వమున బహువచనము లేదు - 'ఒకట్లు', 'ఒక్కట్లు' అనునవి యగపడుచున్నవి |

౨ వ వివ ఒకొండు (ఒకటి) కం ఒ। క్కొండును లేదధిప సీదు కొడుకులు (స్త్రీ-౧వ ఆ-౮౩) ఒ। క్కొట నందఱు గురు నను జ్ఞగాని (ఆది-౫వ ఆ-౨౩౩) కం-యాగ కరణం। బుని దక్కగా నొంటి గలుగ బోలునె చెపుమా (శాంతి-౫వ ఆ-౩౦౮) ఒకటి చేయు కం। బెను హితమైన కృత్య మొకటిం గలదే ఉద్యో-౩వ ఆ-౧౫౮) ఎక్కటి, ఒంటి ఎక్కటి కయ్యము చం-అసమున...ఒం। టి సనుట (విరా-౫వ ఆ-౨౩౪)

## ద్వి ప్రభృతులు

'ద్వి' ప్రభృతి సంఖ్యా వాచకంబులు మహన్మహ త్యమహదర్థకంబులు ౬౬ (బా-అచ్చి-౧౬-౧౭/౨౪ సూ వ్యా-సం-౨౨౨-౨౨౩ విప)

| మహ న్మహత్యర్థకములు | అమహ దర్థకములు |
|---|---|
| ఇద్దఱు-ఇరువురు | రెండు |
| మూవురు-ముప్వురు-మువురు | మూఁడు |
| నలువురు | నాలుగు |
| ఐదువురు (ఏవురు) | అయిదు (ఏను) |
| ఆఱువురు | ఆఱు |
| ఏడువురు | ఏడు |
| ఎనమందురు-ఎనమంద్రు (చూ-అచ్చి-౧౪వ సూ ౧వ విప) | ఎనిమిది |
| తొమ్మండురు (తొమ్మంద్రు) | తొమ్మిది |
| పదురు (పదుండురు) | పది |
| పదుంద్రు (పదువుండురు-పదువుంద్రు) | |
| పదునొకరు | పదునొకటి |
| పన్నిద్దఱు (పన్నిరుగురు) | పంద్రెండు |
| పదుమూవురు | పదుమూఁడు |
| పదునలువురు | పదునాలుగు |
| పదునైదువురు | పదునైదు (పదునేను) |

| | |
|---|---|
| పదునాఱువురు | పదునాఱు |
| పదునేడువురు | పదునేడు |
| పదునెనమండురు | పదునెనిమిది |
| పందొమ్మండురు | పందొమ్మిది |
| ఇరువండురు | ఇరువది |
| ఇరువదియొకరు | ఇరువది యొకటి |
| ముప్పండురు | ముప్పది |
| నలువండురు | నలువది |
| ఏఁబండురు | ఏఁబది |
| అఱువండురు | అఱువది |
| డెబ్బండురు | డెబ్బది |
| ఎనుబండురు | ఎనుబది |
| తొంబండురు | తొంబది |
| నూఱువురు | నూఱు |
| వేవు రు | వేయి |

ఇత్యాదు లూహ్యంబులు

౧ వ వివ 'ఇరువురు' మున్నగువాని 'వు' వర్ణముచోట 'గు' వర్ణ మర్వాచీనముగా నాదేశ మగుచున్నది * కాన 'ఇరువురు' మున్నగు పై

---

* సూరి 'గు' వర్ణమునె నిల్పి గకారమునకు 'వ' కారమును విధించెను (బా-ఆచ్ఛి-౨౭ వ సూ) కావి వీనిలోని 'గ' కార మర్వాచీనము 'వ' కారమె ప్రాథమికము "మూఁడు + వారు = మూవురు వేయి + వారు = వేవురు" అని వాని వ్యుత్పత్తిని గ్రహింపవలయును గకార ఘటిత రూపములు ప్రాచీనకాలమున లేనేలెవు కం దేవర । వేవురు (అర-౨ వ ఆ-౩౫౩) ఉ ఆర్వురు. .। ఉర్వి . . (విక్ర-౨ వ ఆ ౩౪) "ఆవేశాశ్చవు రూరశ్చ" అని యధర్వణుఁడు 'వ' కార ఘటితమునే విధించెను (వ్యా-సం-౨౨౦-౨౨౪ విష) "బాంధవ—బందుగు" మొ వికృతులు నిట్టివి గలవు

యుదాహృతులం దెల్ల 'ఇరుగురు' అను 'గ' కార ఘటిత రూపాంతరములను గ్రహింపవలయును అట్లె 'ఎనమండురు-తొమ్మండురు-పదుండురు' మున్నగు చోటులం దుల్లోపము (చూ-అచ్చి-౧౨ వ సూ) చేసి 'ఎనమంద్రు' మున్నగు రూపాంతరములను గ్రహింప వలయును అట్లె 'నల్వురు-ఆర్వురు' మున్నగు రూపాంతరములను గ్రహింపవలయును (అచ్చి-౨౯ వ సూ) అట్లె "అయిదు-ఐదు, పదునయిదు-పదునైదు'' మున్నగురీతిని రూపద్వయమును గ్రహింపవల యును (క్రియా-౧౦౭ వ సూ).

## రూపాంతర వివృతి

౨ వ వివ గ్రంథ విస్తరభీతిచే నుదాహరింపలేదు గాన పై పట్టికలో 'ఒకరు' మున్నగుచోట్ల వాని వాని రూపాంతరములను జేర్చిన రూపములను సయితము గ్రహింపనగును ఉదా పదునొకరు-పదునొక్కరు-పదునొకొరు-పదునొక్కొరు మొ (చూ-అచ్చి-౬౫ వ సూ) పదునొకర్తు-పదునొకొర్తు మొ (చూఅచ్చి-౬౫ వ సూ) పదునొకటి-పదునొక్కొటి-పదునొక్కఁడు-పదునొక్కొఁడు-పదునొకంటన్-మొ (చూ-అచ్చి-౬౫ వ సూ)

౩ వ వివ 'పంద్రెంఁడు' మొదలగు చోటులందు 'యును' శబ్ద ఘటిత రూపములును గన్పట్టుచున్నవి ఉదా! పదియు రెండు-పంద్రెండు మొ అక్కజ వనమునఁ బదియు రెండేఁడులు (ఆది ౮ వ ఆ ౧౯) పదియు నొక్కంద్రు రుద్రుల (కాశీ ౭ వ ఆ-ప్రౌఢ)

౪ వ వివ 'ఇరువది' మున్నగువానికి 'ఇరువై' మున్నగునవి యర్వాచీన రూపాంతరములు గన్పట్టుచున్నవి మ ఇరువై నాలుగు మూర్ల మేర (కాశీ ౧ వ ఆ-౫౩)

౫ వ వివ "ఎనిమిది + నూఱు-ఎనమన్నూఱు, తొమ్మిది + నూఱు-తొమ్మన్నూఱు" అను రూపములును, వానికి ''ఎనమనూఱు-తొమ్మనూఱు'' అను రూపాంతరములును గన్పట్టుచున్నవి గీ తొమ్మనూఱును దొంబది

తొమ్మిదియును (భీమ ౬ వ ఆ-౬౮) "తొంబనూఱును" అనెడి 'శ-ర', 'సూ-రా-ని' కోశముల పాఠము లపపాఠములు

## సంఖ్యావాచక విశేష రూపములు

౬ వ వివ సంఖ్యావాచకములకు మహత్త్వమున 'వారు' శబ్దముతో సమాసము ('వురు-గురు' అనునవి నిల్వవపు డని తాత్పర్యము) గల్గినపుడు మహత్త్వమందును ''పదులు-నూఱులు-వేలు'' మున్నగు 'లు' వర్ణక ఘటిత రూపములె యరుదుగ నిల్చును ఉదా అబ్జనాభులు నూఱు నైదు పదులు (కాశీ ౬ వ ఆ), అసురు లఱువది వేలు। (ఆర ౪ వ ఆ ౮౧) బ్రాహ్మణు లెనిమిది వేలు... యతులు పది వేలు (ఆర ౫ వ ఆ ౩౦౬) ప్రౌఢ వ్యాకర్త వీని నమహత్కార్య ఘటిత విశేష రూపములుగ సూత్రించుట సరికాదు (ప్రౌఢ-శబ్ద-౧౦౪ వ సూ, చూ-వ్యా-సం-౧౮౬, IV ౨౧౧ I ౨౨౨-విష) పై స్థలము అందు ''ఎనిమిది వేవురు'' మున్నగునవి 'వారు' శబ్ద సామాసిక రూపము లని గ్రహింపవలయును

౭ వ వివ షష్ఠీ' సమాసమున 'షష్ఠి' ద్వితీయా తుల్య రూపమున నిల్వక సంఖ్యావాచక సమాసమునఁ బ్రథమా రూపమున నిల్చుట కొన్ని యెడలఁ గలదు (చూ సమా-౭౨ వ సూ వివృతి) ఉదా ఇరువది యొకటి-ముప్పది రెండు మొ ఇట షష్ఠీ ద్వితీయా రూపమున నిల్చినచో "ఇరువదిటి యొకటి-ముప్పదిటి రెండు" మున్నగు రీతి గల యనిష్టరూపము లవతరించును [1]

౮ వ వివ అమహదర్థక సంఖ్యావాచకములగు ''ఒకఁడు [2], రెండు''

---

1 బాల, ప్రౌఢ వ్యాకరణ పద్ధతి నిట్టి యనిష్టరూపములు దుర్వారములు

2 సూరి 'రెండు' మొదలగునవి యోపవిభక్తికము లనుట పొరపాటు తే గీ తక్కొకంటను లేదు (స్వర్గా ౧ వ ఆ-౮౨)-ఒక్కొకట (ఆది-౫ వ ఆ-౨౩౩), పడనొకొంటికి (ఉద్యో-౪ వ ఆ-౧౪౦) సూరి గా రుదాహరించిన 'ఓరట్టు' శబ్ద మే కోశమందును గానరాదు,

మొదలగునవి యౌపవిభక్తికశబ్దములగుటం జేసి వాని ద్వితీయాద్యేక వచనము లందు 'టి-ంటి' అనునవి వచ్చును (ఔపవిభక్తికముల వివరణము ముందు, చేయఁబడును) ఉదా ఒకటిని-ఒకటన్, రెండిటిని-రెండింటిని-రెంటిని-రెంటను, మూఁడిటిని-మూఁడింటిని- మూఁటిని-మూఁటన్ ఇత్యాదులు

౬ వ వివ 'ఒక' శబ్దంబునకు ఒకానొక, ఒరిమ (ఐకమత్యము), ఒండొక (మఱియొక), కొండొక (అల్ప), ఒండొండ (ఒకటి వెంబడి నొకటి), ఒండొరులు (పరస్పరము) మున్నగు రూపము లర్థవిశేషము లందుఁ గన్పట్టును కందుూత్క్రీడకుఁ గొండొక నేతున్ (విరా ౧ వ ఆ ౧౬౬) దీనికి సూరి వాడిన ట్లొకానొక యను నర్థము (బా ఆచ్చి ౨౪ వ సూ) కానరాదు ఒక శబ్దమున కల్పార్థకత్వమును గలదు ఒక నూఱేఁడులు (మార్క ౧౦౨ వ ఆ) 'ద్వి' శబ్దార్థంబునకు 'ఇనుమడి' (రెండు రెట్లు), 'ఈరాఱు' (పండ్రెండు) 'ఈరేడు' (పదునాల్గు), 'ఇబ్బడి, ఇమ్మడి' (ద్విగుణిత) అనునవి యర్థవిశేషంబులం జూపట్టును 'ఇరాఱు' (పండ్రెండు) అను రూపమును కూచిమంచి తిమ్మకవి మాత్రము వాడెను (రుక్మి ౧ వ ఆ-౪౩)

## పూరణార్థకము 'అవు' అనునది కాదు

సంఖ్యకుఁ బూరణార్థమున 'అవ' ప్రత్యయము తుదిని నిల్చును అది యుత్తరపదముతో సమసించియె యుండును ఉ౭ (బా ఆచ్చి-౨౫ వ సూ, వ్యా సం ౨౨౪ విష)

రెండవ వాఁడు, రెండవది, మూఁడవ పారము

౧ వ వివ దేనిచేత సంఖ్య పూరింపఁబడునో యది పూరణార్థక మనఁబడును "రామకృష్ణు లిద్దఱిలోఁ గృష్ణుఁడు రెండవ వాఁడు" అనుచో 'రామకృష్ణు' లిద్దఱును ద్విత్వ సంఖ్యావయవములె యైనను గృష్ణుఁడు ద్విత్వ సంఖ్యనుఁ బూరించుచున్నాఁడు గానఁ గృష్ణుడు రెండవవాఁ డనవలసెను

౨ వ వివ 'ఆందు-కై ప్రత్యయ స్థలములందు వలెనె 'అవ' ప్రత్యయ స్థలమందును స్వరయతియె చెల్లును ఉదా సీ ఆయువు మొదలి

నాలవ పాలు (శాంతి-౫ వ ఆ-౧౩౬) ద్విపద-ఆదట ద్వాపర మందు విష్ణుండు (బసవ-౬ వ ఆ-౦౪౯) గీ అనఘ మా మామ శకుని నాకై కడంగి (సభా-౨ వ ఆ-౧౭౪)

౩ వ వివ 'అవు - అగు' అను తద్ధర్మార్థక ధాతుజ విశేషణములె యేతత్ప్రత్యయ స్థలములం దెల్ల గ్రహింపఁదగు ననుట సరికాదు పయి శాంతిపర్వ పద్యమందు 'నాలవ పాలు' అనుచో 'నాలవు', అనిన యెడల నాలుగు భాగములను ననిష్టార్థంబు గల్గును మఱియు 'నాల్గవు పాలు' అనక 'నాలవు పాలు' అనుటలో 'గ' కార లోపము గల్గు టెట్లు? 'అవ' ప్రత్యయస్థల మన్ననో ప్రకృతి ప్రత్యయముల యోగమున నట్టి వర్ణలోపాదికము సహజమై యుండును ఇంతియకాక ప్రామాణి కాగ్రసరుఁడగు నథర్వణుఁడు "సమాసేఽవస్తు సర్వదా" అని 'అవ' ప్రత్యయ స్థితి నంగీకరించి యున్నాఁడు సీ ఆయంబునందు నాలవ భాగ మొండె మూఁడవ భాగ మొండె నం దర్థ మొండె (సభా-౧వ ఆ-౪౭) అని నన్నయయుఁ బ్రయోగించియున్నాఁడు

## 'అన్ని' ప్రభృతులు మహతీత్వమున మహత్తుల్యములు

అన్ని ప్రభృతులకును తదన్విత క్రియలకును మహతీ బహుత్వమున మహద్బహువచన రూపములె యగు ౬౦ (బా-ఆచ్చి-౨౬వ సూ వ్యా-సం-౨౨౫ I విష చూ-తత్స-౧౭ వ సూ-౧వ వివ)

వా రిద్దఱు రుక్మిణీ సత్యభామలు వీరు మువ్వురును శ్రీ భూ నీళలు వారు (ఆ స్త్రీలు) వచ్చిరి స్త్రీ లందఱును వచ్చుచున్నారు పదువురు స్త్రీలు గలరు మొ *

---

* 'ఆర్వురు' మొన్నగు చోటులోని ''వురు, గురు''అనునవి 'వారు' శబ్ద రూపములె కదా (చూ-౬౬-ఆచ్చి-టిప్పణము, చూ-సమా-౯౧)

అచ్చిక 'గ-వ'లు కొన్ని యెడలఁ బరస్పరము విభాషగ నా దేశము లగును పదాది 'గ'కారమునకు 'వ' కా రాదేశము లేదు ఉ-(బా-అచ్చి-౨౪వ సూ వ్యా సం-౨౨౬ I)

వకారమునకు గకారాదేశము ఆర్వురు-అర్గురు పలువురు-పలుగురు ముప్వురు-ముగ్గురు నల్వురు-నల్గురు ఇరువురు-ఇరుగురు బందువు-బందుగు (బాన్ధవ) పవడము-పగడము (ప్రవాళ) ఇవము-ఇగము (హిమ) 'గ' కారమునకు 'వ' కారాదేశము అగిసె-అవిసె (అగస్త్య), అగు-అవు తిగ-తివ (త్రికము) దుగ-దువ (ద్వికము) వేసంగి-వేసవి (వైశాఖ) చిగురు-చివురు పదాది 'వ' కారము 'గ' కారమగుట వారు-గారు వాఁడు-గాఁడు గీము-గాము-మున్నగు చోట్ల గకారమునకు వకారాదేశము లేదు కొన్ని యెడల ననుట చేత 'చవుతి-వీఁడు-ఎవఁడు-చదువు' మున్నగు చోట్ల గకారాదేశము లేదు "చాగము-(త్యాగ), అగసాలె-అగిని" మొదలగుచోటులందు 'వ' కారాదేశము లేదు [1]

## ఔపవిభక్తికములు

"ఇ-టి-ంటి-ఇంటి [2]-తి-ఇతి-అటి" ప్రభృతు లౌపవిభక్తికములు ౭౦ (బా-అచ్చి-౨౦వ సూ వ్యా-సం- ౨౨౭ I విష)

కొన్ని జడవాచక స్త్రీ సమ నామముల విభక్తులకుఁ బూర్వమున నాగమములుగాను, గొన్ని యెడల నా దేశములుగాను 'ఇ-టి' ప్రభృతులు నిల్చును అవి యౌపవిభక్తికము లనఁబడును

---

1 సూరి "అపదాద్యంబయి యసంయుక్తంబయిన గకారంబునకు వకారంబు విభాష నగు" అని సూత్రించుట కేవలము నవిమర్శన మూలక మని పై వివరణోదాహృతులవలన విశదమగుచున్నది గదా !

2 సూరి 'ఇ-టి-తి' వర్ణంబు లౌపవిభక్తికము లని సూత్రించి(హ్రస్వము మీఁది 'టి' వర్ణము పూర్ణ బిందు పూర్వకమగునని సూత్రించెను (బా-అచ్చి-౨౦-౩౩ సూ) దీర్ఘము మీఁద 'సీంట' అని కలదే (చూ-౭౨వ సూ-౧వ వివ) ఈ రీతినె "క్రిందంటికి-అప్పంటిని-నెత్తుంటిని-అంతంటికంటె" మున్నగు పూర్ణ బిందు ఘటితములగు ననిష్ట రూపములు దుర్వారము లగును మఱియు "పదియింటిని" (ద్రోణ-౪వ ఆ ౨౨౪, ఆశ్వ ౨వ ఆ ౧౫౩, అను ౩వ ఆ-౩౦) మున్నగు రూపము లీతని పక్షమున లభింప నేరవు గదా,

ఇవి ద్వితీయాద్యేక వచనంబులు పర మగునపుడు మాత్రమె యాచ్ఛిక స్త్రీ సమ జడవాచకములకు బహుళముగా నగును ౭౧ (బా-అచ్చి-౨౯వసూ. వ్యా-సం- ౨౨౭ I విష )[1]

'ప్రవాళము-బాన్ధవము'మున్నగు ప్రకృతులను బట్టి 'పవడము-బందువు' మున్నగునవి ప్రాథమిక రూపము లనుటలో సందియము లేదు గదా 'ఇరు+వారు' అను వ్యుత్పత్తి చొప్పున 'ఇరువురు' అను 'వ' కార ఘటిత రూపము ప్రాథమిక మనకతీరదు గదా! (చూ-అచ్చి-౬౬ సూ టిప్పణి)

టిం-టి అన్ని-అన్నిటిని-అన్నింటిని రెండు-రెండిటిని-రెండింటిని-రెంటిని ఆదేశ నెత్తురు-నెత్తుటిని ఇంటి పది-పదియింటిని-పదిటిని-పదింటిని తి గోయి-గోతిని-నేయి-నేతిని ఇతి అఱ్ఱు-అఱితిని-కొఱ్ఱు-కొఱితిని అటి క్రిందు-క్రిందటిని, అప్పుడు-అప్పటిని

౧వ వివ ఆలు-ఆలిని, కూఁతురు-కూఁతురిని మున్నగు నజడ వాచకములందలి 'ఇ' వర్ణ మౌపవిభక్తికము కామింజేసియే వానికి వేఱుగ 'ఇ'వర్ణము సూత్రింపఁబడెను (చూ-అచ్చి ౯-౧౧వ సూ) [2]

౨వ వివ 'గోతులు-నేతులు' మున్నగు బహువచన స్థలము లౌపవిభక్తిక విషయములు కామింజేసి యచటి 'తి' వర్ణము వేఱుగ సూత్రింపఁబడెను (చూ-అచ్చి-౨౧వ సూ) [3]

---

1 ఔపవిభక్తికత్వము బహుళ మని సూరి చెప్పకుండుట సరికాదు నె। త్తురు రొంపి (కర్ణ-౧వ ఆ ౧౭౯), నె। త్తుటఁ జొత్తిల్లె (ద్రోణ ౨వ ఆ ౩౦౭, ద్రోణ ౫ ఆ-౮౩) మొదలిటి సంపదలతో (సభా-౨వ ఆ ౨౦౨) మొదల నప్రియ మయ్యె(సభా-౨వ ఆ౧౯౨) నీరన్ (శాంతి ౨వ, ఆ౧౭౧), నీటిని (ఉద్యో ౨వ ఆ ౩౯), అంత కంటెన్ (శాంతి ౬వ ఆ ౫౯౮), అంతటి కంటె (శాంతి ౬వ ఆ-౬౦౨)

2 ఇట్టి 'ఇ' వర్ణమును సూరి సూత్రించి సంగ్రహింపనే లేదు

3 సూరి ''గోయి-గోతులు-గోతులన్'' అను బహువచనమందలి 'తి' వర్ణకమును నౌపవిభక్తికమె యను తలంపున నౌపవిభక్తికముల సందర్భమున నేకవచనముతో పాటుగ విధించెను,

ఊరు మొదలగువాని కిత్వం బగు ౭౨ (బా-అచ్చి-౩౦వ సూ. వ్యా-సం-౨౨౮ వ)

ఊరు-ఊరిని (చూ-తత్స-౨౭వ సూ) కాలు-కాలిని, మ్రాను-మ్రానిని నోరు-నోరిని, చోటు-చోటిని

౧ వ వివ 'ఇ' వర్ణము వచ్చు స్థలములందు 'టి-ంటి' అనునవి నిల్చుటయుఁ గలదు ఉదా నోఁరికి వచ్చిన (కర్ణ-౩వ ఆ-౮౮), కమ్మని నోరన్ (మనుచ-౩వ ఆ-౧౨౩), గీ నోటిమాట నోటనె యుండ (కాశ-౨వ ఆ-౩౭), నీరు-నీరన్ (శాంతి-౨వ ఆ-౧౭౧), మున్నీటన్ (ఉద్యో-౨వ ఆ-౩౯) సౌఖ్యరసంబు నీంట (విరా-౨వ ఆ-౩౧౦) ఉ నీంటను మనం బొంటికి . (హరి-ఉ॥భా-౭వ ఆ-౯౪) దీర్ఘము మీఁదను నిండు సున్న వచ్చెను

## ఊర్వాదుల 'అ' త్వము సప్తమ్యర్థకము మాత్రమె

౨ వ వివ 'ఇ' అను నౌపవిభక్తికము వచ్చు శబ్దములలోఁ గొన్నిటికిఁ (అచ్చి-౮౦వ సూ) దృతీయా సప్తములు రెంటను 'అ' త్వము వచ్చును కొన్నిటికి 'ఊరు-చోటు-మేను' ప్రభృతులకు సప్తమ్యర్థమున మాత్రమె 'అ' త్వము వచ్చును తృ- స కాలన్-కాలియందున్, కాలిచేతన్, చేతన్-చేతి చేతన్ - చేతియందును మొ సప్తమి మాత్రము ఊరన్ -(ఊరియందు, 'ఊరిచేతన్' అను నర్థములేదు) చోటన్ (చోటియందు), మేనన్ (మేనియందు) మొ. వీనికి 'నన్' అను సప్తమీ ప్రత్యయము వచ్చుటయుఁ గలదు ప్రోఁన్-ప్రోలునన్ (అర-౪వ ఆ-౮౦) పోరన్ (అర-౩వ ఆ-౧౧౩), పోరునన్ (శల్య-౧వ ఆ ౧౨౧) తేరన్-(తేరియందు, ప్రాస, ఉద్యో-౨వ ఆ-౧౫౨), తేరునన్ (ఆము-౫వ ఆ-౧౦౧) 'కడ' శబ్దము త్రిక సమాసమున నౌపవిభక్తిక మగును ఎక్కడియది (ఆది-౪వ ఆ-౩౪) ఏకడకునైనన్ (ఉ-హరి-౭వ ఆ-౨౪౭), అక్కడన్ (ఆ చోటియందు)-ఇక్కడన్-ఎక్కడన్ ('అక్కడన్'-ఆ చోటిచేత ననరాదు)

## 'టి-ంటి-అటి' అను నౌపవిభక్తికములు

"టి" వర్ణంబు గొన్నింటి యంతాక్షరంబున కాదేశంబును, గొన్నింటి కం తాగమంబును గొన్నింటికిఁ బర్యాయంబున రెండును ప్రాయికంబుగ నగు కొన్ని టికి 'ఇంటి' అనునది యాగమమగును ౭౩ (బా-అచ్చి-౩౧, వ్యా-సం-౨౭౯ విష, ౭౪-౭౫ చొప్పునఁ బూర్ణము)

ఆదేశము త్రాడు-త్రాటిని, కాడు-కాటిని, నోరు-నోటిని, ఏఱు-ఏటిని నీరు-నీటిని, నీంటిని (హరి-ఉ భా ౭వ ఆ-౯౪, చూ-వ్యా-సం-౯౩౬వ పుట) ఆగమము అన్ని-అన్నిటిని-అన్నింటిని ఎనిమిది-ఎనిమిదిటిని-ఎనిమిదింటిని వేయి-వేయిటిని-వేయింటిని ఉభయంబు ఏమి-ఏటిని-ఏమిటిని పగలు-పగ టిని-పగలిటిని-పగలింటిని, మొదలు-మొనటిని-మొదలిటిని రెండు-రెంటిని-రెండిటిని-రెండింటిని మూఁడు-మూఁటిని-మూఁడిటిని-మూఁడింటిని నూఱు-నూటిని-నూఱిటిని-నూఱింటిని ఇంటి పది-పదియింటిని (ద్రోణ-౩౭ ఆ-౨౨౪, చూ-వ్యా-సం-౯౩౦వ పుట) పదిటిని-పదింటిని మొ "టి-ంటి" విధానముచే "టి" వర్ణకము ఖండపూర్వకము కానేరదని యెఱుంగునది

హ్రస్వంబు మీఁది 'టి' వర్ణకంబునకు ముందు పూర్ణబిందువు బహుళం బుగ నగు ౭౪ (బా-అచ్చి ౩౨వ సూ, వ్యా-సం-౨౭౯ విష)

అన్నిటిని-అన్నింటిని, ఎనిమిదింటిని, పగంటిని, పగలింటిని, రెండింటిని మూఁడింటిని బహుళగ్రహణముచేత "నెత్తుటిని-మొదటిని-క్రిందటిని-మీఁదటిని-తంగెటిజున్ను" (మను-౧వ ఆ-౬౬) మున్నగుచోటులందుఁ బూర్ణబిందువు రానేరదని యెన్నునది

పదాద్యంబగు హ్రస్వంబుమీఁది 'టి' వర్ణంబునకు ముందు పూర్ణబిందువు నిత్యముగా నగు ౭౫ (బా-అచ్చి-౩౩వ సూ, వ్యా-సం-౨౭౯ విష)

కన్ను-కంటిని, మిన్ను-మింటిని, ఇల్లు-ఇంటిని, పల్లు-పంటిని, 'ఎఁడు' ప్రత్యయాంతములకు నిత్యమె బారెంటను-జుట్టెంటిలో (చూ-తద్ధి ౩౦వ సూ ౨వ విప)

"టి" వర్ణంబు పరంబగునపు డుత్వంబున కిత్వంబు బహుళంబుగ నగు ౭౬ (బా-ఆచ్ఛి-౩౬వ సూ, వ్యా-సం-౨౭౯ విష ౭౯-చొప్పున నిందు 'తి' వర్ణము విడువఁబడెను)

రెండు-రెండిటిని మూఁడిటిని-పెక్కిటిని కొన్ని యెడల నీ 'ఇ' త్వము గలుగదు ఉదా నెత్తుటిని, ఎదుటికిన్, పురుటికిన్, మొ (దీనిచే 'పదియుం టిని' అను రీతివి సంగ్రహింపఁబడనేరవు)

## 'అటి-తి' మొ. ఔపవిభక్తికములు

క్రిందు-మీదు-ముందు, పువర్ణంబులకు 'అటి' అనునది బహుళంబుగ నిల్చును ౭౭ (బా-ఆచ్ఛి-౩౭వ సూ, వ్యా-సం-౨౩౦ విష)

క్రిందు-క్రిందటిని, మీఁదు-మీఁదటిని, ముందు-ముందటిని, పువర్ణ మాపు-మాపటిని, అప్పుడు-అప్పటికిన్, సేపు-సేపటికిన్ బహుళం బనుటచే 'సేపునకున్' అనియుఁ గలదు ఆ-వె ఒక్కింత సేపునకుఁ దేటి యిట్టు లనియె నాదు। .... .......(ఆశ్వా-౨వ ఆ-౮౯) కం .। నదిలో మఱి కొంతసేపునకు (శాంతి ౪వ ఆ-౧౦, నిర్వ ౧౦వ ఆ-౯౫)

గోయి ప్రభృతుల తుది యక్షరంబున కాదేశముగా 'తి' వర్ణంబు నిల్చును ౭౮ (బా-ఆచ్ఛి-౩౫వ సూ, వ్యా-సం-౨౩౨ I విష)

గోయి-గోతిని, జాయి-జాతిని, చేయి-చేతిని, దాయి-దాతిని (సమీప), నూయి-నూతిని,నేయి-నేతిని, వాయి-వాతిని (నోరు), రోయి-రోతిని (భస్మము, శ-ర, రొయ్యి-రొయి మాత్రము, బహుత్వపు 'తి' యౌపవిభక్తికము కాదు చూ-౨౧వ ఆచ్ఛి గోతులు, నేతులు మొ)

అఱ్ఱు మొదలగు శబ్దంబుల కంతాగమంబు 'ఇతి' వర్ణంబును శకటంబున కొక్కటికి లోపంబు నగు ౭౯ (బా-ఆచ్ఛి-౩౪వ సూ, వ్యా-సం-౨౩౧ విష)

అఱ్ఱు-అఱితిని, 'అఱ్ఱు-(మెడ), కఱ్ఱు-గొఱ్ఱు (దుక్కిసాధనములు)-కొఱ్ఱు

మిఱ్ఱు-వఱ్ఱు'' (ప్రవాహము) ఇవి యఱ్ఱు ప్రభృతులు వీనికి 'అచ్చి-౧౦వ సూ చొప్పున 'అ' త్వము నిల్చునపుడు 'ఉ' అనునదె నిల్చును అఱ్ఱు-అఱు తన్ (కంఠమందు), 'కొఱ్ఱు-కొఱుతన్ - 'కొఱతన్' - అని శ్లేష స్థలమునఁ గవి పితామహుఁడు వాడెను (మను-పీఠి-౯వ ప) దానికి నిపాత న్యాయమున సాధుత్వ మంగీకరింప నగును స్వరలోపమున "కొ ఱ్తన్'' (సంజ్ఞా ౧౮వ సూ ౧వ వివ) అనియుఁ గలదు ద్విపద చంపి మాండవ్యుండు సరిఁ గొ ఱ్తఁ బడియె (బసవ ౫వ ఆ-౩౮౨)

## ఔపవిభక్తికముల అత్వము

ఔపవిభక్తికముల తృతీయా సప్తముల కత్వం బాదేశంబు బహుళంబుగా నగు ౧౦ (బా అచ్చి ౩౮ వ సూ, వ్యా-సం-౨౩౩ విష)

గోరను గీఱెను, ఊర నున్నాఁడు, గొడ్డట నఱికెను, ఇంట లేఁడు, వఱుతఁ గలిసె, కఱుత దూఁటె పక్షంబునందు-గోరిచేత, ఊరియందు ఇత్యాదులు

౧ వ వివ బహుళ గ్రహణముచేత "ఊరను-ఇంటను-చోటను-మేనను'' మున్నగునవి సప్తమ్యర్థకములు మాత్రమె యని గ్రహింప వలయును (చూ-ప్రౌఢ-శబ్ద-౧౦౬వ సూ)

౨వ వివ సూత్రమున విధింపఁబడిన 'అ'త్వము తత్స ౧వ సూత్రము చొప్పున 'ను' గాగమాంత మగును గాన ద్రుతప్రకృతిక మగును ఉదా గోరు ద్వి-గోరిని, తృ, స-గోరను మొ

ఇది యాచ్ఛిక పరిచ్ఛేదము



# బాలవ్యాకరణోద్ద్యోతము

## V కారకపరిచ్ఛేదము

విప. విభక్త్యర్థములను విశదపఱుచునది కారకపరిచ్ఛేదము కర్తృ కర్మ కరణ సంప్రదా నాపాదా నాధికరణములలో నొకటి కారక మనఁబడును కారకము క్రియ నాకాంక్షించును అనఁగాఁ గారకము క్రియాన్వయము గల్గి యుండును శేష షష్ఠి ('యొక్క' షష్ఠి) సంబంధార్థకము కారకము కానేరదు 'రాముని యొక్క ధనము' అనుచో 'రామునియొక్క' అను శేష షష్ఠి 'ధనము' అను విశేష్యముతో నన్వయించును కారక శేషమె శేష షష్ఠి ప్రాతిపదికార్థ ప్రథమయు సంబోధనమును గారకములు కానేరవు *

## ప్రాతిపదికార్థ ప్రథమ

ప్రాతిపదిక సంబోధ నోక్తార్థంబులం బ్రథమ యగు ౧ (బా కార ౧, వ్యా-సం-౨౩౪ I విష)

ప్రాతిపదికార్థమునందును, సంబోధనమునందును, ప్రత్యయాదులచేఁ జెప్పఁబడిన యర్థమునందును బ్రథమా విభక్తి యగును

౧ వ విప శబ్దములు మూఁడు విధములు 1 ధాతువులు (వ్యాపార బోధకములు), 2 ప్రాతిపదికములు, 3 ప్రత్యయాదులు ధాతువు గానట్టియు

---

* "తేన సంబంధస్య క్రియానిమిత్తత్వాభావా న్న కారకత్వమ్ ఏవం లిఙ్గార్థ సంబోధనయో రపీతి" (ముగ్ధ-౩౧౬ వ సూ-దుర్గాదాస వ్యాఖ్య)

సుప్, తిఙ్ ప్రత్యయములు గానట్టియు 'సుప్, తిఙ్' ప్రత్యయాంతమును గానట్టియు నర్థవంతమగు శబ్దము ప్రాతిపదిక మనఁ బడును ఇది కృత్తద్ధిత, ప్రత్యయాంతమును, సమాస రూపమును గావచ్చును అవ్యుత్పన్న మగు శబ్దమును గావచ్చును

౨ వ వివ నియతోపస్థితికము ప్రాతిపది కార్థము అనఁగా శబ్ద ముచ్చరింపఁబడు నంతనె దోఁచెడి యర్థము ప్రాతిపదికార్థము. జాతి వ్యక్తి లింగ వచనము లన్నియుఁ 'ప్రాతిపదికార్థము లె' ప్రాతిపదికము మీఁద నిల్చు సుప్పులు ద్యోతక మాత్రములు అనఁగా నగ్నియందుఁడు దహనశక్తి ప్రకటిత మగుటకు శుష్కేంధనము సాధన మైనట్లె ప్రాతిపదికము వల్లనే వచ్చెడి యర్థములకు 'సుప్పులు' మున్నగునవి ద్యోతకము లగు నని **తాత్పర్యము**

౩ వ వివ ప్రాతిపదికార్థ ప్రథమ సాధారణముగాఁ గోశాది ప్రసిద్ధము ఉదా రాముడు-వనము-గురువు-అన్న-తండ్రి-తల్లి మొ అన్య విషయమునఁ దగిలియున్న వాని నభిముఖీకరించుట సంబోధ నార్థము ఇందును ప్రథమయె నిల్చును ఉదా ఓరాముఁడ-రాముఁడ-రామా మొ వృక్షాది సంబోధనమున నభిముఖీకరణ మౌపచారిక మని యెఱుంగునది

## ఉక్తార్థ ప్రథమ

౪ వ వివ ఉక్తార్థ ప్రథ మోదాహరణములు రాముఁడు రావణుని జంపెను ఉక్త మనఁగాఁ బ్రత్యయాములచేఁ జెప్పఁబడినది పై వాక్యమున నాఖ్యాత మనఁగా ధాతువు మీఁది లిట్టు (ఎను ప్రత్యయము) కర్త్రర్థక మనఁగాఁ గ్రియా ౫౮ వ సూత్రము చొప్పునఁ గర్తను జెప్పుచున్నది గానఁ బునరుక్త ముగాఁ (ఉక్తార్థానా మప్రయోగః)గర్త్రర్థమున రావలసిన తృతీయ రానేరదు ఇకఁ గేవల ప్రకృతి ప్రయోగయోగ్యము కాదు గావున (న కేవలా ప్రకృతిః ప్రయోక్తవ్యా నాపి ప్రత్యయః) వాక్య ప్రయోగ యోగ్య మగు పదత్వపు సిద్ధికయి ప్రాతిపదికార్థ ప్రథమ వచ్చు నని గ్రహింపవలయును ఇట్లె

'రామునిచే రావణుఁడు చంపఁబడెను' అనుచో నాఖ్యాతముచేఁ గర్మము చెప్పఁబడు చున్నది గానఁ (క్రియా ౫౦వ సూత్రము చొప్పున) గర్మార్థమందు రావలసిన ద్వితీయా విభక్తి రానేరదు ఇంక వాక్య ప్రయోగార్హతకై ప్రాతిపదికార్థ ప్రథమయె వచ్చును

౫వ వివ కృత్తద్ధిత ప్రత్యయాదులచేఁ జెప్పబడిన యర్థమందును బయిరీతిని ప్రాతిపదికార్థ ప్రథమయె వచ్చును [1] ఉదా 'ఈశ్వరుఁ డర్చ్యుఁడు' అనుచో (అర్చ్ + య-అర్చ్య) ణ్యత్ ప్రత్యయముచేతఁ గర్మార్థము చెపఁబడుచున్నది (ముగ్ధ-౨౦౦-దుర్గాదాస వ్యాఖ్య, చూ-సి-కౌ, బాల-మ-వ్యాఖ్య ౫౩౨ వ సూ) కావునఁ గర్మార్థమందు రావలసిన ద్వితీయ రానేరదు ఇంకఁ బ్రాతిపదికార్థ ప్రథమయె పదత్వ సిద్ధికయి వచ్చును ఇట్లె కరణాద్యర్థక ప్రత్యయాంతముల యెడలను ద్వితీయాదులు రాక ప్రాతిపది కార్థ ప్రథమయే వచ్చుచుండును

క్రియా ప్రకరణము ౫౦ వ సూత్రమందలి యాది శబ్దముచే భావార్థకాది ప్రత్యయములను (క్రియా ౪౬ మొ-౫౩ సూ-క్రియా ౪౭వ సూ) గర్తృకర్మా ద్యర్థములను వచించును గాన నట్టి యర్థములందు రావలసిన తృతియా ద్వితీయాదులు రానేరవు అట్టి యెడల సయితము ప్రాతిపదికార్థ ప్రథమయె వాక్య ప్రయోగ యోగ్య పదత్వ సిద్ధికై వచ్చును [2] కం నిను సౌమ్యుఁడ వని యెఱిఁగితి (శాంతి-౩ ఆ ఆ-౫౬) మున్నగుచోటులందు 'అని' అనెడి శబ్దముచేతఁ గర్మము చెప్పఁబడెను గాన ద్వితీయ రాక ప్రాతిపదికార్థ ప్రథమయె వచ్చెను

---

1 బాల వ్యాకరణమున సమాపక క్రియలందలి యాఖ్యాతము మాత్రమే యుదాహరింపఁ బడెను కృత్ప్రత్యయాదుల యర్థములం దితర విభక్తులు రాక ప్రాతిపదికార్థ ప్రథమ వచ్చుట యుదాహరింపఁ బడ లేదు

2 పయి సందర్భమునుబట్టి "భావార్థకాది (క్రియా-౪౬ మొ ౫౩వ సూ) యోగంబునం గర్తకుం ప్రథమ యగు (బా-కారక-౩౨ వ సూ) అను సూత్రము వ్యర్థమె యనఁదగు ''రామునిచేఁ గార్యము చేయఁబడుట సంభవించె'' మున్నగుచోట్లఁ గర్మ కారకాదులందును ప్రాతిపదికార్థ ప్రథమయె వచ్చును ... కే ... చెల ?

# ద్వివిధ ద్వితీయ

కర్మంబున ద్వితీయ యగు ౨ (బా కార ౨, వ్యా-సం-౨౩౫ I విష)

ధాత్వర్థఫలాశ్రయంబు కర్మము నాఁబడు దేవదత్తుఁడు వంటకమును వండెను ఇట వండె ననుటకు వంటఁ జేసెనని యర్థము వంట ఫలము చేయుట వ్యాపారము వంట యనఁగాఁ బాకము (మెత్త నగుట) పాకమున కాశ్రయము కావుటంజేసి వంటకము కర్మం బయ్యెనని యెఱుంగునది

౧ వ వివ తిఙాది ప్రత్యయములచే ననుక్తమగు కర్మంబున ద్వితీయ యగును కారకార్థ ముక్తమయినచో ద్వితీయాదికము రానేర దని యీవఱకు వివరింపబడె (కార-౧ వ సూ ౪-౫-వివ)

౨ వ వివ సంస్కృత వ్యాకరణ ప్రసిద్ధములగు కర్మ ప్రవచనీ యార్థములలో నొకటగు నిత్థం భూతాఖ్యానార్థమునఁ దెలుఁగునందుఁ గొన్ని యెడల 'కూర్చి' విభక్తి నిల్చును (గుఱిచి-గుఱించి మున్నగునవియు విభక్త్యర్థాభిధాయక శబ్దములు) ఒకానొక ప్రకారము నొందిన దాని విషయ మును దెల్పునది ''ఇత్థం భూతాఖ్యానము'' ఇట్టి యర్థమున వచ్చు 'కూర్చి' విభక్తి వరమగునపుడు ప్రాతిపదికమునకు 'ను' గాగమ మగును **ఉదా** "ఆ శమీక పుత్త్రి దంబుజ సంభవుఁ గూర్చి (గుఱిచి-పాఠాం) తపము చేసె'' (ఆది ౨ వ ఆ-౧౬౮) అంబుజ సంభవ విషయక తపశ్చరణ మిందుఁ జెప్పఁబడినది ఇట్టి వైషయిక సప్తమీ స్థలములె తెల్గునఁ గర్మ ప్రవచనీయ 'కూర్చి' కువాహృతులు సంస్కృతమునకు మాఱుగ నుండవలె నని యిట్లు చెప్పఁబడెనె కాని యివియు నుద్దేశార్థకములు కాకపోవు ఆ పతి కురు జన నాథుం గూర్చి పలికె (శల్య ౨ వ ఆ-౫౦) అను రీతి గల చోటులందలి ''కూర్చి-గుఱిచి-గుఱించి'' శబ్దములు వైషయిక సప్తమీ స్థలములు కామింజేసి ద్వితీయ కనుప్రయుక్తములగు శబ్ద విశేషము లని యెఱుంగునది ఏది లోపించినను నర్థభంగము కల్గదో యది యనుప్రయుక్త మనఁబడును అట్టి యను ప్రయుక్త 'కూర్చి' ప్రభృతులు లోపించుటయుఁ గలదు 'సుతున్ హతుఁ

డయ్యెనని విని (సుతుం గూర్చి విని, ద్రోణ-౫ వ ఆ-౩౦౫) వేటఁ బోయిరి (వేటం గూర్చి పోయిరి అర-౬ వ ఆ-౧౬౩) ఇట్టి యెడల 'గూర్చి' మున్నగునవి లేకున్నను నర్థభంగములేదు గాన నివి యనుప్రయుక్త శబ్దము లనవలసెను

౩ వ వివ తెల్గునందును ద్వికర్మకముల వాడుక గలదు ఉదా వాఁడు రాజును ధనమును యాచించెను ఇట్టి యెడల 'ధనము' ముఖ్యకర్మము 'రాజును' అనునది యముఖ్యకర్మము మైత్రుఁడు చైత్రుని గూర్చి యీ క్రింది వాక్యమును బల్కెను 'కట్టుము పట్టు మతని' (ద్రోణ-౧ వ ఆ-౬౨) ఈ ద్వికర్మక స్థలములం దముఖ్య కర్మవాచకమునకు 'కు' వర్ణకాదులు వచ్చుట తఱుచు (చూ-కార-౯ వ సూ) యాచ్ఞార్థకములును, పచాది ధాతువులును ద్వికర్మకములు అప్రేరణమున సకర్మకము ప్రేరణమున ద్వికర్మకము కొన్ని యెడల నగును

## అప్రేరణకర్తకుఁ గర్మాది ద్వితీయాదులు

గతి-బుద్ధి-ప్రత్యవసా నార్థ-శబ్దకర్మకి-అకర్మకంబుల కప్రేరణంబునఁ గర్త యగునది ప్రేరణంబునం గర్మం బగు ౩ (బా-క్రియా-౧౨౩, వ్యా-సం-౨౩౬ I వి)

'పొందు' మొదలగునవి గత్యర్థకంబులు 'తెలియు' మొదలగునవి బుద్ధ్యర్థకంబులు 'తిను' మొదలగునవి ప్రత్యవసానార్థకంబులు విను-చెప్పు-చదువు మొదలగునవి శబ్ద కర్మకంబులు వచ్చు-పోవు మొదలగునవి యకర్మకంబులు ప్రసిద్ధంబులు ఉదా గత్యర్థ అప్రే-మైత్రుండు గ్రామంబుం బొందెను ప్రేర చైత్రుండు మైత్రుని గ్రామంబుం బొందించె చైత్రుం ప్రేరణకర్త లాఁతిచో సహిత మిక్కార్యంబు గానంబడియెడి అప్రే మైత్రుండు పుడమి నేలెను ప్రేర చైత్రుఁడు మైత్రుని బుడమి నేలించెను చైత్రుండు మైత్రునిచేఁ బుడమి నేలించెను

విప ప్రయోగ ద్రోణ గాంగేయులు నిన్నొద్ది గఱపిరి

(ఆది-౭వ ఆ-౪౩) శిష్యులను వేదంబులఁ జదివించె (శాంతి-౬ వ ఆ-౩౯౯) ఆచార్యు ల జ్జనపతిని శాస్త్రములను వినిపింతురు (శాంతి-౪ వ ఆ-౩౪౦) అబ్జాదిని శుక్రుని ద్రావించిరి (ఆది-౩ వ ఆ-౧౦౪) లాఁతి చోటులు దేవతల నేలించున్ ద్రిలోకంబులన్ (నన్ని-కు-౧౦ వ ఆ-౫౦౬) క్రతువుల నమ్మహాత్ముని జేయింపరే (శాంతి-౧ వ ఆ-౨౮౭) అవనీభర మాతనిం బూన్చి (సభా-౧ వ ఆ-౫౯) మొ

అప్రేరణ కర్తృ వాచకము ప్రేరణమున ద్వితీయాంతము కావపు డది కొన్ని యెడలఁ దృతీయాంతమును, గొన్ని యెడల షష్ఠ్యంతమును నగును ౪ (బా-క్రియా-౧౨౪ వ సూ, వ్యా-సం-౨౩౩ I విష, ఇచట షష్ఠి తృతీయా పర్యాయమని సూరి భ్రమించెను )

ద్వితీయ అప్రే: భరతుఁడు రాజ్యము నేలెను ప్రేర రాముఁడు భరతుని రాజ్యమును నేలించెను (ఇది యీవల కుదాహృత మయ్యె కార-౩వ సూ) ప్రేరణకర్త ప్రయోజక కర్త యనిపించుకొనును అప్రేరణ కర్త ప్రయోజ్యకర్త యగును షష్ఠి అప్రే-అర్జునుండు తత్వంబుం దెలిసెను ప్రేర కృష్ణుడర్జునునకుఁ దత్వంబుం దెలిపెను (కృష్ణుఁ డర్జునుని దత్వంబుం దెలియఁజేసెను) అప్రే రాముఁడు రామాయణమును వినెను ప్రేర-కుశలవులు రాముని రామాయణమును వినిపించిరి కుశలవులు రామునకు రామా యణమును వినిపించిరి అప్రే ఉత్తరుఁ డర్జునుని యన్నలం దమ్ములం గనియె ప్రేర అర్జునుఁడుత్తరునిఁ దన యన్నలం దమ్ములం గానిపించెను (విరా-౫ వ ఆ-౩౪౨) అచటి వీరులకు నా భుజా విభవముం గానిపించి (విరా-౪ వ ఆ-౨౬౩), ఇట్టి ప్రయోగములచేఁ గన్వాదియోగంబునందును షష్ఠి వైకల్పికమె యని విశద మగుచున్నది *

---

* సూరి యిట్టి స్థలమునఁ గర్మార్థకము నుదాహరించుటయుఁ గన్వాది యోగంబున షష్ఠి నిత్య మనుటయు భ్రాంతి మూలకములు (చూ-వ్యా-సం-౨౩౭ I విష ౯౭౬వ పుట) బాల-క్రియా ౧౨౪ వ సూత్రము నుదాహృతులు ప్రామాదికములు 'రామునకు మిథిల గనంబడియె' నఁగా 'రామునకు మిథిల యగపడె, నని యర్థము 'రామునిచే మిథిలఁ గనంబడియె' అనఁగా రామునిచే మిథిల చూడబడె నని యర్థము

## కర్తృవాచకము 'చేత' వర్ణకాంత మగును

'చేత' వర్ణకంబు కర్త కగు ౫ (బా-కార-౩ వ సూ, వ్యా-సం-౨౩౮ I విష)

ధాత్వర్థ వ్యాపారాశ్రయము కర్త నాఁబడు దేవదత్తునిచే వంటకము వండఁబడియె ననఁగా వంట చేయఁబడె నని యర్థము చేయుట కాశ్రయుం డగుటంజేసి దేవదత్తుఁడు కర్త యయ్యె కావున నట్టి కర్తృవాచకము 'చేత' వర్ణకాంత మయ్యె

౧ వ వివ "దేవదత్తునిచే ... " అను వాక్యము కర్మార్థకము దీని కర్త్రర్థక వాక్యము ''దేవదత్తుఁడు వంటకమును వండెను'' అనునది

౨ వ వివ కర్మార్థమునందు ద్వికర్మక వాక్యములలో నొక కర్మము నిల్చును తక్కిన కర్మ మభిహితమై ప్రాతిపదికార్థ ప్రథమాంత మగును ఉదా రాజును బెద్ద దొరలును జీరల నొలుపఁబడిరి (చూ క్రియా-౯౧ వ సూ ౨ వ వివ) దీని కర్త్రర్థకవాక్యము ''రాజును బెద్ద దొరలను జీరల నొలిచితిని '' (విరా-౫ వ ఆ-౨౨౨) ఇట్టి ప్రయోగములు మిక్కిలి యరుదు ద్వికర్మకములలో నే కర్మము నిల్చునో, యేది ప్రథమాంత మగునో యను విషయము సంస్కృత వ్యాకరణములనుండి తెలియ నగును

## 'చేత, తోడ' వర్ణకములు

'చేత-తోడ' వర్ణకంబులు కరణంబునకుఁ బర్యాయంబున నగును హేతు మాత్రమునకు 'చేత-వలన' వర్ణకంబులు పర్యాయముగ నగును గ్రహ్యాది యోగంబున 'చేత' వర్ణకంబును నగును ౬ (బా-కార ౪, వ్యా-సం-౨౩౯ I విష గ్రహ్యాదులు ఎఱుఁగు విను మొ )

1 కరణంబునకు చేత - తోడ క్రియాసిద్ధిం బ్రకృష్టోపకారకంబు కరణంబు, ఉదా కోలచేఁ గూలనేసె-కోలతోఁ గూలనేసె

2 హేతువాచికిఁ జేత-వలన. ఫలసాధన యోగ్యంబగు పదార్థంబు హేతువు ఉదా విద్యచేత యశము గల్గును, విద్యవలన యశము గల్గును

3 గ్రహ్యాదియోగ రాజులవలనఁ గప్పంబుఁ గొనియె, రాజులచేతఁ గప్పంబుఁ గొనియె (సభా-౧వ ఆ-౨౬౪, చూ-కార-౧౪వ సూ) ఇందలి తృతీయా ప్రయోగము సంస్కృతమున లేనేలేదు నీ గుణంబులు హంస వలన విని-నీ గుణంబులు హంసచేత విని (ఆర-౨వ ఆ-౪౭) కథకుచేత విను వేడ్క-కథకువలన విను వేడ్క ఆది-౧వ ఆ-౨౦)

## 'చేసి' యనుప్రయోగము

చేత వర్ణకార్థక ప్రత్యయములకును 'వలన' వర్ణకమునకును 'చేసి' శబ్దము పాక్షికముగ ననుప్రయుక్త మగును పెక్కుటి కొక్కుటి యనుప్రయుక్త మగుటయుఁ గలదు ఉ (ప్రౌ-కార-౪, వ్యా-సం-౨౩౯ I విష, ౯౦౬ మొ ౯౦౦ పుటలు)

'చేసి' శబ్దము లోపించినను నర్థభంగ ముండదు గాన నది యనుప్రయుక్త మనిపించుకొనును 'చేత' వర్ణకార్థకముల కనుట చేత 'చేతను-చేన్' అనువానిపైని 'చేసి' శబ్దానుప్రయోగము లేదని యెన్నునది (చేత వర్ణకార్థకములు అచ్చి-౦౦-కారక-౨౫-౨౬ సూ)

౧వ వివ తన గదఁజేసి (అర-౩ వ ఆ-౩౬౭) నీ రత్నంబులను వధూరత్నంబులనజేసి (ఆది-౦వ ఆ-౯౬) ధర్మ తనూభవువలనఁ జేసి(విరా ౨వ ఆ-౨౨౫) పెక్కుటి కొక్కుటి అట్టి గౌత మానుగ్రహంబునను నీ దుర్గబలంబునను జేసి (సభా-౧వ ఆ-౧౩౬) వ్యవహిత ప్రయోగములును గలవు దానన చేసి (సభా-౧వ ఆ-౯౦) నా తప్పునఁగాచేసి (బసవ-౩వ ఆ-౨౯౯ కా = కదా)

౨వ వివ "భీష్మ పసుపుఁ జేసి" (సభా-౨ప ఆ-౧౧) అ౦చో 'చేసి-ఆదరించి' అని యర్థము నెన్నునది 'చేసి' శబ్ద మనుప్రయుక్త మనరాదు ఇచటి ద్వితీయ 'నన్' శబ్దార్థక మనరాదు.

## 'తుల్యార్థక' శబ్దముల యోగము

సహార్థ పృథగర్థ యోగంబున "తోడ" వర్ణకం బగు తుల్యార్థ యోగంబున 'తోడ-కు' వర్ణకంబు లగును ౮ (బా-కార-౫వ సూ, వ్యా-సం-౨౪౦ I విష)

సహార్థ రాజు సేనలతోడ వచ్చెను సేనాసహితుండయి వచ్చె నని యర్థము సహార్థక శబ్ద ప్రయోగ ముండనక్కఱలేదు అనుజులతో వచ్చి (అర ౨వ ఆ-౫), బాలుఁడొంటి యిట్లు పలువురతోడఁ బోరంగ (ద్రోణ-౨వ ఆ-౬౧), పాండవులతోడఁ గృష్ణుఁడు వేఱగునె (ఉద్యో-౩ వఆ-౧౬౩) తుల్యార్థ తపశ్చ రణముతో సరిగావు (ఆది-౩వ ఆ-౨౧౬) నాతోడఁ జతుర్దశాబ్దమున మాత్రె పోరు (సభా-౨వ ఆ-౨౯౭) అవి దీనికి సరియుఁగావు (సభా-౧వ ఆ-౬౦) ఇట్టి యెడ ద్వితీయ వచ్చుటయుఁ గలదు నను మార్కొని (భీష్మ-౧వ ఆ-౧౫౮),వీనికి మార్కొనఁజాలు (విరా ౧వ ఆ-౯),

౧ వ విష 'తోడ'కుఁ బ్రత్యేక ప్రయోగమును, బెక్కింటి కొక్కటి తుది దానికిఁ బరముగా నిల్చుటయుఁ గలదు ఉదా తోడరా (అర-౧వ ఆ-౧౧వ ప, ఉద్యో-౧వ ఆ-౪౭) అధికుల హీనులతోడ (ఉద్యో-౨వ ఆ-౪౬)[1] కంటె వర్ణకమునకు నిట్టి ప్రయోగము గలదు సూతుల తమ్ములకంటె (ఉద్యో-౪వ ఆ-౩౯) 'తోడుతన్' అను శబ్దపు ప్రయోగమును గలదు 'అడకువ తోడుత ననికి, (విరా-౧వ ఆ-౧౧౮)

వచ్యర్థాఽముఖ్య కర్మంబునకు 'తోడ-కు' వర్ణకంబులు పర్యాయంబునఁ బ్రాయికముగా నగును ౯ (బా కార-౬వ సూ, వ్యా-సం-౨౪౧ విష)

ఇట్లను నాతనితోడన్ (విరా-౫వ ఆ-౨౭౪) రురునకు నిట్లనియె (ఆది-౧ ఆ-౧౫౬) అముఖ్య కర్మమును ద్వితీయాంత మగునపు డివి ద్వికర్మకము

---

1 సూరిగాని, ప్రౌఢవ్యాకర్తగాని యిట్టి ప్రయోగములను సంగ్రహింప లేదు

లగును ఏమంటి వృపేంద్ర నన్ను (ఉద్యో-౩వ ఆ-౨౯౯వ ప) నన్నుఁ బలికిన (అర-౨వ ఆ-౮౨, చూ-కార-౨వ సూ-౩ వివ).

## ఉపయోగము

ఉపయోగంబునం దాఖ్యాతకుం 'దోడ'వర్ణకంబగు ౧౦ (బా-కార-౫; వ్యా-సం-౨౪౨ I వివ)

నియమపూర్వక విద్యాస్వీకారం బుపయోగం బనంబడు ఆఖ్యాత (ఆఖ్యాతృ)-వక్త-ఉపాధ్యాయుడు రామకృష్ణులు సాందీపని తోడ వేదంబులం జదివిరి (సాందీపని-సందీపన పుత్రి, 'సాందీపుని' తప్పు)

౧వ వివ ఇట్టి యెడల సంస్కృతమందుఁ బంచమి యగును తెలుగున నట్టి పంచమి మిక్కిలి యరుదు "భూవరుల వలన వేదంబులను గఱచుచు" (అది ౩వ ఆ-౧౨వ ప) వసిష్ఠుతోడఁ జదివె (ఆది-౪వ ఆ-౧౬౯)

సంస్కృత తవ్యాది ప్రత్యయ యోగంబునఁ దృతీయా షష్ఠులు పర్యాయముగ నగును "సహితము-సయితము-సైతము" అనునవి సముచ్చయార్థమును బోధించును ౧౧ (ప్రౌ-కార-౧౩వ సూ, వ్యా-సం-౨౪౩ వివ)

నీకు నారాధ్యను (ఆరాధింపఁ దగినదానను, ఆది-౩వ ఆ-౧౩౫) నీచేత నారాధ్యను దానితో సైతము, వాడు సైతము, వానిని సైతము మొ

## సంప్రదానము

త్యాగంబునం దుద్దేశింపఁబడినది సంప్రదానంబు దానికిం జతుర్థి యగు ననుట సంస్కృత సంప్రదాయము ఉద్దేశ మాత్రమునఁ జతుర్థియు, 'కు-కి' షష్ఠియు నగును ౧౨ (బా-కార-౮, వ్యా-సం-౨౪౪ I వివ)

---

* సూరి పంచమియు వచ్చు నని తలంపక 'తోడ' వర్ణకము నిత్య మని తలంచెను.

('కొఱకు-కయి' అను చతుర్థి 'కు' వర్ణక మూలకమె కొఱ-కార్యము కొఱకున్-కార్యమునకున్ 'కు + అయి-కయి-కై')

రాముని కొఱకుఁ గన్య నిచ్చెను-రామునకుఁ గన్య నిచ్చెను పురుషార్థము కొఱకు యత్నింపవలయు, పురుషార్థమునకు యత్నింపవలయు చతుర్థియందు "కై-కొఱకు" లే కాక "కు-కి-కునై-కుఁగాన్-తదర్థము-పొంటెన్" మొదలగు నవియు వాఁడఁబడును ఇవి విభక్త్యర్థాభిధాయక శబ్దము లవఁ దగును. నన్నయ 'కొఱకు' అనుదానిని వాడనే లేదు దానికి బదులుగా 'తదర్థము' అనుదానిని దఱుచుగా వాడెను సీ తదర్థము (సభా-౧వ ఆ-౨౫౯), చైద్యునకై పూని (సభా-౨వ ఆ-౩౮), శాంతి కొఱకున్ (శాంతి-౫వ ఆ-౯౦), కార్యసిద్ధి పొంటెన్ (అర-౩వ ఆ-౩౪౮) నీకుఁగాన్ (ఉద్యో-౩వ ఆ-౩౪౧) పొలియుట కునై (శాంతి-౧వ ఆ-౨౦౬)

రుచి-క్రోధము-సహనము మున్నగునవి దేనికో యచటఁ జతుర్థి యనఁగా 'కు-కి' వర్ణకము లగు అట్లె "కుశలము-స్వస్తి-నమస్కృతి-హితము-ఇష్టము-దూరము-సమీపము-సామర్థ్యము-నేర్పు-ప్రవేశము-కాలము-గమనము" మున్నగువాని యర్థములు గల శబ్దముల యోగమునఁ జతుర్థి యనఁగా "కు-కి" వర్ణకంబు లగు ౧౩ (ప్రౌఢ-కార-౧౩-౧౪, వ్యా-సం-౨౪౫ I విష)

ఇతనికిఁ గూర్తురు (సభా-౨వ ఆ-౧౦), యయాతికి నలిగి (ఆది-౩వ ఆ-౯౮) నీ మఱఁది కపరాధ శతము సైఁపుము (సభా-౨వ ఆ-౫౯) మనకుఁ గుశలము (అర-౨వ ఆ-౧౪౩) దేవతా తతికి న్నమస్కృతి చేసి (ఆది-౧వ ఆ-౨౧) ఇది యుప దయోగజ విభక్తి ఇట్టి యెడలఁ గారక విభక్తియు నగు పరాశర సుతుం బ్రణమిల్లి (ఆది-౧వ ఆ-౭౭), నాకిది యిష్టము (ఆది-౬వ ఆ-౫౧) మీరు నాకు-నేను మీకు నెన్నఁడు నహిత మాచరింప లేదు (సభా-౧వ ఆ-౧౮౬) మాకు సమీపస్థుండవ। దూరంబున నుండియు (సభా-౨వ ఆ-౮౨) నీ కులంబునకుఁ దగఁగ (ఆది-౬వ ఆ-౫౬), ధర్మ వెఱుంగ వీనికిం బోలునె (సభా-౨వ ఆ-౨౨) విధాన్యన కైనను నేరఁబోఁనె (ఆది-౧వ ఆ-౧౯) నే మగుడి వచ్చునంతకు (అర-౩వ ఆ-౩౭) మీఁదికిఁ జూచి యమునా

నదీ తీరమున కేఁగి (ఉద్యో-౪వ ఆ-౩౬౩) [1] "బ్రమాని బ్రమాని కరిగి" ఇదియు గమానార్థోదాహృతియె, దీనిని ప్రౌఢ వ్యాకర్త పీప్స కుదాహరించుట సరికాదు (చూ-ప్రౌఢ-కార-౧౪వ సూ)

## అపాదానము

భయ-జుగుప్సా-పరాజయ-ప్రమాద-గ్రహణ - భవన-త్రాణ-విరా-మాంతర్థి-వారణంబు-లెద్దాన నగు దానికి 'వలన' వర్ణకం బగు ౧౪ (బా-కార-౬; వ్యా-సం-౨౪౬ I విష)

౧వ విష 'వలనను' అనుదానికి 'వల్లను' అనునది యర్వాచీన రూపాంతరము (చూ-తత్స-౧-౭ సూ ౧వ విష) అపాయ మనఁగా విశ్లేషము విడిపోయిన వస్తువులలో నేది నిల్చియుండునో యది యపాదాన సంజ్ఞ గలదనియు నది పంచమ్యంత మగుననియు సంస్కృత వ్యాకరణమునఁ జెప్పబడెను 'వృక్షము వలన నుండి పర్ణము పడెను' అనుచో వృక్షము నిల్చిపోయినది పర్ణమున కపాయము గల్గెను గాన వృక్ష శబ్దము పంచమ్యంత మగునని సంస్కృత వైయాకరణుల యాశయము (వృక్షాత్పర్ణం పతతి) [2] కాని యట్టి యర్థమున దెల్గున వృక్ష మందుండి పర్ణము పడె నని వాడఁబడును వృక్ష మందుఁ గొంత సేపుండి పర్ణము పడె నని యర్థము 'వృక్షము వలనఁ బర్ణము పడె' ననుచోట నయితము 'వలనన్' అనునది యౌపవిభక్తిక 'వలను' (దిక్కు) శబ్ద సప్తమ్యంత రూపమే యనియు వృక్షమువలన నుండి పర్ణము పడె ననియె వాడుక యనియు నందలి 'ఉండి' శబ్దము లోపించి యధ్యాహార్యమగు నపుడు 'వృక్షము వలనఁ బర్ణము పడె'నను వాక్యము సిద్ధించు ననియు నెఱుంగునది

---

1 ఇట్టి వానిని సూరి సంగ్రహింపనేలేదు- ప్రౌఢ వ్యాకర్తయు నిందుఁ గొన్నిటిని మాత్రమె సంగ్రహించెను

2 సూరి యిట్టి సంస్కృత వ్యాకరణ పద్ధతినే యనుసరించి 'అపాయము' అను దానిని సైతము సూత్రమున నిల్పి యపాయ స్థలములను నపాదాన పంచమీ స్థలములుగా సూత్రించి యుదాహరించెను,

కాన 'భయా'దు లెద్దాన నగుచో యది యపాదాన సంజ్ఞ గలదనియు, సిద్ధానక 'వలన' వర్ణక మగుననియు నెఱుంగునది ఇట్లు 'వలనన్' శబ్దమును పంచమీ విభక్తి పరముగాను, సప్తమ్యంత పరముగాను గ్రహింపవలెను "పరేష్వాంద్యాద్యధి శబ్దేషు । సప్త మ్యాద్యా విభక్తయః" అని యధర్వణాచార్యుఁడు వచించెను (వ్యా-సం-౨౪౨ విష ౧౦౧౩వ పుట) కావున నపాయస్థలములందలి 'వలనన్' శబ్దము సప్తమ్యంతమె కాని పంచమీ ప్రత్యయ మని తలంపరాదు

౨వ వివ భయాదు లెద్దాన నగునో యది యపాదాన సంజ్ఞ గలదనియు, నట్టి దానిపై 'వలన' వర్ణకము నిల్చు ననియు నెన్ననగును

భయము చోరునివలన భయము పడియె జుగుప్స (ఏవ) పాపంబు వలన నేవగించె పరాజయము అధ్యయనంబు వలన డస్సె ప్రమాద పాడి వలనం బరాకు వడియె గ్రహణ మైత్రుని వలన ధనంబు గొనియె (చూ-కార-౬వ సూ III వివ మైత్రునిచే ధనంబు గొనియె) హంస వలన విని నావలన నెఱింగి మొ ఇవియు గ్రహణమునకై యుదాహృతులు భవ నంబు మనువు వలనఁ బ్రజలు పుట్టిరి త్రాణంబు చోరుని వలనం గాచె విరామ భోగంబు వలన విరమించె అంతర్ధి (దాఁగుట) కృష్ణుండు తల్లి వలన దాఁగె వారణంబు శోకంబువలన వారించె ఇట్టి వాడుకలు దెల్గునం దరుదుగఁ గలవు భీకువలనం బ్రభవించె (ఆది ౧వ ఆ-౧౪౫) క్షితిపతుల వలన సముపార్జితమైన ధనము (సభా-౧వ ఆ-౨౭౪) ఇట్టి యెడఁల దెల్గున "కు" షష్ఠి తఱుచు ఉదా వానికి భయం పడుచుండుదురు (ఆది-౪వఆ-౩౭) పాండవులకు వెఱతు (ఆది-౬వ ఆ-౧౨౧) కర్ణున కే నోడితి (కర్ణ-౩వ ఆ-౫౩) చ్యవనునకు సుకన్యక కుద్భవ మయ్యె . ప్రమతి (ఆది-౧వ ఆ-౧౪౫) అనుచిత కృత్యంబునకుఁ దొలంగఁ ద్రోచితివి (కర్ణ-౩ వ ఆ-౭౯)

## 'ఉండి'—'ఉంచి'

"ఉండి-ఉంచి" అనెడి శబ్దములు "కూర్చి-గుఱిచి-గుఱించి-చేసి" అను వాని వలె నన్ప్రయుక్త శబ్దములు కావు (చూ-కార-౨వ సూ-౨వ వివ

౭వ సూ ౧వ వివ?) అవి వాక్యావయవము లగు పదములు ౧౫ (బా కార-౧౦-౧౭ సూ వ్యా-సం-౨౪౭ I విష)[1]

ఇవి వాక్యములోని ''సప్తమి-ద్వితీయ'' అను విభక్తులు గల పదములతో నన్వయించుచు వాక్య గత పదములై యుండును ఉదా సప్తమి-ఉండి· దేవ పథమునం దుండి . చనుదేర వలయు (ఆర-౩వ ఆ-౧౮౦, దేవ పథమునందుఁ గొంత సేపుండి చనుదేర వలయు నని యర్థము) ఉంచి-ద్వితీయ కాంచి యమ్మంత్రి యెచ్చోటి నుంచి వచ్చె (కృష్ణరాయ విజయము-౪వ ఆ-౨౬౦వ ప బాలక-౧౯౪వ పుట ఏదోచోటి నచట నుంచి వేసి వచ్చె నని యర్థము) 'ఉండి' అనునది 'ఉండు' ధాతు క్త్వార్థకము 'ఉంచి' అననది 'ఉంచు' ధాతు క్త్వార్థకము (ఉండు ధాతు ప్రేరణము 'ఉంచు' ధాతువు)

౧వ వివ సందర్భయోగ్య పద వ్యవధానమును గలదు "ఎం దేవి నుండి. .వచ్చి" (ఆది-౩వ ఆ-౧౮౦) పెక్కిటి కొక్కటి నిల్చుటయుఁగలదు ఆ వె విష్ణు పదము వలన, విధుని వలన సూర్యు । వలన త్రిపుర విజయి మౌళి వలన నుండి (అను-౨వ ఆ-౧౧౮వ ప) [2]

౨వ వివ సప్తమి మీఁది'ఉండి'శబ్దము లోపించి యధ్యాహార్య మగుటయుఁ గలదు "ముఖ నేత్ర నాసికా రంధ్రము లందు .. వెడలె (ఆర-౬వ

---

1 సూరి ఉండి' శబ్ద (బా-కార-౧౦-౧౧ సూ) మనుప్రయుక్త మని సూత్రించెను అది వాక్యమం దర్థవంతమగు శబ్దము గాన ననుప్రయుక్తము కానేరదు ఉదా వనమునం దుండి వచ్చెను మొ

2 సూరి సయి రూపములను సాధించుటకు ''వలన" కుండి యను ప్రయుక్త మగుసాయి నట్టి 'వలనకు' ద్వితీయా సప్తము లాదేశము లగుననియు సూత్రించెను (బా-కార-౧౦-౧౧ వ సూ) 'ఉండి' శబ్దానుప్రయోగము గల 'వలనన్ అనునది సప్తమ్యంతమె అది యపాదాన పంచమీ విభక్తి కాదు (చూ-కార-౧౭ . సూ I౨ వివ) ఇంక ద్వితీయ "వనము నుండి వచ్చెను'' అను వాక్యమె యసాధువు ఉండి నిల్చునప్పటి ద్వితీయ కవి ప్రయోగారూఢము కాదు

ఆ-౩౬౧వ ప) నూతిలో । వెలువడఁ గోమలిం దిగిచి (ఆది-౩వ ఆ-౧౪౪) ఒడలన్ వెలువడి (ఆర-౨వ ఆ-౧౭౯) [1]

పీపు వెడలిన (ఆశ్వ-౪వ ఆ-౯౪) ఈ సప్తమ్యంతములపైని "ఉండి" శబ్దము నధ్యాహారము చేయనిచోఁ గారకమునకుఁ గ్రియాన్వయము లేక యన్వయ భంగ మగును

౩వ వివ 'ఉంచి' శబ్దపు వాడుకకుఁ బ్రాచీన మహాకవి ప్రయోగములు లభింప లేదు "కాంచి యమ్మంత్రి యెచ్చోటి నుంచి వచ్చె" అను కుమార ధూర్జటి ప్రయోగము బలమైనది దొరకినది [2] ఇట్టి 'ఉంచి' శబ్దము లోపించి యధ్యాహార్య మగుట ప్రాచీన కావ్యములందె కన్పట్టు చున్నది ఉదా చేదినం । దను తనువున్ బృహ ద్రుధిర ధారలు బోరన మీఁది కొల్కఁగాన్ (సభా-౨వ ఆ-౯౦) పృథుదేహము వెల్వడి (సభా-౨వ ఆ-౬౯) ఇట్టి యెడలను 'ఉంచి' శబ్దాధ్యాహారము లేనిచో నట్టి యెడల ద్వితీయ కన్వయము లేక యర్థభంగ మగును

## తొట్టి మొ. ప్రభృత్యర్థకములు

౪వ వివ 'ఉండి-ఉంచి' శబ్దముల వలెనె యనుప్రయుక్తములు కాక వాక్యమునం దన్వయము గల మఱి కొన్ని శబ్దములును గలవు ప్రభృత్యర్థక ములు ప్రథమాంతముతో నన్వయించును ఉదా ఇది మొదలు (ఆది-౩వ ఆ-౧౨) సంస్కృతమున నిట్టి యెడలఁ బంచమి నిల్చును ఉదా 'కార్తిక్యాః ప్రభృతి, కార్తికపు పున్నమ మొదలు 'తొట్టి' (మొదల్కొని) శబ్దము ద్వితీయతో నన్వ, యించును ఉదా హిమకరుఁ దొట్టి (ఆది-౧౨ ఆ-౧౪) 'కోలెన్-కొలెన్' శబ్ద ములు (ప్రభృతి) సప్తమ్యంతముతో నన్వయించును ఉదా నాటం గోలె

---

1 'అందు' విభక్తి మీఁది 'ఉండి'కి లోపము లేదను ప్రౌఢ వ్యాకర ణము ప్రామాదికము (ప్రౌఢ-కార-౧౧ వ సూ)

2 ఇట్టి కవిప్రయోగము లుండఁగా 'ఉంచి' శబ్ద పయోగమె యసాధు వని సూరి వివరించుట సరికాదు (బాం-కార-౧౧౧వ సూ)

(విరా-౧౫వ ఆ-౫౪) పుట్టిన కోలెన్-పుట్టిన దానం గోలెన్ (ఇట తచ్ఛబ్దలోపము గల్గెను)

## 'కంటె-పట్టి' వర్ణకములు

కంటె వర్ణకం బన్యార్థాది యోగజం బగు పంచమి కగు ౧౬ (బా-కార-౧౨, వ్యా-సం-౨౪౮ I వి)

ఉదా రామునికంటె నన్యుండు ధానుష్కుండు లేఁడు అంబుజనాభునిఁ బ్రీతుఁ జేయు కంటె నను హితమైన కృత్య మొకటిం గలదే (ఉద్యో-౩వ ఆ-౧౫౮) ఇట నొక శబ్ద మన్యార్థకము ఇట్టి 'కంటె' విభక్తి పెక్కుటి కొక్కటి నిల్చుటయుఁ గలదు "సూనుల తమ్ములకంటె (ఉద్యో-౪వ ఆ-౩౯) 'కంటె' కర్వాచీన పర్యాయము 'కన్న' విభక్తి (చూ-తత్స-౧-౭వ సూ ౧వ వివ) ఇట్టి యెడల షష్ఠీ 'కు-కి' ప్రత్యయ ప్రయోగము తఱుచు ఉదా రాముని కన్యుండు ధానుష్కుండు లేఁడు (చూ-ఉద్యో-౩వ ఆ-౧౬౦)-ఇట్టివి నీ కగ్గలముగ (నీ కంటె నగ్గలముగ ఆది-౫వ ఆ-౨౩౯) "నీకంటె నితరుఁడు దానికిఁ బరముగ మున్నగునవి యాది శబ్ద గ్రాహ్యములు

కంటె వర్ణకంబు నిర్ధారణ పంచమికి నగు ౧౭ (బా-కార-౧౩వ సూ, వ్యా-సం-౨౪౯ విష)

ఎచట నిర్ధార్యమాణంబు జాత్యాదులచే భేదంబే కలిగి యుండు నచటం బంచమి యగు (చూ-కార-౨౧వ సూ) అట్టి పంచమికిఁ గంటె వర్ణకం బగు నని యర్థము ఉ మానహానికంటె మరణము మేలు ఇట్టి యెడల షష్ఠీ 'కు-కి' ప్రత్యయ స్థితియుఁగలదు మానహానికి మరణము మేలు మహా దారుణ మది విషము కంటె దహనముకంటెన్ (సభా-౨వ ఆ-౧౭) విత్త రక్షకుఁ గడుమేలు వృత్త రక్ష (అర-౪వ ఆ-౧౩౦) సీ-నికంటె హరిబుద్ధి లేకయే (నన్ని-కు-౨౨ ఆ-౧౬౭ హరి నీకంటె నెక్కుడని యర్థము, చూ-కార-౧౩వ సూ) పెక్కుటి కొక్కటి నిల్చుటయుఁ గలదు 'సూనుల తమ్ములకంటె నాకు సంప్రీతి యొనర్చి (ఉద్యో ౪వ ఆ-౩౯)

గుణవాచకము హేతు వగునపుడు 'పట్టి' యు ద్రుత పూర్వకముగ నిల్చును హేతుపగు నుజ్యంత క్రియ మీఁద 'పట్టి' విభక్తి మాత్రమే నిల్చు ౧౮ (బా-కార-౧౪వ సూ, వ్యా-సం-౨౫౦ I విష)

జ్ఞానముంబట్టి మోక్షము గల్గును "పట్టీతి తు పంచమీ గుణే హేతౌ" అను చింతామణి సూత్రము దీనికి మూలము 'పట్టి'యు నిల్చు ననుటచేత (కార-౬వ సూ) "జ్ఞానము చేత-జ్ఞానమువలన" అను హేతు తృతీయా పంచములు నగు * నుజ్యంత గల్గంబట్టి (ఆర-౬వ ఆ-౬౧) ఈవు గలుగంగఁబట్టి (కాశీ-౩ వ ఆ-౪౪, ప్రౌఢ-కార-౧౨వ సూ)

## 'యొక్క-ది-వి' ప్రత్యయములు

స్వస్వామి భావాది సంబంధములందు స్వామ్యాది వాచకములకు 'యొక్క' వర్ణకం బగు అయ్యది లోపించును అట్టి యెడల 'యొక్క' చోట నేకత్వంబున 'ది' వర్ణకంబును బహుత్వమున 'వి' వర్ణకంబును వైకల్పికముగా నిల్చును 'నీ-నా-తా-మన' శబ్దముల 'యొక్క' చోట'దు' వర్ణకము వికల్పముగ నిల్చును (ఈ 'ది-వి-దు' ప్రత్యయములు సమాసగతము లని భ్రమింపరాదు) ఈ ది-వి ప్రత్యయములు పరమగు నపుడును, 'తన' అను తద్ధిత ప్రత్యయము పరమగునపుడును బూర్వావయవ మగు ప్రకృతి (షష్ఠీ తత్పురుష పూర్వావయవము వలె) ద్వితీయా విభక్తిరూపమున నిల్చును (చూ-సమా-౩౨వ సూ) కొన్ని యెడల 'యొక్క' అను దానిచో "కు-కి" అను విభక్తి నిల్చుటయుఁ గలదు ౧౯ (బా-కార-౧౫వ సూ, బా-సమా-౮-౯-౧౧వ సూ, వ్యా-సం-౨౫౦ I, II విష)

'స్వస్వామి భావాది' అను చోటి 'ఆది' శబ్దముచేత "అవయ వావయవి భావము-జన్య జనక భావము" మన్నగు వివిధ సంబంధముల నెన్ననది

* సూరి తృతీయా పంచము లగు నని యేల వచింపలేదో తెలియకున్నది (బా-కార-౧౪వ సూ) ఇందు 'జ్ఞానముం బట్టి' అని యుదాహరించుటకు సూరికి ద్రుత మెట్లు వచ్చెనో? నుజ్యంతము మీఁది 'పట్టిని' సూరి సూత్రింప కుండుట సరికాదు

'యొక్క' లోపము చిన్ని రామచంద్రుని నగుమోము (రాఘ-౨వ ఆ-౬౫ ప, చిన్ని రామయొక్క - భారతార్థ చిన్ని రామచంద్రుని యొక్క-రామాయణార్థ) ధర్మజు నలువురు తమ్ములు (సభా-౨వ ఆ-౨౬౧, నలువురు-ప్రథమా బహు వచనము) ఎవ్వనియేని ముఖామృతాంశు బింబమ్మున (ఆది-౧వ ఆ-౭౭) దుర్మర్షణునియు దుర్ముఖునియు । నిండ్లు (శాంతి-౧వ ఆ-౩౯౬) నీ నా యెడఁబాటు (అను-౧వ ఆ-౨౬౩) భూ । పతులయు విప్రముఖ్యుల సభన్ (సభా-౨వ ఆ-౧౦) మనవారల వారి వారి మానములు (ఉద్యో-౪వ ఆ-౨౧౯) యొక్కార్థక 'ది-వి' ప్రత్యయములు- షష్ఠి ద్వితీయా కారమున నిల్చుట దా । నిది కలరూపు (ఆది-౪వ ఆ-౩౦ సామాసిక దుృతలోపము-సంధి-౨౩వ సూ) వారివ (వారివి + అ) ధమ్మిల్ల భారావకలిత దివ్యామోద నవ పుష్ప దామములయు (ఆది ౩వ ఆ-౧౫౬) 'దు' ప్రత్యయము నీదు కొడుకులు (స్త్రీ-౧వ ఆ-౧౩), తమదు వీథులఁ దమదు లోఁగిళ్ళ (రంగ-రా-యుద్ధ ౬౦౭), మద్భక్త దేహంబు మాదు దేహంబు (బసవ-౪వ ఆ-౧౨) *

---

* సూరి 'ది-వి' ప్రత్యయములను జెప్పనే లెదు 'అది-అవి' శబ్దముల సమాసమునఁ (బా-సమా-౧వ సూ) దచ్ఛబ్దాకార లోపముచే (సంధి-౪౨ వ సూ బా-సంధి-౪౫ వ సూ) నట్టివి సాధ్యము లగు నని సూరి తలంపు ఇంక 'దు' సామాసికాగమ మని సూరి సూత్రించెను (బా-సమా-౧౧వ సూ) అది సరికాదు (చూడు-వ్యా సం ౨౫౧-I విష) చ నీ హృదయము నాదు చొచ్చుటకు (శాంతి-౬వ ఆ-౨౦౨) ఇత్యాదులు దాని 'యొక్క' అను నర్థమును వ్యస్తతను స్థిరపఱచును గదా! 'ది-వి'అనునవి ప్రత్యయము లగునపుడు వానికి 'అగు' ధాతువుతో నన్వయ ముండదు "రాముని యొక్క" అనుదానికి 'అగు' ధాతు జన్య విశేషణములతో నన్వయి ముండదు గదా! అది విశేష్యముతో నన్వయించును రాముని యొక్క గుణములు దానిది కలరూపు (ఆది-౪వ ఆ-౩౦), వారివి + అ-వారివ పుష్ప దామములు (భార-ఆది ౩వ ఆ-౧౫౬)

'ది-వి-దు' ప్రత్యయములు 'యొక్క' ర్థకము లనునపుడే 'నాదు-మాదు-నీదు-మీదు-తనదు-తమదు-దానివి-వారివి' మున్నగు రూపములు కుదురు పడును 'దు' సామాసిక ప్రత్యయ మన్నచో నది ప్రకృతి (నీ-నా-తా) పైని నిల్వవలయును 'యొక్క'కు వ్యస్తతయందును లోపము కవి ప్రయోగ సిద్ధ మగుటచేత 'నా పుస్తకము- వాని పుస్తకము' అను రీతిని సమాసము లన్నను వ్యస్తము లన్నను క్షతి లేదు 'దా। నిది కలరూపు' మున్నగు వానిలో 'ది' అనునది ప్రత్యయ మనుటయె యుక్తము ఇంగ్లీషు నందలి My, Mine శబ్ద ముల వలెనె 'దానిది', 'అది' శబ్దాంతములును నగుననుట యుక్తము 'నాది-నావి' మున్నగు రీతిని 'అది-అవి' అను శబ్దముల సమాసములు నిర్బాధములు 'దు' సామాసిక మను పక్షమున నివి ('నాది-నావి' అనునవి) బాధితము లగును విశేష విధిచే 'దు' అనునదియే రావలయును "దిస్స్యాత్సంబన్ధార్థే యుష్మదస్మ దాత్మభ్యో ద్వితి వర్ణకః" (ఆం-చిం-వ్యా-సం-౨౫౧ I-విష) 'యొక్క' చోట 'కు-కి' ప్రత్యయ స్థితి పొందునకుఁ గుంతికిఁ బుత్త్రుఁడు (ఆది-౬వ ఆ-౪౫) ఇట్టే జగమునకుఁ గర్త-జగము యొక్క కర్త మొ

## ప్రథమ యందు షష్ఠి-నిర్ధారణ షష్ఠీ సప్తములు

ధాతుజ విశేషణ భావార్థకాది ప్రత్యయములచే నభిహిత మగు కర్తృ పదము యొక్క ప్రథమచోఁ సంబంధార్థ వివక్షచే 'యొక్క' షష్ఠి గా వచ్చుఁ అట్టి 'యొక్క' విభక్తి లోపించును 'యొక్క' షష్ఠి యర్థ విశేష బోధకి మును నగు ౨౦ (ప్రౌఢ-కార-౧౫-౧౬సూ, వ్యా-సం-౧౦౩౩-౧౦౩౪ పుటలు ౨౫౧వి)

ఉదా. సంబంధార్థ వివక్ష తన మును పడ్డ బన్నములు (ఉద్యో-౩వ ఆ-౧౦౨) ప్రథమ తాను మునుపడ్డ బన్నములు ఇట్లె-అర్జుండు వెలిఁగించునట్లు (సభా-౨వ ఆ ౬)-అర్కుని వెలిగించునట్లు పరీక్షిజ్జనపాలు చనుట (ఆది ౨వ

'అది-అవి' అను శబ్దములు నిల్చునపు డవి విధేయ విశేషణములై 'అగు' ధాతుజ విశేషణములతో నన్వయింపనగును ఉదా చేసిన దగు పని-చేసిన వైన పనులు-౨న దగు రూపము నాదగు పుస్తకము ఇది నాదియై యున్నది (నా + లది + ది) మొ (చేసినది, తనది మున్నగు నవి విధేయ విశేషణములు)

ఆ)-పరీక్షిజ్జనపాలుఁడు చనుట యొక్క షష్ఠి యర్థ విశేష బోధకము దృఢ దీర్ఘ బాహు వీ। ర్యమ్ములవారు (ఆది-౭వ ఆ-౧౮౦-దీర్ఘబాహు వీర్యములు గల వారు), దర్భపూరి పఱపులు (ఆది-౭వ ఆ ౨౨౬-దర్భగడ్డితో నిర్మించిన పఱపులు) పట్టుపుట్టము దొర-పీతాంబరుఁడు

సముదాయమునం దేక దేశమును బృథక్కరించు నపుడు సముదాయ వాచి లోపల షష్ఠ్యంతము సప్తమ్యంతమును బర్యాయముగ నగును ౨౧ (బా-కార-౧౬వ సూ, వ్యా-సం-౨౫౨ విష)

**ఉదా** మనుష్యులలోపల క్షత్రియుండు శూరుండు పూజనీయులైన **పురుషులలోపల నెవ్వఁడయ్యేఁ గృష్ణుఁడు** (సభా-౨వ ఆ-౧౧) గోవులందుఁగపిల **బహుక్షీర. సీ జ్యోతిస్సులందు** వర్యుఁడు రవి.. .. విద్యలఁ బ్రధాన సావిత్రి .. అనిలచయమునఁ బ్రాణ మగ్ర్యము, ధాతువులలోన నుత్తమము పసిఁడి (అశ్వ-౨వ ఆ-౧౬౧), నలుగాలివాన గోవును ..మనజుల విప్రుండు । సమధికత్వ భాజనములు (శాంతి-౧వ ఆ-౫౧౫౪), 'మనుజులన్' అను నజడ ద్వితీయయు సప్తమ్యర్థకముగ వాడఁబడెను

౧వ వివ చింతామణ్యనురోధమున (సంస్కృత వ్యాకరణము చొప్పునను) 'లోపలన్' అనునది 'షష్ఠి' యనఁబడెను గాని నొప విభక్తికములగు "లోపలన్-లోనన్" శబ్దములును సప్తమ్యంతములె 'లోన్' అను నదియు సప్తమ్యర్థకమె

౨వ విప నిర్ధార్యమాణము భిన్నవస్తు వగునపుడు పంచమి యగును (చూ-కార-౧౭ వ సూ) నిర్ధార్యమాణము సముదాయము లోనిదే యగునపుడీసూత్రము వర్తిల్లును 'మనుష్యులలో క్షత్రియుఁడు శూరుఁ' డనునపుడు క్షత్రియుఁడును మనుష్యులలోని వాఁడే కదా।

## అధికరణ త్రైవిధ్యము-నిమిత్త సప్తమి

అధికరణంబునకు సప్తమి యగు ౨౨ (బా-కార-౧౭, వ్యా-సం-౨౫౩-౨౫౩ I వి)

అధికరణంబు నా నాధారంబు ఇది త్రివిధంబు 1 ఔపశ్లేషికము-ఏక దేశ మాధార మగును ఉదా చాపయందున్నది (చాప యొక్క యేక దేశ మందున్నది) పగవారి యింటఁ గుడిచి (ఉద్యో-౩వ ఆ-౨౨౪) మీ యందుఁ గల వస్తువులు (సభా-౧వ ఆ-౨౩౯) ఇంద్రునందునికి (సభా-౧వ ఆ-౧౯-ఇంద్రుని సన్నిధి యందని యర్థము) ౨ అభివ్యాపకము (సర్వావయవ సంబంధము గలది) ఉదా అంతటను నీశ్వరుఁడున్నాడు ఎల్లయందును దా వసియించుట (ఉద్యో-౨వ ఆ-౩౨౬), ఎక్కడఁ జూచినం దానయై (భీష్మ-౨వఆ-౧౩౭) 3 వైషయికము విషయతా సంబంధమున గోచరించునది ఇది మిక్కిలి విరివిగా నండును ఉదా మోక్షమున నిచ్చగలదు (మోక్ష విషయమున నిచ్చ గలదు) వాఁడు కేళిం గుశలుఁడు (వాఁడు కేళీ విషయమునఁ గుశలుఁ డనియర్థము) ధర్మమున వేదములు ప్రమాణము (ధర్మ విషయమున వేదములు ప్రమాణ మని యర్థము) ఆతఁడు గురు సేవయందున్నాఁడు (అతఁడు గురు సేవా విషయమున నున్నాఁడు)

౧వ వివ సంస్కృత వ్యాకరణ సిద్ధ మగు నిమిత్తార్థజ సప్తమియు విషయ సప్తమియె యనఁదగును ఉదా చర్మణి ద్వీపినం హన్తి-చర్మము నిమిత్తమునఁ (విషయమున) బులిని జంపు చున్నాఁడు మొ

౨వ వివ సంస్కృత ప్రసిద్ధమగు సత్సప్తమిచోటఁ దెలుఁగున భావలక్షణార్థక నుజ్యంతము వాడఁబడును (చూ-క్రియా-౫౧వ సూ) ఉదా గోషు దుహ్యమానాసు దేవదత్తో గతః - గోవులు పిదుకఁబడుచుండఁగా దేవదత్తుఁడు వెళ్ళెను మ కురుప్రౌఢుల్ గురువృద్ధ బాంధవు లనేకుల్ సూచుచుండఁగన్ (సభా-౨వ ఆ-౨౩౩వ ప) ఇట్టి యెడల భావలక్షణార్థక నుజీచే నచటి కర్తృ కర్మార్థము లభిహితములగును గాన నచటఁ బ్రాతిపదికార్థ ప్రథమయే వచ్చును (కురువృద్ధుల్ మొ)

౩వ వివ స్వామీశ్వ రాధిపతి దాయాద సాక్ష్యాది శబ్ద యోగమున సంస్కృతమందు వచ్చు షష్ఠీ సప్తములచోటఁ దెలుఁగున శేష షష్ఠియె వచ్చును ఉదా సంస్కృ గవాం గోషువా స్వామీ - గోవులయొక్క స్వామి-గోవులకు స్వామి మొ

ఉకారాంత జడంబునకు 'న' వర్ణకంబగు ౨౩
(బా-కార-౧౮, వ్యా-సం-౨౫౩ III విష)

'న' వర్ణకమును సప్తమీ ప్రత్యయమె యైనను 'అందు' వర్ణకము నిల్చి నచో నెల్ల నిది నిల్వనేరదు ఉదంత జడములమీఁద నేకత్వమున మాత్రమె 'న' వర్ణకము నిల్చును అస్మదీయ వం । శమునఁ బ్రసిద్ధులై (ఆది ౧వ ఆ ౧౪)

౧వ వివ 'న' వర్ణకము తృతీయార్థ మందును నిల్చును (కార-౨౬వ సూ) ఊరుతలము కరతలం । బున నప్పళించె (శల్య-౨వ ఆ-౨౭౨)

## ఒక విభక్తిచో మఱొక విభక్తి

ఒకానొకచో నొక విభక్తికి మఱియొక విభక్తియు
నగు ౨౪ (బా-కార-౨౧వ సూ, వ్యా-సం-౨౫౪ ౨౫౪ I వి)

సంస్కృత ప్రసిద్ధ విభక్తులకు విలక్షణములగు విభక్తులు సైతము (కార-౧౦-౨౫-౨౬-౨౭-మొ) పెక్కులు తెల్గున వచ్చు నని యీ సూత్ర మున కర్థము కాన నిందు విధింపఁబడిన విభక్తులే కాక యీ వ్యాకృతి యందు విధింపఁబడని విభక్తులు సైతము తెల్గునఁ బ్రయోగింపఁబడుట గల దని దీనికిఁ దాత్పర్యము ఉదా పేరోలగం బుండు (ఉద్యో-౧వ ఆ-౨౭౦, ఇట-'పేరోలగమం దుండు' అను సప్తమి రావలయును, ఇట్టి యంతటను నరయునది) నెఱకులాడి వేదనఁ గావించు (అర-౧వ ఆ-౩౧౪), తీర్థము లాడ నోపరు (అర-౨వ ఆ-౨౮౬), వారు సుఖ మున్నారు (ఆది ౭వ ఆ-౧౨౯), నీయందైన సంబంధము (ఆది-౮వ ఆ-౫౨), నీయం దర్పితం బయ్యె (సభా-౨వ ఆ-౧౦౨)

౧వ వివ , 'వాహనమును దిగెను' అను దాని నీ సూత్రమునకు లక్ష్య

ముగ[1] నుదాహరింపరాదు 'వాహనమునుంచి దిగెను' అను చోటి 'ఉంచి' అధ్యాహార్యమని తలంపవలయును 'వాహనమునుండి దిగెను' అను వాక్యము సాధువే కాదు అట్టి ప్రయోగము మృగ్యము

౨౫ వివ ఏక వాక్యమున రెండు విభక్తు లొక్క శబ్దముపైని నిల్వ వలసి వచ్చునపుడు "కర్తృ-కర్మాఽధికరణ సంప్రదానాఽపాదానములలోఁ బరవిభక్తి బాధితమై పూర్వ పూర్వ విభక్తులు నిల్చును. ఉదా గంగను గూర్చి యేగి స్నానముం జేసెను" అనుచో ''గంగయం దనెడి యధికర ణము బాధిత మయ్యె. ఇట్టె యంతటను నెఱుంగునది [2]

## తృతీయా సప్తమ్యర్థక ద్వితీయ

ఉదంతైక వచనేతరములయు, నౌపవిభక్తికైక వచ నేతరములయు జడముల తృతీయా సప్తములకు ద్వితీయ వైకల్పికముగ నగు ౨౫ (బా-కార- ౨౨, వ్యా-సం-౨౫౫ I విష)

మహిమన్ మహినొప్పు (ఆది-౧౨ ఆ-౬- 'మహిమ చేత మహియం దొప్పు' అని యర్థము) దిక్కుల నించె యశము (సభా-౧౨ ఆ-౧౭) ఉదం తైక వచన ఆశ్రిత పోషణంబునన్ (ఆది-౧౪ ఆ-౬) చిగురునన్ ('ఆశ్రిత

---

1 సూరి దీనికి "మైత్రుండు గృహమును వెడలెను వాఁడు వాహన మును దిగెను'' అని యుదాహరించెను ఈతఁడు 'ఉంచి' నంగీకరింపలేదు ఉండికి ద్వితీయ మీఁదఁ బ్రయోగము లేదు

2 ఇట్టి యుక్త మార్గమును గ్రహింపక ప్రౌఢ వ్యాకర్త "కొన్ని యెడల విభక్తి విపరిణామంబు గ్రాహ్యంబు ఉదా ఈతనితో సాటి యనంగ మేల నఁగ(నిర్వ-౩వ ఆ) ఇచ్చటఁ దృతీయకుఁ బంచమి మార్పుగల్గెను(ప్రౌఢ-కార- ౨౬వ సూ)'' అని సూత్రించి యుదాహరించెను ఇది సరికాదు తెల్గున విభక్తి విపరిణామాన్వయమే సమ్మతముకాదు(చూ-వ్యా-సం-౨౧౯ విష ౮౮౧-౮౮౨ పుటలు)

పోషణంబున్-చిగురున్' అను ద్వితీయైక వచనములకుఁ దృతీయా సప్తమ్యర్థ ములు లేవు 'ఆశ్రిత పోషణంబులన్-చిగురులన్' అను ద్వితీయా బహువచనము లకుఁ దృతీయా సప్తమ్యర్థములును గలవు). ఇట్లె యౌపవిభక్తికైక వచన అన్నిటన్ (అన్నిటి చేతన్-అన్నిటి యందున్. 'అన్నిటిన్' అను ద్వితీయైక వచనమునకుఁ దృతీయా సప్తమ్యర్థములు లేవు) త్రాటన్ (త్రాటి చేతన్-త్రాటి యందున్, 'త్రాటిన్' అను ద్వితీయైక వచనమునకుఁ దృతీయా సప్తమ్యర్థములు లేవు 'త్రాడులన్' అను ద్వితీయా బహువచనమునకుఁ దృతీయా సప్తమ్యర్థ ములు గలవు)

౧వ వివ అజడ వాచకముల ద్వితీయా బహువచనంబునకును నీ విధి వర్తిల్లును మనుజుల విప్రుండు (మనుజులలో విప్రుండు) సమధి కత్వ భాజన (శాంతి-౧వ ఆ-౭౧) ఘనతర స్తన చక్రవాకముల నలరు (చక్రవాకముల చేత, హరి-౮ భా-౪వ ఆ, ప్రౌఢ-కార-౧౭వ సూ) పురుషులను దృప్తిఁ బొందుట (అను-౨వ ఆ-౧౪౫-పురుషులచేత) పశువు। లను మేటి యజ మఖిల చతుష్ప దములను । ధేనువు మిక్కిలి మానవులను । ఎ-గీ బ్రాహ్మణుండు వరిష్ఠుండు పక్షులందు । శ్యేనము...... (అశ్వ-౨వ ఆ-౧౬౧, పశువులన్-పశువులందు మొ)

ఉదంత జడంబు తృతీయకు 'న' వర్ణకంబగు ౨౬ (బా-కార-౨౩ వ్యా-సం-౨౫౬ I విష)

నా కతం। బున బహు దుఃఖముల్ గలిగె (కర్ణ-౩వ ఆ-౬౭, చూ-కార, ౨౩ వ సూ ౧ వివ)

---

* అజడోదంత తృతీయకును 'న' వర్ణక మేకత్వంబునఁ గలుగునని ప్రౌఢ వ్యాకర్త సూత్రించెను గాని దానికి బలమైన కవి ప్రయోగము లభింప లేదు (ప్రౌఢ-కార-౧౭ వ సూ) ఏనుఁగున నేనుఁగు వైచుచు (భాస్కర-యుద్ధ) అని యాతఁడిచ్చిన ప్రయోగమున "ఏనుఁగుల నేన్గుల వైచుచు" అనునది ౨వి ప్రయుక్త మనవచ్చును ప్రయోగాంతరము లేదని యాతఁడే వ్రాసెను

# ద్వితీయార్థక ప్రథమ

సహజ మగు జడంబు* ద్వితీయకుఁ బ్రథమ వైకల్పికంబుగ నగు ౨౭ (బా-కార-౨౪, వ్యా-సం-౨౫౭ I వి)

"భరతా। మ్నాయులగు పాండవేయుల। శ్రీ యిమ్మెయిఁ గొనిన...... (సభా-౨వ ఆ-౧౮౫) ఒకట ద్వితీయయు, నొకట ద్వితీయార్థక ప్రథమయు నిల్చి సముచ్చితములు గావచ్చును ✤ లోకములోని వర్తనములుం దగువారి నెఱుంగుదు (ఆది-౭వ ఆ-౧౫౬)

౧వ వివ 'సహజ మగు' అనుట చేతఁ ద్వితీయా సప్తమ్యర్థములందు వచ్చిన ద్వితీయకుఁ బ్రథమ రాదు ఉదా లంకం గలకలంబు పుట్టెను' (లంకయందుఁ గలకలంబు పుట్టెను) అట్టిచోట 'లంక కలకలంబు పుట్టెను' అనరాదు పాము-కూర్మము, కూర్మము నీటిలో నుండి వెడలి విక్రమింప నేరదు గాన "అను-౧వ ఆ-౨౩౨"వ పద్యములోని "నీటిలోను వెడలకుండి" అను పాఠము సరి "అను-౧వ ఆ-౨౩౩"వ పద్యములోని 'నీర్వెడలి' అను పాఠము కవి ప్రయుక్తము కాదు "నీర్వెడసి" అనునది తిక్కయజ్వ ప్రయుక్త మనఁ దగును" 'తీర్థము లాడనోపరు' అట్టిచోట సైతము 'తీర్థములన్' అను సప్తమ్యర్థక ద్వితీయకుఁ బ్రథమ వచ్చె నని తలంపరాదు ఇది కార-౨౪వ సూత్రమునకె లక్ష్యము ఇట్లె 'పేరోలగం బుండు' మున్నగు స్థలములు సప్తమి కాదేశ

---

* "కొన్ని యెడల నజడంబు ద్వితీయకును బ్రథమ కానంబడియెడి" (ప్రౌఢ-కార-౧౬వ సూ) దీనికిని బలమైన ప్రయోగము కానరాదు ప్రౌఢ వ్యాకర్త యిచ్చిన యుదాహృతు లన్యథా సిద్ధములు 'మదనాగ మెదిర్చి' అనుచో "మదనాగ మెదుర్పన్" అనియు, "తన వారణేంద్ర మ। క్కుకురు కుల వీరు మీఁద నెసకొల్పి" అనుచో "తన వారణేంద్రు న। క్కురు కుల " అనియు, "తత్క్రతుహయోత్తము మొక్కెడఁ గట్టఁ బంచి" అనుచో "తత్క్రతుహ యోత్తము నొక్కెడఁ గట్టఁబంచి" అనియుఁ గవి ప్రయుక్త పాఠములని చెప్పఁదగును

మగు ద్వితీయ చోట వచ్చిన ప్రథమ యని చెప్పుటకు వలను పడదు. పేరోలగంబు మున్నగునవి ఉదంతము లగుట చేత నట్టి యెడఁ 'బేరోలగంబునన్' అనియే నిల్చును గాని ద్వితీయయే నిల్వదు కాన నట్టి స్థలము లెల్ల కార-౨౪వ సూత్రమునకె లక్ష్యము లని తలంపక తీరదు

## కాలాధ్వవాచక ప్రథమ

కాలాధ్వములకుం బ్రాయికంబుగాఁ బ్రథమ యగు ౨౮ (బా-కార-౨౫, వ్యా-సం-౨౫౮-౨౫౮ I విష)

నిన్న వచ్చె (నిన్నటి దినమందు వచ్చె), రేపు గన్గొనియెదం గాకేమి నేఁడేగెదన్ (మనుచ-౨వ ఆ-౧౨), తేపు జనపతి యనికిం । జనుట (భీష్మ-౩వ ఆ-౯, తేపు-ప్రాతఃకాలమందు) వారు క్రోశము నడచిరి ఆ చోటిచ్చటి కొక యోజనంబు గలదు (ఆర-౨వ ఆ-౧౭౩, యోజనంబు-యోజనమందు).

౧వ వివ 'పేరోలగం బుండు' మొదలగు వానిని దీని చొప్పున "దేశ వాచకముల సప్తమికిని బ్రథమ యగు"నని సూత్రించి సాధింప రాదా యని శంకింపరాదు (చూ-ప్రౌఢ-కార-౨౦వ సూ) 'సూర్యుఁడు తూర్పున నుదయించె' అనుచో "తూర్పుదయించె" అనరాదు గదా ! ఇట్టివెల్ల కార-౨౪వ సూత్రమునకు లక్ష్యము లనుటయె యుక్తము

విశేష్యంబునకుం బోలె విశేషణంబునకును బ్రాయికంబుగ లింగ విభక్తి వచనంబులగు ౨౯ (బా-కార-౧౬, వ్యా-సం-౨౫౯ విష)

నంద తనయుండు కృష్ణుండు నాకు దిక్కు- దేవకీ పుత్త్రి హరిని నుతింతు నెపుడు శుభ విధాయుల రామకృష్ణుల భజింతు భువన వంద్యను రుక్మిణిఁ బ్రస్తుతింతు *

---

* "విశేష్యస్య చ యల్లిఙ్గం । విభక్తి వచనే చ యే । తాని సర్వాణి యోజ్యాని విశేషణ పదే ష్వపి" (ముగ్ధ-వ్యాఖ్య-కార-౩౦౯ వ సూ)

౧వ వివ పైది సామాన్య విధి ఇది వర్తిల్లని విశేష స్థలములును గలవు ఉదా రాముఁడు నా మిత్రము (తత్స—౧౮ వ సూ) హనుమంతుఁడు దూత (తత్స-౬౩ వ సూ) సురలు మహాత్ములు (తత్స-౬౧ వ సూ) ఉన్మత్త వేషిణియైన లచ్చి (అర-౨వ ఆ-౧౧౬, చూ-తత్స-౧౭వ సూ -౪వ వివ) తల్లి విదుషి-తండ్రి విద్వాంసుఁడు మొ

౨వ వివ నీ వలిగిన నడ్డమె। పురహ రాజ కేశవులైనన్ (ఆది-౪వ ఆ-౧౯౯), హరుఁడు వానికిఁ బ్రత్యక్షమై (అర-౪వ ఆ-౨౪౪, చూ-వ్యా-సం-విస్త II ౨౫౯ విష) ఇవియు విశేష ప్రయోగములె

౩వ వివ "కొన్ని యెడల విధేయ విశేషణ మొండ బహువచనాంతం బయి విశేష్యములు పెక్కిటి కన్వయ యోగ్యం బగు" (ప్రౌఢ-కార-౨౫వ సూ) ఉదా కం ఇది దక్షిణా పథంబున। కిదియు విదర్భాపురమున కిది కోసలకిం। దిది యుజ్జయినికిఁ దెరువులు (అర-౨వ ఆ-౭౦), చ నల దమ యంతు లిద్దఱు మనః ప్రభవా నల దహ్యమానలు (అర-౨వ ఆ-౨౪) ఇట్లు ద్వంద్వ తత్పురుషములలో నుత్తరపద లింగమే నిల్చును

౪వ వివ ప్రకృతి వికృతులు చెప్పఁబడునపుడు ప్రకృతి పద వచనమే నిల్చును ఉదా పది బల్ల లొక తలు పగుచున్నవి

## విశేషణ విశేష్య విభక్తులు

అప్రాణి వాచకము లగు స్త్రీ సమంబు లయిన విశేషణంబులయు, మువర్ణ కాంత విశేషణములయు బహువచనంబున కేకవచనంబు వికల్పముగా నగు ౩౦ (బా-కార- ౭౦, వ్యా-సం-౨౬౦-౨౬౦ I వి)

స్త్రీసమ మాటలు పెక్కేల ।-మాటలు పెక్కు-లేల ? మువర్ణకాంత ఇష్టమగు పదార్థములు-ఇష్టములగు పదార్థములు అప్రాణి వాచకముల కనుట

చేత "వంద్యము లగు దైవతములు జిత సింహము లగు నేనుంగులు" మున్న గుచోట్ల నేకవచము నిల్వదు[1]

'అన్ని' ప్రకృతులయు, సంఖ్యావాచకములయు వాడుకలో మొదట వాడఁబడుదానికిఁ బ్రథమయుఁ దర్వాతి దాని కితర విభక్తియు బహుళముగ నగును ఇట్టి యెడలఁ గొన్ని చోట్ల షష్ఠీ సమాస మాత్రమె వర్తిల్లుటయుఁ గలదు ३० (బా-కార-౨౬వ సూ, వ్యా-సం-౨౬౧ I విష)

'అన్ని' ప్రకృతులు అచ్చి-౫౧వ సూత్ర వివరణమునఁ జేర్కొనఁబడెను ఉదా గుఱ్ఱము లన్నింటికి-గుఱ్ఱముల కన్నింటికిని, గుఱ్ఱములు నాల్గింటికిని-గుఱ్ఱములకు నాల్గింటికిని గుఱ్ఱములు లక్షకును-గుఱ్ఱములకు లక్షకును (సంఖ్యావాచకము లన్ని ప్రకృతుల లోనివె యైనను నిట్టిసంస్కృత స్థలములకై 'సంఖ్యావాచకములయు'అని వేఱుగ గ్రహింపఁబడెను) కీచకు లందఱును (విరా-౫వ ఆ ३३౧) దిశలు పదింటను (మహాప్ర-౧వ ఆ-४౮) లోకముల కన్నిటికిన్ (అను-౫వ ఆ ३౧౭) షష్ఠీ సమాసమాత్ర మా యిరువురతో (ఉద్యో ౨వ ఆ-౧३౫), వావి యన్నింటికంటెను (ఉద్యో-౨వ ఆ-౮౫), మీ యిరువురలో (శల్య-౨వ ఆ-౧౦౮) ఇట్టి యెడల "మేమిరువురతో-అవి యన్నింటికంటె-మీ రిరువురలో" అను రీతి గల ప్రయోగములు లేవు[2] కార ३౨ భ్యాద్యర్థ వ్యవధా నాభావస్థలముల కన్న నించుక భేదనుండుటచే నిది వేఱుగ నుపదేశింపబడెను

---

1 సూరి "అప్రాణి వాచకము లగు" అని చెప్పకుండుటచేత "వంద్యమగు దైవతములు జితసింహమగు నేనుంగులు" మున్నగు ననిష్టరూపము లాతని పక్షమున దుర్వారములు అట్లే "ఆపన్నయగు మానిసులు మున్నగు ననిష్ట రూపములును దుర్వారములే యగు

2 సూరి యిట్టి షష్ఠీ సమాస స్థలములను జూచికొన్నట్లె యగపడదు.

# ఖ్యాద్యర్థవ్యవధానమున విశేషణము ప్రథమాంతమగుట

ఖ్యాద్యర్థక వ్యవధానమున విశేషణము ప్రథమాంతమును, విశేష్యమితర విభక్త్యంతమును వికల్పముగ నగును ఖ్యాద్యర్థ వ్యవధానము లేకున్నను (అధ్యాహృత్యము కావచ్చును) నట్టి కార్యమగుట గలదు * ఈ విధి షష్ఠీ స్థలమునఁ దఱచుగా నగును ౩౨ (బా-కార-౨౭-౨౮, వ్యా-సం-౨౬౨ I విష)

"అగు-అవు-ఔ, అయిన-ఐన, అయి-ఐ" మొదలగు 'నగు' ధాతుజ రూపములు ఖ్యాద్యర్థకములు భవత్యర్థ వ్యవధానమున సుగుణాభిరాముఁడగు రామునకున్-సుగుణాభిరామునకు రామునకుఁ సుగుణాభిరాముఁడగు రాముని చేన్-సుగుణాభిరామునిచే రామునిచేన్ ఖ్యాద్యర్థవ్యవధానము లేనపుడును, సుగుణాభిరాముఁడు రామునకున్ సుగుణాభిరాముఁడు రామునిచేన్ ప్రయోగములు ౧వ వివరణమునఁ జూపఁబడును

౧వ వివ అతిమానుష మత్యద్భుత మతిదుష్కర మయిన కేశవార్జున కృతిని (ఆది-౮వ ఆ-౩౧౯), ఆచార్యుఁడు ద్రోణునకున్ (ఆది౫వ ఆ-౨౩౩) మీగురుఁడు భార్గవుచే * (ఉద్యో-౪వ ఆ ౨౪౬), మాతండ్రి పరాశర సుతుచేతన్ (ఆశ్ర ౧వ ఆ-౮౨), దుశ్చారిత్రకుండా సుయోధనున్ (ఉద్యో-౩వ ఆ-౯౮), అస్త్రకళా సముజ్జ్వలుఁడు పార్థుతోడ (కర్ణ-౨వ ఆ-౪౨), పార్థివ సుతు లిద్దఱన్ (అర-౫వ ఆ-౧౧౧) తల్లి ద్రౌపది తోడన్ (జై-౧వ ఆ-౯౭) ఆద్యుఁడు హిరణ్య గర్భునందున్ (ఆము-౩వ ఆ-౮౦), ఉద్దండ ఖడ్గ వ్యాఘ్రము మిమ్మంచు కొండకు (మనుచ-౨వ ఆ-౧౬)

౨వ వివ ఖ్యాద్యర్థ వ్యవధాన మను చోటి 'యాది' శబ్దముచేత "సుగుణాభిరాముఁ డని యెన్నఁబడిన రాముఁడు" పుణ్యశ్లోకుఁడనఁగ యజ్ఞ నిరతుఁడనఁగఁ దనరిన నలు భార్యను దమయంతి యనఁగ బఱఁగిన దానన్ (అర-౨వ ఆ-౯౯) మున్నగు సలములు సంగ్రహింపబడుచున్నవి

---

* ఇట్టి మహాకవి ప్రయోగములు పెక్కు గల్గ పని సూరి చూచికొనలేదు

౩ వ వివ 'ఉన్న-కల-న' వర్ణకాదులగు కర్త్రర్థకాదులే కాక భావార్థక స్థలము లగు "రాముడు వచ్చుట మేలు" మున్నగువాని యందును క్రియ నిరాశ్రయమై యుండుట యసంభవమగుటచేత నాభాస కర్తృత్వము వెలయుచుండును (చూ-వ్యా-సం-౨౬౫ II విష) కాన నచటి కర్త్రర్థ మభిహిత మగుటచేతఁ దృతీయాదులు రాక ప్రాతిపదికార్థ ప్రథమయె వచ్చుచున్న దనఁ దగును గాన నట్టి భావార్థకా (ట-అమి-మె) ద్యన్వయమునందును ప్రథమా విభక్తి వచ్చు నను విధానములు (సూరిగారివి)* సిద్ధార్థాను వాదములె ! కాన వానిని వేఱుగ నుపదేశింప నక్కఱలేదు

---

* ఇట్టి వాక్య న్యాయ సిద్ధములగు ప్రాతిపదికార్థ ప్రథమ లని భావింపఁజాలక సూరి యీ క్రింది సూత్రములను సయితము పునరుక్తముగా సూత్రించెను అవి యెల్లఁ బ్రత్యాఖ్యేయములు వాని నిటఁజూపుచున్నాను

"భవత్యర్థకంబు సన్నిహిత విశేషణంబునకు నద్దాని ముందటి విశేషణంబుల 'కయి' పదంబును బహుళంబుగా ననుప్రయుక్తం బగు ౨౯ (వ్యా-సం-౨౬౩ I విష)

అతులుఁడై యప్రమేయుఁడౌ హరిని గొలుతు (వాక్యమం దన్వితమగు 'అయి' శబ్ద మనుప్రయుక్త మగుట సరికాదు)

అయి పదానుప్రయోగంబు లేనిచోఁ దుది విశేషణంబునకేని, విశేషణంబులన్నింటికేని మీఁద సముచ్చయార్థంబు విభాషం బ్రయోగింపఁబడు ౩౦ (వ్యా-సం-౨౬౩ I విష)

ఆద్యుఁ డప్రమేయుఁడు నగు హరినిఁ గొలుతు ఆద్యుఁడు నప్రమేయుఁడునౌ హరినిఁ గొలుతు

ధాతుజ విశేషణంబు లన్నింటి 'కయి' పదం బను ప్రయుక్తం బగు ౩౧ (వ్యా-సం-౨౬౩ I విష)

## యుష్మ దస్మ ద్విశేషణ రూపములు

ప్రథమాంతంబులగు యుష్మ దస్మ ద్విశేషణంబుల కేకత్వంబున 'వు-ను'లును, బహుత్వంబున 'రు-ము' లును నం తాగమంబులు ప్రాయికం బుగ నగు ౩౩ (బా-కార-౩౩)

**ఈ** యాగమంబులు పరంబు లగునపు డుత్వంబున కత్వంబగు ౩౪ (బా-కార-౩౪, వ్యా-సం-౨౬౪ I విష)

నీవు ధన్యుఁడవు, నేను ధన్యుఁడను మీరు ధన్యులరు మేము ధన్యులము "ఇకారంబు మీఁది 'కు-ను-వు-క్రియా విభక్తుల' యుత్వం బున కిత్వం

---

ఆద్యుఁడై యప్రమేయుఁడై యఖిలసేవ్యుఁడై యొసంగెడు దేవుని నభినుతింతు ఇచ్చట మఱియుం ప్రయోగ వైచిత్ర్యంబు గల దది ప్రయోగంబుల నెఱుంగునది ఇట సూరి యుద్దేశించిన వీ క్రింది రీతివి కానోపును కం ... బ్రాహ్మణ ప్రియమయి ధ। ర్మ్యంబయి క్షత్రియ వైశ్య కు। లం బవిరత పుణ్య కర్మ లాలస మగుచున్ (అది-౮వ ఆ-౮౫) ఆయతమతు లయ్యె నౌరుల కలవియె చెప్పన్ అర-౪వ ఆ-౧౨౫, ఇట ధాత్వంతర జన్య విశేషణ ప్రయోగము లేదు)

భావార్థకాది యోగంబునం గర్తకుఁ బ్రథమ యగు ౩౨ (వ్యా-సం-౨౬౩ I విష ౧౦౮౭వ పుట)

క్రియా-౩౫వ సూ మొ ౪౭వ సూ వఱకుఁగల సూత్రములలో విధింపఁబడిన 'ట' వర్ణకాదులును, క్రియా ౧౨౨వ సూత్రమున విధింపబడిన 'నఙ్'యు భావార్థ కాదు లనఁబడును ఉదా రాముడు వచ్చుట రాముఁడు రాఁగా లక్ష్మణుఁడు గాంచె రాముఁడు విల్లందినం ద్రిలోకంబు లాకులం బగు, రాముఁడు పట్టిన ప్రతిన 'వీనిని బురోహితుండుగా, వీనిని బురోహితునిగా' మున్నగువాని యందు 'కాన్' అనునది యనుప్రయుక్త శబ్దమనియు (బా-క్రియా-౧౧౫వ సూ), విశేష్య విభక్తి వచనములు విశేషణమున కయ్యెననియు, నట్టి 'కాన్' శబ్దాంతము క్రియా విశేషణమయ్యె ననియు నెఱుంగునది

ఐగు'' (తత్స-౨౬) అను సూత్రము చేత 'వు-ను'ల కిత్వంబగు నీవు సుకృతివి, నేను సుకృతిని షష్ఠీ విశేషణ ప్రథమ యందును నీ విధి వర్తిల్లును **ఉదా** మహాత్ముఁడ వగు నీకు మొ

"గీ ఆర్తి హరుఁ డగు నినుఁ గొల్తు నంబుజాక్ష",*"గర్వ గరిష్ఠుండగు నన్ను (నిర్వ-౫వ ఆ-౯౧), మీరలు పెద్దలు" ఇత్యాదులు ప్రాయిక గ్రహణంబుచే రక్షితంబు లయ్యె.

'అది' శబ్దంబునకు 'వు-ను' లు పరంబు లగునపుడును, సంబోధనంబు నందును 'దాన' యను నాదేశం బగు ౩౫ (బా-కార-౩౫, వ్యా-సం-౨౯౪ 1) నీవు చిన్న దానవు, నేను చిన్న దానను, ఓ చిన్న దాన!

---

ఇట్లె ప్రౌఢ వ్యాకరణమునందును కారక ౨౧వ సూత్రమును ననావశ్యకమగుటచేఁ బ్రత్యాఖ్యేయము "భుజాటోప భయంకరుఁ । డర్జును కోపానలము" (ఉద్యో-౧వ ఆ ౪౬) మున్నగు ప్రయోగముల లోని "అర్జును" మున్నగునవి 'యొక్క' విభక్తి లోపించిన వ్యస్త షష్ఠ్యంత పదము లనుటలో క్షతి యేమియుఁ గానరాద (చూ-కార-౧౯ వ సూ).

అట్లె ప్రౌఢ-కారక-౨౩ఎ సూత్రమును బ్రత్యాఖ్యేయమె అందలి యుదాహృతు లన్నియుఁ గారక సూత్రాంతర సాధ్యములె (చూ-వ్యా-సం-౨౬౨ విష ౧౦౭౦వ పు) "నన్నుఁ గొన్ని వెడమాట లాడుచు నతఁడు చెట్టవట్టినన్" అని వాక్య న్యాయ పద్ధముగా నన్వయింప నగును గదా దీనికై "క్రియాన్వయంబున రెండు పదంబులకు స్వస్వామి భావ సంబంధము గలచో సంబంధి పదంబు షష్ఠికి ద్వితీయ యగు"నని సూత్రింప నేల?

* 'ఆర్తిహరుఁడవౌ ఎఱు' అను పాఠము (బాల-కార-౩౪ వ సూ) ప్రామాదికము బాల వ్యాకరణ ప్రథమ ముద్రణమునను నిట్లె యున్నది

# వాక్యగత పదముల క్రమ నిరపేక్షత

అన్య యుష్మ దస్మ త్కార్యంబులం దుత్త రోత్తరంబు బలీయంబు ३౬ (బా-కార-३౬, వ్యా-సం-౨౬౪ II విష)

వారును మీరును ధన్యులరు మీరును మేమును ధన్యులము

౧వ వివ ఈ కార్యము క్రియల యందును గల్గును ఉదా . వారును మీరును జదివితిరి మీరును మేమును (మనము) జదివితిమి ప్రార్థనా ద్యర్థము నందు (చూ-క్రియా ३౬) 'అ'త్వము సైతము వచ్చును మీరును మేమును ననఁగా మనము చదువుదము ప్రార్థనము లేనపుడు తద్ధర్మాద్యర్థమున "మనము చదువుదుము" అనియె యగును (చూ-వ్యా-సం-३२० విష ౧౬౯౯-౧२००పుటలు)

ఏక వాక్యంబునం దొకా నొక్కండు దక్క సర్వ పదంబులును గ్రమ నిరపేక్షంబుగం బ్రయోగింపం జను ३८ (బా-కార-३२, వ్యా-సం-౨౬౫-౨౬౫ I విష)

పూర్వ మిది, పర మిది యను నియమ మపేక్షింపక వాక్యమం దెల్ల పదంబులు ముఖ్యముగాఁ బద్యములందుఁ బ్రకృతార్థ ప్రకాశకతకు భంగము లేకుండఁ బ్రయోగింపఁ దగును * ఏని ప్రభృతి శబ్దంబులు కొన్ని నియమ సాపేక్షంబులయి యుండును ఉదా రాముఁడేనిఁ గృష్ణుఁ డేనిఁ భజింపఁ దగును మొ ('ఏని రాముఁడు' మున్నగు రీతిని బ్రయోగింపరాదు) ప్రకృతార్థ ప్రకాశకతకు భంగము లేకుండు నట్లుగ ననుటచేత "రాముఁడు రావణుని జంపెను గుంభకర్ణుని" అను రీతిని బ్రయోగింపరాదు ప్రకృతార్థ ప్రకాశకతకు భంగము లేకుండ విశేషణ విశేష్యములును బదాంతర వ్యవహితములు కావచ్చును ఉదా చ భవ। జ్జనకుఁబరీక్షితున్ . చేసె అతి దాంతు- (భార ఆది ౧వ ఆ-౧౨౪వ ప)

---

* సూరి 'వలచి నట్లు' అని సూత్రించుట సరికాదు

౧౫ వివ వాక్యాంతర గర్భిత వాక్యముల ప్రయోగమును గలదు ఉదా “ ఆ యుధిష్ఠిరుఁడు దమ్ములకు . మీరు . అంబికేయుని... పంచిన యట్లు చేసి చరింపుఁడు అని । యను దినంబుఁ జెప్పు . . (ఆశ్ర-౧వ ఆ ౧౦) తెల్గున నర్థర్చము తుదిని బదావసానము కానక్క ఱలేదు అధ్యాహారములు సంస్కృతమున వలెఁ జేయనగును పద్యాంతరములతోఁ గుల కము నుండవచ్చును ఉ. .తానొక పండు చెచ్చెరన్ ॥ కం కొని వచ్చుడు (ఆది ౨వ ఆ ౧౯౯-౨౦౦)

ఇది కారక పరిచ్ఛేదము



# బాలవ్యాకరణోద్ద్యోతము

## VI సమాస పరిచ్ఛేదము

పృథక్ప్రసిద్ధార్థంబు లగు పదంబుల కేకార్థమునందు వృత్తి యేకార్థీభావ సామర్థ్యంబు ఇది సమాసము లందలి సామర్థ్యము వాక్యములందలి పదముల యన్వయము (రాముఁడు రావణుని జంపె) వ్యపేక్షా సామర్థ్యము ౧ (బా-సమా-౧వ సూ, వ్యా-సం-౨౬౬-I-II-III-IV వి)

పరస్పరాన్వయము గల పదములు సముదాయ శక్తిచే విశిష్టైకార్థ బోధ కంబు లగుట సమాస మని తాత్పర్యము సమాసార్థబోధక వాక్యము సమాస విగ్రహము సమాస మనఁగా సంక్షేపము విభక్త్యాది లోపమునఁ బదము సంక్షిప్త మగుటయు ననేక పదంబు లేకీభవించి యొక్క పదం బగుటయు నిందు సంభవించును

# వృత్తు లైదు విధములు

౧ వ వివ వృత్తు లైదు విధము౹ు "కృత్తద్ధిత సమాసైక శేష సనాద్యన్త ధాతు రూపాః పఞ్చ వృత్తయః" "విగ్రహవాక్యావయవ పదార్థేభ్యః పరః అన్యః యోఽయం విశిష్టైకార్థః తత్ప్రతిపాదికా వృత్తి రిత్యర్థః" (సి-కౌ-౪౧౭వ పుట బాలమ-వ్యా) సమాస వృత్తియందును దద్భిన్న వృత్తులందును విభక్త్యాదుల లోపము గల్గును 1 కృద్వృత్తి ఏలిక (జనుల నేలువాఁడు ఇది దీని విగ్రహము ఇందలి 'ఇక' అను కృత్ప్రత్యయము కర్త్రర్థకము) ఇది సాధ్యము (అచ్చ తెల్గుది) సిద్ధ మగు కృద్వృత్తి సరోజము (సరసి జాయత ఇతి సరోజమ్-ఇది దీని విగ్రహము - సరస్సునందుఁ బుట్టునది) 2 తద్ధితవృత్తి రాముని తనము (ఇది సాధ్యము)-రామత్వము (ఇది సిద్ధము, రాముని యొక్క భావము) ఇఁదలి 'తన' ప్రత్యయము భావార్థక తద్ధితము 3 ఏక శేష వృత్తి దీనికి ద్వంద్వ సంజ్ఞయు మాస సంజ్ఞయు లేవు ఉదా పితలు (మాతాచ + పితాచ-పితరౌ-తల్లిదండ్రులు) రాములు (రామశ్చ + రామశ్చ + రామశ్చ-రామాః), ఇది సిద్ధము సాధ్యము తల్లులు (తల్లియు + దల్లియు) తండ్రులు (తండ్రియుఁ + దండ్రియు) 4 సనాద్యంత ధాతువృత్తి చికీర్షువు (కిర్తుమిచ్ఛుః-చేయ నిచ్ఛగలవాఁడు ఇది సన్నంతధాతువృత్తి) జేగీయమానుఁడు (పునః పున రత్యన్తం వా గీయమానః-మాటిమాటికిని, లేదా మిక్కిలిగన గానము చేయఁబడినవాడు) ఈ వృత్తి సిద్ధమాత్రమె 5 సమాస వృత్తి ఈ ప్రకరణమున వివరింపఁబడు తత్పురుషాదికము ఉదా రాజ పురుషుఁడు (రాజ్ఞః + పురుషః-రాజుయొక్క పురుషుడు, ఇది సిద్ధము) రాజు పురుషుఁడు (ఇది సాధ్యము)

## అలౌకిక విగ్రహము-ప్రాదులు

౨ వ వివ 'రాజ పురుషః' అను దానికి 'రాజ్ఞః + పురుషః' అనునది లౌకిక విగ్రహము లౌకిక విగ్రహ మనఁగాఁ బ్రయోగ యోగ్యము ప్రయోగ యోగ్యము కానిది యలౌకిక విగ్రహము 'రాజన్ + అస్ + పురుష + సు' ఇది యలౌకిక విగ్రహము ఇట్టి యలౌకిక విగ్రహము నందె కృత్తద్ధిత సమాసముల వివక్షచేఁ గృత్తద్ధిత సమాస సంజ్ఞలు గలిగి కృత్తద్ధిత సమాసాంతత్వమునఁ బ్రాతిపదిక

సంజ్ఞలు గల్గును అట్టి ప్రాతిపదికమున కవయవములలోని వగు సుప్ప్రత్య యాదులు (ఆది శబ్దముచే ద్వంద్వ చ కార మధ్యమ పదాదులు గ్రాహ్యములు) "సుపో ధాతు ప్రాతిపదికయోః" (౨-౪-౧౨, సి-కౌ ౬౩౦వ సూ సి-కౌ ౩౧౯వ పుట) అను సూత్రముచే లోపించి కృత్తద్ధిత సమాస ప్రాతిపదికము లేర్పడును కృత్ సరోజ, రామ తద్ధిత రామత్వ-దాశరథి సమాస. రాజ పురుష ఇట్లె సాధ్య ప్రాతిపదికములను నెన్నవలయును

౩ వ వివ సాధారణముగా సుబంత పదములకే సమాసము గల్గును తిఙంతములకు సమాసము సాధారణముగా లేదు "ప్ర + నమతి-ప్రణమతి (నమస్కరించుచున్నాఁడు) ని + సిధ్ + తి-నిషేధతి(నిషేధించుచున్నాఁడు)" మున్నగునవి సమాస విశేషము అని ముగ్ధ బోధ వ్యాకర్త వచించెను ఏకార్థీ భావ సామర్థ్య ముండుటచే సమాసత్వ మంగీకరించినను వానికి ద్వంద్వాది సంజ్ఞలు లేవు (ముగ్ధ ౩౧౯వ సూ) "ప్రణమతి" మున్నగునవి "ప్ర-నమతి" మున్నగు రీతిని వ్యస్తపదములె యని పాణినీయ సిద్ధాంతము "ఉప వసించెను-నమస్కరించెను - అలంకరించుచున్నాఁడు-అనుభవించు" మున్నగునవి యాంధ్ర మహాకవి ప్రయుక్తము లగుచుండుటచేతను దెలుంగునఁ బ్రాదులకుఁ బ్రయోగము లేకుండుటచేతను నవి సమాసములె యనుట యాంధ్ర మహాకవి సమ్మత మనఁదగును

## ఏకదేశాన్వయము

౪ వ వివ సాధారణముగ వ్యస్త పదాకాంక్షిత మగు పదమునకుఁ బదాంతరములతో సమాసము గల్గనేరదు అట్టి యేకదేశాన్విత పద సమాసము సాధారణముగా దుష్ట మందురు కాని "ఋద్ధస్య రాజ్ఞో మాతఙ్గాః ఋద్ధస్య రాజ మాతఙ్గాః" అను రీతి గల సమానాధికర ణాన్వయము గల్గిన యేక దేశాన్వ యము గల పదములకు సమాసము కాదనియు "దేవదత్తస్య గురుకులమ్-బాణేన భిన్న హృదయః" అను రీతి గల్గిన వ్యధికరణాన్వయముగల యేకదేశాన్వయ సమాసములు సాధువు లనియు సంస్కృత వైయాకరణ సిద్ధాంతము అట్లయి నను బ్రాచీనాంధ్ర మహాకవులు వ్యధికర ణైకదేశాన్వయ సమాసములతో పాటుగ సమానాధికర ణైకదేశాన్వయ సమాసములను సయిత మంగీకరించి,

ప్రయోగించిరి వ్యధికరణాన్వయ అవనీశులెల్ల నీ యనుజ వీర్య విజితులు (సభా-౧వ ఆ-౨౭౨), అతని కరతల ద్వయావమర్దితములై (ఆర-౨వ ఆ-౧౬౭), నా వీర్య ప్రభవులు (ఆది-౮వ ఆ-౩౦౧), తన యశో విశద ముక్తా సౌధ పాళికి (వసు-౧వ ఆ-౧౧౬) సమానాధికరణాన్వయ ఆ నారాయణ పాండవేయ గుణ మాహాత్మ్యమలజ్యోత్స్న (ఆది-౩వ ఆ-౨౧), ఆ రథాధిరూఢుఁడు (ఆర-౨వ ఆ-౧౮౩), ఆ పర్వతాగ్ర హేమైక శృంగంబు (నన్నికు-౧వ ఆ-౨), దానవికిఁ జేసిన నెయ్యము (ఆది-౩వ ఆ-౧౮౬) దానము చేసిన తత్ఫలంబు (ఆది-౧వ ఆ-౧౨౫), అరయ భూమి కుచాగ్రహారాభమైన। శ్రీ తెనాల్యగ్రహార నిర్ణేతవు (పాండు-౧వ ఆ-౨౩) ఇట్టి ప్రయోగములను బట్టి చౌదళాబ్జంబు (బస-౧వ ఆ-౩౪), ముల్లోకవంద్య (బసవ-౨వ ఆ-౬౦౭) మున్నగున వెల్ల వైరి సమాసము లని తత్పూరికాకర్త వలె భ్రమింపక యేకదేశాన్వయి సమాసము లని తలంపవలయును

## సమాస మైచ్ఛికము

౫వ వివ సామాన్యముగా సమాస మైచ్ఛికము అట్లయినను 'కృష్ణసర్పము' (నల్లని సర్పము) [illegible] సమాసము [illegible] యెఱుంగునది "రాముఁడు [illegible]" [illegible] చోట్లందు సమాసము గల్గనేరదు

౬వ వివ సమాసము పదాంతర వ్యవధాపితము సాధారణముగాఁ గాదు కాని కొన్ని యెడలఁ ద్రిక క్రియాజన్య విశేషణ ఘటితంబులు సందర్భయోగ్య పద వ్యవధాపితము లగుచు విశేషణోభయ పద కర్మధారయంబు లగును (ప్రౌఢ-సమా-౧౮వ సూ) ఉదా ఈ కన్నులు తెఱవని శిశువు (భోజ-౬వ ఆ), ఇఱల గెలిచిన తుమ్మెద గఱులఁ దెగడు। కురుల (భాగ-౧౦వ స్కం) ఏక [illegible] తిరుగు। నదరు లుమిసెడు కొఱవిదయ్యంబు (నైష-౨వ ఆ), బాగుగఁ [illegible] ప్రకాశమై। [illegible] పుష్పకము [illegible] (భాస్కర-అరణ్య కాండ), [illegible] వినరాని। [illegible] సూచుల (విష్ణు-[illegible] -), [illegible] ఛల్లి సెగ

ల్లిచే నొక్కఁబడని దండంబులు (విజ్ఞా-ఆచారకాండ) ఇట్టి ప్రయోగములు కవిత్రయము వారివి దొరకలేదు

## అలుక్సమాసములు

౭వ వివ సమా—౧వసూ—౨వ వివరణమునఁ జెప్పఁబడిన రీతిగా సమాస విభక్తి లోపించును గాని కొన్ని యలుక్ సమాసములు విధాన సామర్థ్యమున సాధువు లగును "జను షాంధుఁడు - పశ్యతో హరుఁడు - మాతుష్వస" మున్నగునవి సిద్ధము లగు నలు క్సమాసములు (చూ-సమా-౧వ సూ) ఇంక సాధ్యము లగు నలు క్సమాసములు రాముని గుణములు-రాముల గుణములు (సమా-౩౨), నీ చేతి ప్రోపు-నాతోడి చెలిమి-దొంగ వలని భయము-నీ యందలి కరుణ (చూ-సంధి-౪౦ వ సూ), తలఁబ్రాలు-ఒడిఁబ్రాలు - సేసఁబ్రాలు-ఊరఁబంది-ఊరఁబిచ్చుక (సంధి ౨౬ వ సూ) ఉత్తర పదలోపి సమాసములు నీ చేతి ప్రోపు-మొదలగునవి

౧వ వివ "సంస్కృత వ్యాకరణమునఁ బూర్వ నిపాతము పర నిపాతము" అను విషయమున మిక్కిలి విస్తృతముగాఁ గలదు కాని యది కవి ప్రయోగానుసారమె వధూ వరులు-వర వధువులు (సో౬ భవ ద్వరవధూ సమాగమః, రఘువం-ముగ్ధ-౩౨౧వ సూ-దుర్గా వ్యా), లక్షణ హేతువులు (పాణిని సూత్రము), అల్పాచ్చులు గల దగుట చేత హేతు శబ్దము పూర్వస్థమై యుండి హేతు లక్షణములని యుండ వలయునుగదా అల్పాచ్చులు గల శబ్దము లఘ్వక్షరములు గల శబ్దము నభ్యర్హిత వాచకము మున్నగునవి ద్వంద్వమునఁ బూర్వ నిపాతము కావలె నను నది నిత్యము కాదని యెఱుంగునది ఇట్లె సమానాధికరణములలో విశేషణము పూర్వస్థము కావలెను మున్నగునవియు 'మయూర వ్యంసకము' (ధూర్త మగు మయూరము) మున్నగునవి విశేష విధులచే సాధువులు

సిద్ధ సాధ్య భేదమున నీ సమాసము రెండు విధములు సంస్కృతమందే సిద్ధించి - పిసిఁగా సంస్కృత విభక్త్యంత విగ్రహము గలది సిద్ధము ఆంధ్ర

విభక్త్యంత విగ్రహము గలది సాధ్యము ౨ (బా-సమా-౨-౩, వ్యా-సం-౨౬౩ I విష)

సిద్ధ సమాస లక్షణము సంస్కృత వ్యాకరణాదుల వలననే తెలిసికొన వలయును సాధ్య మాంధ్ర వ్యాకరణ సాధ్యము ముందు వివరింపఁబడును

## సిద్ధ సమాసములు

సిద్ధ సమాసము లాఱు విధములు 1 అవ్యయీభావ సమాసము, 2 తత్పురుష సమాసము, 3 కర్మ ధారయ సమాసము, 4 ద్విగు సమాసము 5 ద్వంద్వ సమాసము, 6 బహు వ్రీహి సమాసము ౩ (వ్యా-సం-౨౬౭ I విష)

సాధారణముగాఁ బూర్వ పదార్థ ప్రధానము 'అవ్యయీభావము' ౪ (వ్యా-సం-౨౬౭ II విష)

యథా శక్తిగ నిచ్చెను (శక్తి మన తిక్రమ్య – యథా శక్తి) ఇందలి 'యథా' అను పూర్వావయవము ప్రధానము గాన నిది యవ్యయీ భావము ప్రధాన మనఁగాఁ గ్రియతో నన్వయించునది ఈ సమాసమునం దవ్యయము పూర్వ పదమై యుండును ఇది నపుంసకము వలె నుండి యవ్యయ మగును ఇట్టి సిద్ధ సమాసావ్యయీభావము పైనిఁ దెల్గు విభక్తులు గొన్ని యెడల నిల్చుటయుఁ గలదు ఉదా నా యథాశక్తిఁ జేసి (సభా-౧వ ఆ-౩౭) కేవలా వ్యయముల మీఁది విభక్తులు చెడు నిహముం బరంబు (ఆది-౧వ ఆ-౧౩౯)

తత్పురుష కర్మధారయ ద్విగువులు సాధారణముగా నుత్తర పదార్థ ప్రధానములు ౫ (వ్యా-సం-౨౬౭ III విష).

ద్విగు కర్మధారయములు తత్పురుషాంతర్భూతములె యందురు తత్పురుషము వ్యధికరణము ద్విగు కర్మధారయములు సమానాధికరణ సమాసములు,

# తతుర్పుషము-దాని విశేషములు

సమా సావయవ శబ్ద ధర్మములు విభిన్నాధికరణములగును గాన తత్పు రుషము వ్యధికరణ సమాసము ౬ (వ్యా-సం-౨౬౨ III విష)

రాజ పురుషుఁడు వచ్చెను (రాజ్ఞః పురుషః రాజ పురుషః-రాజు యొక్క పురుషుడు) ఇందు రాజత్వము రాజునందును బురుషత్వము పురుషునందును నుండును గాన నిది వ్యధికరణ సమాసము ఇందలి యుత్తర పద మగు 'పురుషుఁడు' అనునది క్రియతో నన్వయించుచున్నది గాన నిది యుత్తర పదార్థ ప్రధానము తత్పురుష సమాస మేడు విధములు

1 ప్రథమా తత్పురుషము ఉదా పూర్వకాయము(పూర్వః + కాయస్య-శరీరము యొక్క పూర్వభాగము), 2 ద్వితీయా తత్పురుషము ఉదా దుఃఖాతీతుఁడు (దుఃఖ + మతీతః-దుఃఖము నతిక్రమించినవాఁడు) 3 తృతీయా తర్పురుషము ఉదా మాసావరుఁడు (మా సేన + అవరః-మాసముచేతఁ జిన్నవాఁడు) 4 చతుర్థీ తత్పురుషము ఉదా యూప దారువు (యూపాయ + దారుః-యూపము కొఱకు దారువు) 5 పంచమీ తత్పురుషము ఉదా చోర భయము (చోరాత్ + భయమ్-చోరునివలన భయము) 6 షష్ఠీ తత్పురుషము ఉదా రాజ పురుషుఁడు (రాజ్ఞః + పురుషః-రాజుయొక్క పురుషుఁడు) 7 సప్తమీ తత్పురుషము ఉదా దానశౌండుఁడు (దానే + శౌణ్డః-దానమందు సమర్థుఁడు)

ఉత్తర పదార్థ ప్రాధాన్యము లేకున్నను గొన్ని తత్పురుషములె యనఁ బడును ఇటివి తత్పురుష విశేష విధులు ౭ (వ్యా-సం-౨౬౨ IV వి ౧౧౩౧వ పుట)

ఉదా అకించనుఁడు (నాస్తి కిఞ్చన యస్య సః-ఏమియు లేనివాఁడు) అకుతో భయుఁడు (నాస్తి కుతో భయం యస్య సః—దేని నుండియు భయము లేనివాఁడు) ఇట్టివి త్రిపద తత్పురుషము లనఁబడును అబ్రాహ్మణుఁడు (న బ్రాహ్మణః - అబ్రాహ్మణ - బ్రాహ్మణుఁడు కానివాఁడు) ఇట్టివి 'నఞ్'

తత్పురుషము లనఁబడును అతిమాలుఁడు (మాలను-మాలిక నతిక్రమించిన వాఁడు, అతిక్రాన్తో మాలామ్-అతిమాలః) ఇట్టివి పూర్వపదార్థ ప్రధాన తత్పురుషము లనఁబడును ప్రాచార్యుఁడు (ప్రకృష్టః+ఆచార్యః - ప్రాచార్యః-ప్రకృష్టుఁ డగు గురువు) ఇట్టివి ప్రాది సమాసము లనఁబడును

## అలుక్సమాసము

విశేష విధులచేఁ గొన్ని సమాసములందు విభక్తి లోపము గల్గదు అవి యలుక్సమాసము లనఁబడును ఇవి తఱుచుగాఁ దత్పురుషము లగుచుండును ౮ (వ్యా-సం-౨౬౮ X విష)

1 తృతీయాఽలుక్సమాసము ఉదా జనుషాంధుఁడు (జనుషా + అన్ధః-జన్మముచేతనే యంధుఁడు-జాత్యంధుఁడు-పుట్టుగ్రుడ్డి)

2 చతుర్థ్యలుక్సమాసము ఉదా ఆత్మనే పదము (ఆత్మనే + పదమ్-ధాతురూప విశేషము) పరస్మైపదము(పరస్మై + పదమ్-ధాతురూప విశేషము)

3 పంచమ్యలుక్సమాసము ఉదా పశ్యతోహరుఁడు (పశ్యతః + హర-పశ్యన్త మనాదృత్య హరతీత్యర్థః చూచుచున్న వానిని వంచించి దొంగిలించువాఁడు)

4 షష్ఠ్యలుక్సమాసము ఉదా పితురన్తేవాసి(పితుః + అన్తేవాసీ-తండ్రి యొక్క శిష్యుఁడు) హోతుః పుత్త్రుండు (హోతుః + పుత్త్రః- హోతయొక్క కొడుకు - యజ్ఞములో హోమము చేయు వాఁడు హోత) పితుః ష్వస-పితుఃస్వస - పితృష్వస (పితుః + స్వసా - తండ్రికి సోదరి - మేనత్త) మాతుః ష్వస - మాతుఃస్వస - మాతృష్వస (మాతుః + స్వసా-తల్లికి సోదరి పినతల్లి, పెదతల్లి) దేవానాం ప్రియుఁడు (దేవానామ్ + ప్రియః - మూర్ఖుఁడు, బౌద్ధుఁడు)

5 తత్పురుషేతరములును నలుక్సమాసములు గలవు కృద్వృత్తి-సప్తమ్యలుక్కులు యుధిష్ఠిరుఁడు (యుధి + స్థిరః) - ధర్మరాజు - యుద్ధ

మున స్థిరుఁడు) సరసిజము (సరసి + జాయతే - సరస్సునందుఁ బుట్టినది - పద్మము) మనసిజుఁడు (మనసి + జాయతే - మన్మథుఁడు - మనసునందుఁ బుట్టువాఁడు)

6 వ్యధికరణ బహువ్రీహి-సప్తమ్యలుక్సమాసము ఉదా కంఠేకాలుఁడు (కణ్ఠే కాలో యస్య సః - శివుఁడు - కంఠమునఁ గాలకూటపు నలుపు గలవాఁడు)

## కర్మధారయ లక్షణము - పుంవద్భావము

సమాసావయవ శబ్దముల ధర్మములు సమాసావయవములలోని యొక్క-యాధారమందే యుండును గాన ద్విగు కర్మధారయములు సమానాధికరణ సమాసములు ౯ (వ్యా-సం-౨౬౮ IV విష)

సంఖ్యావాచక విశేషణ పూర్వము ద్విగువు తక్కిన విశేషణము మొదటఁ గలది కర్మధారయము ద్విగు చతుర్యుగము ఇందు చతుష్ట్వమును, యుగత్వమును యుగమందే యుండును కర్మ నీలోత్పలము ఇందు నీలత్వమును నుత్పలత్వమును నుత్పల మందే యుండును కాన నివి సమానాధికరణములు 'చతుర్యుగము వర్తిల్లును', 'నీలోత్పలము రాజిల్లును' అను రెండిటియందును నుత్తర పదములే క్రియతో నన్వయించుచున్నవి గాన నివి యుత్తర పదార్థ ప్రధానములు

కర్మధారయ సమాసమునఁ బూర్వావయవము సాధారణముగా విశేషణమై యుండును కొన్నిటి యందు విశేష్యపూర్వ పదత్వమును గలదు ౧౦ (వ్యా-సం-౨౬౮ IV విష )

ఉదా నీలోత్పలము (నీలం చ తత్ ఉత్పలం చ - నీలోత్పలమ్ - నల్లని కలువ )

సమానాధికరణ సమాసములందు భాషిత పుంస్కములకుఁ బుంవద్భావమగును ౧౧ (వ్యా-సం-౨౬౮ IV విష ౧౧౩౩ వ పుట)

విశేషణము స్త్రీలింగమైనను బుంలింగ రూపముతో నిల్చు నని యర్థము భాషిత పుంస్కమనఁగాఁ బున్నపుంసకత్వములందుఁగాని పుం స్త్వ స్త్రీత్వములందుఁ గాని యర్థభేదము లేక యేకాకారమున వర్తిల్లునది (తుల్య పవృత్తి నిమిత్తకము) "రక్తః పురుషః, రక్తాస్త్రీ, మృదుః పురుషః, మృదు వస్త్రమ్" అను రీతిని‒ 'రక్త‒మృదు' మున్నగునవి (విశేషణములు, విశేష్య నిఘ్న విశేషణములు) భాషిత పుంస్కములు ఉదా రక్తలతఁ రక్తా చ సా లతా చ‒రక్తలతా, ఎఱ్ఱని లత) మహానవమి (మహతీ చ సా నవమీ చ‒మహానవమీ, గొప్ప నవమి) సమానాధికరణ సమాసములలో మహచ్ఛబ్ద తకారము లోపించును ముందటి 'అ' కార మాకార మగును ఉదా మహారాజు మొ సూత్రమున సమానాధి కరణ సమాసములం దనుటచేత సమానాధికరణ బహువ్రీహులందును బుంవద్భావ మగును ధ్వస్తమాయుఁడు (ధ్వస్తా + మాయా యేన సః) మొ

౧వ వివ సర్వనామ శబ్దములకు వృత్తి మాత్రమున బుంవద్భావ మగును ఉదా పూర్వశాలుఁడు(పూర్వస్యాం శాలాయాం భవః‒తూర్పుదిక్కునందలి శాలయందుఁ బుట్టిన వాఁడు) సర్వపతి (సర్వాసాం స్త్రీణాం పతిః‒సర్వపతిః‒అందఱు స్త్రీలకును బతి, సర్వస్యామ్‒సర్వత్ర ఇది తద్ధిత వృత్తి)

## సమాసాంతములు

తత్పురుష కర్మధారయ ద్విగువుల తుదిని గొన్ని యెడల సమాసాంత ప్రత్యయములు నిల్చును ౧౨

౧వ వివ • 'సఖి‒అహన్‒ రాజన్' శబ్దములకు 'ష' ప్రత్యయ మగును షకార మిద్వర్ణము ఉదా ‒ కృష్ణ సఖుఁడు (కృష్ణస్య + సఖా) ‚పరమాహము (పరమం చ తత్ అహశ్చ, అహః‒ అహ్నీ, అహనీ‒అహాని 'అహన్' శబ్దము సమాసమునఁ బుంలింగ మగును) అతి రాజు (రాజాన మతి క్రాన్తః రాజు నతిక్రమించిన వాఁడు), మహారాజు (మహాంశ్చాసౌ రాజా చ మహారాజః‒'రాజన్' శబ్దము) 'ష' ప్రత్యయము షిత్తుగాన నేతదంతములకు 'జీప్పు' వచ్చును మహారాజ్ఞి మొ

౨వ వివ  అహోరాత్రముల భాగము  లేక దేశము లనిపించు కొనును ఏక దేశ వాచకములకును, సర్వాది శబ్దములకును, బర మగు రాత్రి శబ్దమునకు 'ష' ప్రత్యయ మగును ఉదా పూర్వ రాత్రము, అపర రాత్రము, అతి రాత్రము, ఇది తత్పురుష సమాసము

౩వ వివ  ఏక దేశ వాచకములకును, సంఖ్యా వాచకములకును నవ్యయ ములకును సర్వాది శబ్దములకును బర మగు 'అహన్' శబ్దమునకు 'అహ్నా' అను నాదేశ మగును ఉదా  మధ్యాహ్నము  ద్వ్యహ్నా ప్రియుఁడు  ప్రాహ్ణము (ప్రకృష్ట దినము  ఇట ణత్వము – తత్స – ౧వ  వివ) సర్వాహ్ణము (దిన మంతయు, ణత్వము)

౪వ వివ . ఇట్టివి  పెక్కు గలవు  అర్ధనావము (నౌ–నావ), మహో క్షము (ఉక్షన్–ఎద్దు), మహానసము  ('అనస్' శబ్దము), పురుషాయుషము (ఆయుః శబ్దము) మొ

## ఉత్తర పదలోపి సమాసములు

శాక పార్థివాది మధ్యమ పద లోపి (ఉత్తర పదలోపి) సమాసములును గర్మధారయ భేదములె ౧౩ (వ్యా–సం–౨౬౮ IV విష )

ఉదా  శాక పార్థివుఁడు (శక్తి ప్రియుఁడగు రాజు–శాక ప్రియః పార్థివః– శాక పార్థివ, శాకః–సామర్థ్యమ్)  ఇందు "ప్రియ" శబ్దము లోపించినది ఇట్లె శతాబ్దములు  (శత  సంఖ్యాకాః + అబ్దాః - శతాబ్దాః),  "చతుశ్శతాబ్దముల్'' (ఆరణ్య–౭వ ఆ –౨౩౧  శతావయవః + అబ్దః–శతాబ్దః– శతాబ్దము–వ్యా–సం– ౧౧౩౬వ పుట)  త్రిలోకములు (త్రి సంఖ్యాకాః లోకాః–త్రిలోకాః)  "త్రిలోక సౌన్దర్య మివోదితం వపుః (కుమార–౨వ సర్గ) ఇట్లే  సప్త  పదార్థములు, షోడశ పదార్థములు  శ్రీ హర్ష నృపతి (శ్రీహర్ష ఇతి నృపతిః)  దధ్యోదనము (దధ్నా సహితః + ఓదనః–పెరుఁగుతోఁ  గూడిన  యన్నము)  ద్వావింశతి  (ద్వ్యధికా వింశతిః-ఇరువది రెండు) మొ

## ఉపమాన సమాసములు

సమాస పూర్వ పద ముపమాన వాచియు నుత్తర పదము సామాన్య ధర్మ వాచియు నయియుండునది యుపమాన పూర్వపద కర్మ ధారయము ౧౪ (వ్యా-సం-౨౬౮ IV వి)

ఉదా ఘన శ్యాముఁడు (ఘన ఇవ శ్యామః- మేఘము వలె నల్లని వాఁడు) ఇందు సమాసోత్తర పద ముపమేయ వాచిగా నుండరాదని వైయాకరణ సిద్ధాంతము కాని యిట్టివి కవి ప్రయోగములు గలవు ఉదా బింబోష్ఠములు, చంద్రబిం బాననములు (రంగ-రా-యుద్ధ ౫౩౩౪వ ప యూనివర్సిటీ ముద్ర) కరభోరులు (నన్ని-కు-౩వ ఆ-౨౯౧) కాళిదాసును నిట్లు ప్రయోగించెను, "యో హేమకుమ్భ స్తన నిస్సృతానామ్" "స్కన్దపక్షే హేమకుమ్భ ఇవ స్తనః ఇతి విగ్రహః" (మల్లినాథ వ్యాఖ్య రఘువం-౨వ సర్గ-౩౬) 'చంద్రముఖి' (చంద్ర సదృశం ముఖం యస్యాస్సా చంద్రముఖీ - చంద్రుని వంటి ముఖము గలది) అను రీతి బహువ్రీహులు నిర్వివాదముగా సర్వ సమ్మతములు

ఉపమేయవాచి పూర్వపదమును నుపమానవాచి యుత్తరపదమును నయి యుండి సామాన్య ధర్మ ప్రయోగము లేనిది యుపమానోత్తర పద కర్మధారయము ౧౫ (వ్యా-సం-౨౬౮ IV)

దీని నుపమిత సమాస మనియు వాడుదురు ఉదా పురుష వ్యాఘ్రుఁడు (పురుషో వ్యాఘ్ర ఇవ-వ్యాఘ్ర సదృశ పురుషుఁడు) 'పురుష వ్యాఘ్రుఁడు శూరుఁడు' అని ప్రయోగింపరాదు 'వ్యాఘ్రము వంటి పురుషుఁడు శూరుఁడు' అని వ్యస్తముగనె ప్రయోగింపవలెను

ఉపమేయమం దుపమానము నారోపించునపుడు రూపక సమాసము ౧౬ (వ్యా-సం-౨౬౮ IV వి ఇది మయూర వ్యంసకాది సమాసము)

ముఖచంద్రుఁడు (ముఖ మనెడి చంద్రుఁడు - ముఖ మేవ చన్ద్రః),

మయూర వ్యంసకుఁడు (మయూర మనెడి వ్యంసకుఁడు-మయూర ఏవ వ్యంసకః-వ్యంసకుఁ డనఁగా ధూర్తుఁడు) ఇదియుఁ గర్మధారయ భేదమె

౧ వ వివ పయి ౧౫ ౧౬ వ, సూత్రములలోఁ జెప్పఁబడిన యుపమిత రూపక సమాసముల నాయా సందర్భములను బట్టి నిర్ణయింప వలయును ఉదా 'ముఖ పంకజము' పరిమళించుచున్నది అనుచో రూపకము "ముఖ పంకజమును ముద్దాడెను'' అనుచో నుపమిత సమాసము 'ముఖ పంకజమును జూచెను' అనుచో రూప కోపమితముల సందేహ సంకరము

## ద్విగు త్రైవిధ్యము

1 తద్ధితార్థ ద్విగువు, 2 ఉత్తరపద ద్విగువు, 3 సమాహారద్విగువు అను మూఁడు విధములు మాత్రమె సంఖ్యా పూర్వములలో ద్విగు వనంబడును ౧౭ (వ్యా-సం-౨౬౭ V వివ)

1 తద్ధితార్థ ద్విగువు సమాసముచేఁ దద్ధిత ప్రత్యయార్థము చెప్పబడినది పంచగువు (పఞ్చభి ర్గోభిః క్రీతః—పఞ్చగుః—అయిదు గోవులచేఁ గొనఁ బడినది)

2 ఉత్తరపద ద్విగువు పంచ గవ ధనుఁడు (పఞ్చ గావో ధనం యస్య సః-పఞ్చ గవ ధనః-అయిదు గోవుల మొత్తము ధనముగాఁ గలవాఁడు) ఇం దిట్లు మూఁడు పదములు చేరియుండును

3 సమాహార ద్విగువు పంచ గవము (పఞ్చానాం గవాం సమాహారః-పఞ్చగవమ్ - అయిదు గోవుల మొత్తము) ఇది యేక వచనాంత మయియే యుండును

౧ వ వివ పయి మూఁడు విధములలోఁ జేరని సంఖ్యాపూర్వక సమాసములు సిద్ధ ద్విగువులు కానేరవు ఉదా సప్తర్షులు, పంచపాండవులు, త్రిలోకములు, త్రిపురుషులు మున్నగునవి సిద్ధ కర్మ ధారయములె యగును 'ముల్లోకములు' ఇవి సాధ్య ద్విగువు

# ద్విగువు-దానిలోని జీప్పు

అకారాంత సమాహార ద్విగువు స్త్రీలింగమై జీప్ప్రత్యయము నందును పాత్రాది శబ్దముల కట్లుకాదు ౧౮ (వ్యా-సం-౨౬౮ V విష)

త్రిలోకి (త్రయాణాం లోకానాం సమాహారః-త్రిలోకీ) "యది త్రిలోకి గణనా పరా స్యాత్'' శ్రీహర్ష నైషధము (మూఁడు లోకముల మొత్తము) త్రిభువనము (త్రయాణాం భువనానాం సమాహారః-త్రిభువనమ్) భువన శబ్దము పాత్రాదులలోనిది ద్విపాత్రము

౧వ వివ పయి పద్ధతి చొప్పున 'శతాబ్ది' అనియే సాధువని కొందఱు తలంతురు అది సాధు వగుఁ గాక "శతావయవః అబ్దః'' అను మధ్యమ పదలోపి సమాసము చొప్పున 'శతాబ్దము' అనియు సాధువె యనఁదగును (సమా-౧౩ వ సూ) లోక శబ్దమును బాత్రాదులలోఁ జేర్చి సాధింపరాదు 'త్రిలోకి' శబ్దమును బట్టి యిది పాత్రాదులలోనిది కాదనక తప్పదు కాన "త్రిలోక సౌన్దర్య'' అను కాళిదాస ప్రయోగము చొప్పున నిది మధ్యమ పద లోపి సమాస మగుటచే సాధు వనక తీరదు

## ద్వంద్వ సమాసము

ఉభయ పదార్థ ప్రధానము ద్వంద్వ సమాసము ౧౯ (వ్యా-సం-౨౬౮ VII విష)

ఉదా రామ లక్ష్మణులు వచ్చిరి ఇందు సమాస గత పదములు రెండిటికిని క్రియాన్వయము గలదు ఇందు ద్వంద్వ గత పదార్థముల సాహిత్యమే యేకార్థీ భావ సామర్థ్యము 'చ' శబ్దార్థమున ద్వంద్వ సమాస మగును సముచ్చయాన్వాచ యేతరేతర యోగ సమాహారములు 'చ' శబ్దార్థ ములు, (1 సముచ్చయః ఈశ్వరం గురుం చ భజస్వ - ఈశ్వరుని గురునిని భజింపుము) "ఈశ్వరుని భజింపుము'' అనుసది యన్వయించిన పిదపఁ క్రియయొక్క యావృత్తిచేత 'గురునిని భజింపుమ' ను నన్వయము గల్గును

కావుననే యిందేక 'చ' శబ్ద ప్రయోగ ముండును (2 అన్వాచయ 'భిక్షా మట, గాం చానయ' - ఇందు 'భిక్ష కేగుము' అనునది ప్రధానార్థము పిదప "గోవును సయితము తెమ్ము" అను నప్రధానార్థము భాసిల్లును కావున నీ సముచ్చ యాన్వాచయములు రెంటను సముచ్చిత పదార్థములకు సాహిత్యము లేమింజేసి యేకార్థీభావ లక్షణ సామర్థ్యము లేదు కావున వీనికి సమాసము లేదు కాన ఇతరేతరయోగ, సమాహారములందె ద్వంద్వ సమాస మగును

పరస్పర సాపేక్షము గల యనేక పదార్థముల కొక క్రియతో నన్వయ ముండిన నితరేతర యోగ ద్వంద్వము ౨౦ (వ్యా-సం-౧౬౮ VII వి)

ఇందలి పరస్పర సాహిత్య సూచనకయి 'చ' శబ్ద ద్వయము ప్రయుక్త మగును ఉదా హరిహరులు వచ్చిరి (హరిశ్చ + హరశ్చ-హరిహరౌ- హరియు హరుడును వచ్చిరి) ఇందలి 'చ' శబ్దార్థము సమాసము నన(గా సాహిత్యమును దెల్పును గాన నీ సమాసమున 'చ' శబ్దములు లోపించును బహుపద ద్వంద్వము రామలక్ష్మణ భరత శత్రుఘ్నులు

౧ వ వివ కొన్ని యెడల ద్వంద్వ పదార్థముల సాహిత్యము శాబ్ద బోధమందు మాత్రమె యుండును క్రియా నిష్పత్తిలో నట్టి దాని ప్రసక్తి లేకపోవచ్చును ఉదా మాతా పితల మృత దినము - ఇట( దల్లి దండ్రు లిద్దఱును నొక దినమందె మరణించి రనుట వక్తృ తాత్పర్యము కాదు గదా!

౨ వ వివ యథాసంఖ్యాన్వయమున సాహిత్యము లేకున్నను మహాకవి ప్రయోగ ప్రామాణ్యమున నట్టి యెడల నితరేతరయోగ ద్వంద్వము సాధు వగుచున్నది ఉదా రామ లక్ష్మణులు రావణేంద్రజితులను జంపిరి

౩ వ వివ ద్వంద్వ ఘటిత పదార్థములను బట్టి యిందు బహువచన మేర్పడును ద్వంద్వ చర మావయవ శబ్ద లింగమె సమాసాంతమున నిల్చును ఉదా సీతా రాములు ద్వంద్వాంతమున నున్న శబ్దము ద్వంద్వ ఘటిత పదార్థము లన్నిటితోను బ్రత్యేకముగా సంబంధించును ఉదా సీతా రాముల దయ (సీతయొక్కయు రాముని యొక్కయు దయ)

౪ వ వివ ద్వంద్వ ఘటిత పదముల పౌర్వాపర్యము విషయమున సంస్కృత వ్యాకరణమున ననేక నియమములు సూత్రింపఁ బడెను కాని యవెల్లఁ బ్రాయికములు మాత్రమే । 1 అల్పాచ్చులు గల పదము మొదట నిల్చును ఉదా ధవ ఖదిరములు (రెండును వృక్ష విశేషములు), 2 లఘ్వక్షర ఘటితము మొదట నిల్చున ఉదా కుశ కాశములు (దర్భయు, రెల్లును) 3 పూజార్హము మొదట నిల్చును ఉదా దేవాసురులు మొ ఇట్టి నియమములు పెక్కు గలవు

## సమాహార ద్వంద్వము

ద్వంద్వ ఘటిత పదార్థముల మొత్త మర్థ మగు నపుడు సమాహార ద్వంద్వ మగును ౨౧

సమాహార మనఁగా సమూహము సమాహార ద్వంద్వము నపుంసకము, నేక వచనాంతము నగును ఏ యే జాతి పదములకు సమాహార ద్వంద్వ మగునో వ్యాకర్తలు పెక్కు సూత్రముల వచించిరి

౧ వ వివ 1 ప్రాణి తూర్య సేనాంగములకు సమాహార ద్వంద్వ మగును ఉదా ప్రాణ్యంగ పాణి పాదము (పాణిశ్చ పాదశ్చ తయోః స్సమాహారః పాణిపాదముల మొత్తము) తూర్యాంగము (తూర్యము వాద్యము) మార్దఙ్గిక పాణవికము (మార్దఙ్గిక పాణవికయోః స్సమాహారః—మృదంగ పణవ వాద్యముల మొత్తము) సేనాంగ (రథ గజ తురగ పాదాతము (రథాశ్చ గజాశ్చ తురగాశ్చ పాదాతంచ తేషాం సమాహారః-రథములయు గజములయు, గుఱ్ఱములయుఁ, బదాతుల సముదాయము యొక్కయు సమూహము)మొ ఇట్టివి పెక్కు గలవు ప్లక్ష న్యగ్రోధము (ప్లక్ష న్యగ్రోధముల మొత్తము)

౨ వ వివ ద్వంద్వ మందును సమాసాంత ప్రత్యయములు మున్నగునవి యగును 'చ' వర్గాంతములకు దకార షకార హకారాంతములకును సమాహార ద్వంద్వమునందు 'అ' ప్రత్యయమగును ఉదా వాక్ త్వచము (వాక్

చ + త్వక్ చ ద్వయో స్సమాహారః వాక్ త్వక్కుల మొత్తము) శమీ దృష దము (శమీచ + దృషచ్చ తయో స్సమాహారః, జమ్మియు తాయియు ననువాని మొత్తము) ఇట్టివి పెక్కు గలవు అహోరాత్రము (దిన రాత్రుల మొత్తము) మొ

౩వ వివ సమాహార ద్వంద్వమును, ద్విగు సమాహారమును నవ్యయీ భావమును, నపుంసక లింగము నగును

౪వ వివ ఋకారాంత ద్వంద్వమునఁ బూర్వ స్థిత పద ఋకారము 'ఆ' కారమగును ఉదా మాతాపితలు (మాతా చ పితా చ, తలి దండ్రులు) పుత్ర శబ్ద పరకత్వమునందును 'ఆ' కార మగును ఉదా పితా పుత్రులు (పితా చ + పుత్రశ్చ) మాతర పిక లనియుఁ గలదు తెనుఁగున 'మాతపితలు' అనియుఁ గలదు (చూడు-సమా-౨౬౦ సూ)

౫వ వివ యజ్ఞీయ దేవతా వాచక ద్వంద్వమునందును బూర్వ పదాంత మునకు 'ఆ' కారమగును ఉదా సూర్యా చంద్రమసులు (సూర్యశ్చ + చంద్రమాశ్చ) మిత్రా వరుణులు (మిత్రశ్చ + వరుణశ్చ) అగ్నీ షోములు (ఇట 'ఈ' వచ్చినది) ద్యావా పృథివులు (ద్యౌశ్చ + పృథివీ చ ఆకాశము, భూమియు)

౬వ వివ . వృత్తి పంచకమున నేక శేష వృత్తి వివరింపఁబడెను (చూ-సమా-౧౨వ సూ-౧ వివ) పుం స్త్రీ ద్వంద్వమునఁ బుంలింగము నిల్చి యుండును ఉదా పితలు (మాతాచ + పితాచ - మాతా పితలు) హంసములు (హంసీ చ + హంస శ్చ-హంసౌ) పుత్రులు (పుత్రశ్చ + దుహితాచ, కొడుకును, గూఁతురును) ఇట్లే-భ్రాతలు (సోదరుఁడును, సోదరియు)

౭ వ వివ నపుంస కానపుంసక ద్వంద్వమున నపుంసకము నిల్చును అది సమాహార ద్వంద్వమును గావచ్చును ఉదా శుక్లములు (శుక్లశ్చ + శుక్లీ చ + శుక్లంచ) సమాహార ద్వంద్వ రూపము - శుక్లము

౮వ వివ త్యద్-తద్-యద్ మొన్నగువానితో నితర పదములకు ద్వంద్వ మగునపుడు త్యదాదులు నిల్చును ఉదా వారు (స చ + దేవ దత్తశ్చ-తౌ, వాఁడును, దేవత్తుఁడును)

## బహువ్రీహి

అన్యపదార్థ ప్రధానము బహువ్రీహి ౨౨ (వ్యా-సం ౨౬౯ VIవిష)
పీతాంబరుఁడు వచ్చెను (పీత మమ్బరం యస్య సః, పచ్చని బట్ట యెవనికిఁ గలదో యట్టి విష్ణువు వచ్చెను - ఇందు సమాసగతము లగు 'పీత, అంబర' అనువానికిఁ గ్రియాన్వయము లేదు 'విష్ణువు' అను నన్యపదమునకుఁ గ్రియాన్వయము గలదు)

౧ వ వివ సమానాధికరణములగు (విశేషణ విశేష్య) ప్రథమాంతములకే బహువ్రీహి సంభవించును అట్టి విశేషణ విశేష్యములు ప్రథమా ద్వితీయాది విభక్త్యంతములగు నితర పదార్థములను జెందును అట్టి యితర పదముల (విశేష్య) లింగ మా బహువ్రీహికిఁ గల్గును (ద్వంద్వ తత్పురుషములకుఁ బరపద లింగమె యగును కొన్ని యెడల మాఱుటయుఁ గలదు వృక్షచ్ఛాయము, వృక్షచ్ఛాయ మొదలైనవి) ఉదా వీర పురుష (సేన, వీరాః పురుషాః యస్యాం సా సేనా-వీర పురుషా, వీరులగు పురుషులే సేనయందుఁ గలరో యా సేన 'వీర పురుష' యనఁబడును) ప్ర-బ-వీరపురుషులు (సేనలు, వీరాః పురుషాః యాసు సేనాసు తాః-వీరపురుషాః సేనాః) వీరపురుషము సైన్యము (వీరాః పురుషాః యస్మిన్ సైన్యే తత్ సైన్యం వీరపురుషమ్) ఇవి సప్తమీ బహువ్రీహులు ఇట్టి బహువ్రీహు లేడు విధములు 1 ప్రథమా బహువ్రీహి సమాతృకుఁడు (సహ మాత్రా వర్తతే యోఽసౌ, తల్లితోఁ గూడినవాఁడు ప్రథమా బహువ్రీహిని పాణినీయులు చెప్పలేదు - ముగ్ధబోధ వ్యాకర్త వచించెను), 2 ద్వితీయా బహువ్రీహి ఆరూఢ వానరము వృక్షము (ఆరూఢో వానరో యం వృక్షం సః-ఆరూఢ వానరః, ఎక్కిన క్రోఁతి గల చెట్టు) 3 తృతీయా బహువ్రీహి, ఊఢ రథము అశ్వము ('ఊఢో రథో యేన సః-వహింపఁబడిన రథము గలది) 4 చతుర్థి బహువ్రీహి దత్త పశువు మనుష్యుఁడు- (దత్తః

పశుః యస్మై సః ఈయఁబడిన పశువు గలవాఁడు) 5. పంచమీ బహువ్రీహి: ఉద్ధృత శరము తూణీర మనఁగా నమ్ములపొది (ఉద్ధృతాః శరాః యస్మాత్ సః, ఎత్తఁబడిన శరములు గలది) 6 షష్ఠీ బహువ్రీహి మహాబలుఁడు మనుష్యుఁడు (మహత్ బలం యస్య సః, గొప్పబలము గలవాఁడు) 7 సప్తమీ బహువ్రీహి వీరపురుష సేన (వీరాః పురుషాః యస్యాం సా, వీరులగు పురుషులు గలది)

బహుపద బహువ్రీహులును నుండును - ఉదా నీలోజ్జ్వల శరీరుఁడు పురుషుఁడు (నీల ముజ్జ్వలం శరీరం యస్య సః, నల్లని యుజ్జ్వల మగు శరీరము గలవాఁడు)

## వ్యధికరణ బహువ్రీహి

వ్యధికరణ బహువ్రీహులు గల వని మునిత్రయేతర (పాణిని, కాత్యాయన, పతంజలి) వైయాకరణులు వ్యాఖ్యానించిరి 23 (వ్యా-సం-2-2-6 VI వి)

కంఠేకాలుఁడు = శివుఁడు (కణ్ఠే కాలో యస్య సః, కంఠమందుఁ గాలకూటపు నలుపు గలవాఁడు) ఉష్ట్రముఖుఁడు మనుష్యుఁడు (ఉష్ట్రస్య ముఖం యస్య సః, ఉష్ట్రముఖమువంటి ముఖము గలవాఁడు)

1 వ వివ పయి యుదాహృతులను సైతము సమానాధికరణ బహువ్రీహులుగనే సమర్థింప నగును కంఠేకాలుఁడు (కణ్ఠేస్థః కాలః యస్య సః, కంఠమందున్న నలుపు గలవాఁడు) ఉష్ట్రముఖుఁడు (ఉష్ట్ర సదృశం ముఖం యస్య సః, ఉష్ట్రసదృశమగు ముఖము గలవాఁడు) ఇట్లు మధ్యమ పద లోపి బహువ్రీహులను గ్రహింపనగును మధ్యమ పదలోపి సమాసము సర్వసమ్మతమే కదా (చూ-బాల-మనో)

## సమానాధికరణ బహువ్రీహిలోని పుంవద్భావము

2 వ వివ సమానాధికరణ కర్మధారయమునందు వలెనె సమా

నాధికరణ బహువ్రీహియందును భాషిత పుంస్కములకుఁ బుంవద్భావ మగును (చూ-సమా-౧౧౯ సూ, వ్యా-సం-౨౬౮ VI విష) మహా సేనుఁడు (గొప్ప సేన గలవాఁడు = కుమారస్వామి, మహతీ సేనా యస్య సః, 'మహతీ సేనుఁడు' అని కానేరదు) రూపవ ద్భార్యుఁడు (రూపవతీ భార్యా యస్య సః. రూపవతి యగు భార్య గలవాఁడు) సుందర భార్యుఁడు (సున్దరీ భార్యా యస్య సః, సుందరియగు భార్య గలవాఁడు)

ఊఙంతములకును, దద్ధిత 'క' ప్రత్యయాంతములకుఁ, బూరణీ ప్రత్య యాంతములకును ణిత్తగు,తద్ధితాంతమునకును, జాతిస్వాంగవిహి తేఙంతములకును బుంవద్భావము లేదు ప్రియా-సుభగా-దుర్భగా-భక్తి-తనయాది శబ్దములు పరమగునపుడును బుంవద్భావము లేదు ౨౪

ఉదా వామోరూ భార్యుఁడు (సుందరమైన తొడలుగల భార్యగలవాఁడు) క రసికా భార్యుఁడు పాచికా భార్యుఁడు పూరణి షష్ఠీ భార్యుఁడు ణిత్తద్ధిత మైథిలీ భార్యుఁడు జాతి బ్రాహ్మణీ భార్యుఁడు స్వాఙ్గ సుకేశీ భార్యుఁడు ('బ్రాహ్మణమానినీ' అని మానినీ శబ్ద పరకత్వమున నగును) ణిత్తులగు తద్ధి తాంతములయినను 'ఇమ్-ఉమ్' అనునవి నిల్చునపుఁడు పుంవద్భావ మగును (చూడు-సంస్కృత-తద్ధిత-౬౫ సూ) వైయాకరణ భార్యుఁడు (వ్యాకరణము తెలి సినది భార్యగాఁ గలవాఁడు) సౌవశ్వభార్యుఁడు (లెస్సయిన గుఱ్ఱములు గలది భార్యగాఁ గలవాడు) ప్రియాది శబ్ద పరకత్వమున కల్యాణీ ప్రియుడు (కళ్యాణవతి యగు ప్రియురాలు గలవాఁడు, కళ్యాణీ ప్రియా యస్య సః) 'దృఢ భక్తి' అను రఘువంశ ప్రయోగమున భావ 'క్త' ప్రత్యయాంత మని యెన్నఁనగును, కర్మార్థ విహిత 'క్త' ప్రత్యయాంత మైనచో 'ధృఢా భక్తి' అనియే యుండును పూరణ ప్రత్యయాంత పరకత్వమందును బుంవద్భావము లేదు ఉదా కల్యాణీ పంచమములు (రాత్రులు, కల్యాణీ పఞ్చమీ యాసాం రాత్రీణాం తాః, కల్యాణము గల యైదవ రాత్రి గలవి, ఇట 'అ' అను సమాసాంత ముతోఁ బూరణ ప్రత్యయాంతము కూడినది)

## అన్యపదార్థ ప్రాధాన్యము లేని బహువ్రీహులు

అన్య పదార్థ ప్రాధాన్యము లేకున్నను గొన్ని బహు వ్రీహులుగనే యెన్న బడును ఇట్టి వెల్ల బహు వ్రీహి విశేష విధులు ౨౫ (వ్యా-సం-౨౭౦ VI వి ౧౧౪౩వ పుట)

1 సంఖ్యోత్తర పద బహువ్రీహి · ఉప దశములు (దశానాం సమీపే యే సన్తి తే-ఉపదశాః, పదికి దగ్గఱగా నుండు సంఖ్యలు-తొమ్మిది, పదునొకండు మొదలగునవి) 2 సంఖ్యోభయ పద బహువ్రీహి ద్విత్రములు దినములు (ద్వౌ వా త్రయో వా-ద్విత్రాః, రెండు మూఁడు దినములు). 3 దిగంతరాళ బహువ్రీహి దక్షిణ పూర్వ దిక్కు (దక్షిణస్యాః పూర్వస్యాశ్చ దిశో రన్తరాళే యా స్థితా సా దిక్, తూర్పునకును దక్షిణమునకును మధ్య దగు దిక్కు—ఆగ్నేయము) 4 వ్యతిహార బహువ్రీహి ముష్టీముష్టి, ముష్టాముష్టి ముష్టాముష్టి అను రూపము పాణినీయ సమ్మతము కాకున్నను ముగ్ధబోధ వ్యాకర్తృ సమ్మతము - కవిసమ్మతము (ముష్టిభిః ముష్టిభిశ్చ ప్రహృ త్యేదం యుద్ధం ప్రవృత్తమ్, పిడికిళ్ళతో మొత్తుకొనెడి యుద్ధము) కం భీమాసురవీరుల ము। ష్టాముష్టి రణచ్చ టాచ్చటల శబ్దం బు। ద్దామ.... .(ఆర-౩వ ఆ-౩౬౫). యుద్ధేతర స్థలము లందును నిది గన్పట్టు చున్నది ఉదా· కర్ణాకర్ణిగ వినుము

౧వ వివ 'అతి మాలుఁడు' మున్నగు చోట్ల నన్య పదార్థ ప్రాధాన్య మున్నను నవి బహువ్రీహులు గావు తత్పురుషములె (చూ-సమా-౭వ సూ)

## బహువ్రీహి సమాసాన్త ప్రత్యయములు

౨వ వివ బహువ్రీహి సమాసమందును ననేకములగు సమా సాంత కార్యము లగును, ఈ యప్రధానత్వమున 'ఆ-ఈ-ఊ' అను స్త్రీ ప్రత్యయము లకు హ్రస్వము గల్గును, గో శబ్దము 'గు' అను రూపము నందును ధ్వస్త మాయుఁడు శీతగువు (చంద్రుఁడు, శీతా + గౌః-కిరణ— యస్య సః-శీతగుః) 'ఈ యస్' ప్రత్యయాంతమునకుఁ గాదు బహు ప్రేయసి (బహ్వ్యః ప్రేయస్యః

'ఇక' వర్ణకం బగ్గలాదుల కగు ౭ (బా-తద్ధి-౭వ సూ, వ్యా-సం-౨౮౯ V)

అగ్గలిక (ఆధిక్యము), ఒమ్మిక (ఒప్పిదము)

మగఁటి మ్యాదులు యథా ప్రయోగంబుగ గ్రాహ్యంబులు ౮ (బా-తద్ధి-౮వ సూ, వ్యా-సం-౨౮౯ VI వి)

మగఁటిమి (మగతనము), పేదఱిమి (దారిద్ర్యము, పేదర్మి-రూపాం), ఒజ్జనము (ఒజ్జతనము), కోటరము-కోడఱికము (కోడలి తనము)-కోడంట్రము-కోట్రము-కోడంట్రికము, కోమలికము (సౌందర్యము, సంస్కృ-కోమల-తద్భ-కోమలి-దీని భావార్థకము 'కోమలికము') చెలికారము (చెలిమి-స్నేహము), నయగారము (గకారాదేశము - మృదుత్వము), తెలుపు (తెల్లన-ధావళ్యము), ఎఱుపు (ఎఱ్ఱన), పసుపు (పచ్చన), నలుపు (నల్లన) ఈ 'తెలుపు' మున్నగు వానికి 'తెల్లనిది' మున్నగు రీతిని ధర్మి పరముగాను నర్థము గలదని 'శ-ర' మున నున్నది

నాయఁకరము (నాయఁక శబ్ద భావార్థకము), ఒంటి (ఒండు శబ్దజ భావార్థకము)

ఱికాదులు రానపు డెల్లయెడల భావార్థమున 'తన' వర్ణకంబగు ఉదా చిన్నఱికము-చిన్నతనము మొ

## స్వార్థమున వచ్చు ప్రత్యయములు

అరమరాదులకు స్వార్థంబునం 'దిక' వర్ణకం బగు ౯ (బా-తద్ధి-౯, వ్యా-సం-౨౯౦-౨౯౦ I విష)

అరమరిక (సందేహము-భేదము)-ఆమిక (మదము) అరమర-ఆమూ-అల్లిబిల్లి (పెనఁకువ)-గండి (రంధ్రము)-నడవడి-నాడు (దేశము) - నివ్వాళి-పొత్తి (మెత్తని వస్త్రము)-మాన (ఒక కొల పాత్రము)-మెలి (పెన)-వాలు (పొడుగు)-ఇత్యాదులు

'ఉక' వర్ణకంబు చిఱుతాదులకు స్వార్థంబునం దగు ౨౦ (బా-తద్ధి-౧౦ వ్యా-సం-౨౯౦ II వి)

చిఱుతుక-నాతుక 'చిఱుత-నాతి-నెలఁత-మెలఁత-'మెలుత' అనఁదగును కం లోకము సేరుటయు నమ్మెలుఁత యెలుఁ గెసఁగన్ (అను-౩వ ఆ-౨౨౧) పడఁతి-మడఁతి-పొలఁతి-వెలఁది ('నాతి' శబ్దము మొదలుగ నింతవఱకు స్త్రీ వాచకములె) నిప్పు-ఎమ్ము' ఇత్యాదులు చిఱుతాదులు అంతటను నపదాదిస్వర సంధి (సంధి ౧౨వ సూ) స్వార్థమందును ''కా-క త్తియ'' లగు (చూ-తద్ధి-౧౯వ సూ) 'ఈ' ప్రత్యయము నగు (చూ-తద్ధి-౨౨వ సూ)

వేఱునకు 'అడ' వర్ణకము-వెల్లకు 'అడి' వర్ణకమును స్వార్థమునం దగు ౧౧ (ప్రౌఢ-తద్ధి-౬-౭వ సూ) ఉదా వేఱడము-వెల్లడి

'తెలివి-విరివి-వినికి-లేమి-రాపు' లకు స్వార్థమునందు 'ఇడి' వర్ణకంబగు ౧౨ (ప్రౌఢ-తద్ధి-౮) తెలివిడి-విరివిడి-వినికిడి-లేమిడి-రాపిడి

'ఇత' వర్ణకంబు 'ఇంపు-బిగి-పోరు'లకు స్వార్థమునం దగు ౧౩ (ప్రౌ-తద్ధి-౯) ఇంపితము-బిగితము-పోరితము

'ఇద' వర్ణకంబు 'ఒప్పు-తప్పు-పెల్లు'లకు స్వార్థమునం దగు బెట్టు క్రొవ్వులకు మతుబర్థంబునను నగు ౧౪ (ప్రౌ-౧౦ తద్ధి)

ఒప్పిదము-తప్పిదము-పెల్లిదము-బెట్టిదము-క్రొవ్విదము

చలికి 'మిరి' వర్ణకంబును, వాపునకు 'ఇరి' వర్ణకంబును స్వార్థమున నగు ౧౫ (ప్రౌఢ-౧౧ తద్ధి) చలిమిరి-వాపిరి

'నుడి-కొల'లకు 'కార-గార'లు స్వార్థమున నగు ౧౬ (ప్రౌఢ-తద్ధి-౧౩వ సూ) నుడికారము-కొలగారము

## షుత్వార్థీయములు

"కా-క త్తియ" వర్ణకంబులు పుంస్త్వ స్త్రీత్వంబుల మతు బర్థంబునం దాటా దుల కగు ౧౭ (బా-తద్ధి- ౧౯, వ్యా-సం-౨౯౧ I విష)

'కా-క త్రియ'ల 'క' కారంబునకు 'గ' కారంబు కొండొకచోఁ గానంబడి యెడి ౧౮ (బా-తద్ధి-౧౨వ సూ, వ్యా-సం-౨౬౧ I విష)

'కా-గా' ప్రత్యయాంతములకుఁ బుంలింగ సమత్వముచేతనే 'డు' జ్ఞగు ఉదా ఆటకాఁడు-బేరగాఁడు మొ అందగాఁడు-కొండెగాఁడు (చూ-ఆచ్చి-౪వ సూ దీని టిప్పణము)

ఆట-అడపము (వక్కలాకుల తిత్తి)-అడప (అడపకాఁడు-'తద్ధి-౩౪వ సూ' ఈ పట్టున 'అడపకాఁడు' అనునది స్వార్థిక మనుకొనవలయును) ఎమ్మె (విలాసము) ఒయారము (విలాసము) దీనిపైని, దీని రూపాంతరములపైని 'కా-క త్రియ'లు నిల్చిన శబ్దములు-'శ-ర' మున్నగు కోశములందు లేవు కటారి (కత్తి)-కొల్ల-చెలిమి-చేరువ-సేన (సమూహము) చొరవ (ప్రవేశము)-జట్టి (బేరము నిచ్చు) - జాజర-(కపటము) జూదము-తిండి-తేర (సంబంధము లేమి)-దొడ్డ-కొల్ల-సీటు-నేస్తము (ములోపము-నేస్తకాఁడు-మొ) బేరము- (జేత గాఁడు)' వగ-విలు-వెచ్చము (వెచ్చకాఁడు)-సొగసు ఇత్యాదు లాటాదులు ఆది శబ్దముచే 'కొండెము-అందము' మున్నగునవి గ్రాహ్యములు

౧వ వివ : మతుబర్థకము లనఁగా నస్త్యర్థకములు, 'కలుగు' అను నర్థము గలవి "కాఁడు ర్గఁడు ర్భవే దీఁడు" అను నధర్వణవచనము చొప్పున 'గ' త్వము లేదనఁజాలము గాని యట్టి 'గ' కారమునకుఁ బ్రాసాదిగత ప్రయోగము దొరక లేదు

౨వ వివ 'కార-కర్త్రి' శబ్దములతో వీనికి సంబంధము గల దనుట కన్న 'కల' అను నాచ్ఛిక శబ్దముతో (కలవాఁడు-కలాఁడు-కాఁడు) వీనికి విదూరసంబంధము గలదనుట లెస్స 'ఎవతె-ఒకతె-ఎవతి-ఒకతి' మున్నగు వానియందు వలెనె 'కత్తియ' శబ్దమునందును (కలస్త్రీ-కత్తియ) 'తి' అను స్త్రీ ప్రత్యయస్థితి నంగీకరింప నగును 'ఇయ'కు 'ఎ' అను నాదేశము (ఆచ్ఛి-౨౩వ సూ) వచ్చుసుగాన 'కత్తియ' శబ్దమునుండి 'కత్తె' అనునది యేర్పడనగును (ఒకతె-ఒకతి)

౩వ వివ "ఆటకాఁడు-ఆటకత్తియ" అనువానికిఁ బర్యాయములుగా "ఆటవాఁడు-ఆటది" అను నాభాస బహువ్రీహి రూపములును (సమా-౧౮౭వ సూ ౨వ వివ, గనుపట్టుచున్నవి ఇట్లె 'పూనికవాఁడు' అను శబ్దము నుండి యేర్పడిన 'పూనికాఁడు' శబ్దమును నన్ని చోడ కవి ప్రయోగించెను. "పూనికాఁడవై (నన్ని-కు-౪వ ఆ-౪౧౮వ ప)

౪వ వివ గీ "అన్నః మీ తండ్రి కోపగాఁ డౌనా కాడొ?" (కాశీ ౪వ ఆ-౯౦) మున్నగు ప్రయోగములనుబట్టి యీ 'కా-కత్తియ' వర్ణకము అరుదుగా సంస్కృత శబ్దములమీఁద నిల్చుటయుఁ గలదని కొందఱ యాశయము ఇట్టి యెడల 'కోపకుండు' అనునది కవిప్రయుక్తపాఠమనుట యుక్తము ఇట్లె "అభిమానకత్తె" (బసప) మున్నగుచోట్ల 'అభిమానకర్త్రి' అనునది కవి ప్రయుక్తపాఠ మనుట యుక్తము (చూ-వ్యా-సం-౨౯౧-౩౯౧ I విష ౧౨౮౪-౧౨౮౯ పుట)

౫వ వివ "భూమ నిన్దా ప్రశంసాసు । నిత్యయోగేతిశాయనే । సంసర్గేఽస్తి వివక్షాయాం । భవన్తి మతుబాదయః" అను చొప్పున సంస్కృతమందు వలెనె తెల్గునందును నీ మతుబర్థకములకు "భూమ-నిన్దా" ద్వ్యర్థ విశేషములను గ్రహింప నగును 'తిండికాఁడు' మున్నగుచోట్ల నెల్లరును 'తిండికాండ్రే' యగుటచేతఁ గొన్ని యుచిత స్థలములందు 'అధికమైన తిండిగలవాఁ'డను భూమార్థమును గ్రహింపనగును ఇట్లె-'జూదగాఁడు' మున్నగుచోట్ల నిందార్థమును గ్రహింపనగును ఇట్లె తక్కిన యర్థములను నాయా సందర్భములందు గ్రహింపనగును

'కా-కత్తియ'లు కొండొకవానికి స్వార్థంబునం జూపట్టెడు ౧౯ (బా-తద్ధి-౧౩వ సూ, వ్యా-సం-౨౯౧ II విష)

చెలికాఁడు-చెలికత్తియ-హెగ్గడికాఁడు-హెగ్గడికత్తియ (హెగ్గడికాఁడు-అంతఃపురపు కావలి)

20)

'కా' వర్ణకంబు తిర్యక్కులకుం గానంబడియెడి ౨౦ (బా-తద్ధి-౧౪ వ సూ, వ్యా-సం-౨౯౧ II వి)

ఇబ్బందిగాఁడు (సంకరజాతి మృగము అడవిపందికిని నూరఁబందికిని బుట్టిన పంది) ఒంటిగాఁడు(అసహాయ శూరత్వము గల మృగము) కొమ్ముకాఁడు (అడవిపంది) పరికాఁడు (ఏనుఁగుల యూధపు పతి)-ఇత్యాదులు మృగవిశేష వాచకంబులు.

అటమటాదులకు మతుబర్థంబునందు 'ఈ' వర్ణకంబు పుంస్త్వంబునం దగు ౨౧ (బా-తద్ధి౧౫వ సూ, వ్యా-సం-౨౯౧ III విష)

'ఈ' ప్రత్యయాంతంబునకుం బుంలింగ సమత్వముచేతనే "డు"జ్జగు (చూ-అచ్చి-౪వ సూ దీని టిప్పణియు) అటమటీఁడు (మాయావి)-కమ్మతీఁడు (కృషికుఁడు)-అటమటము-కమ్మతము-కన్నడము-కొండెము-బానసము(వంట)-బూటకము (మాయ)-మందడి (అశ్వశాల)-మన్నెము (సన్మానపూర్వకముగా నిచ్చిన భూభాగము-మన్నీఁడు (భూపతి)-సుంకము (పన్ను) ఉక్కివంబునకు 'వ' లోపంబు (ఉక్కీఁడు, మూర్ఖుఁడు)-ఇత్యాదులు వీనికెల్ల 'ము' వర్ణక లోపము నెన్నునది వీనికి మత్వర్థీయేకార ప్రత్యయాంతములు నగు అటమటకాఁడు-అటమటకత్తియ-కొండెగాఁడు-కొండియుఁడు-సుంకరి మొ

'ఈ' ప్రత్యయంబు గొన్నింటికి స్వార్థమునం దగు౨౨ (బా-తద్ధి-౧౬ వ సూ, వ్యా-సం-౨౯౧ III వి)

మొక్కలీఁడు (మనుష్యుఁడు)- కల్లరీఁడు (అసత్యవాది) కల్ల శబ్ద మతుబర్థ రూపము "కల్లరి"

'అరి' వర్ణకంబు మతుబర్థంబున జాలాదుల కగు ౨౩ (బా-తద్ధి-౧౭, వ్యా-సం-౨౯౧ IV వి)

'అరి' ప్రత్యయాంతములు స్త్రీ సమములు గానఁ బ్రయోగానుసారముగ మహన్మహతీ వాచకత్వము వీనికిఁ గలదు జాలరి-ఒడపరి (వక్కఁడనము గల)- జాల (వల)- ఒడపు (వకృఁడనము)- కల్ల-చదవు- జూదము

(ములోప)-టక్కు-తగవు-తీరుపు-తెంపు-తెరువు-నేరుపు-మతకము (మాయ)-వెరవు (ఉపాయము)-వేఁట-సిగ్గు-సుంకము(ములోప)-బొంకు-పూజ (పూజ)-పూజారి- పూజరి సొన్నము (ములోపము)-సొన్నరి-సొన్నారి (అగసాలె) ఇత్యాదులు- జూదరికత్తె-జూదకత్తె-జూజగాఁడు-జూజకత్తె-సిగ్గరికత్తె ఇత్యాది ప్రయోగములును గలవు

'ఇ' వర్ణకం బోయారాదులకు మతుబర్థంబునం దగు ౨౪ (బా-తద్ధి-౧౮, వ్యా-సం-౨౯౧ V వి)

ఓయారి (విలాసి)-అక్కసి (సంతాపముగల)-ఓయారము (విలాసము), ఒయారము, ఒయ్యారము (ములోప)-కడలు (తరంగము, కడలి-సముద్రము) చాగము (త్యాగము)-జోగము (యోగము)- జోగి (యోగి)-తమకము (త్వర)-తుటారము (దిట్టతనము)-బండారము (వౌక్కసము)-బిత్తరము (శృంగార చేష్ట)- బిటారము (విలాస విశేషము)-బేహారము (వ్యవహారము)-బేహరము-మచ్చరము-మిటారము (నిక్కు)-విన్నాణము (విజ్ఞానము)-వెక్కసము (దుస్సహత్వము), ఇత్యాదులు. ఆది శబ్దముచే జవ్వని (యువతి) మొ

౧వ వివ సూ-రా-నిఘంటు కర్తలు 'కైవారి' శబ్దము 'ఇ' ప్రత్యయాంతముగా నదాహరించుట సరికాదు- అది సంస్కృత "కైవార" శబ్దపు 'అస్త్యర్థక' మగు 'ఇన్' ప్రత్యయాంతము (చూ-వ్యా-సం-౨౬౧ V విష ౧౨౯౭-౧౨౯౮-౧౨౯౯ పుటలు) "కైవార దుర్భాషణంబులకున్"(నైషధ ౭వ ఆ ౮౯, కైవార స్తుతి)

వగాదులకు బహువచనాంతంబులకు స్త్రీ వాచ్యం బగునపుడు మత్వర్థమునందు 'ఆఁడి' వర్ణకం బగు ౨౫ (బా-తద్ధి-౨౨వ సూ, వ్యా-సం-౨౯౧ VII విష )

వగలాఁడి వగ-చిన్నె-కులుకు (శృంగారముగా కదలు)-వన్నె-ఎమ్మె (విలాస విశేషము)[1]-ఇత్యాదులు వగాదులు

కుల వాచకములు మహద్వాచకములు నగు, 'బోయ' ప్రభృతి శబ్దముల పైని 'వాని స్త్రీ' అను నర్థమున 'త' ప్రత్యయ మగును ౨౬ (బా-తద్ధి-౧౫వ సూ, వ్యా-సం-౨౯౧ VI విష)

బోయత (బోయవాని స్త్రీ) చాకిత (చాకలివాని స్త్రీ) పాఱుత (బ్రాహ్మణుని స్త్రీ), గొల్లత-ప్రేఁత (గొల్లవాని స్త్రీ) వానెత (వైశ్యుని స్త్రీ) [2]

'త' వర్ణకంబు పరంబగుచో నొకానొకచోట నెత్వంబు చూపట్టెడు ౨౭ (బా-తద్ధి-౨౦ వ సూ, వ్యా-సం-౨౯౧-VI విష)

మాలెత (మాలవాని స్త్రీ) చెంచెత (చెంచువాని స్త్రీ) "చంచెతలం బింఛపత్ర చేలాంచితలన్" అను పాఠమం దంత్యాను ప్రాసభంగము లేదు

---

1 'ఆఁడి' ప్రత్యయాంతములు ప్రాచీన మహా కావ్యములలోఁగానరావు ఇవి 'వగలాఁడు' మున్నగువాని సమాన న్యాయమున నర్వాచీనముగా నేర్పడిన 'మహతి' వాచక రూపములని తోఁచును వగలవాఁడు-వగలాఁడు (అభాస బహువ్రీహి సమా-౧౮వ సూ-౨వ విష) ఇట్టివి తచ్ఛబ్ద 'వ' కారలోపమున సిద్ధించును (చూ-సమా ౧౩ వ సూ) గాన వీనికై మత్వర్థీయము 'ఆ' ప్రత్యయమును విధించి దానిని మగాది గణములోఁ (ఆచ్చి-౪వ సూ) జేర్చుపద్ధతి సరికాదు (బా-తద్ధి-౨౩వ సూ)

2 బాల వ్యాకర్త 'త' వర్ణకంబు 'కుల' వాచకంబునకు స్త్రీ వాచ్యంబగునపుడు మతుబర్థంబు నందగు (బా-తద్ధి ౧౫ వ సూ) అని సూత్రించెను కాని, 'చాకి-బోయ' ప్రభృతులు కేవల కులవాచకములు కావు కం కొట్టెన్ ..మదావివేకిన్ చాకిన్ (భాగ-౧౦వ స్కం-పూ-౧౨౬౦, సూ-రా-ని). 'చాకి' అనఁగా నిట రజకుఁడు అట్లె బోయ-కిరాతుఁడు కొందఱు బోయలు (ఉద్యో-౨వ ఆ-శ-ర)

(భాగ-౧౦౨ స్క-౦-పూ, ప్రౌఢ-తద్ధి-౪వ సూ) గాన దాసరి పాటల నాధార ముగాఁ ("చెంచీత") గొని 'చెంచిత' అను 'ఇ' త్వ ఘటితరూపమును స్తాధిం చుట ప్రౌఢ వ్యాకర్తకు సరికాదు

'గుబ్బెత-ముట్టుత-మిండత' ల స్త్యర్థకములె ౨౧ (బా-తద్ధి-౨౧ వ సూ వ్యా-సం-౨౯౧ VI విష)

గుబ్బెత (ప్రశంసార్హములగు కుచములు గల్గది, ఇచటి మతుబర్థము ప్రశంసా పరము)- ముట్టుత (రజస్వల, ముట్టు తాఁకుడు-రజస్సు తాఁకుడు గలది)-మిండత (మిండలుగల స్త్రీ)*

ముక్కు లోనగువానికిం దదభావ ద్యోతకంబయి మతుబర్థంబునందు 'ఇఁడి' వర్ణకంబగు ౨౯ (బా-తద్ధి-౨౪ వ సూ, వ్యా-సం-౨౯౧ VIII విష)

ముక్కిఁడి (ముక్కు లేని వాఁడు) ముక్కు-వాలు (తోఁక, వాల శబ్ద భవము)-సిగ్గు ఇత్యాదులు ప్రయోగంబుల నెఱుంగునది ఆది శబ్దముచే వెర విఁడి (ఉపాయము లేని వాఁడు)-కట్టిఁడి (క్రూరుఁడు-కట్టులేని వాఁడు)- వేఱిఁడి (వివేకము లేనివాఁడు)- 'వీఱిఁడి' అను రూపాంతరము ముద్రణములలోఁ గలదుగాని 'వీఱు' శబ్దములేదు పరువిఁడి (పరువు-గౌరవము లేనిఁవాడు) మున్నగు వానిని గ్రహించునది

## పరిమాణార్థకాదులు

మానార్థంబున కేకత్వంబునందు 'ఎఁడు' వర్ణకంబగు ౩౦ (బా-తద్ధి-౨౫వ సూ, వ్యా-సం ౨౯౨ I వి)

---

* సూరి "యువతి విటీ రజస్వలలు గుబ్బెత మిండత ముట్టుతలు నాఁబడుదురు" అని సూత్రించెను (బా-తద్ధి-౨౧ వ సూ) యువతి గుబ్బెత కావచ్చును గాని 'కఠినకుచ' కాకపోవచ్చును ఇట్లె తక్కిన యెడలను నస్త్యర్థ కత్వ మంగీకరించుట లెస్స

తూమెఁడు - తూమెండు ముంతెఁడు-ముంతెండు ఎత్తెఁడు (రెండు పీసెలు) పీసెఁడు-జేనెఁడు - మూరెఁడు - కుండెఁడు - గంపెఁడు (అంతటను నపదాది నిత్యసంధి-సంధి ౧౧ వ సూ) ఏకత్వమునం దనుటచేత-'నాలుగు గంపల పెసలు' అనుచో ఎఁడు ప్రత్యయము రానేరదు 'బారెఁడు బ్రాడు-బారబ్రాడు' మున్నగు కొన్ని చోట్ల నిది విభాషగ నగును

౧వ వివ విభాగమందలి పరిమాణార్థమునఁ గొన్నిట 'ఏసి' వర్ణక మగును ఉదా నాలుగేసి-గంపెఁడేసి-అంతలేసి దొరలు-ఇంతలేసి "అంతలు సేసి" గోరంతలు-గోరంత,కొండంత-కొండతలు "అంత-ఇంత" ఇత్యాదులు తద్ధిత ప్రత్యయములు గావు అవి ప్రత్యేక శబ్దములె

౨వ వివ 'ఎఁడు' ప్రత్యయాంతము లౌపవిభక్తిక వర్ణములతో వ్యస్తముగా వాడఁబడును బారెంటన్-మూరెంటన్ (బసవ ౪వ ఆ ౧౨౭) ఆడు గెంటనె (పాండు ౧ వ ఆ ౧౧౪) పదాది హ్రస్వము మీఁద వలెనె యిందును నిండుసున్న మాత్రమె (చూ-సంధి-౨౨వ సూ) బారెటన్-మూరెటన్' అని యుండరాదు (చూ-ఆచ్ఛి-౭౨వ సూ)

ఎఁడు వర్ణకంబు పరంబగునపుడు 'లి' వర్ణంబు లోపించును ౩౧ (బా-తద్ధి-౨౬వ సూ, వ్యా-సం-౨౯౨ I విష)

కమికెఁడు (కమికిలి - వంపఁబడిన వ్రేళ్ళుగల పుడిసిలి) కొడిదెఁడు (కొడిదిలి - బొట్టవ్రేలి గాక తక్కిన నాల్గు వ్రేళ్ళను పంపఁగా నేర్పడు చేర) దోసెఁడు (దోసిలి-అంజలి) పిడికెఁడు (పిడికిలి) - సందెఁడు (సందిలి)- దోయిలి (వ్యామము అపదాది స్వర సంధి సంధి ౧౧ వ సూ)

పరిమాణార్థంబున 'బంటి-కొలఁదు' లగు ౩౨ (బా-తద్ధి-౨౭వ సూ వ్యా-సం-౨౯౩-౨౯౩ I విష)

మోఁకాలిబంటి-మోఁకాలి కొలది జొమ్ము బంటి-జొమ్ము కొలఁది

౧ వ వివ సంస్కృతమందు 'మయ-మాత్ర' శబ్దముల వలెనె యీ 'బంటి-కొలది' శబ్దములును బ్రత్యేక ప్రయోగార్హములు నగును కావుననె

యివి ప్రత్యయపూర్వకముగను, షష్ఠ్యంతపూర్వకముగను గన్పట్టును తత్సమ శబ్దములమీఁద సయితము నిల్చును ఉదా ముక్కున బంటి-మోఁకాలిబంటి-మోఁకాలికొలది తత్స కంటిబంటి సంస్కృ-తనమయము మొ *

౨ వ వివ 'కొలఁది' అను దానిని బ్రత్యేక శబ్దముగానె కోశకారులు చూపెదరు ప్రత్యయముగాఁజూపరు "కొలఁది - దే వి పరిమితి, విణ-శక్యము... కొలఁది మిగిలి నాకు భరియింప గొలఁది గాక" (హరి-పూ-భా-౫ వ ఆ, ౪-ర)

అర్థ విశేషంబుల వర్ణకాంతరములును మహత్ప్రయోగంబుల నెఱుంగునది ౩౩ (బా-తద్ధి-౨౧వ సూ, వ్యా-సం-౨౬౫ I విష)

మంటమారి (జ్వలనశీలుడు-కోపశీలుఁడు-)-తిండిపోతు - తాచ్ఛీల్యంబున 'మారిపోతు' వర్ణకంబులు అడప (తాంబూల కరండవాహి) మతుబర్థంబునందు 'అ' ప్రత్యయము (అడపము + అ-అడప - వక్క లాకుల తిత్తిని బట్టికొను వాఁడు అట్టి యాఁడుదియు 'అడపకాఁడు - అడపకత్తియ' అనియుఁ జెప్ప నగును) పెండ్లము (ఊఢ)-పెండ్లి శబ్దంబునకు మతుబర్థంబునందు 'అము' ప్రత్యయము చెడుగఁడు (క్రూరుఁడు), దుడుకఁడు (దుష్టుఁడు), నిడుపఁడు (పొడుగైన నది-పాము-దీర్ఘ పృష్ఠము) పీనియందు మతుబర్థంబున 'అ' ప్రత్యయము ఇత్యాదు లూహ్యంబులు

౧ వ వివ "సంఖ్యకుఁ బూరణార్థమున 'అవ' ప్రత్యయ మగును" (ఆచ్చి-౬౭ వ సూ) మున్నగునవియు నిందుఁ జేరఁదగినవె !

---

* సూరి "దఘ్నార్థంబున బంటి కొలఁదు లగు" (బా-తద్ధి-౨౮) అని సూత్రించెను కాని సంస్కృతమున 'దఘ్న' ప్రత్యయ మూర్ధ్వ పరిమాణవాచి ఉదా ఊరు దఘ్నము 'ఈఁతబంటి' అనుచో నధో మానము 'చేతి కొలంది (పెద్దన యుత్పలమాలిక)

ఇది యాచ్ఛిక తద్ధిత పరిచ్ఛేదము



# బాలవ్యాకరణోద్ద్యోతము

## సంస్కృత తద్ధితములు - అపత్యార్థకములు

అదంతములకును, బాహ్వాదులకును "ష్ణి"-స్త్రీ ప్రత్యయాంతములకును, 'అత్రి' ప్రభృతులకును "ష్ణేయ"-గర్గాదులకు "ష్ణ్య"-నడాదులకు "ష్ణాయన"-పితృష్వస్రాదులకు "ణీయ" - రేవత్యాదులకు "ష్ణిక"- శివాదులకును దక్కిన వానికిని "ష్ణ"-అను ప్రత్యయము లపత్యార్థము నగును ౧ (ముగ్ధ-౪౧౫ వ సూ)

తద్ధితములకు 'త' అననది ముగ్ధబోధ వ్యాకరణ సంజ్ఞ. పయి ప్రత్యయములలోని 'ష' కారము 'స్త్రీత్వమున' 'ఈః' ప్రత్యయము వచ్చునని తెల్పు నిద్వర్ణము (చూ-తత్స-౧౦౦వ సూ) ఉదా (శైపీ-శైవి - శివాపత్యము-స్త్రీ) 'ణ' కారము ప్రకృత్యాద్యచ్చునకు వృద్ధియగు నని తెల్పు నిద్వర్ణము (సం-తద్ధి-౨వ సూ వృద్ధి) ఉదా శివ స్యాపత్యం పుమాన్-శివ + ష్ణ-శైవః-శైవుఁడు

౧ వ వివ "న పతతి వంశో యేన జాతే నేతి తదపత్యమ్" - ఎవని పుట్టుక చేత వంశము పడిపోదో యట్టి దపత్య మని యర్థము పుత్త్రి పౌత్త్రి ప్రపౌత్త్రిదు లని భావము ఇట్లె కన్యా విషయమును నెన్నునది 'రాఘవ'శబ్దము రఘుని ప్రపౌత్త్రులగు రామ లక్ష్మణుల విషయమున "రఘువంశములో" వాడఁబడెను "రాఘవా వపి నినాయ" (ముగ్ధ-దుర్గాదాసవ్యాఖ్య) ఇట్లె యపత్య ప్రత్యయ మొక్కటే పౌత్త్రిదులను దెల్పును గాన నపత్య ప్రత్యయాంతముపైని మరల నపత్యప్రత్యయమును నిల్పరాదు కాని 'గర్గ-నడాదుల' పట్ల నట్లు గాదు వాని పైని గోత్రాపత్య ప్రత్యయము నిల్చిన పైని యువాపత్య ప్రత్యయము నిల్చుట గలదు ఉదా గర్గ స్యానన్త రాపత్యమ్ - గోత్రాపత్యమ్ - గార్గ్యః - గర్గుని గోత్రాపత్యము - గార్గ్యుఁడు గార్గ్యుని యువాపత్యము - గార్గ్యాయణుఁడు గార్గ్య స్యాపత్యం యువా - గార్గ్యాయణః ఏవం వాత్స్యాయనః 'దక్ష స్యానన్త రాపత్యం-దాక్షిః తస్యాపత్యం యువా-

దాక్షాయణః,-దక్షుని గోత్రాపత్యమ-దాక్షి, వాని యువాపత్యము-దాక్షాయణుఁడు' అనురీతిని గర్గాది భిన్న స్థలమునందును రెండవ ప్రత్యయ మగుటయుఁ గలదు. కన్యా పక్షమున నిట్లు గాదు ఉదా దక్షుని యపత్యము స్త్రీ-దాక్షాయణి (దక్షస్యాపత్యం స్త్రీ దాక్షాయణీ)

౨ వ వివ పాణినీయాదులలో నెల్లెడలను గోత్రాపత్యార్థకములు యువాపత్యార్థకములు నను భేధములతో నీవిషయమున మిక్కిలి విపులముగా వివరింపఁబడెను కాని పై ''రఘువంశాది మహాకావ్యములలోని ప్రయోగములం దట్టి భేదము గన్పట్టలేదు కాన వోపదేవుఁడట్టి భేదముల నుపేక్షించెను

పయిరీతినె ''తైకాయని'' 'తికాదిభ్యః ఫిఞ్' (సి కౌ ౧౧౭౮వ సూ) 'ఆలాయని' (ఆది-౭వ ఆ-౨౩౭వ ప), 'గాంగాయని' (భీష్మ) మున్నగునవి 'ష్ణాయన' ప్రత్యయముపైని 'ష్ణి' ప్రత్యయము నిల్చుటచేత నేర్పడిన వని గ్రహింపవలెను

३ వ వివ ప్రసంగ వశమున నిట గోత్ర వివరణము చేయఁబడుచున్నది "పౌత్రాది గ్గోత్ర మేక స్యః। (త్య-ప్రత్యయ).. । వంశ్యే జీవత్యపత్యం త । స్య పౌత్ర ప్రభృతే ర్యువా । జీవతి భ్రాతరి జ్యేష్ఠే । కనీయాంస్తు స ఉచ్యతే । వృద్ధతరే స వాన్యస్మిన్ । సపిణ్డే సతి జీవతి । పూజ్యే వృద్ధం యువా వా స్యా । త్కుత్సాయాం వా ఽయువా యువా" (ముగ్ధ-౪౧౨వ సూ-శ్రీరామతర్క వ్యాఖ్య ३౬-౨వ పుట ३४౨వ పుట)

## ఆద్యచ్చుల వృద్ధి

ణిత్తగు తద్ధితము పరమగునపుడు శబ్దాద్యచ్చునకు వృద్ధి యగును (చూ-సమా-३౦వ సూ-వృద్ధి), సుభగాదులయెడ వాని యవయవములు రెండిటి యాద్యచ్చులకును వృద్ధి యగును సుపంచాలాదులయెడల వాని యుత్తరావయవము నాద్యచ్చునకు మాత్రము వృద్ధి యగును ౨ (ముగ్ధ ४౧౬వ సూః (సి-కౌ-౧౦౭౨వ సూ )

సి-కౌ-సుభగాదులు ౧౧३३-౧४७౮వ సూ సుపంచాలాదులు ౧४౯౬-౯౭ ౧४౪౦వ సూ )

తద్ధితములగు నచ్చులును, యకారమును బరములగునపుడు పూర్వస్థము లగు 'అ-ఇ' అను నక్షరములు లోపించును, ౩ (ముగ్ధ ౨౫౭వ సూ-సి-కౌ-౩౧౧వ సూ)

ఉదా శివుని యపత్యము-శైవుడు (శివ స్యాపత్యం-శైవః, శివ+ష్ణ-శైవ్+అ-శైవ

## తద్ధితాజ్ యకార పరక విధులు

తద్ధితములగు నచ్చులును, యకారమును బరము లగునపుడు పదాంత నకారము లోపించును, పదాంత మందుండు 'ఉ' కారము 'ఓ' కార మగును కొన్ని యెడల నట్టి నకారము లోపింపదు అట్టి 'ఉ' కారము లోపించును ౪ (ముగ్ధ ౩౩౭ వ సూ, సి-కౌ-౬౭౯-౧౪౭ వ సూ నలోపాభావము. ముగ్ధ ౪౨౪ వ సూ 'ఉ' కారలోపము ముగ్ధ ౪౨౦ వ సూ సి-కౌ-నలోపాభావము ౧౧౫౯ వ సూ-౧౨౪౫వ సూ 'ఉ' కార లోపము-౧౧౪౨ వ సూ)

"ఓ-ఔ" అనువానికిఁ బరమగు తద్ధితసంబంధి 'య' కారము స్వర తుల్య మగును ౫ (ముగ్ధ-౪౨౩ వ సూ, సి-కౌ-౬౩-౬౪ వ సూ)

ఉదా బభ్రువు నపత్యము-బాభ్రవ్యుఁడు (బభ్రు+బభ్రో-బభ్రవ్+(ష్ణ్య) - య - బాభ్రవ్యః) - స్తుతింపఁదగినవాఁడు - స్తవ్యుఁడు (స్తు - స్తో-స్తవ్+య)

బాహ్వాద్యదంత 'ష్ణి' బాహు వను ఋషి (తత్వ-౨౨౦ వ పుట) యపత్యము-బాహవి (బాహో రపత్యం బాహవిః-బాహు+ష్ణి-బాహో+ఇ-బాహవ్+ఇ, సం-త-౪ వ సూ సమా-౩౨ వ సూ, సి-కౌ-౧౦౯౬వ సూ) అగ్నిశర్మ యపత్యము-ఆగ్నిశర్మి (అగ్ని శర్మణో ఉపత్యమ్-ఆగ్నిశర్మిః అగ్నిశర్మన్+ష్ణి-అగ్నిశర్మన్+ఇ సం-త-౨-౩-౪సూ)

బాహ్వాది "బాహు-సుమిత్రా-అగ్నిశర్మన్-లోమన్ (ఉడు లోమన్ ము)- యుధిష్ఠిర - అర్జున - సామ్బ-కృష్ణ - గద-ప్రద్యుమ్న - రామ-సత్యకా"

మొదలగునవి బాహ్వాదు లాకృతి గణము కాన 'పణిన'-'పాణిని' (శ్రీం నైష ౮ వ అ ౧౯ వ ప 'పణినాపత్య', 'ఫలాదే రినః'' ఫలం - బర్హాం-పణో గర్భో । మలం శృఙ్గంచ కథ్యతే ముగ్ధ ౪౪౭ వ సూ-వ్యాఖ్యా-శ్రీరామతర్క చూ-చిం-పరి ౮౮ విష) 'కశ్యప' శబ్దమునుండి 'కాశ్యపి-కాశ్యపేయ-కాశ్యప' అను మూఁడు రూపములు గల్గును ఇట్లె దక్షుని యపత్యము-దాక్షి (దక్షస్యాఽ పత్యం దాక్షిః దక్ష + ష్ణి-దాక్ష్ + ఇ, సం-త-౨-౩ సూ)

అదంతములకు 'ష్ణి' ప్రత్యయ మగు నని చెప్పియు బాహ్వాదులలో గొన్ని యదంతముల నేల పఠింపవలయు నని శంకింపరాదు అవి శివాదులలోను నుండుటచేత నట్లు పఠింప వలసెను "యుధిష్ఠిరాది ద్వయోః కురువంశత్వాత్ రామాది పఞ్చానాం వృష్ణివంశత్వాత్, శివాది బాధనార్థః" (ముగ్ధ ౪౧౭వ సూ శ్రీరామతర్క వ్యాఖ్య ౩౭౫-౩౮౫ పు)

అత్రి - 'శ్రీ' - ప్రత్యయాంత "ష్ణేయ" అత్రి (ముని) యపత్యము-ఆత్రేయుడు (అత్రే రపత్య మాత్రేయః అత్రి + ష్ణేయ-ఆత్ర్ + ఏయ-సం-త-౨-౩ సూ సి-కౌ-౧౧౨౪ మొ ౧౧౨౭ వ సూ)

శ్రీ ప్రత్యయ గంగ యపత్యము-గాంగేయుఁడు (గఙ్గాయా అపత్యం గాఙ్గేయః గఙ్గా + ష్ణేయ-గాఙ్గ్ + ఏయ సం-త-౨-౩ సూ సి-కౌ-౧౧౨౩వ సూ, 'గాంగుఁడు-గాంగాయని' అనియు రూపాంతరములు గలవు) మహి యొక్క యపత్యము-మాహేయుఁడు (మహ్యా అపత్యం-మాహేయః మహీ + ష్ణేయ-మాహ్ + ఏయ సం-త-౨-౩-సూ) కద్రువ యపత్యము - కాద్రవేయుఁడు (కద్ర్వా అపత్యం-కాద్రవేయః కద్రూ + ష్ణేయ-కాద్రో-కాద్రవ్ + ఏయ, సం-త-౨-౪ సూ- సమా-౩౨వ సూ) ఇట్లె-పాండవేయుఁడు కొన్ని యెడల 'ఉ' కార లోపము కమండలువు నపత్యము-కామండలేయుఁడు (కమణ్డలో రపత్యం-కామణ్డలేయః కమణ్డలు + ష్ణేయ-కామణ్డల్ + ఏయ, సం-త-౨-౪ సూ)

అత్ర్యాది గణము అత్రి-శుభ్ర-సునాథ-అశ్వినీ - మృకణ్డు - అమ్బికా-రోహిణీ-పాణ్డు-కమణ్డలు-కద్రూ-కశ్యప మొ ఆకృతిగణము ('కాశ్యప - కాశ్యపి' అనునవి 'కాశ్యపేయ' అనుదాని రూపాంతరములు)

గర్గాది 'ష్ణ్య' గర్గుని యపత్యము-గార్గ్యుఁడు (గర్గస్యాఽపత్యం-గార్గ్యః గర్గ + ష్ణ్య-గార్గ్ + య-సం-త - ౨-౩ సూ) ఇట్లె - వాత్స్యుఁడు - జామదగ్న్యుఁడు-పారాశర్యుఁడు మొ గర్గాదు లాకృతి గణము కాన-బాభ్రవ్యుఁడు (బభ్రో రపత్యం-బాభ్రవ్యః బభ్రు + ష్ణ్య-బభ్రో-బాభ్రవ్ + య, సం-త-౨-౪-౫ సూ సమా-౩౨వ సూ, సి-కౌ-౧౧౦౭వ సూ)

గర్గాది గర్గ-వత్స-పులస్తి-రేభ-శక-ధూమ-బభ్రు - మను - శకల-శండిల-ముద్గల-చషక-జమదగ్ని-పరాశర-దల్భ-మణ్డు (మాణవ్యః) ఇత్యాది-ఆకృతిగణము

నడాది 'ష్ణాయన' నడుని యపత్యము-నాడాయనుఁడు (నడస్యాఽపత్యం-నాడాయనః-పురాణ ప్రసిద్ధ సంజ్ఞానామము-చూ-తత్స-౨౨౦వ పు-నడ + ష్ణాయన-నాడ్ + ఆయన-సం-త-౨-౩ వ సూ)

నడాది నడ-శకట-యుగంధర-దణ్డిన్-బదర-న (నా) ర (నారాయణ) శలఙ్కు-ద్వీప (ద్వైపాయన)-అముష్య (ద్వ్యాముష్యాయణ) - ద్రోణ (ద్రౌణాయన)- ద్రౌణాయనః క్రోధనః (వేణీసంహార) ఇత్యాదులు నడాదులు నాకృతిగణమె!

౧వ వివ "గర్గ-నడా"దులకు మొదట గోత్రాపత్య ప్రత్యయముగ 'ష్ణ్య' ప్రత్యయమును, దానిపైని యువాపత్య ప్రత్యయముగ "ష్ణాయన" ప్రత్యయమును నిల్చు సంప్రదాయమును గలదు కాని "గార్గ్యుఁడు-వాత్స్యుఁడు-జామదగ్న్యుఁడు-పారాశర్యుఁడు-నాడాయనుఁడు-శాకటాయనుఁడు-ద్రౌణాయనుఁడు యౌగంధరాయణుఁడు-బాదరాయణుఁడు-నారాయణుఁడు మొదలగు రూపములు ప్రయోగ దృష్టము లగుటచేతఁ దక్కినవానితో పాటుగ నపత్యార్థమున "ష్ణ్య-ష్ణాయన" ప్రత్యయములు ప్రత్యేకముగను నగునని చెప్పఁబడెను అట్లయినను ననేక స్థలములందు 'గార్గ్యాయణ-వాత్స్యాయన' మున్నగు ప్రయోగములును గలవు కాన వానిపైని మొదట గోత్రాపత్య 'ష్ణ్య' ప్రత్యయమును నిల్పి, దానిపైని యువాపత్య 'ష్ణాయన' ప్రత్యయమును నిల్పి యట్టి వానిని సాధింపనగును (చూ-సం-త-౧వ సూ ౧వ వివ)

# ణ త్వ వి ధి

౨వ వివ 'షకార-రేఫ-ఋకార'ములకుఁ బరమగు పద మధ్యగత 'న' కారము 'ణ' కార మగును అచ్చులును, 'హ-య-వ'లును, 'క' వర్గ 'ప' వర్గ ములును వ్యవధాన మున్నను 'ణ'త్వము గల్గును పదాంతర గత 'ష-ర-ఋ' కారములకుఁ బరమగు పదాంతరస్థ 'న' కారమును గొన్ని యెడల 'ణ' కార మగును (ముగ్ధ-౧౦౫వ సూ, సి-కౌ-౧౯౭ ౨౩౫ ౨౮౨ సూ) ఉదా. చూ-తత్స-౧వ వి 'రామ' శబ్దము బాదరాయణుఁడు-యౌగంధరాయణుఁడు-నారాయణుఁడు-ద్వ్యాముష్యాయణుఁడు మొ

పితృష్వస్రాది-ఢీయ పితృష్వసయొక్క యపత్యము-పైతృష్వసీ్రయుఁడు (పితృష్వసు రపత్యం - పైతృష్వసీ్రయః పితృష్వసృ+ఢీయ-పైతృష్వసృ-ఈయ, సం-త-౨వ సూ-సమా-౩౧వ సూ)

పితృష్వసా్రది పితృష్వసృ-మాతృష్వసృ-భ్రాతృ మొ (షష్ఠ్యలుక్ వైకల్పికము కాన రాలేదు, సి-కౌ-౧౧౩౮వ సూ ౧౧౪౦వ సూ) 'పైతృష్వ సేయుఁడు-మాతృష్వసేయుఁడు' అను రూపములును గలవు

రేవత్యాది-ష్ఠిక రేవతియొక్క యపత్యము-రైవతికుఁడు (రేవత్యా అపత్యం-రైవతికః రేవతీ+ష్ఠిక-రైవత్+ఇక, సం-త- ౨-౩ వ సూ)

రేవత్యాదులు రేవతీ-అశ్వపాల-ద్వారపాల-మణిపాల మొ (సి-కౌ-౧౧౬౯వ సూ)

శివాదులయు, శేషములయు 'ష్ణ' శివుని యపత్యము-శైవుఁడు (శివ స్యాపత్యం-శైవః శివ+ష్ణ- శైవ్+అ, సం-త-౨-౩వ సూ)

శివాది "శివ-వశిష్ఠ కకుత్స్థ-హైహయ-విశ్రవణ-ఊర్ణనాభ-జరత్కారు-పృథా-గఙ్గా-యస్క-కర్ణ-ఓ(?)యూపాక్ష-భూమి-ఇలా-సపత్నీ-దశరథ-యుధిష్ఠిర-అర్జున-రామ-సామ్బ-కృష్ణ-గద-ప్రద్యుమ్న-కశ్యప" మొ ("ప్రదీయతాం దాశరథాయ మైథిలీ రామాయణ 'దాశరథి' అనునది ప్రసిద్ధమె)

శేషములఁ 'ష్ణ' యదువు నపత్యము-యాదవుఁడు (యదో రపత్యం-యాదవః యదు + ష్ణ-యాదో-యాదవ్ + అ, సం-త-౨-౪ సూ సమా-౩౨ వ సూ)

శేష "యదు-అఙ్గిరస్-రఘు-ఉపగు-పశు-మధు" మొ

౩ వ వివ సం-త-౪వ సూ నలోపాభావము యజ్వ యపత్యము-యాజ్వనుఁడు (యజ్వన్). భద్రవర్మ యపత్యము-భాద్రవర్మణుఁడు (భద్ర వర్మన్) చక్రి యపత్యము-చాక్రిణుఁడు (చక్రిన్)

౪ వ వివ ''మాతృ-పుంస్-స్త్రీ" శబ్దముల విశేషరూపములు ద్విమాతల యపత్యము-ద్వైమాతురుఁడు ఇట్లె-త్రైమాతురుఁడు-షాణ్మాతురుఁడు పుమాం సుని యపత్యము-పౌంస్నుఁడు స్త్రీయొక్క యపత్యము-స్త్రైణుఁడు

ణిత్తగు తద్ధితము పరమగుచుండఁగా నాద్యచ్చు స్థానమునఁ బుట్టిన పదాంతస్థములగు ''య-వ''ల చోట 'ఇ-ఉ' అనునవి వరుసగా నిల్చును స్వఙ్గ-వ్యఙ్గాదుల కట్లు గాదు ద్వార న్యగ్రోధాదులకఁ బ్రసక్తి లేకున్నను నవి వచ్చును ౬ (ముగ్ధ-౪౧౫-౪౧౭ సూ, సి-కౌ-౧౦౯౭ - ౧౩౭౬ - ౧౨౪౩-౧౨౪౯ సూ)

విగతమగు నశ్వము గలవాఁడు-వ్యశ్వుఁడు వాని యపత్యము-వైయశ్వి (వ్యశ్వ స్యాపత్యం-వైయశ్విః వి + అశ్వ + ష్ణి-వై + ఇ + అశ్వ + ఇ) శోభనమగు (సు) నశ్వము గలవాఁడు-స్వశ్వుఁడు వాని యపత్యము-సౌవశ్వి (స్వశ్వ స్యాపత్యం-సౌవశ్విః సు + అశ్వ + ష్ణి-సౌ + ఉ + అశ్వ + ఇ, సం-త-౨-౩ సూ) స్వంగాదుల కిట్లు కాదు స్వంగుని యపత్యము - స్వాంగి వ్యంగుని యపత్యము-వ్యాంగి ద్వారాదుల కపత్య ప్రసక్తిలేమ గాన ''ద్వారమున నియుక్తుఁడు-దౌవారికుఁడు'' (ముగ్ధ-౪౩౨వ సూ-చూ) మున్నగురీతిని 'ఇ-ఉ' అనువానిని గ్రహింపవలయును

వ్యాసాదులకు 'ష్ణి' ప్రత్యయము పరమగుచుండఁగా 'అక్' అను నాదేశ మగును ౭ (ముగ్ధ-౪౧౯వ సూ, సి-కౌ-౧౦౯౭వ సూ దీని వార్తి ము)

వ్యాసుని యపత్యము - వైయాసకి (వ్యాస స్యాపత్యం-వైయాసకిః వ్యాస + ష్ణి - వై + ఇ + అన్ + అక్ + ఇ, సం-త-౨-౬-౭సూ)

వ్యాసాది "వ్యాస-సుధాతృ-విశ్వ - చణ్డాల - వరుఢ - నిషాద" ము "వాణీం కాణ భుజీ మజీగణ దవాసాసీచ్చ వైయాసకీమ్" (మల్లినాధ వ్యాఖ్య).

# ఇనేయాది ప్రత్యయములు

కల్యాణీ ప్రభృతుల "ష్ణేయ" ప్రత్యయ స్థానమున 'ఇనేయ' ప్రత్యయ మగును ౮ (ముగ్ధ-౪౨౧వ సూ, సి-కౌ-౧౧౩౧-౧౧౪౨ వ సూ)

'ష్ణేయ' ప్రత్యయ స్థానమున ననుటచేత 'షిత్త్వ'మును, 'ణిత్త్వ'మును దీనికి లభించును 'ష్ణేయ' అనుటచే నిది స్త్రీ ప్రత్యయముల విషయమున సం-త-౩వ సూ ) వర్తిల్లుననియు నెఱుంగునది ఉదా కల్యాణి యపత్యము-కాల్యాణినేయుఁడు స్త్రీ-కాల్యాణినేయి (కల్యాణ్యాః అపత్యం-కాల్యాణినేయః-(స్త్రీ)-కాల్యాణినేయీ కల్యాణీ + ష్ణేయ-కాల్యాణ్ + ఇనేయ, సం-త-౨-౩వ సూ) ఇట్లె-సౌభాగినేయుఁడు-దౌర్భాగినేయుఁడు-పారస్త్రైణేయుఁడు ము

కల్యాణ్యాః "కల్యాణీ-సుభగా-దుర్భగా-పరస్త్రీ - బన్ధకీ - రజకీ - జ్యేష్ఠా-కనిష్ఠా-మధ్యమా" ఇత్యాదులు

నట్యాది చతుష్పాత్సంజ్ఞాముల 'ష్ణేయ' ప్రత్యయస్థానమున 'ఏర' ప్రత్యయమును, గోధాదుల 'ష్ణేయ' ప్రత్యయ స్థానమున "ఏర-ఆర" ప్రత్యయములను వికల్పముగా నిచ్చును ౯ (ముగ్ధ-౪౨౨వ సూ, సి-కౌ-౧౧౩౪-౧౧౩౬-౧౧౩౭ వ సూ)

కుల, శీల హీనులు, సంగహీనులును క్షుద్రు లన బడుదురు (దాసీ-విటీ-నటీ-కాణాదులు) ఉదా నటి యపత్యము-నాటేరుఁడు-నాటేయుఁడు (నట్యా అపత్యం-నాటేరః-నాటేయః నటీ + ష్ణేయ-నాట్ + ఏర-నాట్ + ఏయ సం-త-౨-౩వ సూ) గోధ (ఉడుము) యపత్యము-గౌధేరము-గౌధారము-గౌధేయము

(గోధాయా అపత్యం-గౌధేరః-గౌధారః-గౌధేయః గోధా + ఢ్రక్-గోధ్ + ఏర, ఆర, ఏయ, సం-త-౨-౩వ సూ).

గోధాది. "గోధా (ఉడుము) మృగి (లేడి) కాకీ-మూషికా-చటకా (పిచ్చుక)'' మొ

## బహుత్వమున నపత్య ప్రత్యయము లోపించుట

గర్గాదులకును, యస్కాదులకును, భృగ్వాదులకును, రూఢ రాజవాచకములకును, బహుత్వమున నపత్య ప్రత్యయము లోపించును స్త్రీత్వమున లోపింపదు ౧౦ (ముగ్ధ-౪౨౮వ సూ, సి-కౌ-౧౧౯౩-౧౧౪౬ మొ ౧౧౪౯వ సూ, చూ-సి-కౌ-౧౧౦౬వ సూ)

(ఏక) గార్గ్యుఁడు - (బహు) గర్గులు, 'గార్గ్యులు' అనరాదు (ఏక) యాస్కుఁడు-(బహు) యస్కులు, 'యాస్కులు' అనరాదు (ఏక) భార్గవుఁడు-(బహు) భృగువులు, 'భార్గవులు' అనరాదు

గర్గాదు లీవఱకు వచింపఁబడెను

యస్కాదులు ''యస్క-లహ్య-క్రోష్టుపాద - మన్థక - వర్షక'' మొ యస్కాద్యన్తర్గణము విదాద "వి (బి) ద-కశ్యప-కుశిక-భరద్వాజ-ఉపమన్యు-శరద్వత్-రథన్తర-విశ్వానర'' మొ ఇవెల్ల ఋషుల పేర్లు

భృగ్వాది "భృగు-అత్రి-కుత్స-అంగిరస్-వశిష్ఠ-గోతమ'' మొ (ఏక) భార్గవుఁడు (బహు) భృగువులు (ఏక) ఆత్రేయుఁడు (బహు) అత్రులు (ఏక) కౌత్సుఁడు (బహు) కుత్సులు (ఏక) ఆంగిరసుఁడు (బహు) అంగిరులు (ఏక) వాశిష్ఠుఁడు (బహు) వశిష్ఠులు (ఏక) గౌతముడు (బహు) గోతములు) ఇవెల్ల ఋషుల పేర్లు

దేశతుల్యాఖ్య క్షత్త్రియ శబ్దము రూఢ మనిపించుకొనును ఉదా (ఏక) వాంగుఁడు (బహు) వంగులు (ఏక) కాళింగుఁడు (బహు) కళింగులు ఇచటి

యాధ శబ్దము కొన్నియెడల 'ప్రసిద్ధ క్షత్రియులకును' నుపలక్షణ మగును (ఏక) రాఘవుఁడు, (బహు) రఘువులు (ఏక) యాదవుఁడు, (బహు) యదువులు "నాథో రఘూణా మధవా యదూనామ్''- ఇత్యుద్భటః (ముగ్ధ-४-२८व సూ దుర్గా-వ్యాఖ్య) పాణినీయు లిచట లక్షణావృత్తి నాశ్రయింతురు

స్త్రీత్వమున నిట్లపత్య ప్రత్యయము లోపింపదు ఉదా (ఏక) భార్గవి (బహు) భార్గవులు (స్త్రీలు) ఇచట "భృగువులు (స్త్రీలు)'' అనరాదు

## వివిధార్థక తద్ధితములు

వెనుకఁ జెప్పిన "ష్ణి-ష్ణేయ-ష్ణ్య-ష్ణాయన-ణీయ-ష్ణిక-ష్ణ'' అను నేడు ప్రత్యయములును ''ష్ణిక-కణ్-ణీక-ఇయ'' అను నాల్గు ప్రత్యయములును, నిద్వర్ణ రహితముగాను, నిద్వర్ణ సహితముగాను, మహాకవి ప్రయోగానుసారముగాఁ గారకము లన్నిటికంటెను గర్త్రర్థమందును, గర్మార్థమందును నిల్చును ౧౧ (ముగ్ధ-४-२౯व సూ 'ష్ణి' ప్రభృతులు వెనుక 'సం-త-౧వ సూ'న చెప్పఁబడెను)

పాణినీయాదులందును 'తర్క' శబ్దముకంటెఁ బరముగ "ష్ణిక'' ప్రత్యయమును, వ్యాకరణ శబ్దముకంటెఁ బరముగ 'ష్ణ' ప్రత్యయమును నిల్చునని చెప్పఁబడలేదు అది మహాకవి ప్రయోగైకవేద్యమె! 'కృత్తద్ధిత సమాసానా। మభిధానం నియామకమ్। లక్షణం త్వనభిజ్ఞానాం। తదభిజ్ఞాన సూచకమ్॥' (ముగ్ధ-౧౧౮३వ సూ క్రింద) ''తదధీతే తద్వేద'' (४-२-५९) ''తదధీత ఇత్యర్థే-తద్వేత్తీ త్యర్థే చ ద్వితీయాన్తా దణాదయ స్స్యు రిత్యర్థః'' (బాల మనోరమా వ్యాఖ్య, సి-కౌ-౧२౬౯వ సూ) ఉదా తర్కము నధ్యయనము చేయుచున్నాఁడు (లేదా) తెలియుచున్నాఁడు-తార్కికుఁడు (తర్కం వేత్త్యధీతే వా-తార్కికః, తర్క + ష్ణిక) వ్యాకరణము నధ్యయనము చేయుచున్నాఁడు (లేదా) తెలియుచున్నాఁడు - వైయాకరణుఁడు (వ్యాకరణం వేత్త్యధీతే వా-వైయాకరణః వ్యాకరణ + ష్ణ-వి + ఇ + ఆకరణ, సం-త-२-३-౬ సూ) పదమును (లేదా) క్రమమును నధ్యయనము చేయుచున్నాఁడు (లేదా) తెలియు

చున్నాఁడు-పదకుఁడు-క్రమకుఁడు (పదం క్రమం వా వేత్త్యధీతే వా - పదకః, క్రమకః పద+క క్రమ+క సం-త-౨-౩-సూ, సి-కౌ-౧౨౭౧ వ సూ) పై ప్రత్యయములు కర్త్రర్థమున వచ్చినవి

కర్మార్థక వాక్కుచేఁ జేయఁబడినది-వాచికము (వాచా కృతమ్-వాచికమ్, వాచ్+ష్ఠక వాచ్+ఇక) ఇటఁ గర్మార్థమునఁ గరణకారకముపై నిల్చినది (ముగ్ధ ౪౩౧ వ సూ) సం-త-౧౧వ సూ౩వ వివ చొప్పునఁ బదత్వమ్ము లేమింజేసి, సమా-౩౩వ సూత్రము చొప్పున 'క' కారాదికము (వాక్కాన్రా) లేదు (సి-కౌ-౨౧౦౩ వ సూ) "సందేశ వాగ్ వాచికం స్యా" త్తని యమరము పాణినిచేఁ జెప్పఁబడినది-పాణినీయము (పాణినినా ప్రోక్తమ్-పాణినీయమ్-పాణిని+ఛీయ) కర్మార్థమునఁ గర్తృకారమున నిల్చిన దిచటి 'ఛీయ' ప్రత్యయము (సం-త-౨-౩వ సూ, సి-కౌ-౧౪౭౧వ సూ)

కర్త్రర్థక కరణకారక శక్తిచే యుద్ధము ను జేయుచున్నాఁడు - శాక్తీకుఁడు (శక్త్యా యుధ్యతే-శాక్తీకః శక్తి+ష్ఠీక-శాక్త్+ఈక, సం-త-౨-౩ సూ, సి-కౌ-౧౬౭౯ వ సూ) [illegible] (ఇష్టి-కష్ట)

[illegible] తిష్య [illegible] రాత్రి-తైషి (తిష్యేణ యుక్తా రాత్రిః-తైషీ తిష [illegible] తైషీ)

'సూర్య [illegible]' [illegible] నక్షత్రవిహిత 'ష్ణ' ప్రత్యయ [illegible] సూ, సి-కౌ-౪[illegible] సూ) [illegible] కారకముపై 'ష్ణ' ప్రత్యయము ఎట్లు చే సిద్ధించినదీ తెల్ప వలె ను

[illegible] వచ్చినది క్షత్రియ [illegible] క్షత్రాస్య [illegible] క్షత్రియః [illegible] సూ సి-కౌ-[illegible] వ సూ)

[illegible] మాధుర [illegible]

(మధురాయా ఆగతః-మాధురః మధురా + ష్ణ-మాధుర్ + అ, సం-త-౨-౩ సూ, సి-కౌ-౧౪౫౩ వ సూ)

అధికరణ కారకము- క ర్త్రర్థము ఈ లోకమునం దగునది (ఇహ)- ఐహికము (ఇహ భవ మైహికమ్-ఇహ + ష్ణిక-ఐహ్ + ఇక,సం-త-౨-౩ సూ)

ఒకానొకప్పు (కదాచిత్) డగునది - కాదాచిత్కము (కదాచిద్భవం-కాదాచిత్కమ్ కదాచిత్ + కఙ్-కాదాచిత్ + క, సం-త-౨ వ సూ సి-కౌ-౧౪౨౪వ సూ), గ్రామమునం దగునది-గ్రామీణము-గ్రామ్యము (గ్రామే భవః-గ్రామీణః-గ్రామ్య గ్రామ + ఖీన లేదా గ్రామ + ష్య సం-త-౨-౩వ సూ, సి-కౌ-౧౩౧౪-౧౩౯౩ సూ) మూర్ధమునం దగునది-మూర్ధన్యము (మూర్ధని భవమ్-మూర్ధన్యమ్-మూర్ధన్ + య నకారలోపాభావము, సం-త-౪ వ సూ) ఇట్లె-కణ్ఠ్యము-దన్త్యము మొ (సి-కౌ-౧౬౬౬ వ సూ) నదియం దగునది-నాదేయము (నద్యాం భవః-నాదేయః నదీ + ఢేయ-నాద్ + ఏయ, సం-త-౨-౩ సూ, సి-కౌ-౧౩౧౭వసూ) శాలయం దగునది-శాలీయము (శాలాయాం భవః-శాలీయః. శాలా + ఛీయ-శాల్ + ఈయ, సం-త-౨-౩సూ, సి-కౌ-౧౩౩౭ వ సూ) నగరమందగునది-నాగరము (నగరే భవః-నాగరః నగర + ష్ణ-నాగర్ + అ, సం-త-౨-౩ సూ, సి-కౌ-౧౩౫౨ వ సూ) నగర ప్రావీణ్యము గలవాఁడు-నాగరకుఁడు (నగర ప్రావిణ్యవాన్-నాగరకః నగర + కఙ్-నాగర + క, సం-త-౨-౩ సూ, సి-కౌ-౧౩౫౨ వ సూ) అగ్రమం దగునది-అగ్ర్యము (అగ్రే భవః-అగ్ర్యః అగ్ర + య-అగ్ర్ + య, సం-త-౩వ సూ, సి-కౌ-వైదిక ౪ వ అధ్యాయ ౩౮౬౨వ సూ) "అగ్రియము-అగ్ర్యము" అనియు రూపములు గలవు (ముగ్ధ ౪౨౯వ సూ శ్రీరామతర్క-వ్యాఖ్య-౪౨౨వ పుట)

౨ వ విధి కొన్నియెడలఁ దద్ధితాచ్చుగాని, తద్ధిత యకారముగాని పరమగునపు డవ్యయముయొక్క యంత్యాచ్చు మొదల్కొన్న భాగము లోపించును (ముగ్ధ-౪౩౦వ సూ, సి-కౌ-౧౩౨౪వ సూ వార్తికము) ఉదా సాయం ప్రాతః కాలమునం దగునది-సాయం ప్రాతికము (సాయం ప్రాతః భవతీతి-సాయం ప్రాతికః సాయం ప్రాతర్ + ష్ణిక-సాయం ప్రాత్ + ఇక మాటిమాటికిని (పునః పునః) నగునది-పౌనః పునికము (పునః పునః భవతీతి-పౌనః పునికః పునః

పునర్ + ష్ణిక-పౌనఃపున్ + ఇక) పయి నయినది (బహిర్)-బాహ్యము (బహిర్భవః-బాహ్యః బహిర్ + ష్ణ్య-బాహ్ + య, ముగ్ధ ౪౩౦ వ సూ, సి-కౌ-౧౩-౭౪వ సూ వార్తికము)

౩వ వివ తద్ధితమగు నచ్చుగాని, యకారముగాని పరమగునపుడు కొన్ని యెడలఁ బూర్వమునకుఁ బదత్వము లేదు తాంత, సాంతముల క స్త్వర్థమునఁ బదత్వములేదు (ముగ్ధ-౪౩౧వ సూ, సి-కౌ-౭౨౧-౧౮౯౬వ సూ) ఉదా దిశ్యము (దిశ్ + య) త్వాచ్యము (త్వచ్ + ష్ణ్య) వాచ్యము (వాచ్ + ష్ణ్య, చూ-సమా-౩౭-౩౮వ సూ) ఇట నీ సూత్రములచొప్పున 'క' కారాదులు రానేరవు ('త్వాక్యము' కాదు)

తాంత, సాంతములకు తటిత్వంతుఁడు-పయస్వి - తేజస్వి మొ వీని యందుఁ బదాంతత్వము లేమింజేసి జ స్త్వము, సకారమునకు విసర్గమును రాలేదు (చూడు-సమా-౩౬౪౩వ సూ)

౪వ వివ తద్ధితమగు నచ్చుగాని, యకారముగాని పరమగునపుడు కొన్ని యెడల 'అహన్' శబ్దమునకు 'అహ్న' శేషమగును ఉదా ఆహ్నికము (అహ్ని భవః-ఆహ్నికః, అహన్ + ష్ణిక-ఆహ్న + ఇక, ముగ్ధ-౪౩౭౫ సూ, సి-కౌ ౧౨౪౩వ సూ)

## వికారాద్యర్థకములు

వికార సంఘ భాగేదం హిత స్వార్థాదులందునుబయి పదమొకండు ప్రత్యయములును నిద్వర్ణసహితముగాను, నిద్వర్ణరహితముగాను నగును ౧౭ (ముగ్ధ-౪౫౩వ సూ)

వికారార్థక హేమముయొక్క వికారము-హైమము (హేమ్నో వికారః-హైమః-[illegible]-హేమన్ + అ, సం-త-౭-౩-౪ సూ, సి-కౌ-౧౩౧౪వ సూ) అప్పుల ([illegible]) వికారము-ఆప్యము(అపాం వికారః-ఆప్యమ్ అప్ + ష్ణ్య-అప్ + య) అగ్నియొక్క వికారము - ఆగ్నేయము (అగ్నే ర్వికారః-ఆగ్నేయః-అగ్ని + ష్ణేయ) సంఘార్థక భిక్షల సమూహము-భైక్షము (భిక్షాణాం

సమూహో భైక్షమ్-భిక్షా + ష్ణ, సి-కౌ-౧-౨౪౩-౧-౨౪౪ సూ, సమూహార్థకములు నపుంసకములు) అహముల సమూహము ఆహ్నము (అహ్నాం సమూహః ఆహ్నమ్ అహన్ + ష్ణ, సం-శ-౧౧వ సూ ౪వ వివ అహ్నాదేశము) గణికల సమూహము-గాణిక్యము (గణికానాం సమూహః-గాణిక్యమ్ గణికా - వేశ్యా గణికా + ష్య-గాణిక్ + య, సం-త-౨-౩ సూ, సి-కౌ-౧-౨౪౧ వ సూ దీనిలోని వార్తికము ౨౭౯) బ్రాహ్మణుల సమూహము-బ్రాహ్మణ్యము రాజుల సమూహము-రాజకము (రాజ్ఞాం సమూహః-రాజకమ్ రాజన్ + కఞ్, సం-త-౨-౩-౪ సూ) వృద్ధుల సమూహము-వార్ధకము(సి-కౌ-౧-౨౪౬వసూ) హస్తిసమూహము-హాస్తికము (హస్తినాం సమూహః-హాస్తికమ్, హస్తిన్-గజ హస్తిన్ + ష్ణిక-హాస్త్ + ఇక) భావార్థక గురువుయొక్క భావము (ధర్మము)-గౌరవము (గురో ర్భావః-గౌరవమ్-గురు + ష్ణ-గౌరో-గౌరవ్ + అ, సి-కౌ-౧౭౯౩) ఇట్లే బ్రాహ్మణ్యము (బ్రాహ్మణ + య) యౌవనము (యూనో భావః) బహిః ప్రదేశము-బాహ్యము (సి-కౌ-౧౭౦౦వ సూ) బహి ర్భవమ్-బాహ్యమ్ బహిర్ + ష్య సామ్యము (సమస్య భావః-సామ్యమ్) వైరూప్యము (విరూపస్య భావః-వైరూప్యమ్) రాజ్యము (రాజ్ఞో భావః-రాజ్యమ్) సుహృదుని భావము-సౌహార్దము(సుహృదో భావః-సౌహార్దమ్) ఇది సుభగాదులలోనిది గాన నవయవములు రెండిటియొక్కయు నాద్యచ్చులకు వృద్ధి వచ్చెను (సం-త-౨వ సూ సుహృద్ + ష్ణ-సౌహార్ద్ + అ) ఇదమ్ సంబంధి విష్ణు సంబంధి-వైష్ణవము (విష్ణోస్సంబన్ధీ-వైష్ణవః విష్ణు + ష్ణ-వైష్ణో-వైష్ణవ్ + అ, సి-కౌ-౧౫౦౦వ సూ) త్వద్-(నీ)సంబంధి-త్వదీయము (తవ ఇదమ్-త్వదీయమ్ త్వద్ + ఈయ) మఘవుని సంబంధి-మాఘవనము-మాఘవతము (మఘోనః ఇదమ్-మాఘవనమ్ మఘవతః ఇదమ్-మాఘవతమ్ మఘవన్ + ష్ణ-మాఘవన్ + అ మఘవత్ + ష్ణ - మాఘవత్ + అ) కుక్క (శ్వన్) సంబంధి-శౌవనము (శునః ఇదమ్-శౌవనమ్ శ్వన్ + ష్ణ-శౌవన్ + అ, సం-త-౨ వ సూ)

౧వ వివ తద్ధిత 'య'కార పరకత్వమున 'ఋ' కారము రేఫ మగును ఉదా. పితృసంబంధి-పిత్ర్యము (పితురిదమ్-పిత్ర్యమ్-పితృ + య)

౨౭వ ౨౮వ 'ష్ణ-ఠీన' ప్రత్యయములు పరమగునపుడు 'యుష్మద్-అస్మద్-త్వద్-మద్' అను వానికి "యుష్మాక-అస్మాక-తవక-మమక" అను నాదేశము లగును ఉదా యౌష్మాకము-యౌష్మాకీణము (మీ సంబంధి-యుష్మాక మిదమ్-యౌష్మాకమ్-యౌష్మాకీణమ్) అస్మాకము-ఆస్మాకీనము (మా సంబంధి-అస్మాక మిదమ్-ఆస్మాకమ్-ఆస్మాకీనమ్) తావకము-తావకీనము (నీ సంబంధి-తవ + ఇదమ్-తావకమ్-తావకీనమ్) మామకము-మామకీనము (నా సంబంధి-మమ ఇదమ్-మామకమ్-మామకీనమ్)

హితార్థకములు సూర్యుని హితము-సౌరీయము (సూర్యాయ హితమ్-సౌరీయమ్ సూర్య + ఛీయ-సౌర్ + ఈయ, సం-త-౧౧౧వ సూ, ౧౧వ ౨౮వ య లోపము, సి-కౌ-౧౬౬౫వ సూ) ఆత్మన్ (తనకు) హితము-ఆత్మనీనము (ఆత్మనే హితమ్-ఆత్మనీనమ్ ఆత్మన్ + ఖీన, సి-కౌ-౧౬౭౦వ సూ,

స్వార్థిక చోరుఁడే-చౌరుఁడు (చోర ఏవ చౌరః-చోర + ష్ణ-చౌర్ + అ) త్రిలోకియే-త్రైలోక్యము (త్రిలోక్యేవ త్రైలోక్యమ్-త్రిలోకి + ష్య-త్రైలోక్ + య) రాముఁడే-రామకుఁడు (రామ ఏవ - రామకః-రామ + కణ్) స్వార్థిక ప్రత్యయాంతములు పూర్వలింగములై యగును

"అజ్ఞాతే కుత్సితే చైవ। సంజ్ఞాయా మనుకమ్పనే। తద్యుక్త నీతా వప్యల్పే। వాచ్యే హ్రస్వే చ కః స్మృతః" అను నర్థములందు 'క' ప్రత్యయము వచ్చును ఎవ్వరిదో తెలియని యశ్వము-అశ్వకము కుత్సితమైన యశ్వము-అశ్వకము (అజ్ఞాతః, కుత్సితో వా అశ్వః-అశ్వకః) అనుకంపన పుత్రకుఁడు హ్రస్వ చిన్న చెట్టు-వృక్షకము (హ్రస్వో వృక్షః-వృక్షకః) అల్ప అల్పమగు తైలము-తైలకము (అల్పం తైలమ్-తైలకమ్, సి-కౌ-౨౦౨౮-మొ ౨౦౩౨వ ౨౦౪౦ ౨౦౪౧వ సూ)

## వివిధార్థక తద్ధితములు

వికారేత్యాది సూత్రములోని యాది శబ్దము చేత శివుఁ డిష్ట దైవముగాఁ గలవాఁడు-శైవుఁడు (శివో దేవతా అస్య-శైవః-శివ + ష్ణ) శక్తి దేవతగాఁ

గలవాఁడు-శాక్తేయుఁడు (శక్తిర్దేవతా అస్య-శక్తి+ష్ణేయ) పశుపతి దేవతా కము-పాశుపతము (పశుపతి ర్దేవతా అస్య-పాశుపతమ్-పశుపతి+ష్ణ) ఇన్ద్రై-ఐంద్రము (సి-కౌ-౧౨౨౬ వ సూ) అపూపములు దీనికి వెల-ఆపూపికము (అపూపా అస్య పణ్యమ్-అపూప+ష్ఠిక, సి-కౌ-౧౬౦౧వ సూ) మృదంగ వాదనమున నేర్పు గలవాఁడు-మార్దంగికుఁడు (మృదఙ్గవాదనే శిల్ప మస్య మార్ద ఙ్గికః-మృదఙ్గ+ష్ఠిక, సి-కౌ-౧౬౦౫వ సూ) ధనుస్సు ప్రహరణ సాధనముగాఁ గలవాఁడు-ధానుష్కుఁడు (ధనుః ప్రహరణసాధన మస్య-ధానుష్కః-ధనుస్+ కణ్-సి-కౌ-౧౬౦౫వ సూ) గురుని దోషముల నావరించువాఁడు (ఛత్రమువలె) ఛాత్రుఁడు (గురో ర్దోషావరణే ఛత్రవత్ శీల మస్య-ఛాత్రః ఛత్ర+ష్ణ సి-కౌ-౧౬౧౧వ సూ) ఆకరమున నియుక్తుఁడు (రత్నాదుల గని అకరము)-ఆకరికుఁడు (ఆకర+ష్ఠిక, సి-కౌ-౧౬౨౦ వ సూ) సర్వ భూమీశ్వరుఁడు-సార్వభౌముఁడు (సర్వభూమే రీశ్వరః సార్వభౌమః-సర్వభూమి+ష్ణ సి-కౌ-౧౭౦౮ వ సూ)

౩ వ వివ 'క' ప్రత్యయమునకు సంస్కృతమున మిక్కిలి వ్యాప్తి గలదు స్వార్థమందు 'క' ప్రత్యయ మగు నని పైని వివరింపఁబడెను కం॥ కావించు విచిత్రవీర్యక క్షేత్రములన్ (భార-ఆది-౪వ ఆ-౨౩౮, విచిత్ర వీర్యుఁడే విచిత్రవీర్యకుఁడు)

ఈకారాంతోకారాంతములగు (నదీ సంజ్ఞ గల) శబ్దములకును, ఋదంత శబ్దములకును బహువ్రీహిలోఁ దుదిని 'క' ప్రత్యయమగును ఉదా పూజిత గౌరీకుఁడు బహుకర్తృకము (చూ-సమా-౨౫వ సూ ౨వ వివ) బహు వ్రీహిని దుదిని 'క' ప్రత్యయము వైకల్పికముగా నగును ఉదా మహాయశస్కుడు-మహాయశుఁడు మొ (చూ-ద్రా-పరి-౮౫ I విష ౧౨ IV విష ౪౬వ పుట, ముగ్ధ ౪౩౬వ సూ దుర్గాదాస వ్యాఖ్య ౪౪౮వ పుట) "అజ్ఞాతే కుత్సితే " మున్నగు శ్లోకము మీఁద వివరింపఁబడెను "సంజ్ఞాయామ్ దేవదత్తకః . అనుకమ్పా యుక్త సీతా-గుప్తకమ్" (ముగ్ధ-వ్యా-శ్రీరామతర్క ౪౫౨-౪౫౩వ పుటలు)

౪వ వివ 'క' ప్రత్యయ పరకత్వము 'ఆ-ఈ-ఊ-ఋ' అను దీర్ఘా చ్చులు హ్రస్వము లగును, బహువ్రీహి సమాసమున వైకల్పికముగా నగును

(సి-కౌ-౮౩౪ వ సూ) ఉదా కన్యక (కన్యాకా - కన్యకా) బహుబ్రీహి-సుకన్యకుఁడు, సుకన్యాకుఁడు

కొన్ని యెడల స్థలాంతరమందును హ్రస్వమగును ఉదా కాళిదాసుఁడు, వైదేహిబంధుఁడు, రతిదూతి పదము మొ (ముగ్ధ ౪౩౭ వ సూ దుర్గా-వ్యా ౪౫౬ వ పుట, చూ-సమా-౨౬ ౭ సూ)

## భావార్థక తద్ధితములు

భావార్థమున 'త్వ-త' అను ప్రత్యయము లగును త్వాంతము నపుంస కము, తాంతము టాబంతము నగును ౧౩ (ముగ్ధ ౪౩౮ వ సూ, సి-కౌ-౧౭౮౧ సూ)

ఇచటి భావము 'ప్రకృతిజన్యబోధంబునఁబ్రకారంబు ప్రవృత్తినిమిత్తము ఉదా గురువు యొక్క భావము (ధర్మము) గురుత్వము-గురుత - గౌరవము (తద్ధి ౧౨ వ సూ చూపఁబడెను-గురోర్భావః-గురుత్వమ్-గురుతా-గౌరవమ్) ఇట్లె-బ్రాహ్మణత్వము - బ్రాహ్మణత - బ్రాహ్మణ్యము మొ (సి-కౌ-౧౭౮౮ ష్యఞ్) ఇట్లె ఆధిక్యము-అధికత్వము-అధికత మొ

త్వాది పరకత్వమున భాషితపుంస్కములకుఁ బుంవద్భావ మగును (త్వ-తా-తర-ఇమన్-మొ), అందలి 'త్వ-త'లు పరమగునపుడు జాతి సంజ్ఞా వాచకములకుఁ బుంవద్భావము లేదు ౧౪ (ముగ్ధ ౩౨౭-౩౫౦ వ సూ, సి-కౌ-౮౩౬ వ సూ)

సాధ్వి యొక్క భావము (ధర్మము) సాధుత్వము- సాధుత (సాధ్వ్యా భావః సాధుత్వమ్ సాధుతా) జడ యొక్క భావము (ధర్మము) జడత్వము-జడత (జడాయా భావః-జడత్వమ్-జడతా) షష్ఠి యొక్క భావము షష్ఠత్వము షష్ఠత (షష్ఠ్యా భావః-షష్ఠత్వమ్ షష్ఠతా) జాతి సంజ్ఞా బ్రాహ్మణి యొక్క భావము-బ్రాహ్మణీత్వము - బ్రాహ్మణీత (బ్రాహ్మణ్యా భావః బ్రాహ్మణీత్వమ్-బ్రాహ్మణీతా) అనసూయాత్వము-అనసూయాత (అనసూయాయా భావః- అనసూయాత్వమ్-అనసూయాతా)

**త్వాదులు** "త్వ-తా-తర-తమ-ఇమన్-ఇష్ఠ-ఈయసు - కల్ప - శస్-రూప-చతరామ్-చతమామ్-దేశ్య-దేశీయ-బహు-పాశ-చర" ఇవి త్వాదులు

## షత్వవిధి - కల్పాదిప్రత్యయము

'క' వర్గమునకంటెను, 'అ' వర్ణేతరాచ్చులకంటెను, 'హ-య-వ-ల'ల కంటెను బరమైన పదమధ్య గతమగు ప్రత్యయాగ మాదేశ సంబంధి సకారము 'ష' కార మగును నుణ్-విసర్గ-వ్యవధానమున్నను నీ 'ష' త్వము గల్గును ప్రాతిపదికముయొక్కదీర్ఘముకానట్టి యిక్కులకుఁ బరమగు 'స' కారము తద్ధిత 'త' కార పరకత్వమున 'ష' కారమగును ౧౫ (ముగ్ధ-౧౧౧ - ౪౩౯వ సూ, సి-కౌ-౨౧౦-౨౧౧-౨౧౨-౪౩౪-౧౩౨౫ సూ)

యజుస్సుయొక్క భావము-యజుష్ట్వము (సమా ౬౬వ సూ-చూడు యజుషో భావః-యజుష్ట్వమ్ యజుస్-యజుష్+త్వమ్-యజుష్ట్వమ్ సమా ౩౯వ సూ చొప్పున 'త' కారము టకారమగును) మాటలయొక్క (గిర్-మాట) భావము-గీస్త్వము (గిరో భావం-గీస్త్వమ్, ధాతువుయొక్క 'ఇక్కు' లకు విసర్గ రేఫ పరకత్వమున దీర్ఘమగును గిర్-గీర్-గీః ధుర్-ధూర్-ధూః)

ఈషదూనార్థమున "కల్ప'' ప్రత్యయ మగును ౧౬ (ముగ్ధ-౪౭౭వ సూ, సి-కౌ-౨౦౨౨వ సూ)

ఈ యర్థమున 'దేశ్య-దేశీయ' ప్రత్యయములును నగును ఉదా. ఈషదూనముగా విద్వాంసుఁడు-విద్వత్కల్పుఁడు-విద్వద్దేశ్యుడు - విద్వద్దేశీయుఁడు ఈషదూనముగా దీర్ఘము-దీర్ఘకల్పము-దీర్ఘదేశ్యము-దీర్ఘదేశీయము ఇవి పరమగునపుడు భాషితపుంస్కములకుఁ బుంవద్భావమగును (సమా-౧౦-౨౪వ సూ సం-త-౧౪వ సూ) విదుషి కించుక తక్కువ-విద్వత్కల్ప (చూ-సమా-౪౦వ సూ, 'విద్వస్' వసు ప్రత్యయాంతము-సకారాంతము)

౧వ వివ సంస్కృతమున నవ్యయములగు 'వతి' ప్రత్యయాంతములు గలవు గాని యట్టి యవ్యయములు తెల్గున నిల్వనేరవు (ముగ్ధ ౪౪౦, సి-కౌ-

౧౩౩౮-౧౭౭౯ సూ) ఉదా కృష్ణ ఇవ - కృష్ణవత్ భాతి కృష్ణ మివ- కృష్ణవత్ మన్యే "కం అల తద్ధితముల యందుం। దెలియ'వతి' ప్రత్యయంబు దెలుఁగున లేమిం । గలిగిన 'కల్ప' ప్రత్యయ। మలరుచు నయ్యార్థియంద యది గనుపట్టుకా" (నరస-౫వ ఆ ౧౧వ ప)

## మత్వర్థీయములు

అస్త్యర్థమున 'మతు' ప్రత్యయ మగును ౧౭ (ముగ్ధ-౪౪౧ వ సూ, సి-కౌ-౧౮౯౪వ సూ)

ఇందలి 'ఉ' కారము స్త్రీత్వమున 'ఈ' ప్రత్యయము వచ్చునని తెల్పు నిద్వర్ణము (దీర్ఘాదులు వచ్చుననియుఁ దెల్పును శ్రీమాన్ మొ తత్స ౧౯౯వ సూ) శ్రీమంతుఁడు (శ్రీరస్తి యస్యాసౌ-శ్రీ + మత్-శ్రీమత్-శ్రీమాన్, ఏవం-విదుష్మాన్ దోష్మాన్-ఇట్లే-విదుష్మంతుఁడు (విద్వాంసుఁడు) దోష్మంతుఁడు (బాహుబలశాలి), స్త్రీలింగమున-శ్రీమతి-విదుష్మతి(విదుషి)-దోష్మతి మొ

౧వ వివ "భూమ నిన్దా ప్రశంసాసు । నిత్యయోగేఽతిశాయనే । సంసర్గేస్తి వివక్షాయాం । భవన్తి మతుబాదయః॥" దీనికి వరుసగ నుదాహృతులు భూమ-అనేక గోమంతుఁడు (పెక్కు గోవులు గలవాఁడు) నిన్దా పాపి (మిక్కిలి పాపాత్ముఁడు) ప్రశంసా రూపవంతుడు (ప్రశస్తమగు రూపము గలవాఁడు). నిత్యయోగ క్షీరవంతము (పాలుగల వృక్షము) అతిశాయన ఉదరవతి (పెద్దకడుపుగల కన్య) సంసర్గ ఛత్రి (గొడుగు గల పురుషుఁడు, పురుషుఁడుగలది ఛత్రి మనరాదు)

౨వ వివ అస్త్యర్థక ప్రత్యయముపైని భిన్న రూపము కాని యస్త్యర్థక ప్రత్యయము నిల్వదు ఉదా 'ధనవద్ వంతుఁడు అనరాదు 'ధనిమంతుఁడు' అనవచ్చును

౩వ వివ బహువ్రీహిపయిని సయుతము మత్వర్థీయ మతిశయాద్యర్థ విశేష బోధకమై నిల్వవచ్చును ఉదా తరుణ జ్వరి (తరుణ జ్వర మధికముగా

గలవాఁడు) "కోకప్రీతి చకోర పారణపటు జ్యోతిష్మతీ లోచనే" (అనర్ఘ రాఘవము)

౪వ వివ "శుక్లము (శుక్లత గల) కృష్ణము (కృష్ణత గల)" ఇత్యాదు లందు మత్వర్థీయము నిల్వ నక్కఱ లేదు 'రసవంతము' అని వాడుదురు కాని 'రసి' అని వాడుట లేదు

## 'వతు' ప్రత్యయాంతములు

మకారోపధకములకును, 'అ' కారోపధకములకును, మకారాంతముల కును, 'అ' కారాంతములకును, 'ఝయ్' ప్రత్యాహారాంతములకును న స్వార్థ మున 'వతు' ప్రత్యయ మగును యవాదులకు 'మతు' ప్రత్యయమే యగును ౧౮ (ముగ్ధ-౪౪౨ వ సూ, సి-కౌ-౧౮౯౩-౧౮౯౮ సూ)

మకారోపధక లక్ష్మీవంతుఁడు (లక్ష్మి + వత్-లక్ష్మీవాన్), అకారో పధక యశస్వంతుఁడు (యశస్వాన్) మకారాంత కింవంతుఁడు(కింవాన్) అకారాంత : జ్ఞానవంతుఁడు (జ్ఞానవాన్) తపరకరణము లేమింజేసి 'ఆ'కారాం తములకును 'ఆ'కారోపధకములకును 'వతు' ప్రత్యయ మగును ఆకారాంత విద్యావంతుఁడు (విద్యావాన్) ఆకారోపధక భాస్వంతుఁడు (తేజస్సు గల వాఁడు, భాస్వాన్) 'ఝయ్' ప్రత్యాహారాన్త విద్యుత్వంతుఁడు (మెఱపులు గల మేఘుఁడు - విద్యుత్వాన్) యవాది యవమంతుఁడు (ధాన్యము గల వాఁడు, యవమాన్) యవాదులు యవ-ఊర్మి (తరంగ)-భూమి-కృమి (పురుగు)-కకుత్ (ఎద్దు మూపురము)-కకుభ్ (దిక్కు)-హరిత్ (దిక్కు) మరుత్ (గాలి)-గరుత్ (ఱెక్క) ఇత్యాదులు యవాదులు 'అ'కారాంతములు', 'ఊర్మి' మున్నగునవి మకారోపధకములు 'కకుత్' మున్నగునవి 'ఝయ్' ప్రత్యాహారాంతములు

౧వ వివ సంజ్ఞావాచకములు వత్వంతము లగును ఉదా : ఉదన్వం తుఁడు(సముద్రుఁడు-ఉదన్వాన్ ఇది 'అ కారోపధకము ఉదక శబ్దము 'అ' కారాంతము) చర్మణ్వతి (ఒకానొక నది-చర్మణ్వతీ-ఇదియు'అ'కారోపధకమె)

రాజన్వతి (మంచిరాజు గల భూమి, రాజన్వాన్-రాజస్వతీ, ఇవియు 'అ' కారో పథకమె)

## అ_స్త్యర్థక 'ఇన్' ప్రత్యయము

అనేకాచ్చులు గల దానికిని, 'అ' వర్ణాంతములకును, న_స్త్యర్థమున 'ఇన్' ప్రత్యయము వైకల్పికముగ నగును ౧౯ (ముగ్ధ-౪౪౪వ సూ, సి-కౌ-౧౯-౨-౨ వ సూ)

వ్రీహి + ఇన్ -వ్రీహి-వ్రీహి (ధాన్యము గలవాఁడు) జ్ఞాని (జ్ఞానము గల వాఁడు- జ్ఞాన + ఇన్ జ్ఞానీ) శిఖి (శిఖ గలవాఁడు-శిఖా + ఇన్ శిఖిన్-శిఖీ) మాలి (మాల గల వాఁడు, మాలా + ఇన్-మాలిన్-మాలీ) వైకల్పిక మగుట చేతఁ వ్రీహి మంతుఁడు-జ్ఞాన వంతుఁడు మున్నగు రూపములు నగును

౧వ వివ 'అస్' అనునది తుదిని గల శబ్దములకును, స్రిజ్మేధా మాయా శబ్దములకును 'విన్' ప్రత్యయ మ_స్త్యర్థమున వికల్పముగా నగును ఉదా యశస్వి (కీర్తి గలవాఁడు, యశస్ + విన్ యశస్వీ) స్రగ్వి (పూలమాలిక గల వాఁడు, స్రిజ్ + విన్-స్రిగ్వీ) మేధావి (ధారణావంతమగు బుద్ధిగలవాఁడు (మేధా + విన్- మేధావీ) మాయావి (మాయగల వాఁడు, మాయా + విన్- మాయావీ) ఇవియు వైకల్పికములె ! కాన "యశస్వంతుఁడు-మేధావంతుఁడు" మున్నగునవి యును సాధువులె ।

శంభ-కంభాదులు పెక్కు మత్వర్థీయములు 'భ' ప్రత్యయాంతాదులు ప్రయోగ వేద్యములు ౨౦ (ముగ్ధ-౪౪౫ మొ ౪౪౭ సి-కౌ-౧౯-౧౪ మొ)

శంభము (మాంగళ్యముగల-శమ్ + భః-శమ్భః) కంభము (మూర్ధము గల-కమ్ + భః-కమ్భః - స్తంభము) 'సుఖ-శీర్ష-జలేము' 'కమ్' (విశ్వ ప్రకాశః-సి-కౌ-౧౯-౪౪) స్వామి (స్వ + మిన్-స్వామీ, సి-కౌ-౧౯-౩-౨ వ సూ) రజస్వల (రజస్సు గలది-ముట్టుది-రజస్ + వల-రజస్వలా) కృషీవ లుఁడు (వ్యవసాయదారు-కృషీ + వల-కృషీ...ః-సి-కౌ-౧౯-౧౯ వ సూ) మధురము (మధు + ర-మధురః, సి-కౌ-౧౯-౧౪ వ సూ) కేశవుఁడు (మంచి

కొప్పుగల విష్ణువు-కేశ+వ-కేశవః, సి-కౌ-౧౯౧౬ వ సూ) శ్రాద్ధము (శ్రద్ధగల-శ్రద్ధా+అ, సి-కౌ-౧౯౦౭౫ సూ) పణినుఁడు (పాణిని తండ్రి, పణ-వ్యవహారము గల-పణ+ఇన-పణినః,సి-కౌ-౧౯౭౭వ సూత్రమునొద్ద-'ఫల బర్హాభ్యా మినచ్'-'పణ' శబ్దాదులు నుండవలెను-చూ పుట ౩౧౫) వాగ్మి (వాక్కు పుణిగల-వాచ్+మిన్-వాగ్మి, సి-కౌ-౧౯౩౦) వాచాలుఁడు(వాగ్మి-నిపాతము, సి-కౌ-౧౯౩౧) వీని కస్త్యర్థమే కాక యర్థ విశేషములును గలవు

## సమూహార్థకములు-పూరణార్థకములు

౧ వ వివ 'తా' మున్నగు ప్రత్యయములు సమూహార్థకములు ఇందు 'వాతూల' శబ్దము మాత్రము పుంలింగము తక్కిన యీ సమూహార్థకములెల్ల స్త్రీలింగములు ఉదా జనత (జనసమూహము-జనతా) ఇట్లె గ్రామత-బంధుత-గజత మొ ఖలిని-దుర్జన సమూహము-(ఖల+ఇన్-ఈ), ఇట్లె హాలిని (హాల సమూహము) మొ గోత్ర-గోవుల సమూహము - (గో + త్రా-గోత్రా) రథకడ్య (రథముల సమూహము-రధ+కడ్యా-రధకడ్యా) వాతూలము-వాయు సమూహము- (వాత+ఊల-వాతూలః) వాత్య (వాయు సమూహము-వాత+య+అ-వాత్యా)

పూరణార్థమున ని ందిరీతిని రూపసిద్ధి గల్గును 'ద్వి' శబ్దమునకు 'ద్వితీయ' అనియు, 'త్రి' శబ్దమునకు 'తృతీయ' అనియుఁ బూరణార్థకములు నిల్చును 'చతుర్-షష్'శబ్దములకు 'థట్' ప్రత్యయమగును సంఖ్యావాచక శబ్దమాది యందు నిల్చిన 'ఎ' కారాంతములపయిని 'మట్' ప్రత్యయము నిల్చును 'షష్టి-సప్తతి-అశీతి-నవతి' శబ్దములపైని 'తమట్' ప్రత్యయము నిల్చును శత శబ్దముపైనినిత్యముగాను,వింశత్యాదులపైవైకల్పికముగాను 'తమట్' ప్రత్యయము నిల్చును తక్కినయేకల సంఖ్యావాచకములపైని'డట్' ప్రత్యయము నిల్చును-౨౧ (ముగ్ధ-౪౫౦ మొ ౪౫౭ వ సూ సి-కౌ-౧౮౪౯ మొ ౧౮౫౮ వ సూ)

సంఖ్యను 'పూరించు నది' పూరణార్థకము 'ద్వితీయ' అనునది 'ద్విత్వ'

సంఖ్యను బూరించుచున్నదిగదా 'ఏక' శబ్దముపైని బూరణార్థక ప్రత్యయము నిల్వదు ప్రథమాది శబ్దములె వాడఁ బడును 'డ' కార 'ట' కారములు పైవానిలో నిద్వర్ణములు 'డ' కారము 'టి' లోపమును దెల్పును అంత్యాచ్చు మొదలొక్కన్నది 'టి' సంజ్ఞ గలది టకారము స్త్రీత్వమున 'ఈ' ప్రత్యయము వచ్చునని తెల్పును (చూ-తత్స-౧౦౦ వ సూ) ఉదా ద్వితీయుఁడు-ద్వితీయము-ద్వితీయ (స్త్రీ-ద్వితీయా, రెండవది) తృతీయుఁడు - తృతీయము- తృతీయ (స్త్రీ-తృతీయా, మూఁడవది) చతుర్థుఁడు-చతుర్థము-చతుర్థి (స్త్రీ- చతుర్థీ, నాల్గవది) పంచముఁడు-పంచమము-పంచమి (స్త్రీ-పఞ్చమీ, ఐదవది) షష్ఠుఁడు-షష్ఠము-షష్ఠి (స్త్రీ-షష్ఠీ, ఆఱవది) సప్తముఁడు-సప్తమము-సప్తమి (స్త్రీ-సప్తమీ, ఏడవది) అష్టముఁడు-అష్టమము-అష్టమి (స్త్రీ-అష్టమీ, ఎనిమిదవది) నవముఁడు-నవమము-నవమి (స్త్రీ-నవమీ, తొమ్మిదవది) దశముఁడు- దశమము- దశమి (స్త్రీ -దశమీ, పదవది) ఏకాదశుఁడు-ఏకాదశము-ఏకాదశి (స్త్రీ-ఏకాదశీ, పదునొకండవది) ద్వాదశుఁడు-ద్వాదశము-ద్వాదశి (స్త్రీ- ద్వాదశీ, పండ్రెండవది) త్రయోదశుఁడు-త్రయోదశము-త్రయోదశి (స్త్రీ- త్రయోదశీ, పదుమూఁడవది) మొ వింశతితముఁడు-వింశతితమము- వింశతితమి (స్త్రీ-వింశతితమీ) వింశుఁడు-వింశము-వింశి (స్త్రీ-వింశీ, ఇరువదవది) త్రింశత్తముఁడు-త్రింశత్తమము-త్రింశత్తమి, (స్త్రీ-త్రింశత్తమీ) త్రింశుఁడు- త్రింశము-త్రింశి (స్త్రీ-త్రింశీ ముప్పదివది) మొ. షష్టితముఁడు-షష్టితమము- షష్టితమీ (స్త్రీ-షష్టితమీ, అఱువదవది) శతతముఁడు-శతతమము-శతతమి (స్త్రీ-శతతమీ, నూఱవద) మొ

౧వ వివ : కతిథము-కతిథి - (ఎన్నవది) కతిపయథము స్త్రీ-కతిథీ కతిపయథి (స్త్రీ-కతిపయథీ-కొన్నిటిది) బహుతిథము-బహుతిథి (స్త్రీ-బహుతిథీ-అనేక కాలపుది) తుర్యము-తురీయము (నాల్గవది)

## సంఖ్యా సర్వనామ తద్ధితము

ప్రకారార్థమున సంఖ్యావాచకములపైని 'ధాచ్' ప్రత్యయమును, సర్వనామములపైని "థాల్" ప్రత్యయమును వచ్చును (మొగ్గ-ఆధార-ధాచ్ ... , ౧౫౦౪-౧౫౦౫ సూ)

ఇందలి చకార మవ్యయ మిది యని తెల్పు నిద్వర్ణము ఏకధా-ఏకధమ్ ద్విధా-ద్వైధమ్-ద్వేధా త్రిధా-త్రైధమ్-త్రేధా షడ్ధా-షోఢా (ముగ్ధ ౪౩౫. సి-కౌ-౧౯౯౦-౧౯౯౧-౧౯౯౨ సూ)

౨వ వివ 'ద్వి-అస్మద్-యుష్మద్' అను సర్వనామములకు 'ధాచ్' ప్రత్యయము లేదు

౩వ వివ బహు శబ్దముపైని ప్రకారార్థమున "ధాచ్-ధాస్" ప్రత్యయములు రెండును రావచ్చునని తోఁచును ఉదా బహుధా-బహుధా 'శబ్దస్తోమ మహానిధి- శబ్దార్థ చింతామణి' మున్నగు ప్రామాణిక కోశములలో వర్గచతుర్థ మగు 'ధాచ్' ప్రత్యయము మాత్రమె చూపఁబడెను.

"తేన సంఖ్యా వాచకేభ్యః దత్యతు బహుగణేభ్యశ్చధాచ్ స్యాత్ ప్రకారే" (ముగ్ధ-దుర్గా-వ్యా-౪౩౮వ సూ) "తేన త్రిసి (సర్వనామ) బహుభ్యామ్ ... ధాచ్ స్యాత్ ప్రకారే" (ముగ్ధ-దుర్గా-వ్యా-౩౨౭వ సూ)

"కిం సర్వనామ బహుభ్యో విశేష విహితేనాపి ధాలా" (తత్వబో-౨౯౬వ పుట)

## తయట్ తర-తమ ప్రత్యయములు

సంఖ్యావాచకములకు అవయవార్థమున 'తయట్' ప్రత్యయమగును ౨౩ (ముగ్ధ-౪౬౦వ సూ, పా-సి-౨౮౩-౧౨౪౪వ సూ)

ఇందలి టకారము ఇత్సంజ్ఞము ఇది స్త్రీత్వమున 'ఈ' ప్రత్యయ మగునని తెల్పును (పాణి- ౧౨వ పుట) ఉదా ద్వితయము - ద్వితయి (సంస్కృ- ద్వితయమ్-స్త్రీ-ద్వితయీ) త్రితయము-త్రితయి (సంస్కృ- త్రితయమ్-స్త్రీ- త్రితయీ)

౧వ వివ ద్వి- త్రి-ద్వయము ద్వితయ-ద్వయి త్రితయము- త్రయము త్రిత-త్రయ ప్రత్యయాంతరములను సూచు) 'ఉభయము' అను నిత్యయాపమ [illegible] (పా-సి, ౧౨౪౫వ సూ)

రెండిటిలో నొకటి కతిశాయన మర్థ మగునపుడు తర ప్రత్యయమును, ననేకములలో నొకటి కతిశాయన మర్థ మగునపుడు 'తమ' ప్రత్యయమును నగును ౨౪ (ముగ్ధ ౪౬౨ వ సూ, సి-కౌ-౨౦౦౧-౨౦౦౩ సూ)

ఇందలి యతిశాయన ముత్కర్షాపకర్షములు రెంటిలో దేని కయినం గావచ్చును "తరాది" ప్రత్యయ పరకత్వమందును భాషిత పుంస్కములకుఁ బుంవద్భావము వచ్చును (చూ-సం-త-౧౪వ సూ సమా ౧౧-౨౪వ సూ) ఉదా విద్వత్తమ-స్త్రీ (విదుషీ+తమా) ఈ స్త్రీ లందఱిలో నీమె విదుషి యని యర్థము. ఇట్లె సాధుతర-సాధుతమ, యోగ్యతర-యోగ్యతమ ("ఈ స్త్రీలలో నీమె యోగ్యురాలు" అనురీతి నర్థము నెఱ్ఱునది)

తరాదులు తర-తమ-ఇష్ఠ-ఈయస్-కల్ప-ఇమన్ మొ (చూడు-ముగ్ధ-౩౨౩వ సూ-దుర్గా వ్యాఖ్య)

౧వ వివ పీరిద్దఱిలో నీతఁడు 'ఉత్తరుఁడు' అను వాడుక కన్పట్టదు

౨వ వివ "కిం-యద్-తద్-ఏక-అన్య" అను శబ్దములకు "డతర-డతమ" ప్రత్యయము లగును అనఁగా 'టి'లోపము గల్గు నని యభిప్రాయము వీరిద్దఱిలోఁ గతరుఁడు రాముఁడు వీరందఱిలోఁ గతము డుత్తముఁడు అన్యతరుఁడు-అన్యతముఁడు మొ (ముగ్ధ ౩౧౦వ సూ సి-కౌ-౨౦౪౭-౨౦౪౮-౨౦౪౯ సూ)

గుణవాచకములపై (గుణవద్వాచకములపై) నతిశాయనమాత్ర మర్థమగు నపుడు "ఇష్ఠ-ఈయస్" ప్రత్యయములు వైకల్పికముగ నగును ౨౩ (ముగ్ధ-౪౬౬ మొ-౪౭౪ వ, సి-కౌ-౨౦౦౧-౨౦౦౩-౨౦౦౬-౨౦౦౮-౨౦౧౬-౧౩౮౬-౨౦౨౦వ సూ)

గరిష్ఠము-గరీయము (గురుశబ్దమునకు గరాదేశము) పక్షమున 'గురుతరము-గురుతమము' అనియు నుండును

౧వ వివ 'తర' ప్రత్యయమునకు 'ఈయస్' ప్రత్యయము సమమనియు, 'తమ' ప్రత్యయమునకు 'ఇష్ఠ' ప్రత్యయము తుల్యమనియుఁ బాణినీయులు చెప్పుదురు గాని 'తర-తమ' ప్రత్యయములకు వలె 'ఇష్ఠేయస్' ప్రత్యయముల కర్థభేదము మహాకవి ప్రయోగములలో నగపడమిఁ జేసి ముగ్ధబోధకారుఁ డిట్లు మార్చి చెప్పెను

౨వ వివ "ఇష్ఠేయస్" ప్రత్యయములు పరమగునపుడు ప్రకృతికి వివిధములగు నాగమాదేశ లోపాదులు గల్గును వానిని మహాకవి ప్రయోగములను బట్టి యెఱుంగనగును టిలోపము లఘిష్ఠము-లఘీయము (మిక్కిలి లఘువైనది) మత్వర్థీయలోపము మతిష్ఠము (మిక్కిలి గొప్ప మతిగలది) మేధిష్ఠము (మిక్కిలి గొప్ప మేధ-బుద్ధి-గలది) వీనియందు 'టి' లోపమును గలదు తృన్ ప్రత్యయలోపము కరిష్ఠము (మిక్కిలి గొప్పకర్త) ఆదేశాదులు గరిష్ఠము-గరీయము (మిక్కిలి గురువు, గురుశబ్దమునకు గరాదేశము) నేదిష్ఠము (మిక్కిలి యంతికము అంతిక-సమీప ద్రాఘిష్ఠము (మిక్కిలి దీర్ఘము) శ్రేష్ఠము (మిక్కిలి ప్రశస్యము) జ్యేష్ఠుఁడు (మిక్కిలి పెద్దవాఁడు-మిక్కిలి ప్రశస్యుఁడు) ద్రఢిష్ఠము (మిక్కిలి దృఢమైనది) కనిష్ఠుఁడు (మిక్కిలి చిన్నవాఁడు మిక్కిలి యువ్వఁడు) భూయిష్ఠము (బహుశబ్ద మూలకము) - భూయము-భూయాంసము-భూమము మొ

## ఇమన్-చరట్-ప్రత్యయములు

గుణవాచకముపైని (గుణపద్వాచకముపైని) భావార్థమున వైకల్పికముగా "ఇమన్" ప్రత్యయ మగును ౨౬ (ముగ్ధ-ఆఙవ సూ సి-కౌ-౧౭౭౬)

లఘిమము (సంస్కృ -లఘు + ఇమన్-లఘిమా) "ఇమన్" ప్రత్యయ పరకత్వమందును 'టి' లోపమగును ఇట్లే గరిమము, అణిమము, నీలిమము. పక్షమున లఘుత, లఘుత్వము, లాఘవము నీలిమము, నీలిమ, నీలత్వము, నీలత, నైల్యము (నీల + ఇమన్-నిలిమన్)

౧వ వివ  రూపాది గుణవాచకములపై 'ఇమన్' ప్రత్యయము నిల్వదు ఉదా రూపత్వము-రూపత రసత్వము-రసత, గంధత్వము-గంధత మొ

౨వ వివ  పృథ్వాది శబ్దములమీఁద 'ఇమన్' ప్రత్యయము వికల్పముగా నిల్చును-ఋవర్ణము రేఫమగును ఉదా ప్రథిమము (పృధు + ఇమన్-ప్రథిమా) ద్రఢిమము-దార్ఢ్యము - దృఢత్వము - దృఢత - (దృఢ + ఇమన్-ద్రఢిమా-దార్ఢ్యమ్-దృఢత్వమ్ మొ) ఇట్లె క్రశిమము-కార్శ్యము-కృశత్వము మ్రదిమము మృదుత్వము పటిమము-పటుత్వము చండిమము-చండత్వము మహిమము-మహత్త్వము భూమము-బహుత్వము మొ

భూతపూర్వార్థమున 'చరట్' ప్రత్యయ మగును ౨౭(ముగ్ధ-౪౦౦వ సూ, సి-కౌ-౧౯౯౯)

జ్ఞాతచరము (పూర్వము తెలిసినది) టిత్తుగాన స్త్రీ త్వమున 'ఈ' ప్రత్యయము వచ్చును 'జ్ఞాతచరీ' (తత్స ౧౦౦౫ సూ, జ్ఞాత + చరట్-జ్ఞాతచరః)

## 'శస్-కృత్వస్-సుచ్-మయు' ప్రత్యయములు

ఎహ్వాల్పార్థ శబ్దముల కారకములపైని, సంఖ్యావాచకములపైని వీప్సార్థము 'శస్' ప్రత్యయ మగును ౨౮ (ముగ్ధ-౪౦౨-౪౦౩వ సూ, సి-కౌ-౨౧౯౯-౨౧౧౦ సూ)

ఇందు 'శ' ... ... పిత్త్వ ల్యయాంత మవ్యయ మగనని అల్పున ఉదా బహుశః-అల్పశః-... శః-త్రిశః ఇది సంస్కృతావ్యయము ... లేదు సిద్ధ సమాసములలో నిల్వవచ్చును బహుశో దాహ... ...యము

... 'కృత్వ...స్' ప్రత్యయ మగును ద్వి-త్రి-చతు' శబ్దములు ... ... ౨౯ (ముగ్ధ-౪౦౪-౪౦౫వ సూ, సి-కౌ-... సూ)

ప్రత్యయాంత మవ్యయ మగు(నసు) చ కారేద్వర్ణము తెల్పును. రండిటి లోని 'చ' కారములు సిద్వర్ణములె ఉదా "పఞ్చకృత్వో భోజనము (అయిదుసార్లు భోజనము, పఞ్చ+కృత్వస్-పంచకృత్వః) సుచ్ ద్విః (రెండు సార్లు) ఇవియు నవ్యయములుగాను దాఖ్గా సిద్ధ సమాసములలో మాత్రమె నిల్చును "త్రిస్సప్తకృత్వో జగతిపతీనాం। ..." (భారవి)-ఇరువది యొక్క మారు (త్రిః+సప్తకృత్వః)

తద్రూపార్థమున "మయట్" ప్రత్యయమగును ౩౧ (ముగ్ధ-౪౮౭వ సూ, సి-కౌ-బహ్వర్థములందీ ప్రత్యయము కన్పట్టును ౧౫౩-౧౫౪వ సూ)

ఇందలి 'ట' కారేద్వర్ణము స్త్రీత్వమున 'ఈ' ప్రత్యయము వచ్చునని తెల్పును ఉదా విష్ణుమయము స్త్రీత్వమున-విష్ణుమయి (తత్స ౧౦౦వ సూ). ఏకాచ్కమునకు నిత్యము-వాఙ్మయము

## 'చుంచు-చణ-ఇత-చ్వి' ప్రత్యయములు

ఖ్యాతార్థమున "చుంచు-చణ" ప్రత్యయము లగును ౩౧ (ముగ్ధ-౪౮౮వ సూ, సి-కౌ-౧౮౭౭వ సూ)

విద్యాచుంచువు-విద్యాచణుఁడు (విద్యచే ఖ్యాతుఁడు, విద్యయా ఖ్యాతః-విద్యాచుంచుః-విద్యాచణః)

సంజాతార్థమున 'ఇత' ప్రత్యయ మగును ౩౨ (ముగ్ధ-౪౯౪వ సూ, సి-కౌ-౧౮౩౭వ సూ)

ఫలితము (సంజాత ఫలము వనము) తారకితము (సంజాత తారకము ఆకాశము) పాణినీయులు తారకాదులకే యీ ప్రత్యయ మగు నందురు తారకాదు లాకృతిగణము

అభూత తద్భావార్థమున 'భూ-కృ-అస్' ధాతు రూపములు పరమగు నపుడు 'చ్వి' ప్రత్యయ మగును 'చ్వి' ప్రత్యయము పరమగునపు డవ్యయేతర

## కార—ఇఫాదులు

౪ వ వివ వర్ణములపైని నిర్దేశాద్యర్థమునందు 'కార' ప్రత్యయమును 'ర' వర్ణము పైని 'ఇఫ' ప్రత్యయమును నిల్చును ఉదా అకారము-ఇకారము-కకారము-రేఫము మొ చూ సంజ్ఞా ౩వ సూ ౯వ వివ)

సాకల్యముగా సధీన మయ్యె నను నర్థమున 'కృ-భూ-అస్' ధాతు రూప పరకత్వమున వికల్పముగ 'చసాత్'-ప్రత్యయమగును ౩౪ (ముగ్ధ ౪౯౯వ సూ, సి-కౌ-౨౧౨౨ మొ ౨౧౨౩వ, ఈ సకారమునకు షత్వములేదు )

ఉదా "అసుర భస్మసాత్ కృతుఁడయ్యెన్" (ఆది ౧వ ఆ-౧౩౨వ ప), పక్షమున "భస్మీభూతుఁ డయ్యెను" అని మీఁది సూత్రము చొప్పున 'చ్వి ప్రత్యయము వచ్చును ఇందలి 'చ' కార ముఖ్యయతాద్యోతకమగు నిద్వర్ణము షత్వాభావ అగ్నిసాత్ కృతుఁ డయ్యెను

"ఊర్ధ్వపరిమాణార్థమున "దఘ్నట్-మాత్రట్-ద్వయసట్" అను ప్రత్యయములగును ౩౫ (ముగ్ధ-౫౦౬వ సూ, సి-కౌ-౧౮౩౮వ సూ)

ఇందలి 'ట' కారము 'ఈ' ప్రత్యయము వచ్చును స్త్రీత్వమున నని తెల్పు నిద్వర్ణము (చూ-తత్స-౧౦౦వ సూ) ఉదా గజ దఘ్నము- గజ మాత్రము-గజద్వయసము, 'ఏనుఁగు' ఎత్తు పరిమితి) స్త్రీత్వమున గజదఘ్ని మొ

## సార్వనామిక తద్ధితములు

కొన్ని సర్వనామ శబ్దములపై నీ క్రింద రీతిని ప్రత్యయములు నిల్చును' వీని వాడుక తెలుఁగున మిక్కిలి యరుదు విప్రయోగైకవేద్యము ౩౬ (ముగ్ధ-౫౧౦ మొ ౫౨౬ వ)

౧వ వివ 'తస్' అనునది ఎఫక్త్యర్థ వగును ఉదా సర్వతో ముఖముగ, కృష్ణతో గల మొ.

౨ వ వివ  సర్వనామములకును, 'బహు'శబ్దమునకును సప్తమ్యర్థమున 'త్ర' ప్రత్యయ మగును ఉదా 'సర్వత్ర' నిలింప కామినుల వాడకు (ఆముక్త)

౩ వ వివ  సర్వదా-సదా (ఎల్లప్పుడు) ఏకదా-ఒకప్పుడు) కదా (ఎప్పుడు) తదానీమ్ (అప్పుడు) పూర్వే ద్యుః (పూర్వదినమందు) పరేద్యుః (పరదినమందు) ఉభయే ద్యుః (రెండుదినములందును) పురస్తాత్ (ఎదుట) కుతః (ఏకారణముచేత) క్వ (ఎక్కడ) కుత్ర (ఎక్కడ) ఇతః (ఇచ్చటినుండి) అతః (అచ్చటినుండి) అత్ర (ఇక్కడ) ఇహ (ఇక్కడ - ఈలోకమున) అధునా (ఇపుడు) ఉపరి (మీఁదుభాగమున) సద్యః (తత్క్షణము) అద్య (ఇప్పుడు) ఇత్థమ్ (ఇట్లు) కథమ్ (ఎట్లు) తత్రత్యుఁడు (అచటనున్నవాఁడు) అద్యతనము (ఈదినము) దాక్షిణాత్యుఁడు (దక్షిణ దేశస్థుఁడు) పాశ్చాత్యుఁడు (పశ్చిమ దేశస్థుఁడు) ప్రాచ్యుఁడు (తూర్పు దేశస్థుఁడు - ప్రాచీనుఁడు) ఆదిమము (మొదటిది) మధ్యమము (నడిమిది) చిరత్నము (ఇవి సర్వనామములు కావు చిరకారపుది) కించిత్ (ఇంచుకంత - ఒకానొకటి) కదాచన (ఒకప్పుడు) కించన (ఇంచుకంత) మొ.

ఇది సంస్కృత తద్ధిత పరిచ్ఛేదము



# బాలవ్యాకరణోద్ద్యోతము

## క్రియా పరిచ్ఛేదము

## సంస్కృత క్రియల వివరణము

౧ వ వివ సంస్కృత ధాతువులనుండి యేర్పడిన సంస్కృత సుబ్విభక్తిరూప,తిఙంతరూపములకుఁ దెలుఁగున వాడుక లేదు సంస్కృత సుప్పులకు వలెనె యీ తిఙ్ఙులకును నాదేశముగాఁ దెలుఁగు డ్వాది విభక్తులు సంస్కృత సమములు నాచ్ఛికములు నగు ధాతువులు రెండు విధములపైని నిల్చును

౨ వ వివ సంస్కృతధాతువులు 1 పరస్మైపదములు, 2 ఆత్మనేపదములు, 3 ఉభయపదములు నని మూఁడు విధములు ప్రథమాది పురుషములలో "తిప్-తస్-అన్తి-" మున్నగు ప్రత్యయములు నిల్చు ధాతువులు పరస్మైపదములు (భవతి-భవతః-భవన్తి మొ) ప్రథమాది పురుషములలో "తే-ఆతే-అన్తే" మున్నగు ప్రత్యయములు నిల్చు ధాతువులు "ఆత్మనేపదములు" (భూ ధాతువు ప్రాప్త్యర్థమున నాత్మనేపదము భవతే-భవేతే-భవన్తే మొ) ప్రథమాది పురుషములలో ద్వివిధ ప్రత్యయములును నిల్చునవి యుభయ పదములు (రాజతి-రాజతః-రాజన్తి, రాజతే-రాజేతే-రాజన్తే మొ) ఙకార మిద్వర్ణముగాఁ గల ధాతువు లాత్మనేపదములు (ఏధఙ-వృద్ధౌ మొ) ఞకార మిద్వర్ణముగాఁ గలవి యుభయపదములు (రాజృఞ్-దీప్తౌ) తక్కినవి పరస్మైపదములు (భూ సత్తాయామ్ మొ ముగ్ధ-౨౩౧ వ సూ, ౧-కౌ-౨౧౨౪ మొ ౨౧౨౫ వ సూ) ఇవి "ఆత్మనేపదములు", ఇవి 'పరస్మైపదములు, నవి యుభయపదములు నని ధాతుపాఠములలో నుండును ఙకార, ఞకారములు లేవి కల్పితపదములు ఆత్మనే పదాదుల కిద్వర్ణములుగా నిలుపఁబడును

౩ వ వివ ఇట్టి ధాతువులపైని "లట్-లిట్-లుట్-లృట్-లేట్-లోట్-లఙ్-లిఙ్-లుఙ్-లృఙ్" అను సమాపక క్రియా లకారములు నిల్చును "ప్ర-

తిప్-తస్-అన్తి మధ్య -సిప్-థస్-థ ఉత్త మిప్-వస్-మస్'' ఇవి పర స్మైపద ప్రత్యయములు ''ప్రథ తే-ఆతే-అన్తే మధ్య సే-ఆథే-ధ్వే ఉత్త ఏ-వహే-మహె'' ఇవి యాత్మనే పద ప్రత్యయములు ఈ రెండు విధ ములును 'లట్' అనుదాని కాదేశములు ఇట్లె 'లిట్' మున్నగువానికిని ద్వివిధ ప్రత్యయములు నగును ఈ లడాదులకు ముగ్ధబోధమున 'కీ-ఖీ' మున్నగు సంజ్ఞలు గల్పింపఁ బడినవి లట్ (కీ-ముగ్ధ), ఇది తద్ధర్మాద్యర్థకము ''లిట్ (ముగ్ధ-రీ), లఙ్ (ఘీ-ముగ్ధ), లుఙ్ (టీ-ముగ్ధ)'' ఇవి మూఁడును భూతార్థక ములు ''లుట్ ('డీ-ముగ్ధ), ల్యాట్ (తీ-ముగ్ధ)'' అనునవి రెండు లకారము లను భవిష్యదర్థకములు 'లెట్' అనునది వేదమాత్ర ప్రసిద్ధము ''లిఙ్'' (ఖీ-ముగ్ధ) అనునది విధ్యాద్యర్థకము ''లిఙ్'' (ఢీ-ముగ్ధ) అనునది యాశీరర్థ కము ''లోట్'' (గీ-ముగ్ధ) అనునదియు నాశీరర్థకమె ''ల్యఙ్'' (ఢీ-ముగ్ధ) అనునది చేదర్థ గర్భిత భవిష్య దర్థకము

## సార్వధాతు కార్ధధాతుకాది సంజ్ఞలు

''లట్, విధ్యాద్యర్థక లిఙ్, లోట్, లఙ్, లఙ్'' అను నైదును, శవర్ణ మిద్వర్ణముగాఁగల ప్రత్యయములను (శప్ మొ ) సార్వధాతుకములు ('ర'-ముగ్ధ బోధ సంజ్ఞ) తక్కిన వెల్ల 'అర్ధధాతుకములు ('అర' ముగ్ధబోధ సంజ్ఞ)

ఆర్ధధాతుకములగు పురుషబోధక ప్రత్యయములు వికరణము లేకయే ధాతువుపైని నిల్చును 'శప్' మొ వికరణములు పకార మిద్వర్ణములేని సార్వ ధాతుక ప్రత్యయములు 'ఙిత్తు' లనిపించుకొనను లిట్టును, నాశీరర్థక లిఙ్ఙును, పకారేత్తులు కానివియును 'కిత్తు' లనిపించుకొనును

ఆవ వివ లడాది లకారములు సిద్ధరూపోదాహృతులు

లట్ ప్రథ భవతి-భవతః-భవన్తి మధ్య భవసి-భవథః-భవథ ఉత్త భవామి-భవావః-భవామః ఇవి పరస్మైపద రూపములు ఆత్మనేపద ప్రథ భవతే-భవేతే-భవన్తే, మధ్య భవసే-భవేథే-భవధ్వే, ఉత్త భవే-భవావహే-భవామహే

లిట్ పరస్మైపద ప్రథ బభూవ-బభూవతుః-బభూవుః, మధ్య-బభూవిథ-బభూవథుః-బభూవ ఉత్త బభూవ-బభూవివ-బభూవిమ ఆత్మనేపద ప్రథ బభూవే-బభూవాతే-బభూవిరె మధ్య బభూవిషే-బభూవాథే-బభూవిధ్వే, (బభూవిఢ్వే-రూ) ఉత్తః బభూవే-బభూవివహే-బభూవిమహే

లుట్ పరస్మైపదము పథ భవితా-భవితారౌ-భవితారః మధ్య భవితాసి-భవితాస్థః-భవితాస్థ ఉత్త భవితాస్మి-భవితాస్వః-భవితాస్మః ఆత్మనేపదము ప్రథ భవితా-భవితారౌ-భవితారః మధ్య భవితాసే-భవితాసాథే-భవితాధ్వే ఉత్త భవితాహే-భవితాస్వహే-భవితాస్మహే

ల్మట్ పరస్మైపదము ప్రథ భవిష్యతి-భవిష్యతః-భవిష్యన్తి మధ్య భవిష్యసి-భవిష్యథః భవిష్యథ ఉత్త భవిష్యామి-భవిష్యావః భవిష్యామః ఆత్మనేపదము ప్రథ భవిష్యతే-భవిష్యేతే-భవిష్యన్తె మధ్య భవిష్యసే-భవిష్యేథే-భవిష్యధ్వే ఉత్త భవిష్యే-భవిష్యావహే-భవిష్యామహే

లోట్ పరస్మైపదము ప్రథ భవతు (భవతాత్-రూ) భవతామ్-భవన్తు మధ్య భవ (భవతాత్-రూ) భవతమ్-భవత ఉత్త భవాని-భవావ-భవామ ఆత్మనేపదము పథ భవతామ్-భవేతామ్-భవన్తామ్ మధ్య భవస్వ-భవేథామ్-భవధ్వమ్ ఉత్త భవై-భవావహై-భవామహై

లజ్ పరస్మైపదము ప్రథ అభవత్-అభవతామ్-అభవన్ మధ్య అభవః-అభవతమ్-అభవత ఉత్త అభవమ్-అభవావ-అభవామ ఆత్మనేపదము ప్రథ అభవత-అభవేతామ్-అభవన్త మధ్య అభవథాః-అభవేథామ్ - అభవధ్వమ్, ఉత్త అభవే-అభవావహి-అభవామహి

లిజ్ విధ్యాద్యర్థకము పరస్మైపదము ప్రథ భవేత్-భవేతామ్-భవేయుః మధ్య భవేః-భవేతమ్-భవేత ఉత్త భవేయమ్-భవేవ-భవేమ ఆత్మనేపదము ప్రథ భవేత-భవేయాతామ్-భవేరన్ మధ్య భవేథాః-భవేయాథామ్-భవేధ్వమ్ ఉత్త భవేయ-భవేవహి-భవేమహి,

లిఙ్ ఆశీరర్థకము పరస్మైపదము ప్రథ భూయాత్-భూయాస్తామ్-భూయాసుః మధ్య భూయాః-భూయాస్తమ్-భూయాస్త ఉత్త భూయాసమ్-భూయాస్వ-భూయాస్మ ఆత్మనేపదము ప్రథ భవిషీష్ట-భవిషీయాస్తామ్-భవిషీరన్ మధ్య భవిషీష్ఠాః-భవిషీయాస్థామ్-భవిషీధ్వమ్(భవిషీఢ్వమ్-రూ) ఉత్త భవిషీయ-భవిషీవహి-భవిషీమహి.

లుఙ్ పరస్మైపదము ప్రథ అభూత్-అభూతామ్-అభూవన్ మధ్య అభూః-అభూతమ్-అభూత ఉత్త అభూవమ్-అభూవ-అభూమ ఆత్మనేపదము ప్రథ అభవిష్ట-అభవిషాతామ్-అభవిషత మధ్య అభవిష్ఠాః-అభవిషాథామ్-అభవిధ్వమ్ (అభవిఢ్వమ్-రూ) ఉత్త అభవిషి-అభవిష్వహి-అభవిష్మహి

ఌఙ్-పరస్మైపదము ప్రథ అభవిష్యత్-అభవిష్యతామ్-అభవిష్యన్ మధ్య అభవిష్యః - అభవిష్యతమ్ - అభవిష్యత ఉత్త - అభవిష్యమ్ - అభవిష్యావ-అభవిష్యామ ఆత్మనేపదము ప్రథ అభవిష్యత-అభవిష్యేతామ్-అభవిష్యన్త మధ్య అభవిష్యథాః-అభవిష్యేథామ్-అభవిష్యధ్వమ్ ఉత్త అభవిష్యే-అభవిష్యావహి-అభవిష్యామహి

ఇవి వివ అట్టి సంస్కృతధాతువులు పదివిధములగు వికరణములతో సార్వధాతుకత్వమునఁ బురుషబోధక ప్రత్యయముల నందును వీనిని దశగణి యందురు వివరణము శ్లో "భ్వాద్యదాదీ జుహోత్యాదిర్దివాది స్స్వాది రేవచ, తుదాదిశ్చ తనక్ర్యాది చు రాదయః" కవికల్పద్రుమగ్రంథమున నింద్రొక్కొక్కగణ మొక్కొక్క యిద్వర్ణయుతోఁ గూడియుండును తక్కిన ధాతుపాఠములలో నీ ధాతు వీ గణమని వ్రాయఁబడును

## 'భూ-అద్-హు-దివ్-సు-తుద్' ప్రభృతులు

1 భ్వాదులకు సార్వధాతుకత్వమున 'శప్' అను వికరణ మగును ఇందలి 'శ' వర్ణ 'ప' కారము లిద్ లక్షణములు "భూ - సత్తాయామ్"- పరస్మైపదము భూ + శప్ + తి (భూ-భో-భవ్)-భవతి భూ + శప్ + తే (భూ-భో - భవ్)-భవతే "భూ-ప్రాప్తౌ" ఆత్మనేపదము

2 అదాదులకు సార్వధాతుకత్వమునందును వికరణము లేదు ఇవి ధాతుపాఠమున (కవి కల్పద్రుమమున) లకార మిద్వర్ణముగాఁగలవై యుండును. "అద్ లౌ భక్షణే"-అద్+తి-అత్తి మొ

3 జుహోత్యాదులు ఇవియు 'అదా' ద్యంతర్గణమే కాన వీనికిని వికరణము లేదు ఈ గణము 'లి' వర్ణ మిద్వర్ణముగాఁగలవై యుండును "హు (లి) హోమే"-హు+హు+ (అభ్యాసకార్యములు చూడు-౭ వ సూ సం-క్రి అభ్యాసము)+తి-జుహోతి మొ

4 దివాదులు వీనికి సార్వధాతు-కత్వమున 'శ్యన్' వికరణ మగును ఇందలి 'శ' వర్ణ 'న'కారము లిద్వర్ణములు, ఈ గణము 'యు' కార మిద్వర్ణము గల్గి యుండును "దివ్ యు" క్రీడాయామ్, విజిగీషాదిషు చ, దివ్+శ్యన్+తి-దీవ్యతి మొ

5 స్వాదులు వీనికి సార్వధాతుకత్వమున 'శ్ను' అను వికరణ మగును ఇందలి 'శ' వర్ణ మిద్వర్ణము ఈ గణము 'న' కారేత్కమయి యుండును. ధాతుపాఠములో 'షు' అని షకారముతో నున్నను, ప్రక్రియా దశలో 'సు' అని సకారముతోనే యుండును "షు (నఞ్) బన్ధే" సు+శ్ను+తి-సునోతి మొ

6 తుదాదులు వీనికి సార్వధాతుకత్వమున 'శ' అను వికరణము నిల్చును ఇందలి 'శ' వర్ణ మిద్వర్ణము ఈ గణము 'శ' కారేత్కమై యుండును "తుదౌ (శఞ్) వ్యథే" తుద్+శ+తి-తుద్+అ+తి-తుదతి మొ

## రుధ్-తన్-క్రీ-చుర్ ప్రభృతులు

7 రుధాదులు వీనికి సార్వధాతుకత్వమున 'శ్నమ్' అను వికరణ మగును ఇందలి 'శ-మ' కారము లిద్వర్ణములు ఈ గణము 'ధ' కారేత్కమై యుండును "రుధ్ (ధఞ్) ఆవరణే"-రుధ్+శ్నమ్+తి-ఋణద్ధి-రున్ధః-రున్ధన్తి మొ

8 తనాదులు వీనికి 'ఉప్' అనునది సార్వ ధాతుకత్వమున వికరణమై నిల్చును 'శ-ప' కారము లిప్యర్థములు ఈగిణము దకారే త్కామైయుండును "తను (దఞ్) విస్తారే" తన్ + ఉప్ + తి-తనోతి మొ

9 క్ర్యాదులు వీనికి 'శ్నా' అనునది వికరణముగ సార్వ ధాతుక పరకత్వమున నిల్చును ఇందలి 'శ' వర్ణ మిద్వర్ణము ఈ గణము 'గ' కారేత్కామై యుండును "క్రీ (ఞ్ గ) ద్రవ్య వినిమయే" క్రీ + శ్నా + తి-క్రీణాతి మొ

10 చురాదులు వీనికి సార్వ ధాతుక పరకత్వమున 'ణి' అనునది వికరణ మగును (పాణినీయులు 'ణి') ఇందలి 'ణ' కార మిద్వర్ణము ఈ గణము 'క' కారేత్కామై యుండును "చుర (కి) స్తేయే" చుర + ణి + తి-చోర్ + (ఇ)-అయ్ + తి-చోరయతి మొ

సంస్కృతశబ్ద ప్రపంచమున కెల్ల మూలభూతములగు సంస్కృత ధాతువులు పై రీతిని భ్వాది గణ రూపమున విభజింపఁబడి ధాతు పాఠములలోఁ జేర్పఁబడును కవికల్పద్రుమమున నెల్ల విషయములకును నిద్వర్ణములు నిల్పఁబడును అట్టి ధాతువులనుండి ప్రేరణా ద్యర్థవిశేషములందుఁ దత్త దర్థబోధకము లగుచు "ణి" (పాణినీయులు-'ణిచ్' అందురు) మున్నగు ప్రత్యయములు నిల్చి మరల ధాతుసంజ్ఞ గలవగును పిదప మూలధాతువుల పయి వర్తమానాద్యర్థములందు 'డాదులు నిల్చినట్లె, వీనిపైని సైతము నిల్చి సంస్కృత తిజంతాదు లేర్పడును

'ణి-సన్-యఙ-కామ్యక్-క్య-జ్య క్వి' అను నేడు ప్రత్యయములు తుదిని గల ధాతువులు మరల ధాతు సంజ్ఞ గలవగును వీని పయిని 'శప్' అను వికరణము నిల్చును ౧ (ముగ్ధ ౬౩౧ ప సూ, సి-కౌ-౨౩౦౪ వ సూ)

ఇట్లు 'ణ్యంత', 'సన్నం' తాదు లను మరల ధాతుత్వము సంభవించు చుండుటచేత ధాతువుల మీఁద వలెనె వీని మీఁద సంతతము లకారాదులును 'తవ్యా'ద కృత్ ప్రత్యయములును నిల్చును ఉదా 'భావయతి'-భావయిత

వ్యము- బుభూషితవ్యము - బోభూయితవ్యము - పుత్రకామ్యితవ్యము - జ్ఞానీయిత
వ్యము-కృష్ణాయితవ్యము మొ (చూ-౩-౪-౬-౭-౮-౯-౧౬-౧౯-౨౦ సూ)

## ప్రేరణ రూప సాధనము

ప్రేరణార్థమున ధాతువునకు 'ణిచ్' ప్రత్యయమగును ౨ (ముగ్ధ-౭౭౭వ సూ సి-కౌ-౨౫౭౬ వ సూ)

ఇందలి 'ఇ' కార మిద్వర్ణము వృద్ధి వచ్చు నని తెల్పును ఇట్లు ధాతువునకు 'ణిచ్' ప్రత్యయము రాఁగా దానికి మరల ధాతుత్వము కలిగెను

ధాతువు తుది నున్న 'ఇచ్' ప్రత్యాహార వర్ణములకును, నుపధా భూతమగు 'అ' కారమునకును 'ఞిత్తు'గాని, 'ణిత్తు' గాని పరమగునపుడు వృద్ధి యగును ౩ (ముగ్ధ-౫౭౭వ సూ, సి-కౌ-౨౫౪ ౨౨౮౨ వ సూ, సమా-౩౦వ సూ-'వృద్ధి' వివరింపఁబడెను)

ఉదా "కృ (ఞ్)-కరణే" "కృ + ణి + శప్ + తి-కార్ + ణి + శప్ + తి" అని యుండఁగా —

ధాతువుల తుదినున్న 'ఇక్' ప్రత్యాహారమునకును లఘూపధమునకును గుణ మగును 'కిత్తు'గాని 'ఙిత్తు' గాని పరమైనచోఁ గాదు ౪ (ముగ్ధ-౫౪౨వ సూ, సి-కౌ-౨౧౬౮-౨౨౭౯వ సూ, ఈ సూత్రము సామాన్య శాస్త్రము ౩ వ సూత్రము దీనికి నొక విశేష శాస్త్రము)

'కార్ + ఇ" ఇకారమునకు గుణము (సమా-౨౯వ సూ గుణము వివరింపఁబడెను) రాఁగా 'కార్ + ఏ + అ + తి కార్ + అయ్ + అ + తి-కారయతి" అని సిద్ధించును 'కృ' ధాతువు తానుచురాదిలోని దయ్యును ణ్యంత ధాతువు గాను 'శప్' వికరణము వచ్చును ఇట్లే "భూ-సత్తాయామ్" అను ధాతువు నుండి "భావయతి" మున్నగు రూపము లేర్పడును

# ఇచ్ఛార్ధక 'సన్నంత' రూప సాధనము

ఇచ్ఛార్థమున ధాతువునకు 'సన్' ప్రత్యయ మగును ౫ (ముగ్ధ-౮౦౩వ సూ సి-కౌ-౨౬౦౮ వ సూ ఇందలి తుది 'న' కార మిద్వర్ణము)

ఇందలి'ఇచ్ఛ' ధాత్వర్థేచ్ఛ యని యెన్నునది అట్టి యిచ్ఛ "తున్" ప్రత్యయ గర్భితమై యుండును ఉదా భవితు మిచ్ఛతి-బుభూషతి ('అగుట కిచ్ఛించుచున్నాఁడు')

"సఙ్-యఙ్" ప్రత్యయాంతములగు ధాతువులు ద్విరుక్తము లగును ౬ (ముగ్ధ-౬౩౨వ సూ, సి-కౌ-౨౩౯౫ వ సూ)

ద్విరుక్తమందలి పూర్వభాగ మభ్యాస మనబడును ౭ (ముగ్ధ 'ఖి' అనబడును, ముగ్ధ-౫౮౦వ సూ, సి-కౌ-౨౧౭౦వ సూ) బుభూషతి (భూ + భూ + స + అ + తి)

అభ్యాసముయొక్క యాద్యచ్చునకుఁ బరభాగము లోపించును 'శస్' సమాహార మాదిగను, 'ఖప్' సమాహార మంతముగను (ముగ్ధ-'సమాహార' పాణి ప్రత్యాహారము) గల సంయోగము నిల్చియున్నచో నట్టి యభ్యాసముయొక్క యాది హల్లు లోపించును తద్భిన్న సంయోగ మున్నచో దాని తుది హల్లు లోపించును ౮ (ముగ్ధ -౫౬౪వ సూ, సి-కౌ-౨౧౭౯వ సూ) 'సఙ్' ప్రత్యయ పరకత్వమున 'అద్' ధాతువునకు 'ఘస్' అను నాదేశ మగును అభ్యాసము నందలి "ఝభ్" సమాహారము "ఒబ్" సమాహార మగును 'ఖద్' సమాహారము 'చప్' సమాహారమగును 'హ' కారము 'జ' కార మగును దీర్ఘము హ్రస్వ మగును, 'క' వర్గము 'చ' వర్గ మగును 'ఋ'వర్ణము 'అ'కార మగును 'సన్' ప్రత్యయ పరకత్వమున నభ్యాసము యొక్క 'అ' కరము 'ఇ' కార మగును ౯ (ముగ్ధ- ౫౫౯వ సూ ౬౪౦వ సూ, సి-కౌ-౨౧౭౯ మొ ౨౧౮-౨వ సూ ౨౩౧౭ సూ)

'అద్-భక్షణే' ప్రథమపురుషము-జిఘత్సతి-జిఘత్సతః-జిఘత్సన్తి(తిన నిచ్ఛించు)

# యఙన్తములు

ముహూరర్థమునందును, భృశార్థమునందును ధాతువునకుఁ బరముగా 'యఙ్' ప్రత్యయము నిల్చును ౧౦ (ముగ్ధ-౮౨౦వ సూ, సి-కౌ-౨౬౨౫ వ సూ ఇందలి ఙకార మిద్వర్ణము 'ఙిత్తు' ఆత్మనేపదము)

'సం-క్రి-౧ వ సూ' చొప్పున ధాతుత్వము వచ్చెను. 'సం-క్రి-౬వ సూ' చొప్పున ద్విరుక్తి రాఁగా, "సం-క్రి-౭-౮-౯-వ సూ" వర్తించును 'యఙ్' ఙిత్తుగానఁ దదంతము 'ఆత్మనేపద' మగును

'యఙ్' ప్రత్యయము పరమగునపు డభ్యాసమునకు గుణ మగును ౧౧ (ముగ్ధ-౮౨౨ వ సూ, సి-కౌ-౨౬౩౦ వ సూ)

సమా ౨౫వ సూత్రమున గుణము వివరింపబడెను "సూచ-పైశున్యే" ప్ర సోసూచ్యతే-సోసూచ్యేతే - సోసూచ్యన్తే (మిక్కిలిగఁ గొండెము చెప్పు)

'యఙ్' ప్రత్యయము వికల్పముగా లోపించును అట్లు లోపించునపుడు 'శప్' అను వికరణమును లోపించును ధాతువు పరస్మైపద మగును ధాతువునకు ద్విరుక్తియు నభ్యాసమునకు గుణమును నగును ౧౨ (ముగ్ధ-౮౩౬వ సూ సి-కౌ -౨౬౫౦ వ సూ)

"ప్రత్యయ లోపే ప్రత్యయ లక్షణమ్" అను చొప్పున ధాతుత్వాదికము కల్గును ఉదా బోభోతి (బోభవీతి)-బోభూతః-బోభువతి మొ

## సంస్కృత నామధాతువులు

నామమునకు ఇచ్ఛార్థమున నాత్మేచ్ఛార్థమున 'క్యచ్' ప్రత్యయ మగును ౧౩ (ముగ్ధ-౮౪౨ వ సూ సి-కౌ ౨౬౫౭ వ సూ)

ఇందలి తుది 'చ' కార మిత్సంజ్ఞము కిత్తుగాన ప-క్రి-౫వ సూత్రము చొప్పున, ఙిద్వద్భావము ఉదా పుత్త్రకామ్యతి-పుత్త్రకామ్యతః-పుత్త్రకామ్యన్తి మొ (పుత్త్రుఁడు కావలెనని కోరుచున్నాఁడు)

నామమునకుఁ బరముగా (మాన్తములు, నవ్యయములు తప్ప) స్వేచ్ఛా ర్థమున 'క్విప్' ప్రత్యయమగును ౧౪ (సిద్ధ ౦౪౩ వ సూ, సి-కౌ-౨౬౨౫ వ సూ -౨౬౨౦ వ సూ ఇందలి 'ప' కార మిద్వర్ణము)

జ్ఞానీ యతి-జ్ఞానీయతః-జ్ఞానీయన్తి (జ్ఞానివలె నుండనిచ్ఛించుచున్నాఁడు) క్రింది ౧౬వ సూత్రముచేత 'జ్ఞానీ' అనుచోటి దీర్ఘము సంభవించెను

కర్త్రర్థక మగు సుపమాన వాచకముకంటెఁ బరముగ నాచారార్థమున 'క్యఙ్-క్విప్' అను ప్రత్యయము లగును ౧౫ (సిద్ధ-౦౪౦ వ సూ, సి-కౌ-౨౬౬౫ వ సూ)

'ఙ్' ప్రత్యయములోని 'ఙ' కార మిద్వర్ణము 'క్విప్' ప్రత్యయములోని 'క' కార మిద్వర్ణము ఈ క్విప్' ప్రత్యయములోని యక్షరము లెల్ల లోపించును

ఆర్ధధాతుక మగు యకారము పరమగుచుండఁగా నజంతమునకు దీర్ఘం బగును ౧౬ (సిద్ధ-౫౯౦ వ సూ, సి-కౌ-౨౨౯౦ వ సూ)

'ఙ' ప్రత్యయాంతము జిత్తుగాన నాత్మనేపద మగును కృష్ణాయతే-కృష్ణాయేతే-కృష్ణాయన్తే ము 'క్విప్' ప్రత్యయాంతము కృష్ణ-కృష్ణః-కృష్ణన్తి మొ (కృష్ణుని వలె నాచరించు) ఇందు 'కృష్ణ' అను నామమె క్విప్ ప్రత్యయాంత ధాతు వగుచున్నది

సన్నంతాదులందు రెండేసి ప్రత్యయముల స్థితి యగపడుచున్నది "పుత్ర మిచ్ఛ త్యాత్మ న ఆచరతి" (పుత్త్రుని వలె శిష్యు నాచరించుచున్నాఁడు) అను నర్థమున 'క్యచ్' ప్రత్యయము వచ్చును పిదప "పుత్త్రీయితు మిచ్ఛతి" (పుత్త్రునివలె నాచరించుట కిచ్ఛించుచున్నాఁడు) అను నర్థమున 'సన్' ప్రత్యయము వచ్చును దాని రూపసిద్ధిలో "యథేష్టం నామ ధాతుషు" (సిద్ధ ౦౨౯ వ సూ, సి-కౌ-౯౪౪వ పుట-బాలమనోరమా పుస్తకములోని వార్తికము)-అను చొప్పున నాకార్యక్రమముచే ద్విరుక్తి రాఁగా "పుపుత్త్రీయిష-పుపుత్త్రీయిషత-పుత్త్రీయియిషతి-పుత్రీయిషిషత" అన్నిటికిని ద్విరుక్తి రాఁగా "పుపుతత్త్రీ యియి షిషతి" అగును

# కర్మార్థకము

కర్త్రర్థమందు వలెనె కర్మార్థమందును లడాదులు వచ్చును కర్మార్థక ధాతువునకు సార్వధాతుక పరకత్వమున 'యక్' ప్రత్యయము నిల్చును కర్మార్థక ధాతు వాత్మనేపదమే - యగును ౧౩(ముగ్ధ-౯-౨౦-౯-౨౧ సూ సి-కౌ-౨౬౭౯వ సూ ౨౩౪౬-౨౩౪౦ సూ)

స్తూయతే- స్తూయేతే- స్తూయన్తే (స్తుతింపఁబడుచున్నాఁడు, ౧౬వ సూత్రము చొప్పున దీర్ఘము) యక్ ప్రత్యయమునందలి కకార మిద్వర్ణము కిత్తుగాన గుణము లేదు చికిత్స్యతే (రోగాపనయనము చేయ నిచ్ఛింపఁబడుచున్నది మొ) తెలుఁగున సంస్కృత సమాపక క్రియలకుఁ బ్రయోగము లేమింజేసి వాని రూపములు, ప్రక్రియ విశేషించి వివరింపఁబడదయ్యె

ఇది సంస్కృత క్రియల భాగము



# బాలవ్యాకరణోద్ద్యోతము

## క్రియా పరిచ్ఛేదము

## తెనుఁగు క్రియల వివరణము

ధాతువునకు ౧ (బా-క్రియా-౧ వ్యా-సం-౨౬౪ విష)

ఇయ్యది యధికార సూత్రము ఇంక నెయ్యది యుపక్రమింపఁబడు నయ్యది ధాతువునకుఁ బరముగ నగు నని యెఱుఁగునది 'ధాతువు-క్రియ' అనునవి పర్యాయములు క్రియ వ్యాపారబోధకము, ఉదా చదువు-వండు-తిను-విను-కను-వ్రాయు-పోవు మొదలగునవి యాచ్ఛిక ధాతువులు తత్సమ ధాతువులు రక్షించు-పోషించు-జయించు-అనుభవించు మొ

సంస్కృతమున కిం(గలాదు)లు కించు కగు ౨ (బా-క్రి-౬౩వ సూ, వ్యా-సం-౩౨౬ I విష)

సంస్కృత ధాతువులకును, గొన్ని సంస్కృత నామంబులకును నంగలాదులగు కొన్ని యాచ్ఛిక (ధాతువులకును) శబ్దంబులకును స్వార్థమునందు 'ఇంచు'గాగమ మగును అంటటు నపదాది నిత్యస్వరసంధి (సంధి-౧౧ వ సూ) ఉదా సం-ధా రక్షించు-పోషించుజయించు-అనుభవించు సం-నామ శయనించు-సుతించు - స్తుతించు - ఆహారించు - కరుణించు-పల్లవించు-విచారించు - ఆఘ్రాణించు-కారించు (పీడించు) మొ సాధారణముగా 'ఇంచు'గాగమమును, సిద్ధసమాసములను సంస్కృతశబ్ద మిది యని తెలియుటకు మంచి యాధారములు

ఉ లాదులు ఉగ్గలించు (దుఃఖించు) అంగవించు (ఉత్సహించు) ఉబ్బలించు (ఉత్సాహవంతుడై) ఉగ్గడించు (శ్లాఘ్యుడై), ఉంకించు (యత్నించు)

ఓసరించు (తొలఁగు) జాడించు-తులకిం౦చు (ప్రకాశించు) పంకించు (కంప-వై), పరికించు (పరీక్షా-వై), పలవించు (ప్రలాప-వై)-అప్పించు (ఒప్పించు-అర్పణ-వై), ఆలించు-ఆలకించు (ఆలక్ష-వై), గాలించు (బియ్యమును)

ఆచ్ఛిక నామములు ఎలుఁగించు (శబ్దించు-పిలుచు) అడకించు (అడకము-లోపల నడగు) ఇనుమడించు (రెట్టించు - ఇనుమడి) ముమ్మడించు (ముమ్మడి-మూడు రెట్లు చేయు) ఉరవడించు (ఉరవడి) తొలుకరించు (తొలుకరి) తల్లడించు (తల్లడము) తురగలించు (తురగలి-ప్రకాశము)

౧ వ వివ 'ఇల్లు-ఇలు' అను నాగమములను జేర్చుటచేత సైతము కొన్ని తత్సమ ధాతువు లేర్పడును (చూ-క్రియా-౫౩వ సూ) ఉదా సంధిల్లు-సంధిలు (సంధిల్లఁజేయు, ప్రే-సంధించు)-ఘటిల్లు (సంభవించు, ఘటించు-ప్రే-కూర్చు) చింతిల్లు-చింతిలు-చింతించు (విచారపడు), కంపిల్లు-కంపిలు-కంపించు (వణఁకు) భాసిల్లు-భాసిలు - భాసించు రంజిల్లు-రంజిలు (అనురాగపడు, రజించు-ప్రే-రంజిల్లఁజేయు) భేదిల్లు-భేదిలు (బద్దలగు, భేదించు, ప్రే - భేదిల్లఁజేయు), ఇందలి 'ప్రే' అను గుర్తునకు "ప్రేరణ" మని యర్థము ప్రేరణ వివరణము ముందుఁ జేయఁబడును (చూ-క్రియా-౭౨ వ సూ)

౨ వ వివ పైని వివరించిన ధాతువులు యథాప్రయోగముగ గ్రాహ్యంబులు ఉదా 'ను' అను సంస్కృత ధాతువు 'నవించు' అను రూపముతోఁ దెలుగున వాడఁబడనేరదు ఇక "నుతించు" అను రూపముతో వాడఁబడును 'రమ్' అను సంస్కృత ధాతువు తెలుగున 'రమించు' అను రూపముతోఁ వాడఁబడును 'రామ' శబ్దమునుండి 'రామించు' అను రూపము గల్గనేరదు

## తత్సమ ధాతు రూప నిర్మాణము

సంస్కృత ధాతువుల తుదనున్న 'ఇ-ఉ-ఋ' అను వర్ణంబుల 'కించుక్కు' పరంబగునపుడు వరుసగా (అయ్-అవ్-అర్) నయు గవు గ రుక్కు లగును ౩ (బా- కి- ౬౪వ సూ, వ్యా-సం-౩౨౬ II విష)

సం-"జి-జయే"-జయించు జి-జే (గుణసంధి-చూ-సమా-౨౯౫ సూ) జయ్ (అయాద్యాదేశ సంధి-సమా-౩౨౪ సూ)+ఇంచు-జయించు "నీ-ప్రాపణే" -నీ-నే (గుణ-సమా-౨౯౫ సూ) నయ్(అయాద్యాదేశసంధి-సమా-౩౨)+ఇంచు-నయించు "ద్రు-ద్రవే" -ద్రవించు (ద్రు - ద్రో-ద్రవ్+ఇంచు-ద్రవించు) "లూ-లవనే-ఛేదనే"-లవించు (లూ-లో-లవ్+ఇంచు-లవించు) 'ధృ-ధారణే' ధరించు (ధృ-ధర్+ఇంచు-ధరించు) 'తౄ-తరణే'-తరించు (తౄ-తర్+ఇంచు-తరించు)

నిర్ పూర్వక 'జి' ధాతువునకు 'అముక్కు' లేదు ౪ (బా-క్రి-౮౨వ సూ, వ్యా-సం-౩౨౮ III విష) నిర్జించు (నిర్+జి+ఇంచు)-జయించు

సంస్కృత ధాతువుల యుపధ యగు 'ఇ-ఉ-ఋ' వర్ణంబుల కించుక్కు పరం బగునపుడు 'గుణా'దేశం బగు ౫ (బా-క్రియా-౮౮వ సూ, వ్యా-సం-౩౨౮ IV విష)

గుణాదేశ విషయము సమ-౨౯౫ సూత్రమందును 'ఉపధా,' శబ్దార్థము సంజ్ఞ ౧౦వ సూత్ర వివరణ [illegible] చూడదగు 'ఛిద్-ఛేదే-ఛేదించు 'భిద్-భేదనే'-భేదించు 'ఘుష్-ఘోషణే'-ఘోషించు, 'పుష్-పోషణే'-పోషించు 'వృష్-వర్షణే'-వర్షించు 'హృష్-హర్షే'-హర్షించు

స్పృశికి గుణంబు విభాష నగు ౬ (బా-క్రి-౮౭వ సూ, వ్యా-సం-౩౨౮, V విష) స్పృశించు- స్పర్శించు

లిఖ-భుజ-రుచ- కృశంబులకు గుణంబు లేదు ౭ (బా-క్రి-౮౮వ సూ, వ్యా-సం- ౩౨౮ V వి) లిఖించు-భుజించు-రుచించు-కృశించు

సృజికి నిత్యముగ గుణంబు లేదు ౮ (బా-క్రి-౮౯వ సూ, వ్యా-సం-౩౨౮ V వి) సకలమ్ముగ ప్రజలను సృజించె అతడు విషయములను విసర్జించె

# తత్సమ ధాతు స్వరూప స్వభావములు

అగతికంబులగు భ్వాదుల కిందుఁ బ్రయోగంబు లేదు—(బా-క్రి-౧-౨౧వ సూ, వ్యా-సం-౩౫౧-౩-౨౬ VII వివ)

'భూ-సృ-కృ-రేకృ-లోచ-పచి-లప' ఇత్యాదులగు భ్వాదులకు (సంస్కృత వ్యాకరణ ప్రసిద్ధ 'భ్వాదు'లని భ్రమింపరాదు ఇందలి 'కృ' సంస్కృత వ్యాకరణ ప్రసిద్ధ దశగణిలో "తన్వాదు''ల లోనిది)గతి విరహితంబుల కీ భాషం బ్రయోగంబు లేదు "ప్ర-పరా-అప-సమ్-అను-అవ-నిస్-నిర్-దుస్-దుర్-వి-ఆఙ్-ని-అధి-అపి-అతి-సు-ఉద్-అభి-ప్రతి-పరి-ఉప-"అను ప్రాదులును,'ఊరీ' ప్రభృతి శబ్దంబులును, సాక్షాత్ప్రభృతులును గతి సంజ్ఞాకంబులు ప్రాదు లిరువది రెండును గ్రియాయోగమున 'ఉప సర్గంబులు' నాఁబడును ('భవించు-సరించు-కరించు' అను రీతిని బ్రయోగింపరాదని యర్థము) ఉదా ప్రభవించు-ఆవిర్భవించు-ప్రసరించు-సత్కరించు-భస్మీకరించు-సాక్షాత్కరించు- అతిరేకించు-ఆలోచించు-ప్రపంచించు-ప్రలపించు ఇత్యాదు లార్య ప్రయోగంబుల నెఱుఁగునగి

౧వ వివ "ఉపసర్గేణ ధాత్వర్థో। బలా దన్యః ప్రతీయతే । ప్రహారాహార సంహార । విహార ఉపహార వత్" అని కొంద ఱందురు మఱి కొంద ఱుపసర్గ సంబంధము లేకయే ధాతువు లనేకార్థము లనియుఁ గ్రియావాచిత్వమును దెల్పుటకై ప్రసిద్ధార్థము చెప్పఁబడు ననియుఁ జెప్పుదురు "క్రియా వాచిత్వ మాఖ్యాతుం। ప్రసిద్ధార్థః ప్రదర్శితః । ప్రయోగతోఽనుమ న్తవ్యా । అనేకార్థా హి ధాతవః"

౨వ వివ సన్నంతాదులకుఁ దిజంత రూపములు తెల్గున లేవు సన్నంత నామ (చికీర్షా)-చికీర్ష-చేయు నిచ్ఛ (చికీర్షుః) చేయు నిచ్ఛగలవాఁడు-చికీర్షువు యఙ న్తనామ జేగీయమానుఁడు (జేగీయమానః) ణిజన్త (స్థాపయతి) "స్థాపించు చున్నాఁడు (ఆజ్ఞాపయతి) ఆజ్ఞాపించుచున్నాఁడు" అనునీరీతి ణిజంతములకుఁ దెల్గునఁ బేరణార్థకము లగుచుఁ దిజంతరూపము ... సన్నంతాదుల కన్నినో తదర్థ బోధక ప్రత్యయములు తెల్గున లేవు సన్నంత (చికీర్షతి) చేయ నిచ్ఛించుచున్నాడు యఙన్త (జేగీయతే) మాటిమాటికి గానము చేయుచున్నాఁడు

# లడంతాదులగు తెల్గు క్రియలు

వర్తమానంబున లట్టగు ౧౦ (బా-క్రి-౨ వ సూ, వ్యా-సం-౨౯౭ విష)

వర్తమాన క్రియావృత్తి యగు ధాతువునకు లడ్వర్ణకంబగు వర్తమానం బనఁగాఁ బ్రారబ్ధాఽపరిసమాప్తంబు ఆవఱ కారబ్ధమై యప్పటికి ముగియకుండునది ఉదా రాముఁడు వచ్చుచున్నాఁడు

౧ వ వివ సంస్కృతమున 'వర్తమానే లట్' (౩-౨-౧౨౩, సి-కౌ-౨౧౫౧వ సూ ) అను సూత్రము చొప్పున నేర్పడునట్టి 'భవతి-ఏధతే' మున్నగు లడ్రూపములు పయిని వివరించిన ప్రారబ్ధాఽపరిసమాప్తి రూప వర్తమానమును దెల్పును గాని యంతకన్న ముఖ్యముగాఁదద్ధర్మాద్యర్థములను సయితముదెల్పును ఉదా భవతి-అగును, అగుచున్నాఁడు ఏధతే-వర్ధిల్లును, వర్ధిల్లుచున్నాఁడు 'అగ్నిర్జ్వలతి'అగ్నిమండును 'విహగా డయన్తే'-పక్షు లెగురును ఇట్టి తద్ధర్మాద్యర్థ మును బోధించు ప్రత్యేక 'ల' కారము సంస్కృతమున లేదు

భూతంబున లిట్టగు ౧౧ (బా-క్రి-౩ వ్యా-సం-౨౯౮ విష )

భూతక్రియావృత్తి యగు ధాతువునకు లిడ్వర్ణకం బగు భూతంబు నా ముందుండి యప్పటికి [illegible] అప్పటి కనఁగా వాక్య ప్రయోగ కాలమున కగు యర్థము

౧ వ వివ 'లట్-లిట్-లృట్' మున్నగు 'ల' కారములు కొన్ని సంస్కృత వ్యాకరణ ప్రసిద్ధము లగు సంజ్ఞలె కాని యర్థమున మార్పును గలదు పాణినీయము నాఁటి భూత [illegible] "అనద్యతన భూతము-పరోక్షానద్యతన భూతము" అను భేదములు గలవు కాని యట్టి విశేషములు సంస్కృత మహాకవ్యపేక్షితము లె [illegible] చే ముగ్ధబోధాది సంస్కృత వ్యాకరణములందే యుపేక్షితము లయ్యె [illegible] 'ల' ట్టిపై భూత మాత్ర మందే యుపయోగింపఁబడెను ఇట్లె భావ్యర్థమునందు గ్రహింపనగును.

భావిని లృట్టగు ౧౨ (బా-క్రి-౪వ సూ, వ్యా-సం-౨౯౭ విష)

భావి క్రియావృత్తి యగు ధాతువునకు లృడ్వర్ణకం బగును భావి యనఁగా నప్పటికిఁ బుట్టకుండునది

౧వ వివ లృట్టనునదియు సంస్కృత వ్యాకరణ సంజ్ఞయే భూతమందు వలెనె భావియందును ననద్యతనాది భేదము లుపేక్షితములు కేవల భావిమాత్ర మందే యీ లృట్టు వాడఁబడెను

తద్ధర్మాదులందు లాట్టగు ౧౩ (బా క్రి-౫, వ్యా-సం-౨౯౭ విష)

తద్ధర్మాది క్రియావృత్తి యగు ధాతువునకు 'లా' డ్వర్ణకంబగు "తద్ధర్మ-తచ్ఛీల-సంభావనా-సంప్రశ్న - సాతత్య-వర్తమాన-భావ్యాశీరాదులు" తద్ధర్మాదులు

౧వ వివ 'లాట్టు-లూట్టు-లజి' అనునవి పాణినీయ సంజ్ఞాను సరణమునఁ గల్పితములగు సంజ్ఞలు తద్ధర్మాదుల కుదా తద్ధర్మ-వాని వృత్తి మొకలాలుఁడు కుండలు వానును తచ్ఛీల-ఆ వస్తువు స్వభావము జ్వలనజ్వాలలుప్పరం బెగయును సంభావన-ఊహము వాఁడచ్చటి కీపాటికిఁ జేరును సంప్రశ్నము నివు చదువుదువా॰ సాతత్యము-ఎల్లప్పుడు నుండునది పర్వతములు చలింప కుండును ఈశ్వరుఁడు సర్వంబున నుండును వర్తమాన నేనిప్పుడు వచ్చెదన నేనిప్పుడు వత్తును మేన నిప్పుడు పులకలు పొడమెడును ఆశీస్సు నీకు మంగళం బగును నీకుఁ గీడఁగున్ (ఇది శాపము) మొ భూతంబునను లాట్టు గన్పట్టును అన నతఁ డిట్లనున్ (ఇట్లనె నవి యర్థము) వచ్యర్థములందే కాదు "వి-దున్ (వింటిని)"-సభా-౨వ ఆ-౧౨౬-౧౬౪

౨ వ విప 'వచ్చెదను' ( ఎద ) అను రీతివె వర్తమానార్థకము లనియు, 'చదువుదును' ( దు ) అను రీతివె భావ్యర్థకములనియుఁ గేతనాదులు చెప్పిరి అది సరికాదు (మా-వ్యా-సం-౭౩౨౫ ౧౩౨౬ పుటలు) విజితేంద్రియుం డనఁగ నిమ్మనిఁ బాయక విందును (ఆది ౪ వ ఆ-౩౦)

సద్ధర్మ మార్గంబు నలుపు దయ్య (సభా-౧వ ఆ-౨౬) ఈ బిలము .చొరుండు
దీనిఁ గ| ప్పెద (ఆది ౨వ ఆ ३०)

ఆశీ శ్శాప సంప్రార్థన విధులందు లూట్టగు ౧౪ (బా-క్రి-౬వ సూ,వ్యా-
సం-౨౯౭ వి)

ఆశీరాదులందు ధాతువునకు లూడ్వర్ణకం బగు లూట్టను నది గల్పిత
సంజ్ఞయె "ఎడుమ-తన్" మొదలగునవి లూడాదేశములు (చూ-క్రి-३३వ
సూ) ఉదా నీకు దీర్ఘాయు వయ్యెడుమ నీకుఁ దీర్ఘాయు వగుతన్ నీవు
దీర్ఘాయు వగుము నీ వీ పని చేయునది మొ

వ్యతిరేకంబున 'లజీ' యగు ౧౫ (బా-క్రి-౭ వ సూ, వ్యా-సం-౨౯•
విష)

వ్యతిరేక విశిష్ట క్రియావృత్తి యగు ధాతువునకు 'లజీ' వర్ణకం బగు
ఇదియుఁ గల్పితమె పాణినీయము కాదు ఉదా వాఁడు వండఁడు మొ

## పురుష బోధక ప్రత్యయములు

లకారంబునకు 'డుజ్-రు, వు-రు, ను-ము ల్లగు ౧౬ (బా-క్రి-౨ వ
సూ-వ్యా-సం-౨౯౨ వి)

లడాది లకారంబులం దొక్కొక్కటికి 'డు' జాదు లాదేశంబు లగు
ఇందుఁ దుది 'ఞ' కారంబు ప్రత్యాహారార్థంబు (చూ సంజ్ఞా-౧వ సూ-వివృతి)

అందు వరుస రెండేసి ప్రథమ మధ్య మో త్తమంబు లనంబడు ౧౭ (బా-
క్రి-౯వ సూ, వ్యా-సం-౨౯౨ విష)

'డుజ్-రు' ప్రథమ పురుషము 'వు-రు' మధ్యమ పురుషము 'ను-
ము' ఉత్తమ పురుషము

వానిలో 'రు-ము'లు బహువచనంబులు, పెఱ లేక వచనంబులు ౧౮
(బా-క్రి-౧౦) నామ యుష్మ దస్మ దర్థంబు లందుం బ్రథమ మధ్య మో త్త
మంబు లగు ౧౯ (బా-క్రి-౧౧)

నామ మనఁగా యుష్మ దస్మ ద్భిన్నము అస్మ దర్థము కర్తగాఁ గల క్రియ యుత్తమ పురుషము యుష్మ దర్థము కర్తగాఁ గల క్రియ మధ్యమ పురుషము తక్కిన యేది కర్తయై యున్నను గ్రియ ప్రథమ పురుషము

అమహ దర్థంబునందు 'డుజ్-రు' లకు 'దు-వు' లగు ఉన్నాను బంధంబు మీఁద 'ది-వి' యగు ౨౦ (బా-క్రి-౧౨ వ సూ, వ్యా-సం-౨౯౯ విష)

'డుఙ్' ప్రత్యాహారములోని 'డుజ్-రు' అను ప్రథమ పురుష ప్రత్యయములు మహత్కర్తృకత్వముననె నిల్చును అమహత్కర్తృకత్వమున 'డుజ్జు' చోట 'దు' అనియు, 'రు' చోట 'వు' అనియు నిల్చును ఉన్నానుబంధంబు మీఁద 'డుజ్జు' చోట 'ది' అనియు, 'రు' చోట 'వి' అనియు నిల్చును

౧ వ వివ పై ప్రత్యయములకుఁ బురుష బోధక ప్రత్యయము లని పేరు తత్తత్పురుష బోధక సర్వనామ శబ్దముల తుది వర్ణములె పై ప్రత్యయము లని యెఱుంగునది ఉదా 'వాఁడు-ఁడు' 'వారు-రు' '-అది-ది' 'అవి-వి' మొ ప్రాచీన తమ కాలమున 'అది-అవి' అనునవి 'అదు-అవు' అను రూపములతో నుండెడి వనఁ దగును కాన వాని మూలమున 'దు-వు' ప్రత్యయము లేర్పడి యుండును మధ్య మోత్తమ పురుషములందు మహ దమహత్పక్షములు రెంటను 'నీవు-మీరు, నేను-మేము' అనునవే నిల్చును

## ఉన్నానుబంధ 'చు' శబ్దములు

ఉదంతంబునకు 'లట్టు' పరంబగునపుడు 'ఉన్న' అనునది యనుబంధమగును ౨౧ (బా-క్రి-౧౩ వ సూ, వ్యా-సం-౨౯౯ విష)

ఉదంతంబయిన ధాతువునకు 'లట్టు' పరంబగునపుడు 'ఉన్న' అను శబ్దం బనుప్రయుక్తం బగు

౧ వ వివ ధాతువులెల్ల సాధారణముగ 'ఉ' దంతములయియె యుండును అంగలాదులగు నచ్ఛిన్న శబ్దములును 'ఇంచు' గాగమ తోఁ గూడి 'ఉ' దంతములె యగు (క్రియా-౨వ సూ) కావున నెల్ల ధాతువులను వర్తమానమున

'ఉన్న' అను ననుబంధ మగును ఒక్క 'కలుగు' ధాతువునకాదేశంబగు 'కల' అనునది (క్రియా-౧౦౦వ సూ) మాత్రము 'ఉ' దంతము కాదు దానికి 'ఉన్న' అను ననుబంధము చేనేర దనుట కింద 'ఉదంతంబునకు' అను దళము చేర్పఁబడినది

౨వ వివ "ఉన్న" అనునది "ఉండిన" అను భూతార్థక విశేషణము నుండియె యేర్పడిన దనఁ దగును అట్లయినను "ఉన్న" అనునది వర్తమానార్థకముగా మహాకవులచే వాడఁబడినది దీనికి భూతార్థకత్వమె మహాకవి ప్రయోగములలో లేదు ఉదా వెలిగించుచున్న నృపపూజ్యులు (ఆది-౧వ ఆ-౨౧౭) గుణవంతు లగుచున్న కొడుకులు గలవాఁడు (ఆది-౧వ ఆ-౨౩) ఇష్టు, మగధేశ్వరుఁడు ఉన్నవాఁడు (సభా-౧వ ఆ-౧౬౧) నేఁడు. . రోహిణీయుక్తుఁడై శశాంకుఁ డున్నవాఁడు (ఆది-౫వ ఆ-౨౧౨) మొ

"ఉన్న" శబ్దంబు పరంబగు నపుడు "చు" వర్ణకం బగు ౨౨ (బా-క్రి-౧౪వ సూ, వ్యా-సం-౨౯౯ విష)

ఉన్నాబంధ మనక "ఉన్న" శబ్దం బనుటచేత (క్రియా-౩౬వ సూ) "ఉన్న" అను వర్తమానార్థక ప్రత్యయము పరమగునపుడును నీ "చు" వర్ణక మగు నని విశద మగుచున్నది ఉదా వండుచున్న యన్నము-వండుచున్నాఁడు మొ

"ది-వి" పరంబగు 'దళ్లు' పరంబగునపుడు "ఉన్న" అనెడి యనుబంధంబునకు దీర్ఘం బగు ౨౩ (బా-క్రి-౧౩, వ్యా-సం-౨౯౯ విష)

"డుఙ్" మొదలగు ప్రత్యయము లన్నింటికిని "డుఙ్" అనునది ప్రత్యాహార సిద్ధమగు సంజ్ఞ అమహదర్థక ప్రథమ పురుష ప్రత్యయములగు 'ది-వి' అనునవి 'దు-వు'లు కాదేశంబులుగా జేసి వానిని బృథక్కరింప వలసెను పయి రీతి గల ప్రక్రియచే నికి లఘ్రూపము లేర్పడుచున్నవి ప్రథమ వాఁడు వండుచున్నాఁడు - వారు వండుచున్నారు అమహదర్థ అది వండు చున్నది - అవి వండుచున్నవి మహత్ ఆమె వండుచున్నది - వారు వండు చున్నారు (చూ-ఆ ౧-౬౧ వ సూ) మధ్యమ నివు వండుచున్నావు - మీరు

వండుచున్నారు ఉత్తమ నేను వండుచున్నాను - మేము వండుచున్నాము ఈ యర్వాచీన సమాపక క్రియా రూపములు విధేయ విశేషణ రూపములుగఁ గొంత మార్పుతో నన్నయ తిక్కనలు వాడుదురు

## నన్నయ తిక్కనాదుల వర్తమాన రూపములు

౧వ వివ పైని సాధించిన రూపములలో "చేయుచున్న వాఁడను-చేయుచున్నవారము" మున్నగు నన్నయకాలపు రూపములలోని 'డ'కార, 'ర' కారములు లోపించిన యర్వాచీన రూపములె 'చేయుచున్నాను' మొదలగునవి ఇవి ప్రాచీన మహాకవి సమ్మతములని కాని, చింతామణి సాధ్యములని కాని భ్రమింపరాదు (చూ-సమా-౧౩వ సూ) నన్నయకాలరూపములు-ప్రథ వాఁడు చేయుచున్నవాఁడు-వారు చేయుచున్నవారు-అది చేయుచున్నది-అవి చేయుచున్నవి మధ్యమపురు నీవు చేయుచున్నవాఁడవు-మీరు చేయుచున్నవారరు ఉత్తమ నేను చేయుచున్నవాఁడను- మేము చేయుచున్నవారము నన్నయ కాలమున నివే సమాపక క్రియా రూపములును, విధేయ విశేషణ రూపములును తిక్కనాదుల కాలమునఁ బయి ప్రాచీన రూపములె కాక తచ్ఛబ్ద 'వ' కార లోపము గలవియు నుండెడివి ప్రథ వాఁడు చేయుచున్నాఁడు-వారు చేయుచున్నారు, అది చేయుచున్నది-అవి చేయుచున్నవి మధ్యమ నీవు చేయుచున్నాఁడవు-మీరు చేయుచున్నారు ఉత్తమ నేను చేయుచున్నాఁడను-మేము చేయుచున్నారము రంగనాథ రామాయణమునఁ బై యర్వాచీన రూపములుంట దాని వ్యావహారికభాషోపయోగ పరత్వమును వెల్లడించును అట్టివి ప్రాచీన మహా కావ్యములలో లేవు

౨వ వివ పయి రూపముల కెల్ల వ్యస్త రూపములును గలవు చేయుచున్ + ఉన్నవాఁడను-చేయుచు నున్నవాఁడను చేయుచున్ + ఉన్నాఁడను-చేయుచు నున్నాఁడను-చేయుచున్నాఁడను చేయుచున్ + ఉన్నాను-చేయుచు నున్నాను-చేయుచున్నాను మొ (చూ-సంధి- ౨వ సూ)

లిఙ్లోట్టుల డుఙ్ఞునకు 'ఎను-ను' ఎన్నఁడు లగు ౨౫ (బా-క్రి-౧౬వ సూ, వ్యా-సం-౩౦౦ వివ)

లిడాదేశంబగు 'డుజ్జు' నకు 'ఎను' అనునదియు, లాడాదేశంబగు డుజ్జు నకు 'ను' అనునదియు నాదేశంబు లగును

## భూత విశేషములు

భూతంబునం దిగాగమం బగు ౨౫ (బా-క్రి-౧౭, వ్యా-సం-౩౦౦ విష)
భూతార్థ వృత్తియగు ధాతువునకు 'ఇ' గాగమం బగు

లిట్టు వృత్తా పరంబగునపుడు 'తి' వర్ణకం బగు ౨౬ (బా-క్రి-౧౮, వ్యా-సం-౩౦౦ విష)

'ఇకారంబుమీఁది 'ను-ను-వు' క్రియా విభక్తుల' (తత్స-౨౬వ సూ) అను సూత్రముచే 'రజ్జు' నకు 'ఇ' త్వంబు ప్రథమ వండెను-వండిరి మధ్యమ వండితివి-వ-కితిరి ఉత్తమ వండితిని-వండితిమి, వండిన యన్నము-వండినన్ మొ

౧ వ వివ యకారము తుదిని గల కొన్ని ధాతువుల ప్రథమ పురుషైకవచనమున 'ఎను' అను దానిచో 'అను' అనునది బహుళముగా నిల్చుట కవి ప్రయోగ దృష్ట మగుచున్నది (చూ-వ్యా-సం - ౩౦౦ విష ౧౩౬-౨వ పుట) చం అ, యలె నిజశక్తి నా యనుచు నా పసకుణ (ఆము-౫వ ఆ-౧౩౩) శా అయ్యో నీ సుతు గ్రద్ద తన్నుకొనిపోయన్ (వేంకట-పంచ-౧వ ఆ) మొ

౨ వ వివ భవిష్యత్సామీప్యము మొదలగు కొన్ని యెడల భూతార్థ క్రియలు ప్రయోగింపఁబడుట గలదు ఉదా తా, వచ్చె సుదర్శ నాయుధుఁడు (భాగ - ౧౦వ స్క - పౌథ - క్రియా-౭) మానవ పతి నన్నేం కన్నడి, దానివు నీ వనియె నేని (వి-రా - ౧వ ఆ-౬౦) అదియేల యువనుణ మయెంన్ (అ ) - ౨వ ఆ ౨౧౬ సూ-నా-ప-౧౩౬౩ వ పుట) ఇచట 'అయెన్' అని ఎ రాని పవచు పెన్నెద్ది గణపిరి, నెమ్మితోడ దానిని చేయుట ధర్మపు (అద -౧వ ఆ-౪౩)

క్త్వా పరంబగునపుడు ధాతువు ఉత్వాంబన కత్వం బగు.

'కలజి-పడుజు'లు పరంబగునపుడు నుగాగమంబగు ౨౯(బా-క్రి-౨౧, వ్యా-సం-౩౦౧ వి)

ద్రుత కార్యంబు ప్రథమ వండఁగలఁడు - వండఁగలరు, వండఁగలదు-వండఁగలవు మధ్యమ వండగలవు - వండఁగలరు ఉత్తమ : వండఁగలను-వండగలము ఈ భావ్యర్థమందును (కాన్ - కన్) శబ్దము లనుప్రయుక్తము లగును (క్రియా ౧౧౯ వ సూ) వండఁగాఁ గలము - వండఁగఁ గలము

౧ వ వివ పము నుదాహరించిన రూపములలోఁ గొన్ని యర్వాచీనములు, ప్రాచీన సమ్మతములు కావు సమాపకక్రియలును విధేయ విశేషణములు నని నన్నయ కాలమున 'వండఁగలవాఁడను- వండఁగలవారము, వండఁగలవాఁడవు-వండఁగలవారరు, వండఁగలవాఁడు-వండఁగలవారు' అను రీతిని దచ్ఛబ్ద 'వ' కార ఘటితరూపములె యుండెడివి (చూ-సమా-౮౩వ సూ) తిక్కన నాఁడు పము రూపములె కాక 'వ' కార లోప రూపములును (వండఁగలవాఁడను- వండఁగలాఁడను - వండఁగలవారము-వండఁగలారము వండఁగలవాఁడు-వండఁగలాఁడు' మొదలగు రూపములు) బయల్వెడలినవి గెల్వఁగలారు (భీష్మ-౨వ ఆ-౧౧) ప్రాపింపఁగలారు (అను-౩ వ ఆ-౭౦ వ ప)-ఎఱ్ఱాప్రెగడ 'వండఁగలఁడు-వండఁగలరు' అను రీతిని ప్రథమపురుష మందుఁ బ్రయోగించెను 'చేయఁగలరు కలిం చుమని' (అర ౪ వ ఆ-౨౯౩) అమహాత్మ్యమున నెల్లరును "వండఁగలవు" అను రీతి వాడిరి ఇంకి "వండఁగలను-వండఁగలము-వండఁగలవు" అను నివి ప్రాచీనకావ్యములం దెంత మాత్రమును లేవు (చూ-వ్యా-సం-౩౨౧ పిపి ౧౩౬౯ వ పుట) ఇవి కేవలము నాధునిక రూపములు అర్వాచీన మహాకవి ప్రయోగ సమ్మతములును గావు

౨ ఇ పు 'వాఁడు-కలఁడు, కలవార-కలరు' అను ప్రాప్త్యర్థక 'కలుగు' ధాతు రూపములను నన్నయయే వాడెను కాని యట్టివి భవిష్యదర్థక రూపములలో నెంత మాత్రము ప్రాచీనులు వాడలేదు మగటిమ గలఁ

౨ వ విధ లాడర్థక రూప ప్రయోగములు వ్యా-సం-౧౩౭౫ మొ ౧౩౭౭ పుటలలోఁ జూడఁదగును. ఇందు లాట్లు భూతార్థ ప్రయోగములును గలవు (చూ-క్రియా ౧౩వ సూ, ౧౨ ఎప)

## మధ్యమ 'వు' లోపము

లిఙ్లాట్టుల వకారంబునకు లోపంబు ఒభాష నగు ౩౨ (బా-క్రి-౨౪ వ సూ, వ్యా-సం-౩౦౩ I విష)

వండితి-వండితివి వండుదు-వండుదువు-వండెదు-వండెదవు వండు + ఎద + (వలోప) ఉ-వండెదు

౧ వ విధ 'చనునె (అనుప్రయుక్త 'కొను') దొరకొనునె-ఉండునె' అను రూపములకు వర్ణలోపముచేత 'చన్నె-దొరకొన్నె-ఉన్నె' అను రూపాంతరములు గలవు (చూ-వ్యా-సం-౧౩౦౪ వ పుట, మా-సంధి-౨౧ వ సూ) మునీంద్ర నీకుఁ జన్నె (ఆది-౦ వ ఆ ౧౭౯) పుట్టకయున్నె (విరా ౧ వ ఆ-ప్రౌఢ-క్రియా-౨ వ సూ)

౨ వ విధ 'ఉండు' ధాతువునకిట్టి వర్ణలోప రూపములు స్థలాంతరములందును గలవు ఉదా ఉండునది ఉన్నది సీ దుర్జన యోధవరుల కడనుండకున్నది (ఆది ౩ ఎ ఆ ౨౦౬) నమ్మఁదగనివారి నమ్మకయున్నది (శాంతి ౩ వ ఆ ౨౩౯) ఉండునేనిన్-ఉన్నేనిన్ నడచుచున్నేని (శాంతి ౩ వ ఆ ౨౭౫), రహస్యంబుగాక యున్నెని (అను-౪వ ఆ ౪౨౨) ఉన్నన్-ఉండినన్ వర్షములేక యున్నన్ (ఉద్యో-౩వ ఆ ౦౨)

తిర్యగ్జడంబులు వాచ్యంబు లగునపుడు లిఙ్లాట్టుల ప్రథమ పురుష బహువచనమున కెకవచనం బగు ౩౩ (బా-క్రి-౨౫ సూ, వ్యా-సం-౩౦౨ విష ౧౩౭౯వ పుట)

చిలుకలు పలికెను, చిలుకలు పలుకును, చిలుకలు పలికెడును, చిలుకలు పలికెడిని మేఘములు గర్జిల్లెను మేఘములు గర్జిల్లును, మేఘములు గర్జిల్లెడును, మేఘములు గర్జిల్లెడిని

౧వ వివ కులము గలవాఁడు శౌర్యము। గలవాఁడును నధిక సేన గలవాఁడును భూ। తలమున రాజను నామము। విలసిల్లఁగఁ దాల్చు (ఆది-౬వ ఆ-౪౩)- ఇట్టి తిర్యగ్జదేతర కర్తృ స్థలములందుఁ బ్రత్యేకాన్వయమును జేసి, సమర్థించుకొన నగును శ్లో పాఞ్చజన్యం హృషీకేశో। దేవదత్తం ధనం జయః। దధ్మౌ (మహాభార- భీష్మపర్వ-భగ౧-౧వ అధ్యా) ఇట్టి ప్రత్యేకాన్వయ స్థలమ్ములు సంస్కృతము నందు సుప్రసిద్ధములు "చె। ప్పనివాఁడును సత్యము చె। ప్పనివాఁడును ఘోరనరకపంకమునఁ బడున్" (అది-౧వ ఆ-౧౩౭) *

## 'లూట్టు' రూపములు

లూట్టు ప్రథమ 'డుజ్-రు లకు ఎడుమ-తన్' అను వర్ణకము లాశీశ్శార్థములం దగును ౩౪ (బా-క్రి-౨౬, వ్యా-సం-౩౦౪-౩౦౪ I విష)

ఉదా పెక్కు తునియ లయ్యేడుమ (సౌ ప్తి-౨వ ఆ-౧౨౪, ఎడుమ-కళ) ప్రసన్నుఁడయ్యేడుమ (శాంతి-౪వ ఆ-౨౨౨) సీ నీబుద్ధి ధర్మైకనిష్ఠ గావుతను (అను-౩వ ఆ-౪౪౨) చేయుతన్ (రాఘ-౧వఆ-౨ కళా ౧వ ఆ-౧) 'ఈవుతన్-ప్రోవుతన్' అనునవి నిరాధారములు 'ఇచ్చుతన్-ప్రోచుతన్' అనునవి సుశబ్దములు 'నీ పూన్కి బుగ్గిగాను' (నీలా ౩వ ఆ) అనునది బుగ్గి 'గాతను' అనుదాని సంక్షేపరూప మెమో? వాసుకి మాకుఁ

---

* ఈ భారతపద్యము నుదాహరించి త్రిలింగలక్షణ శేషకర్త "మహ ద్బహుకర్తృ క్రియకు నేకవచనంబు విభాష నగు" (ప్రౌఢ-క్రియా ౬వ సూ) అని సూత్రించుట సరికాదు ముద్రణ సంస్కర్తలు "చె। ప్పనినాఁడును సత్యము చె। ప్పనినాఁడును ఘోరనరక" అని సవరించుటయు సరికాదు

బ్రసన్నుఁ డయ్యేడున్ (ఆది ౧వ ఆ-౧౦౬) అనురీతివి లాట్టుయొక్క ప్రథమ పురుషైక వచనరూపము లని యెఱుంగనగును *

లూణ్మధ్యమ 'వు-రు'లచో విధి ప్రభృత్యర్థ విశేషములందు ద్రుతపూర్వక మగు 'అది' శబ్దము నిల్చును ౩౫ (బా-క్రి-౨౭, వ్యా-సం-౩౦౪-౩౦౪ I వి)

విధి ఇచ్చునది ధనము పాత్రునకు (ఆది-౩వ ఆ ౨౦౪) ప్రార్థనము - కం ద్వారవతినుండియును నిట । యారసి యుండునది దానవాంతక.. (సభా-౨వ ఆ ౮౨) కం ఇమ్మనివరునకు నన్నుఁబ్రి । యిమ్మన నిచ్చునది (ఆర-౨వ ఆ-౩౩౨, వధువు తండ్రితో ననెడి వాక్యమిది) ఏమఱకుండునది (ఆది-౨వ ఆ ౧౮౧, హితముపదేశించు నప్పటి వాక్యమిది) మఱచునది(సభా-౨వ ఆ ౨౬౫ ధృతరాష్ట్రుఁడు తనపుత్త్రిల దుండగముల మఱవు మని ధర్మజునితోఁ బల్కినవాక్యము) 'ఉండునది' అనుదాని రూపాంతరము 'ఉన్నది' (చూ-క్రియా-౩౨వ సూ-౨వ వివ)

లూణ్మధ్యమ 'వు-రు' లకు ముడుజ్జు లగు ౩౬ (బా-క్రి-౨౯, వ్యా-సం-౩౦౫ I విష)

(ఆశీస్సు నీవు దీర్ఘాయువ ఎగుము మీరు దీర్ఘాయుల రగుఁడు శాపము రాక్షసుఁడ వగుము రాక్షసుల రగుఁడు సంప్రార్థనము నన్ను రక్షింపుము. నన్ను రక్షింపుఁడు విధి న చెప్పిన పనిచేయుము-నా చెప్పిన పనిచేయుఁడు

---

* సూరం "లూట్టు ఉజ్ఞానకు 'ఎడు-త' వర్ణకంబులు ద్రుతాంతంబు లగు (బా-క్రి-౨౬ సూ) అని యిట్లు 'ఎడు' వర్ణకమును విధించుట యవి వర్ణ ము కయు ప్రాచీన తాళపత్ర గ్రంథములందును నాశీ రాదులందు 'ఎడుము' గానంబడుచున్నది "డుమ కాతౌ కావుతాద్యాః" అని యథర్వణుడు పఠించెను (వ్యా-సం-౩౦౪ విష) "ఎడు-తల ద్రుతంబున కచ్చు పరంబగునపుడు మకారంబగు" (బా-క్రి-౨౮) అను మకారవిధి (సూరిగారిది) నిరాధారము

ఇందలి 'ము' వర్ణకమునకు లోపము పాక్షికము-రక్షింపుము-రక్షింపు (చూ- సంధి-౪౪-౪౩వ సూ) 'ఇందము-ఇంద'(ఇదిగో పుచ్చికొమ్ము) సూ-రా- నిఘంటువు దీని నవ్యయమ నెను 'ఇంద' ధాతురూప మనుట యుక్త మని తోఁచును

## ఉభయ కర్తృక ప్రార్థనము

ఉభయ ప్రార్థనంబున లూట్టునకు దుగాగమంబును * దాని యుత్వంబున కత్వంబు నగు ౩౭ (బా-క్రి-౩౦వ సూ-౩౦౬, వ్యా-సం-౩౦౬ I విష)

మనము వండుదము "ఇత్తరుణిఁ బరిగ్రహింతము (ఆది-౭వ ఆ-౨౧౩) చలుపుదమీ నిదాఘ దివసంబులు (ఆది-౦వ ఆ-౨౩౨)

౧వ వివ క్రియా-౯౪వ సూత్రము చొప్పునఁ 'బరిగ్రహింతము' మున్నగు చోటులందు 'త'కారము వచ్చె నని యెఱుంగునది ఉభయకర్తృకత 'ల' కారము అన్నిటియందును గలదు ఉదా మనము చేయుచున్నాము మొ లాట్టు దుక్కునకు దీనితో నెక్కుడు సంబంధము గన్పట్టును మనము చేయు దుము-మనము చేయుదము మొ "తరుణి మనకీ శాపములేకుండినచో మనమీ సమయమున భోగసక్తులమై యుండుదుము" అనుచో 'యుండుదము' అని నిల్పరాదు

## 'ము' వర్ణక ద్వైవిధ్యము

౨వ వివ 'పోవుదుము-పోదుము-పోదము-పోవుదము' మున్నగువాని లోని 'ము' ప్రత్యయ ముత్తమ పురుష బహువచన సంబంధి 'పొమ్ము-పొదము- పదఁము' మున్నగువానిలోని 'ము' ప్రత్యయము మధ్యమ పురుషైక వచన

---

* సూరి "ఉభయ ప్రార్థనంబున దుగాగమంబున కత్వం బగు" (బా- క్రి-౩౦)అని సూత్రించెను ఈతఁడు ప్రార్థనార్థంబున 'దు'క్కును విధింప లేదు ప్రార్థనార్థకము లూట్టె కాని లాట్టుకాదుగదా

సంబంధి ఈ మధ్యమ పురుష రూపములందును వచన ద్వయమునందును'దు' క్కును 'అ'త్వమును 'పోవు'ధాతువునకు వెలయుచున్నవి మఱికొన్ని యాచ్ఛిక ధాతువులకును బహుత్వమున నివి మహాకవి ప్రయోగదృష్టము లగుచున్నవి ఈ 'ద'కార మహిమచేత మధ్యమ పురుష ప్రార్థన క్రియలయందును నస్మదర్థ సాహిత్యము వెలయుచున్నది 'నీవు పోదము-మీరు పోదఁడు' అనువానినుండి ''నీవు వెళ్ళుము-మీరు వెళ్ళుఁడు-నేనును వచ్చెదను (లేదా) మేమును వచ్చెదము'' అను నర్థ విశేషము భాసిల్లుచున్నది ''పోవుము-పొమ్ము'' అను వాని కట్టి యర్థ విశేషభావము లేదు * ఇట్లు పోవు ధాతువునకే కాక 'వెదకు' మున్నగు నానికిని బహుత్వమున నిట్టి రూపములు ప్రయోగ దృష్టము లగుచున్నవి ఉదా వెదకుదండు-చూతండు ము (చూ-వ్యా-సం-౩౦౬ విష ౧౪౦౪ పుట చూ-క్రియా-౧౦౨వ సూ)

౩వ వివ ఈ క్రింది లజిరూపములు వెనుకటి సూత్రములచేతనె సిద్ధించినను నచట నుదాహరింపలేదు లకారముల వరుస చొప్పున నిట నుదాహరింపఁబడుచున్నవి క్రియా ౨౮వ సూత్రము చొప్పున 'అ'త్వము ప్రథమ వండఁడు-వండరు వండదు-వండివు మధ్యమ వండవు-వండరు ఉత్తమ వండను-వండము

మధ్యమ ము డుజ్జులు ముజ్జు నాఁబడు ౩౮ (బా-క్రి-౩౧, వ్యా-సం-౩౦౭-౩౦౭ I విష)

## వ్యతిరేక రూపములు

వ్యతిరేకంబున ముజ్జు పరంబగునపుడు కుజి యగు ౩౯ (బా-క్రి-౩౨, వ్యా-సం-౩౦౭-౩౦౭ I వి) నివు వండకుము-మీరు వండకుఁడు

---

* సూరి యిట్టి విశేషమును జూచికొనక ''పోవునకు దుజ్ముత్తులు యిట్టు పరంబగునపుడు 'వు' లోపంబుం 'బొద-పద'లును విభాష నగు'' (బా-క్రి-౫౮)-'పొమ్ము-పోదము' అని కలగాయ వులగముగా నుదాహరించెను ఇతర ధాతువుల బహుత్వమున నిట్టి రూపములు గల వని యాతఁడుగాని ప్రౌఢ వ్యాకర్తగాని చూచికొనలేదు

౧వ వివ 'మఱవకుము' అను దానికి బదులుగా 'మఱాకుఁము' అనియుఁ గవులు ప్రయోగించిరి చం అనుపమ సత్య విస్ఫురణ నాడిన మాట మఱాకు మన్న (ఉద్యో-౪వ ఆ-౭౦వ ప)

సంప్రార్థనంబున ముజ్ఞునకు 'అ-ఆ-ఇ-ఈ-అయ్య-అన్న-అమ్మ' మున్న గునవి విభాష నన్ప్రయుక్తములగు ౪౦ (బా-క్రి-౩౩, వ్యా-సం-౩౦౮-౩౦౮ I వి)

రక్షింపుమ (ఆది-౨వ ఆ-౨౧౭) చెపుమా (అది-౩వ ఆ-౧౩౫) చెప్పుమీ (ఆది-౨వ ఆ-౧౧౦) చెప్పకు మయ్య (అర-౩వ ఆ-౩౭౭) వినుమయ్య శమ ధనాగ్రణి (హరి-నలో-౨వ ఆ-౩౬) 'విను మయ్య' (నల పరార్థము), 'వినుము + అయ్యశమధనాగ్రణి' (హరిశ్చంద్రపరార్ధము)

వ్యతి రేకార్థక క్రియలమీఁద "ఎ-ఏ-ఒ-ఓ-అయ్య-అన్న- అమ్మ" మున్నగునవి నిల్చుటచే నవి ప్రార్థనాద్యర్థకము లగును ౪౧ (బాలలో లేదు, వ్యా-సం-౩౦౮-౩౦౮ I విష)

వేచినయది నన్నుఁ బంపవే ద్వారకకున్ (అశ్వ-౩వ ఆ-౩౫ ప యతి స్థలము) రావే యీశ్వర కావవే వరద (భాగ) పో - వన్న కు మార (ఉద్యో-౩వ ఆ-౩౪౮) పంపవే (పంపవు + ఏ)-పంపుము రావు + ఏ-రావే-రమ్ము కావవు + ఏ-కావవే-కావుము పోవు + అన్న-పోవన్న-పొమ్ము

## ఎ ఏ ల యోగము

'ఎ-ఏ'ల యోగమున వ్యతిరేక ప్రార్థనాద్యర్థక 'ము' వర్ణక 'ము'కార మునకు 'వ'కారాదేశ మగును ౪౨ * (బా-క్రి-౩౪, వ్యా-సం-౩౦౮-౩౦౮ I విష)

---

* సూరి పయిరీతిని సూత్రింపక ప్రార్థనాద్యర్థక ముజ్ఞునకు ఎదాదు లన్ప్రయుక్త మగునపు దేకత్వమున 'వుజీ'యు బహుత్వమున 'రుజీ'యు నిత్యముగా నగు నని సూత్రించి "వినవే-వినరే-వినకువే-వినకురే" అని యుదాహరించెను ఈ పక్షమున "వినుమయ్య శమధనాగ్రణీ (హరిశ్చంద్రనలో-౨వ ఆ-౩౬) మున్నగుచోట్ల 'ముజ్ఞు'నిల్వనేరదు ఎదాదులలో సూరి అయ్య-అమ్మ' అనువానిని బరించెను 'వినకురె' మున్నగు బహువచన ప్రయోగములు కవి ప్రయోగములందు లేవు.

ఉదా వినకుము + ఏ - వినకువే "అడ్డ పడకువే" (శాంతి-౩వ ఆ-౨౯౭) ఒందకుము + ఏ - ఒందకువే (ఉ-హరి-౫వ ఆ-౧౭) మదింపకువే (కళా-౩వ ఆ-౧౯౫)

౧వ వివ నామములును, క్రియలును యథాప్రయోగముగ 'ఆదాదుల'తోఁగూడి యర్థవిశేషముల నిచ్చుచుండును ఉదా నేనొక బ్రాహ్మణుండనే (ద్రోణ-౫వ ఆ-౩౨వ ప) వీ రెవ్వరయ్య ద్రుపదమహారాజులె (ఆది-౮వ ఆ-౯౦) నీవు చదివెదవా ? నీవు బ్రాహ్మణుఁడవా ? మొ ఆదాదులు చూడు క్రియా ౪౦వ సూ-వివ)

౨వ వివ అయ్యాదు లేక వచనాంతంబులయ్యు బహువచనాంత ములమీఁద సైతము నిల్చును ఉదా చెప్పుఁడయ్య (ఆది-౭వ ఆ-౨౦౭) చూచి వత్తమమ్మ సుదతులార (భాగ-౧౦ పూ భా, ప్రౌఢ-శబ్ద ౪౪వ సూ)

'చూచు' ధాతు ప్రార్థనాద్యర్థక సంక్షేప రూపములగు చుమ్ము-చుము (చూడుము)-చుండు-చుఁడు(చూడుఁడు) అనునవి ఎదాద్యను ప్రయోగమున "చూవె-చువ్వె (చూడవె)-చూరె(చూడరె)" అను రూపములనంది, యథాప్రయోగ ముగ నామములమీఁదను క్రియలమీఁదను నిల్చి యర్థవిశేష బోధకము లగును ౪౩ (బాలలో లేదు, వ్యా-సం-౩౦౮ II విష)

వచ్చెం జూవె-వచ్చెం జూరె-వాఁడుసూవె- వాఁడు సువ్వె (గసడదవా దేశము-చూ-సంధి-౧౪ వ సూ) ఇట్టి 'చూవె' మున్నగు చోటులు తప్ప మఱెచ్చటను ప్రార్థనాద్యర్థ మధ్యమ పురుషముపై ఎ-ఏ-లు నిల్చుటలేదు 'చూడు మే' మున్నగు రూపములు లేవని తాత్పర్యము

'వచ్చు' ధాతు ప్రార్థనాద్యర్థక సంక్షేపములగు "రా-ర-రారా-రార (రమ్ము)" అను శబ్దములు యథాప్రయోగముగ నామములపయిని క్రియలపైని నిల్చి యర్థవిశేష ద్యోతకములగు ౪౪(బాలలో లేదు, వ్యా-సం-౩౦౮ III విష)

'ఏమిర కర్ణ (ద్రోణ-౪వ ఆ-౨౮౮) కాదురోరి (కాదుర + ఓరి) భాస్క-యు) బళిరా (కళా-౧వ ఆ) ఏరా తమ్ముడ (పాండు ౩వ ఆ-౩,

ఏమి-రా-ఏరా) కానీరా (తారా-౩వ ఆ-౩౫వ పుట) ఔర-ఔరా (ఔను + ర, ఔను + రా)

౧వ వివ కోశకారులు "రా-ర" అనునవి యవ్యయము లనిరి ఈ "రా-ర" అనునవి పరమగు నపుడు పూర్వ స్థిత మధ్యను పురుషము యొక్క 'ఉ'కారము 'అ'కారమగు నందురు ఉదా "చేయరా (చేయుముర), పాలింపరా (పాలింపుముర) ఉ "ఏలర యీ చలం బుడిగి యేలర (ఏలర-ఏలుముర)" అని యుదాహరింతురు ఇట్టి చోటులనెల్ల బూర్వపదము "తుమున్నా" ద్యర్థక మనుట లెస్స ఉదా ఏలన్ + ర (రమ్ము)-ఏలర పాలింపన్ + రమ్ము-పాలింపరా సత్యము సుమ్మర కుంతి భాషణంబు (శాంతి-౧వ ఆ-౩౯)

మఱికొన్ని శబ్దముల జంటలును ప్రార్థనాద్యర్థ విశేష బోధకంబు లగు ౪౫ (బాలలో లేదు, వ్యా-సం-౩౦౮ IV V విష)

కానిమ్ము (కాన్ + ఇమ్ము) - కానీ-కాని ఏను నీ యింతి గాని యెఱుఁగ రన్యు। లు (ఆది ౪వ ఆ-౧౦౭) భూమి యీక తక్కిన మఱి కాని ముందొక కీడు దలంపఁడు (ఉద్యో-౨వ ఆ-౧౭౦) కానీరా యిటువంటి నీ తకములె (తారా-౩వ ఆ-౩౫వ పుట) ఉండనీ (ఉండనిమ్ము, కాశీ-౨వ ఆ) కాదా (కాదు + ఆ)-కదా-కద - కా (కళ) కద + ఏ-కదే వినఁగదయ్య (వినుము, ఆర-౬వ ఆ-౬౪). ప్రసాదింపఁగదే (గద + ఏ)-ప్రసాదింపుము (ఉద్యో ౩వ ఆ-౪౦౮) వచ్చితివిగదా నేఁడుగదా-నేఁడుగా (వసు-౩ వ ఆ-౫౫) వీఁడే కదా వచ్చితివఁటె-వచ్చితిరఁటె (అఁట + ఎ, అనుట-అంట-అఁట) వచ్చితిరటె (అటు + ఎ) వచ్చితివటయ్య మొ

'కదా-కద' మున్నగువానిపైని 'వె-రె' అనునవి నిల్చుటయుఁ గలదు చెప్పఁగదవె (చెప్పుము మనుచ-౨వ ఆ-౩౯) జయింపఁగదవయ్య (ఉ రా-౧వ ఆ-౭౮ జయింపుము) కూర్పఁగదయ్య (సారం-౨ వ ఆ-౧౭౦ కూర్పుము) అవధారు (అవధరింపుము, కవిప్రయుక్తము గాన ననింద్య గ్రామ్య మందురు, పొమ్ము-పో-నిశ్చయార్థకము చేయుఁబో (చేయును) అతఁడే పో (ఆతండే నిశ్చయము), అయొళె-అయటె (అయ్యొను గదా ఆము-౫ఎ ఆ)

# భావార్థక 'ట' వర్ణకము

'ట' వర్ణకంబు భావంబునం దగు ౪౬ (బా-కి౫-౩౫వ సూ, వ్యా-సం-౩౦౯ I విష)

భావం బనఁగా ధాత్వర్థంబు వండుట-పండుట-తినుట-కనుట మొ

౧వ వివ 'ట' ప్రత్యయాదులు కృత్తులలోఁ జెప్పఁదగిన వైనను సమాపక క్రియలందు వలెనె వీనియందును ధాత్వర్థీభూత వ్యాపార భానము వెలయుచుండుటచేతను, నివి సమాపక క్రియా ప్రత్యయముల వలెనె సర్వధాతు సామాన్యములగుటచేతను వీనిని గ్రియా ప్రకరణమునఁ జెప్పుట యుక్తమయ్యెను

'చేఁత-పోక-ఉంట' మున్నగువానియందును వ్యాపారార్థ భానము వెలయుచున్నను (ఈ "తజ్-క" మున్నగు ప్రత్యయములు) నివి సర్వధాతు సామాన్యములు కామింజేసి కృత్తులలోనె యుపదేశింపఁబడినవి

౨వ వివ టవర్ణక పరకత్వమున ధాతువు తుది 'ను' వర్ణము పాక్షికముగా బిందువగుట నన్నయేతర మహాకవి సమ్మతము ఉదా అనుట-అంట తినుట-తింట వినుట-వింట మొ

౩వ వివ 'చేయుకంటెన్' మున్నగునవి 'చేయుటకంటెన్' మున్నగువాని రూపాంతరములని యాధునిక వ్యాకర్తలు సూత్రించినను (ప్రౌఢ-క్రి-౧౪) నది ప్రాచీన సమ్మతము కాదు అవి 'చేయు దానికంటెన్' మున్నగువాని రూపాంతరములు (చూ-సమా-౮౩వ సూ, చూ-వ్యా-సం-౨౧౦ VIII విష)

౪వ వివ 'చేయుట' మున్నగువానికి రూపాంతరములుగ 'చేయుడు' మున్నగునవి కొన్ని కవి ప్రయోగములందుం దగపడుచున్నవి కం షడరత్ని ధనుర్ధరుఁడు చేయుడు (ఆది-౭వ ఆ-౧౬, చేయుడు-చేయుట) చం వడి ఓర్చుఁ డొక వావిరి బీరముగాఁ గరంబు చెప్పుడు నది (నన్ని-కు-౧వ ఆ-౧౭౭)

౫వ వివ భావార్థకము సముచ్చయ 'ను' శబ్దముతోఁ గూడి యానంత ర్యార్థమును బోధించుట సంప్రదాయము కం ఈ యగ్ని దేవు డసురకు। నోయన 'చెప్పుటయు' (చెప్పినతోడనె, ఆది-౧వ ఆ-౧౩౪, ప్రౌఢ-క్రియా-౧౨వ సూ) ఇట్టి స్థలములం దీ భావార్థక 'డు' ప్రత్యయము ధారాళముగ వాడఁ బడును [1] ఆ ముని యల్గి చూచుడును (ఆది-౪వ ఆ-౩౮) పిరా। టుం డాత్మ తనూజుఁ బొగడుడున్ (విరా-౫వ ఆ-౩౦౮, యతిస్థలము వ్యా-సం-౧౪౩౫వ పుట).

## 'అడ' ప్రత్యయము-భావార్థక నుడి

౬వ వివ 'అడ' ప్రత్యయాంతములును 'ఇంపు' ప్రత్యయాంతములును భావార్థకము లరుదుగఁ గలవు ఉదా కేరడములు (నరస-౨వ ఆ-౨౯) చావడము (ఉద్యో-౩వ ఆ-౬౧) పేలడములు- "కేరడములు-పాళగింపులు" (ఒడలు చూపుటలు, పాండు-౩వ ఆ-౪౩) నెలత్రావడములు (హరిశ్చంద్రన-౪వ ఆ-౪౩) ఆరగింపు (పర-౪వ ఆ-౧౯౯) అర్ధగింపు (ఉ రా-౧వ ఆ-౨౦౫) తాటింపు (పిన-శకుం-౧వ ఆ-౩౯) [2]

---

1 సూరి పయి విషయమును గ్రహింపక "ఆనంతర్యంబున 'డు' వర్ణ కంబు ద్రుతాంతం బగు" (బా-కి౧-౪౨ వ సూ) "జాబిలి తోఁతెంచుడుఁ గువలయంబులు వికసిల్లె" అని సూత్రించి యుదాహరించుట సరికాదు

2 సూరి ఈ సూత్రముక్రింద "కజివర్ణకంబు పురార్థయోగంబున విభాషను భావంబునం దగు"(బా-కి-౩౬వ సూ) వండక మునుపు (వండుటకు మునుపని యర్థము) మునుపు-ముందు-మున్ను-తొల్లి అను రీతివి పురార్థకములు'' అని సూత్రించి యుదాహరించెను ఇది సరికాదనియు వ్యతిరేక క్త్వార్థక 'కజి' కిది భిన్నము కాదనియు ముందు వివరింపబడును (క్రియా-౫౦వ సూ-౧-౨-వివరణ ములు)

వలయ్యాది క్రియలకుఁ గర్తయగు భావంబునందు 'నుజీ' యగు ౪౭
(బా-క్రి-౧౨-౨వ సూ, వ్యా-స౭-౩౦౯ I విష)

వలయ్యాది క్రియలకుం గర్తృభూత క్రియావృత్తి యగు ధాతువునకు 'నుజీ' వర్ణకం బగు ఉదా వాఁడు చూడవలయు-వారలు చూడవలయు-నీవు చూడవలయు-మీరు చూడవలయు-నేను జూడవలయు-మేము చూడవలయు-మనము చూడవలయు వలయు - కూడును-కూడదు-చెల్లును - చెల్లదు-తగును-తగదు-అగును-కాదు ఇత్యాదులు వలయ్యాదులు 'నాకుఁ జూడవలయు-మాకుఁ జూడవలయు' అని షష్ఠియు నగును

౧వ వివ ఇందలి కర్తృపదము షష్ఠ్యంత మగుట నన్నయ సమ్మతము కం పితృ సంకల్పము సేయఁగ । సుతుల కవశ్యమును వలయు (సభా ౧వ ఆ ౯౪వ ప) కాన యింక వేఁడఁగాదు నాకు (సభా-౨వ ఆ ౨౬౩) భావార్థక మగు 'నుజీ'చే నభిహితమైన కర్తకుఁ బ్రథమయు నగును దైవము తోడ్పడన్ వలయు (ఉద్యో ౩వ ఆ-౫౩) వినవలయు వాని నెల్లను । జననాయక వింటి వీవు (అశ్వ ౧వ ఆ-౮వ ప) ఈ నుజ్యంతమునకు సయితము 'కాన్-కన్' అనునవి యను ప్రయుక్తము లగును చేయఁగవలయున్ (సభా-౧వ ఆ ౯౪వ ప చూ-క్రియా ౧౧౯ వ సూ) ఈ నుజ్యంతముతో వలయ్యాదులు వ్యవహిత ముగా సైత ముండవచ్చును కం పితృ సంకల్పము సేయఁగ । సుతుల కవశ్యమును వలయు (సభా ౧వ ఆ ౯౪) ఈ నుజీ ద్రుతమునకు సంశ్లేష మును నగును దైవము తోడ్పడన్ వలయు (ఉద్యో ౩వ ఆ ౫౩) పెక్కు నుజ్యంతముల కొక్క 'వలయ్యాది' శబ్దము నిల్చుటయుఁ గలదు కం అగ్ని శిఖయుఁ బోలె నంటను డాయను । జూడరానియట్టి శుభ చరిత్ర (ఆర ౨వ ఆ ౯౧)

౨వ వివ ఒక్కొకయెడల వలయ్యాది యోగము లేకయె భావంబున నీ 'నుజీ' ప్రయోగింపఁబడుటయు నరుదుగఁ గలదు చం ఇతనికిఁ గూర్తురేని చేయఁ బాడియే (సభా-౨వ ఆ-౧౦౭ వ ప, చేయన్-చేయుట, పాడియే-నీతియా?)

౩వ వివ  భావార్థక నుజ్యంతముపైని 'పట్టి' వర్ణకము నిల్చుటయుఁ గలదు ఉదా  నీవు గల్గఁబట్టి (ఆర ౬వ ఆ ౬౧), కలుగంగఁబట్టి (కాశీ ౩వ ఆ ౪౪) దీనిచే నీ భావార్థకము మీఁద నితర విభక్తులు నిల్వవని విశద మగుచున్నది

౪వ వివ  చం అమలిన తారకా సముదయంబుల నెన్నను- పొందను ఈదను , విధాతృనకైనను నేరఁబోలునే (ఆది ౧వ ఆ ౧౯, చూ-కార-౧౩ వ సూ ) ఇత్యాది స్థలములందు సామర్థ్యార్థకయోగ చతుర్థిని బోధించు తుమర్థక క్రియలనియు నెఱుంగునది  మార్కొనఁ గావను శక్యమె (ద్రోణ ౫ వ ఆ ౩౫౩వ ప, మార్కొనుటకును గాచుటకును శక్యమా?)

## 'మిజి-ఇ' ప్రత్యయములు

వ్యతిరేక భావంబున మిజి యగు ౪౮ (బా-క్రి-౩౭, వ్యా-సం-౩౧౦-౩౧౦ I విష)

వ్యతిరేక విశిష్ట క్రియాభిధాయి ధాతువునకు ''మిజి'' వర్ణక మగును ఉదా  వండమి (వండకుండుట), పండమి (పండకుండుట) రక్షిం । పమి (ఆర ౧వ ఆ-౧౭౦) మృత్యువయ్యె యెసఁగు నొప్పమికి (హరి-పూ-భా-౪వ ఆ-౧౬౩  యతి ప్రాస స్థలములు)

సమాన కర్తృకంబులం బూర్వకాలమునందు 'ఇ' వర్ణకంబగు ౪౯ (బా-క్రి-౩౮ వ్యా-సం-౩౧౧-౩౧౧ I విష)

సమాన కర్తృకంబులగు క్రియలలోపల నెయ్యది పూర్వకాలంబగుఁ దద్వాచియగు ధాతువునకు 'ఇ' వర్ణకంబగు, ఇదియే క్త్వార్థంబు నాఁబడు ఉదా  వండి-పండి-విని-కని  ఈ సమాన కర్తృకత్వపు నిర్వాహమున కయి పెక్కుచోటులందు ''ఉండు'' ధాతురూపము లధ్యాహార్యము లగుచుండును ఉదా  కం  రాహుకంఠము దెగి దే । హము ధరణిఁబడియె  (ఆది-౨వ ఆ ౧౯) 'కంఠము దెగియున్న దేహము ధరణిఁ బడియె' అని సమాన కర్తృకత్వమును గ్రహింపవగును.

౧వ వివ  ఈ పద్ధతి సంస్కృతమందును గలదు "క్రియాణా మేక కర్తృకత్వే ఏవ క్త్వాచ్ స్యాత్  పుత్త్రం దృష్ట్వా సుఖంభవతి  ఇత్యాదౌ స్థితస్యేత్యధ్యాహా రాదేశ కర్తృకత్వే క్త్వాచ్" (ముగ్ధ-దుర్గా వ్యాఖ్య ౧౧౬౬ సూ, చూ-వ్యా-సం-౧౪౪౯-౧౪౫౦ పుటలు) *

౨వ వివ  ఆత్మనే పదార్థక 'కొను' ధాతు క్త్వార్థక రూప మగు (పట్టు) కొని మున్నగువానికిఁ బర్యాయములుగ "పట్టుక-పట్టుకు-పట్టుకొ-పట్టుకొన్" అను రీతిని నిల్పుట గలదు  ఉదా  మెడఁబెట్టు కొయ్యఁ దిరుగన్  హారంబులే భామినుల్ (శకుం-పరి-౭౦ వ పుట, చూ-క్రియా-౬౩వ సూ-౬ వివ) ఇట్టి ప్రయోగములు సాధువు లని విశ్వసింపఁదగదు

౩వ వివ  మిక్కిలు ధాతు క్త్వార్థకమగు 'మిక్కిలి' శబ్దము విశేషణముగ సయితము వాడఁబడు నందురు (శ ర)  వాని మిక్కిలి చేతులు-

---

* సూరి "చైత్రునిచేతఁ గొట్టఁబడి మైత్రుండు మడిసె" మున్నగు చోటులందు సమానకర్తృకత్వము కుదురు పడదనుచు "సమానాశ్రయములన్" అని సూత్రించెను (బా-క్రియా ౩౮వ సూ) కాని యీ సూరి సూత్రము నుత్యంతాది స్థలములం దతివ్యాప్త మగుచున్నది  ఉదా  చైత్రులచేతఁ గొట్టఁబడఁగా మైత్రుండు మడిసె "చైత్రునిచేతఁ గొట్టఁబడి యున్న మైత్రుండు మడిసె" అని యిట్లు 'ఉండు' ధాతు రూపాధ్యాహారముచే నేక కర్తృకత్వము గల్గుచునే యున్నది కాన నిట్టివాని సాధుత్వమునకై "ఒక్కొకచో భూతార్థ కాసమాపక క్రియ హేత్వర్థకంబు నగు  రాహుకంఠము దెగి దేహము ధరణిఁ బడియె (ఆది-౨వ ఆ-౧౯, ప్రౌఢ-క్రియా-౧౫వ సూ) అని ప్రౌఢవ్యాకర్త సూత్రించిన సూత్రము నిరర్థకము  ఇంక ననర్థకము నగుచున్నది సీ భీము గదాహతి భూమిఁ గూలి । యాతనిచేత సర్వాంగంబులందును గలుగు క్రొన్నెత్తురు కాంక్షఁ ద్రావఁ । బడి మఱి తెగటారి పడియున్నవాఁడు దుశ్శాసనుఁడు  (స్త్రీ-౨వ ఆ-౫౫వ ప) మున్నగుచోట్లఁ బ్రౌఢవ్యాకర్త చెప్పినట్లు హేత్వర్థక ము కుదురు పడదుగదా  పడియుండుటకు రక్తము త్రావఁబడుట హేతువుకాదు  గదాహతిచేఁ బడియున్న పిమ్మటనే యాతని రక్తము భీమునిచేఁ ద్రాగఁబడెను.

మిక్కిలి కన్నుల్ (సభా-౨వ ఆ-౨౬) 'మిక్కిలు' అను తద్ధర్మ విశేషణమునె నిల్పుట లెస్స

## క్త్వార్థక విశేషములు

'కజి' వ్యతిరేక క్త్వార్థంబునం దగు ౨౦ (బా-క్రి-౩౮ వ్యా-సం-౩౧౨ I విష)

వండక-పండక-కొట్టక-తిట్టక "వారు-ఉఱు" ధాతువులు వ్యతిరేకార్థములందె వాడఁబడును ఉదా వారని యలజడి (ఉద్యో ౨వ ఆ ౭౬) ఉఱఁడు సురేంద్రుఁడైన (ఆది ౭వ ఆ ౧౮౨)

౧వ వివ ఇది క్త్వార్థమునకు వ్యతిరేకమాత్రమే యగుటంజేసి యిందును సమాన కర్తృకత్వాది నియమము లావశ్యకములె కం సకల శాస్త్రార్థవిదునని మొనన్ మారొక్కననో । పక వలియం బాఱఁడె యా । ముకుందుఁడు (సభా-౨వ ఆ ౪౭వ ప వలియు-సన్నగిలు) ఆ వె చదువక యును నాకు సర్వవేదంబులు । సంభవిల్ల । వలయు (అర-౩వ ఆ-౨౨౪) 'చదువక' అనుదానికిఁ గర్త 'నేను' శబ్దము సంభవిల్లుటకుఁ గర్త సర్వవేదంబులు ఇట సమాన కర్తృకతకయి "చదువక యున్నను సర్వవేదంబులు సంభవిల్ల వలయు" నని 'యుండు' ధాతు రూపాధ్యాహారము చేయుటచే 'ఉన్నన్' అను దానితో సమాన కర్తృకత్వము సిద్ధించినది.

౨వ వివ ఈ రీతి 'నుండు' ధాతు రూపాధ్యాహారముచేతనే యీ క్రిందిరీతి గల ప్రయోగములును సిద్ధించును ఉ ఇనుండు పశ్చిమాం । భోనిధిలోనఁ గ్రుంగకయ మున్న ( సుచ-౨వ ఆ-౭౬) ఇట క్రుంగకయ మున్న" అనుచో "క్రుంగకుండుమున్న'' అని 'యుండు' ధాతురూపాధ్యాహారముచే సమాన కర్తృకత సిద్ధించుచున్నది కొన్ని యెడలని ట్లుండు ధాతురూపాధ్యాహారమక్కఱలేకయె 'యుండు' ధాతు ప్రయోగమే వెలయుచున్నది చం తునుముదు నెల్లి సైంధవునిఁ జోయజమిత్రుఁడు గ్రుంగకుండు మున్న నరవరేణ్య (ద్రోణ-౨వ ఆ-౨౮౧) *

---

* ఇట్లు 'ఉండు' ధాతు రూపాధ్యాహారముచే రూపసిద్ధి కల్గుచుండుటచేత "కజి వర్ణకంబు షష్ఠ్యర్థయోగంబున విభాషను భావంబునం దగు" (బా-క్రి-౩౭వ సూ) అను సూత్ర మనావశ్యక మయ్యె వండకమునువు-వండకుండు మునుపు మొ

# తుమర్థ భావలక్షణములు

తుమర్థ భావలక్షణంబులందు నుజీ యగు ౫౧ (బా-క్రియా-౪౦వ సూ, వ్యా-సం-౩౧౩-౩౧౩ I విష)

తుమర్థమందును, భావలక్షణమందును ధాతువునకు "నుజీ" వర్ణకం బగు సంస్కృతమందలి 'తుమ్' ప్రత్యయమున కర్థము తుమర్థము ఉదా తుమర్థము చైత్రుండు వండను బోయెను, పాకక్రియార్థము పోయె నని యర్థము భావలక్షణంబు నా నన్యక్రియకు లక్షణ భూతంబగు క్రియ ఉదా చైత్రుండు వండ నతిథి వచ్చెను (సంస్కృత "చైత్రే పచతి సతి అతిథి రాజగామ" దీనిని సంస్కృతమున "సతి సప్తమి" యందురు) ఇట వంట లక్షణము, వచ్చుట లక్ష్యము అతిథి వచ్చుట చైత్రపచనకాల మని యర్థము సీ ఈతఁడు వృద్ధని యెఱిఁగి పూజించితే వసుదేవుఁ డుండంగ వసుమతీశ (సభా-౨వ ఆ-౧౧) ఇందు 'ఉండన్' అనునది భావలక్షణార్థముగ నుపచరింపఁజేసికొన వలెను (ఇచట భావలక్షణార్థ మంత స్పష్టముగాఁ దోఁపదని భావము) పై పద్యమున సీసచరణములు నాల్గిటను నిట్టి భావలక్ష ణార్థక్రియలె యున్నవి

౧వ వివ 'చాలన్' అనునది చాలు ధాతు నుజ్యంతరూపమె యయ్యు విశేషణముగా సైతము వాడఁబడుచున్నది 'చాల-చాలా' శబ్దములు విశేషణత్వమునఁ గళలుగా నగపడును చాలకాలము (పాండు) చాల భరంబుగఁ బూనెన్ (అర-౭వ ఆ-౨౦౦) చాల మేలంద్రు (హరి-పూ-భా-౭వ ఆ-౭౪౬) చాలా (చాలన్?) గౌరవమొంద (హరి-పూ-భా-౬వ ఆ-౧౪౦) లక్ష్మీనారాయణ కోశమున 'చాల, చాలా' విశేషణములుగాఁ జూపబడెను

౨వ వివ తుమర్థ మనఁగా 'తాదర్థ్యార్థము' ఏ ధాతువు నర్థము రెండవ ధాతువు నర్థమునకుఁ బ్రయోజన మగుచుండునో యా ధాతువు పైని 'నుజీ' నిల్చును దీనినె తుమున్నర్థక మందురు తెలుఁగునందలి తాదర్థ్యార్థము సైతము సంస్కృతమునకన్న భిన్నమె (చూ-వ్యా-సం-౧౪౫౭వ పుట) "కృష్ణః భోక్తుం జగామ" (కృష్ణుఁడు భుజించుట కేఁగెను) అను చోటిఁసందువలెఁ దెల్గున మఱొక క్రియతో నేక కర్తృకత్వ ముండవలె నను నియమము లేదు (పయి

సంస్కృత వాక్యమున భుజించుటకును నేఁగుటకును గృష్ణుఁడే కర్త) తెల్లున 'ఈశ్వరుని మాఱొకన నీ శక్యమా' (నీకు శక్యమగునా) అనుచో మాఱొకను టకు నీవు కర్త అగుటకు శక్తి కర్త ఇట్లు భిన్నకర్తృకతయుఁ దెల్లున నుండును "కృష్ణుఁడు విప్రుని నన్నమును భుజింప నిమంత్రించెను" అను తెలుఁగు వాక్యమును సంస్కృతమున "కృష్ణః విప్ర మన్నం భోక్తుం నిమన్త్రి యతే" అని వచింపరాదు ఇది భిన్న కర్తృకస్థల మగుటచే 'తుమ్' ప్రత్య యము రాదు (విప్రుండు భుజించుటకుఁ గర్త, కృష్ణుఁడు నిమంత్రించుటకుఁ గర్త) ఇంక "కృష్ణః అన్న భోజనాయ విప్రం నిమన్త్రియతే" అని తాదర్థ్య చతుర్థినె నిల్పవలెను పైని వ్రాసిన "ఈశ్వరుని మాఱొకన నీశక్యమా" అను దానివంటి వ్యతిరేక సంక్షేప వాక్యాన్వయమున భిన్నకర్తృకత నియతమై యుండును ధారుణీ ప్రజకు ఉండఁగ, లావే (ఆది-౪వ ఆ-౨౪౯) కర్మ విపాకంబు గడవంగ లావె (ఆది-౬వ ఆ-౨౩౦)

౩వ వివ "ఎఱిఁగించు-ఎఱుఁగఁజేయు" మున్నగు ప్రేరణార్థక క్రియ లలో ఎఱుఁగుటకుఁ గర్త యస్మదర్థకము చేయుటగుఁ గర్త ప్రేరకుఁడు ఇట్టి వెల్ల భిన్నకర్తృకస్థల తుమర్థకములె

# చేదర్థకము

చేదర్థమునందును, నప్యర్థమునందును, భూతార్థమందలి భావలక్షణార్థ మందును ద్రుతాంతంబగు 'న' వర్ణకం బగు ౩౨ (బా-క్రి-౪౧)

చేదర్థయోగంబున భావివిలిట్టు విభాష నగు ౩౩ (బా-క్రి-౧౧౯ వ్యా-సం-౩౧౩-౩౧౪ 1 విష)

ఇట్టి ప్రత్యయము సంస్కృతమున లేదు కావునసే 'చేత్-అపి' మున్నగు పదము లీ యర్థమునందు వాడఁబడును ఉదా చేదర్థకం వినినఁ బరించిన వ్రాసినఁ గొనియాడిన దురిత పీకకుం దొలఁగు (శాంతి-౩వ ఆ-౩౭౨) అప్యర్థకం అడిగినఁ దిట్టినన్ మఱి మహా పరుషంబులు పల్కి యల్కతోఁ బొడిచిన నుత్తమ ద్విజులు పూజ్యులు (ఆది-౧వ ఆ-౧౩౯) భూతార్థ భావ

లక్షణ పయోధి రిక్త మై। నన్. కాలకేయులు బయల్వడి తోcచిరి (అర-౩వ ఆ-౩౯)

౧వ వివ 'నాcడు-ఏనిన్' మున్నగు శబ్దములును నీ యర్థములం దుప యోగింపcబడును ఆధునికులు 'చోన్-ఎడన్-ఎడలన్' మున్నగు శబ్దములను శైథిల్యము చేదర్థమున వాడుదురు నీ నేcడు పోవని నాcడు నిష్ఫలం బిమ్మహా యత్న మంతయు (ఆది-౧వ ఆ-౧౧౫) కం .దుశ్చరిత్రుcడై యహితుc డగు నేనిన్। మఱవక గురునైన...శాసించునది (ఆది-౬వ ఆ-౧౦౩) భావిని లిట్టు గీ. కడcగి సమబుద్ధి వీనికిc గల్గెనేని। కాదు శాప ఫలం బట్లు గాక బుద్ధి। హీనుcడై గర్వితుండగునేని శాప। హవ్యవాహ ఫలంబు వీc డనుభవించు (అర-౧వ ఆ-౧౦౩) ఇది 'ఏని' శబ్ద ప్రయో గోదాహృతియు నగుచున్నది కం ఇంతుల గోష్ఠి నున్న యత్తc। డెంత వివేకము గల్గెనేన్ని య। త్యంత మదాభిభూతుcడగు (ఆది-౭వ ఆ-౫౯) *

## 'చున్' వర్ణకము

చువర్ణకంబు ద్రుతాంతంబు క్రియాన్వయంబున వర్తమానార్థంబునం దగు ౫౪ (బా-క్రి-౪౩, వ్యా-సంc-౩౧౪-౩౧౪ I విష)

చూచుచుం బోవుచున్నాcడు చూచుచుం బోయెను చూచుచుం బోవc గలcడు భూత భావులందును 'చూచుచున్' అను పోవునప్పటి పరన వర్తమాన క్రియ విరుద్ధము కాదు క్త్వార్థకాదు లయిటును గ్రియతోనె యన్వయించుc గావc గ్రియా ఽకాంక్షా ఽసమాపక ము లనcబడును

౧వ వివ సంస్కృతమునందలి శతృ ప్రత్యయము వర్తమానార్థక విశేషణము ఇది సంస్కృతమున విధేయ విశేషణ మగుటచేతc గ్రియాన్వయంబును దీనికి సంభవించును శ్లో ప్రియః పతిః శ్రీమతి శాసితుం జగ। జ్జగన్నివాసో

* ఈ సూత్రమునందుc దర్వాత సూరి 'ఆనంతర్యంబున 'దు' వర్ణకంబు ద్రుతాంతం బగు'' (బా-క్రి-సూ-౪౨వ సూ) అని సూత్రించెను ఇది భావార్థక 'దు' ప్రత్యయమె యగుటచేత నీ సూరి సూత్రము ప్రామాదికము, ప్రత్యాఖ్యే యము (చూ-క్రియా-౪౬వ సూ ౪వ ౫వ వివరణములు)

వసుదేవ సద్మని। వసన్ దద ర్శాఽఽత్మ రస్త ముమ్బరా। ద్ధిరణ్య గర్భాఙ్గ భువం మునిం హరిః (మాఘకా-౧వ సర్గ-౧వ శ్లో) "హరిః వసుదేవ సద్మని వసన్ మునిం దదర్శ" (కృష్ణుఁడు వసుదేవుని గృహమున నివసించుచున్న వాఁడై మునిని జూచెను) అని యన్వయము సంస్కృతమందలి 'వసఞ్' అను శతృ ప్రత్యయాంతమునకుఁ దెల్గున 'వసించుచున్నవాఁడు' అను వర్తమానార్థక విధేయ విశేషణము పర్యాయము కాఁగా సంస్కృతమునఁ దెల్గు 'చున్' ప్రత్యయముఁబోలు వర్తమానార్థక లాక్షణికావ్యయమువంటి ప్రత్యయము లేదని చెప్పనగును దీనిని దెల్గున శత్రర్థక మనుట సరికాదు వర్తమానార్థక లాక్షణికావ్యయ మనఁ దగును ఇది తద్ధర్మాద్యర్థక విధేయ విశేషణము చోట నిల్పఁదగియు నుండును ఒక్కరుండ చనువాఁడు-ఒక్కరుండ చనుచు (ఆది-౧వ ఆ-౯౪వ ప)

## తద్ధర్మాద్యర్థక విశేషణాదుల యుదాహృతులు

తద్ధర్మాద్యర్థక* విశేషణత్వమున "ఎడు-ఎడి-ఉ" వర్ణంబులు పర్యాయంబున నగు ౫౫ (బా-క్రి-౫౪-౫౫వ సూ, వ్యా-సం-౩౧౬ I విష)

ప్రహరించెడువాఁడు-ప్రహరించెడివాఁడు-ప్రహరించువాఁడు-ప్రహర్త యని యర్థము

౧వ ఎవ 'డోస్తు భేదకతాపి స్యా' త్తను యథర్వాణుఁడు 'ఎడు' అను వానిని మాత్ర మంగీకరించినను నీక్రింది సోమయాజి ప్రభృతుల ప్రయోగములను బట్టి 'డి-ఉ' వర్ణకాంతములును నంగీకార్యములె కం ద్రౌపది। నట్టులు పఱిచెడిదే (ఉద్యో-౧వ ఆ-౩౪౪) నీయట్టివాఁడు నిస్సి। పోయెడిదే (విరా-౫వ ఆ-౨౦౬, 'పోయెడునదే' అన్నచో ఛందోభంగమగును) "వారియును

---

* తచ్ఛీల తద్ధర్మాద్యర్థములందును 'తృన్' ప్రత్యయము వైయాకరణ సమ్మత ము (చూ-ముగ్ధ-వ్యా-౯౯౦వ సూ దుర్గా-వ్యాఖ్య) 'తద్ధర్మ డోస్తు భేదకత్వాపి స్యాత్' (వ్యా-సం-౩౧౬ విష ౨౯౬ I విష)

వయించు।సితకృష్ణ తంతురాజిత తంత్ర మది" (ఆది-౧వ ఆ-౧౮౯, వయించు-వేయుచున్న) మనకుఁ జేయు దుండగములు (౫౧వ ఆ, చేయు-చేసిన) జనమేజయు చేయు సర్పయాగము (ఆది-౧వ ఆ-౧౩౧, చేయు-చేయఁగల-చేయనున్న) ఇట్టి తద్ధర్మాద్యర్థక విశేషణములు కాలత్రయ బోధకము లగును (చూ-ప్రౌఢ-క్రియా-౧వ సూ) ఇంకను ప్రయోగములు ధాత్రిఁ బరిభ్రమించు (ఆది-౧వ ఆ-౧౦౭) చం గొంతి మద్దుసేయు కొడుకు విరా-౧వ ఆ-౯౭) కం కడక మదీయాస్త్రము లనియెడు (ఆది-౭వ ఆ-౧౯౩) ఒక్కరుండ చనువాఁడు (ఆది-౧వ ఆ-౯౪వ గద్య, చనువాఁడు-చనుచున్న వాఁడై) ఇట్లే "చనువాఁడు" (ఆది-౧వ ఆ-౧౦౨వ ప)

## ఉన్న-కలజి-న వర్ణకాదుల యుదాహృతులు

'ఉన్న-కలజి-న' వర్ణకంబులు భవద్భావి శతృ-క్తవదర్థంబులం దగు ౫౬ (బా-క్రి-౪౬, వ్యా-సం-౩౧౫ II విష)

'ఉన్న' వర్ణకంబు వర్తమానార్థక శత్రర్థమునం దగు 'కలజి' వర్ణకము భవిష్యదర్థక శత్రర్థమునం దగు 'న' వర్ణకంబు 'క్తవ'దర్థంబునం దగు ఇవి సత్త్వాభిధానంబునం దగు నని యెఱుంగ నగు సుబంత వాచ్యంబు సత్త్వంబు నాఁబడును ఇవి ధాతుజ విశేషణము లగుటయు, విశేష్యభూత సుబంతంబునె యాకాంక్షించు ననియు, నక్కారణమున నివి నామాకాంక్షాసమాపక క్రియ లనియుఁ దాత్పర్యము ఉదా వండుచున్నవాఁడు (క్రియా-౨౨వ సూ చుపర్ణికము సమా-౮౨వ సూ-౨వ విప తచ్ఛబ్దానుప్రయోగము) వండఁగలవాఁడు (క్రియా-౨౮-౨౯వ సూ 'అ'త్వము, నుగాగమమును, సమా-౮౨వ సూ-౨వ వివ తచ్ఛబ్దాను ప్రయోగము) వండినవాఁడు (క్రియా-౨౫వ సూ. ఇగాగమము, సమా-౮౨వ సూ-౨వ వివ తచ్ఛబ్దాను ప్రయోగము)

౧వ వివ 'ఉండిన' అను భూతార్థకమునుండి యేర్పడినను 'ఉన్న' శబ్దము వర్తమానార్థకముగనే కవి ప్రయోగ సమ్మతము (చూ-క్రియా-౨౧వ సూ-౨వ వివ)

౨వ వి॰ మున్న వెలిగి-చుచున్న నృపపూజ్యుఁ (ఆది-౧వ ఆ-౨౧౭) 'ఉండుచున్న' అనరాదు క్రియా-౬౬ నొప్పున 'ఉండు' ధాతులోప మగు కాన 'ఉన్నవాఁడు' అనవలెను (సభా-౧వ ఆ-౧౬౧, ఆని-౭వ ఆ-౨౧౨, చూ-క్రియా-౧౼ సూ-౨, విస) కల-ఆరం౧౨ దీపమట్లతఁడు ఉండుం గాక యే నార్చెదన్ (కర్ణ-౩వ ఆ-౪౯) ఈఁగలవాఁడ నేను (సభా-౨వ ఆ-౧౭౪) 'న' వర్ణక చిచ్చువెట్టి కాఁ ల్చిన యని ... (ఉద్యో-౨వ ఆ-౧౪ వప)

వ్యతిరేక తద్ధర్మార్థములందు 'నిజీ' యగు ౫౭ (బా-క్రి-౪౭, వ్యా-సం-౩౧౭ I విష)

వంచనివాఁడు (క్రియా-౨౧వ సూ-అత్వము, సమా-౧౨వ సూ-౨వ ౧వ-తచ్ఛబ్దానుప్రయోగము)

'ఎడు' ప్రకృతి , ర్ణకాంతంబు లేదు౦ నామములతోడనే యన్వయించుఁ గాన నివి ధాతుజ విశేషణములు, క్రియాజన్య విశేషణములు, నామాఽకాంక్షాఽ ఃమాపకములు ననఁబడును

## కర్తృకర్మార్థముల వచ్చు 'ల' కారాదులు

లకారాదులు సకర్మకంబునకుం గర్తృకర్మార్థంబులందును, నకర్మకంబు ఁకుఁ గర్త్రర్థమాత్రమందును నగు ౫౧ (బాల-క్రి-౪౧, వ్యా-సం-౩౧౧విష)

సకర్మకంబునాఁ గర్మాకాంక్షోత్థాపకంబు, అకర్మకంబునాఁ గర్మాకాంక్షాఽ ఁుత్థాపకంబు ఆకాంక్ష యనఁగా వాక్యార్థబోధముకై పదము పదాంతరమునపేక్షిం చుట తెల్గున నకర్మకములకు భావార్థక తిఙంత రూపము లేదు సంస్కృతమున 'త్వయా-మయా-తేన భూయతే' అని యున్నట్లు తెల్గున 'నీచేత-లేదా నాచేత-వానిచేత ఉండఁబడెను-కాఁబడెను' అని యుండరాదు అసమాపక భావార్థకములు తెల్గునందును ధారాళముగా నుండును 'వాఁడుండుట-మీరగుట' మున్నగునవి యుదాహృతులు ఇట్టియెడలఁ గర్త యభిహిత మ బనన్ మెట్లును జెప్ప నగు

ననరాదు క్రియనిరాశ్రయ ముండనేరదు గాన నిట్టి భావార్థ కాదులందును నాభాస కర్తృత్వము నంగీకరించి కర్తకుఁ బ్రాతిపదికార్థ ప్రథమను జెప్పక తీరదు (చూ-క-ర-౩-౨వ సూ-౩వ వివ, వ్యా-సం-౨౬౫ II విష)

౧వ వివ సంస్కృతమందు వలెనె తెల్గునందును గొన్ని యెడల నర్థముల మార్పుచేత సకర్మకంబు లకర్మకము లగును అకర్మకములు సకర్మకము లగును ఉదా సకర్మ కిన్ను మూయదు నాకున్ (ఆర-౧వ ఆ-౨౬౦) ఆర్యుఁడు జయించుఁగాక (సర్వోత్కర్షచే వర్తించుఁగాక- జయతు జయత్వార్యః) అకర్మ వేఁటఁ బోయిరి (ఆర-౬వ ఆ) పొల మేఁగెను (వి-పు-౭వ ఆ, చూ-ప్రౌఢ-కార-౧౩వ సూ, చూ-వ్యా-సం-౩౧౮ విష)

పడుఙ్యనుబంధంబు కర్మంబునం దగు ౫౯ (బా-క్రి-౪౯, వ్యా-సం-౩౧౯-౩౧౯ I విష)

కర్మార్థంబునందు ధాతువునకు "పడు" ఙ్యనుబంధం బగును క్రియా-౨౮-౨౯ సూత్రములచే ధాతువుయొక్క 'ఉ'త్వమునకు 'అ'త్వమును, నుగాగమంబును నగును ఇందలి తిఙ్జుచేతఁ గర్మం బభిహితంబగును గాన నది ప్రాతిపదికార్థ ప్రథమాంతంబును, గర్తృవాచకము తృతీయాంతంబును నగును ఉదా మెచ్చఁబడునే (ఆది-౭వ ఆ-౫౦) రాజును బెద్ద దొరలును (మనచే) జీర లొలుపఁబడిరి (విరా-౫వ ఆ-౨౨౨) క్రియా-౫౮వ సూత్రమందలి యాది శబ్దము చొప్పున భావార్థకాదులును గర్మార్థమున వచ్చును ఉదా పడయఁబడిన (ఆది-౧వ ఆ-౭౨), పడయఁ బడుట మొ

౧వ వివ పడుఙ్యనుబంధ పరకత్వమందును 'కాన్-కన్' శబ్దము (క్రి-౧౧౯వ సూ) లనుప్రయుక్తము లగును ఉదా చేకొనంగఁ బడునేని (సభా-౨వ ఆ-౧౪౨), దహింపఁగాఁబడి (ఆర-౧వ ఆ-౧౯౮).

౨వ వివ రెండు మూఁడిటి కొక్కెడ 'పడు' ఙ్యనుబంధము నిల్చుటయుఁ గలదు కం వినఁ జూడంబడు నందెల్లను (శాంతి-౬వ ఆ-౨౮౫)

౩వ వివ "రాఁబడు-చొరఁబడు" మున్నగు నకర్మకస్థలము లందలి 'పడు' శబ్దము స్వార్థిక మనఁ దగును (క్రియా-౧౧౩వ సూ చూ-వ్యా-సం-౧౬౬౨ మొ ౧౬౮౨ వ పుటలు-ఘటక క్రియలు)

౪వ వివ సంస్కృతమున స్వార్థధాతువు సనాద్యంతమగుచు వివిధ ధాతువు లగుచున్నట్లె తెలుఁగునందును స్వార్థికధాతువు కర్మాత్మనేపద ప్రేరణార్థములచే వివిధ రూపములతో వివిధ ధాతువు లగుచుండును అవెల్ల స్వార్థిక ధాతువుల వలెనె లకారాది రూపముల నందును స్వార్థిక-వండు, ప్రేరణ-వండించు, ఆత్మనేపద-వండుకొను, కర్మార్థ-వండఁబడు, ప్రేరణాత్మనేపద-వండించుకొను, ప్రేరణకర్మ-వండింపఁబడు, ప్రేరణాత్మనేపద కర్మార్థ-వండించుకొనఁబడు మొ

## ఇయు డాగమము

గురు విరహితంబులయి, యయాంతంబులగు నేకస్వర ద్విస్వర సంస్కృత ధాతువుల కించుక్కు పరంబగునపుడును, ద్వి-త్రి-స్వరాచ్ఛిక ధాతువులకు 'ఎ'కారాది ప్రత్యయము పరమగునపుడును * 'ఇయు' డాగమము వికల్పముగా నగును ౭౦ (బా-క్రి-౫౦, వ్యా-సం-౩౨౦-౩౨౦ I విష)

---

* సూరి 'ఇంచుక్కు' పరమగునపుడును నాచ్ఛిక ధాతువులకు 'ఇయుట్టు' వచ్చు నని సూత్రించి "నగియించు-నగించు" అని యుదాహరించెను కాని యట్టి రూపమును నిర్వహించు మహాకవి ప్రయోగము లేదు ఇంచుక్కు పరమగునపుడు 'అన్వాదులకు' 'పు'గాగమ మగును (చూ-క్రియా-౮౧ వ సూ-౨వ వివ) కాన 'అనిపించు-తినిపించు' అను వాని వలెనె 'నగుపించు' అని యగును (పిరా-౪వ ఆ-౩౭, తాళపత్రమాతృక) ఇచట టిప్పణిలోని 'నగియించె' యనెడి పాఠాంతరము ప్రక్షిప్తము అప్పకవిమతమున 'కింజుక్' పరకత్వమున 'ఇయుట్టు' ప్రాచీన ప్రామాణిక గ్రంథములందు విశ్వసింపఁదగిన ప్రయోగము లేదు 'తెగియించు' అని సూ రా నిఘంటువున నర్వాచీన కవి ప్రయోగముఁ జూపఁబడెను ''తెగ(యి)ంచు-అ-క్రి. ఉ ఎంతకు నేర రంత తెగియించినవా రధి యున్నదేకదా !'' (శుక-౪వ ఆ-౨౮, సూ-రా-ని)

సంస్కృ-ఏకస్వర, భుజియించు-భుజించు (భుజ్ + ఇయ్ + ఇంచు). * ద్విస్వర గుణించు-గుణియించు (గుణ + ఇయ్ + ఇంచు) ఇట్లె-స్తుతియించు-నుతియించు మొ (నన్ని-కు-౨వ ఆ-౨౩౨ మొ ౨౩౮ వఱకు పద్యములు) ఇంచు గవ్యవధానంబునంజేసి సంస్కృత ధాతువులు 'ఎ'కార పరకము లుండ నేరవు 'యాచ్-అర్థ' ఇత్యాది ధాతువులు గురుమంతంబులు గాన వానికి 'ఇయుట్టు' రానేరదు 'వ్యయ' అనునదియాంతము గాన దానికిని 'ఇయుట్టు' రానేరదు యాచించు-అర్థించు-వ్యయించు మొ "జి + ఇంచు-జయ్ + ఇంచు" (చూ-క్రియా ౩వ సూ) అనునదియు యాంతంబె ఇట నిత్యంబగుటంజేసి 'అయు'గాగమంబు రాంగా యాంతంబగుటంజేసి 'ఇయు'డాగమంబు రానేరదయ్యెను "పరనిత్యాన్తరఙ్గాపవాదానా ముత్తరోత్తరం బలీయః కృతాకృతప్రసఙ్గి నిత్యమ్" అని నిత్యత్వ లక్షణ మరయునది ఇయుడాగమంబు చేసినను చేయకున్నను "అయు" గాగమంబు వచ్చుటకుఁ బ్రతిబంధము లేదనియు, 'అయు'గాగమంబు చేసిన పిదప యాంతంబగుటచే 'ఇయు' డాగమంబు రానేరదనియు 'అయు'గాగమ నిత్యత్వమును బరిశీలించునది ఆచ్ఛికధాతు కొనియెను-కొనెను (కొను + ఎను) కొనియెదను-కొనెదను (కొను + ఎదను) ఇట్లె కొనియెడును-కొనెడును అనియెదను-అనెదను అనియెను-అనెను మొ ఇట్లె నగియెదను-నగెదను పడియెను-పడెను ఇడెదను-ఇడియెదను (సభా-౨వ ఆ-౩౦, చూ-వ్యా-సం-౧౫౦౮వ పు) క్రుమ్మరియెదను-క్రుమ్మరెదను త్రిమ్మరియెడు, త్రిమ్మరెడు (ఆది-౭వ ఆ-౩౮-౩౯ ప) భారతమున 'కొనెను-అనెను' అనువానివంటి 'ఇయుడా'గమ రహిత రూపములు 'న' వర్ణాంత ధాతువులందుఁ గన్పట్టలేదు 'కనెనంట' అనునది పిన వీరభద్రుని శృంగార శాకుంతలములోనిది (౯౫౬ పుట) ఇది నన్నయ భారతములోని దనెడి యప్పకవి

* సంస్కృతము వ్యంజనపరకము గురువు కాదు కాని 'భుజ్' అను దానిలోని 'భు'కారము గురువు కాదు ఇది సంస్కృత ధాతువు గానఁ దెలుఁగు సంప్రదాయము చొప్పున వ్యంజనపరకము గురువని భ్రమింపరాదు (చూ-అచ్చి-౩౦-౩౧ సూ-౨౯ వివ వ్యా-సం-౧ విస్త-౩౦ IV విష)

ప్రాఁత (౧వ ఆ ౧-౨౯-౧౩౦) సరికాదు 'కొనెను' మున్నగువాని నర్వాచీన కవులు ధారాళముగాఁ బ్రయోగించిరి

౧౨ వివ సంస్కృత ధాతువులు ప్రాది శబ్దపూర్వకము లయినను వానికి 'ఇయు'డాగమము వచ్చుట గలదు "సీ చదలేఱు పాఱెడు జాడ యుత్తరియించి - ఇత్యాది శ్రీనాథాది కవీనాం వచనాని ప్రామాదికాని" (అహో ౪౧౭వ పుట) అను నహోబల పండిత వాక్యము సరికాదు. ప్రతిఘటియించు (శృం-నై-౪వ ఆ-౯వ ప), సంభరియించు (కాశీ-౩వ ఆ-౧౭౪), ప్రతివసియించు (కాశీ-౨వ ఆ-౧౭)

## ఇడ్వాదుల నవర్ణకంబున కత్వము

ఇడ్వాదుల 'న' వర్ణకంబున కత్వంబును, గడహల్లునకు ద్విత్వంబును విభాష నగు ౬౧ (బా-క్రి-౫౧వ సూ, వ్యా-సం-౩౧౫ IV విష)

సంధి-౪౩వ సూత్రపు పడ్వాదులు వేఱు ఇందలి పడ్వాదులు వేఱు కావున నిట పడ్వాదు లనక 'ఇడ్వాదు'లనుట లెస్స ఇందలి 'న' వర్ణక మనఁగా భూతార్థక విశేషణ 'న' ప్రత్యయమును (క్రియా-౫౬వ సూ), చేదాద్యర్థక 'న' ప్రత్యయమును (౫౭ వ సూ) నని యెన్నునది ఉదా ఇడు + ఇ + న (క్రియా-౨౫వ సూ) ఇడ్ + డ్ + ఇ + అ-ఇడ్డ-ఇడిన. అంతటను సంధి ౧౨వ సూత్రము చొప్పున నపదాది నిత్యసంధి నెన్నునది పడ్డను-పడినను 'ఇడు-పడు-చెడు-అను-కను-కొను-తిను-మను-విను-చను' ఇవి యిడ్వాదులు * ఇందలి 'పడు' ధాతువు పతనార్థకమును బ్రాప్త్యర్థకమును నని యెన్నునది పతన చెట్టునుండి పడ్డవాఁడు ప్రాప్త్యర్థ భయపడ్డవాఁడు మొ ఇట్లే అనిన మాట-అన్నమాట అనినన్-అన్నన్ మొ దీర్ఘపూర్వక 'ను' వర్ణాంతముల కిట్టి

---

* సూరి పడ్వాదులలో 'తగు' ధాతువును బఠించెను "తగ్గపని" అను రీతి గల వ్యావహారిక ప్రయోగ మాత్రమే దీనికిఁ గలదుగాని మహాకవి ప్రయోగము లేదు గాన దీని నుపేక్షించుట లెస్స

స్థితి లేదు మానిసి-మానినన్ మొ శరణన్నఁ గాచుచు (ఆది-౧వ ఆ-౭),
పలిలేఁడనఁ బడ్డ కాంత (కర్ణ-౩వ ఆ-౨౨౪)

## 'కొను' ధాతు పరకత్వమున 'ఇ' గాగమము

క్రియాఫలంబు కర్తృగామి యగుచోఁ గొనుధాతు వనుప్రయుక్తం బగు ఉ-౨ (బా-క్రి-౫౨వ సూ వ్యా-సం-౩౨౧-౩౨౧ I విష)

ఇదియే యాత్మనేపదార్థంబని వ్యవహరింతురు **ఉదా : వండుకొను** చున్నాఁడు

౧వ వివ '౫౬వ సూ-౪వ వివ' చొప్పున 'కొను' ధాత్వంతములగు రూపములును లకారాదుల లన్నిటిని నందుచు సమాప కాసమాపక క్రియారూపముల నందుచుండును

కొను ధాతువు పరంబగునపు డిగాగమంబు బహుళంబుగా నగును ఉ-౩ (బా-క్రి-౫౩వ సూ, వ్యా సం-౩౨౧-౩౨౧ I విష)

వండికొనియెన్-వండుకొనియెన్ వండించుకొనియెన్-వండించికొనియెన్ మాన్చికొనియెన్-మాన్చుకొనియెన్ సీ తే॥ గీ॥ మ। దీయ పుత్త్రికుఁ డనుచు నెత్తికొని రనఘ (అను-౩వ ఆ-౧౫౦) ఇట్లిత్వము రాని పక్ష మందలి యతత్స్థాన ప్రయోగము ప్రాచీన ప్రామాణిక గ్రంథములందలిది । ఖింప లేదు బహుళం బనుటచేత యాంతధాతువులకు నిత్యంబు-చేసికొనియెన్

౧వ వివ ఏకర్మకంబున నాత్మనే పదార్థక ప్రయోగము లేదు అట్టి యెడల 'కొను' ధాతువు స్వార్థికమె యని గ్రహింపవలయును (చూ-క్రియా-౧౧౩వ సూ)

౨వ వివ 'కొను'ధాత్వనుప్రయోగము లేకున్నను నాత్మనే పదార్థ మరుదుగఁ గన్పట్టుచున్నది కం ప్రత్యక్షము గావించె నుగ్రతపముఁ జేసెన్ (ఆర ౩వ ఆ-౪౭, గావించెన్-గావించికొనియెన్)

# 'కొన్-కొ-కు-క' అనునవి యుపేక్ష్యములు

౩వ వివ ఆత్మనే పదార్థమ న ననుప్రయుక్త మగు 'కొను' ధాతు క్త్వార్థక రూపములు 'కొని' అనుటకు మాఱుగా "కొన్-కొ-కు-క" అను నాకార ములతో నర్వాచీన కవిగ్రంథములందుఁ గన్పట్టుచున్నవి చం పుత్త్రిని వెంటఁ బెట్టుకొన్ (పట్టాభిరామా-వేంకటరామకృష్ణకవి ౨వ ఆ ౪౨, శశిరేఖాపరి-వేంకట రంగకవి-౪౩వ పుట) కం ఇచ్చిన మచ్చికఁ బుచ్చికొ। యచ్చెలి మెచ్చుచు (దశా-౪౨వ పుట) మ... మెడఁబెట్టు కొయ్యఁ దిరుగన్ (పెట్టుకు + ఒయ్య, శకుంతలాపరి ౧౦వ పు బాలక ౧౧౩ మొ ౧౯౦ వ. పుటలు)

౪వ వివ యాంతధాతువులకు 'ఇ' త్వములేని ప్రయోగములును నర్వా చీన గ్రంథములందుఁ గన్పట్టును సీ బలు తోలు కుళ్ళాయిపై నిన్ప గొల్సును, జుట్టి జందెంబు వేసుకొని విల్లు। (రంగరాట్ ఛం)

౫వ వివ క్త్వార్థమునందే కాక 'ట' ప్రత్యయాంతాది స్థలములందును నిట్టి ప్రయోగ మధునాతన గ్రంథములలో నగపడుచున్నది ఉ వ్రాసుటకుం జతుర్భుజవిలాసము . (ప్రాసస్థలము, రాజరాజ పట్టాభిషేకము ౫౦౦వ పుట అంగర నృసింహకవి) సుందరుఁ డింపుతోడఁ గలసుం బలసూదన...ద్రౌపదీ పరి అల్లమరాజు రామకృష్ణకవి, ఆం-భా-అ-ప్రయోగవిశేష ప్ర ౨౭వ సూ) ఇట్టి ప్రయోగములు సామాన్య కవిగ్రంథములందుఁ గన్పట్టుచున్నను మహాకవు లనఁదగువారి గ్రంథములందుఁ బ్రయుక్తము లని విశ్వసింపఁ దగియున్న స్థలము లందలి ప్రయోగములలో నగపడమింజేసి యుపేక్ష్యము లనఁదగును

౬వ వివ ప్రాచీన ప్రామాణిక గ్రంథములం దిట్టి ప్రయోగము లున్నచో నవి ముద్రణ సంస్కర్తలచేఁ బ్రక్షిప్తము లనఁదగును కవి ప్రయుక్తము లని విశ్వసింపదగిన ప్రాసాది స్థలములందు మహాకవు లెచ్చటను నిట్టివ్రాసిని వాడ లేదు కాన నట్టియెడల 'చు' ప్రత్యయమ[illegible] కవి ప్రయుక్త మని విశ్వసింపఁ దగును 'దిసంతలు గొట్టుకు' (ఆ[illegible]-౬[illegible] ఆ [illegible]) అనుచో "దిసంతులు గొట్టుచు మోచు చేగుచో" అని కవి ప్రయుక్త మనఁదగును ఇట్లే 'కం, సౌరిది

క్షకారము గూడుక। సరి' అనుచో 'సొరిది క్షకారము గూడుచు। సరి' (అనంతుని ఛందో) అని కవిప్రయుక్త మనందగును ''కం చండగతి నేఁగి యీడ్చుక। రండిప్పుడు'' అనుచో "చండగతి నేఁగి యీడ్చుచు। రండిప్పుడు (మార్కండేయపు)" అని కవిప్రయుక్త మని విశ్వసింపఁదగును (చూ-క్రియా ౪౯వ సూ ౨వ వివ)

## యకారము సకారమగు చోటులు

ఇంచు, కృత్తద్ధితప్రత్యయములు తప్పఁ దక్కిన ప్రత్యయముల మొదట నున్న 'ఇ-ఎ-ఏ'లు నిల్చునపుడు ధాతువు తుది యకారము సకారమగును ఉ॥ (బా-క్రి-౫౪, వ్యా-సం-౩౨౨ I విష)

చేయు చేసిరి-చేసి-చేసినది-చేసినన్-చేసికొను - చేసెడిది - చేసెడునది

మొ కం చే। సితి వారల కిట్లు నిష్కృతి సేయుట లగ్గే (సభా-౨వ ఆ-౧౮౬) కం చే సమరికొంచు . । డాసిన.. (ఆది-౬వ ఆ-౨౦౬) సీ వేసవి వడగాలి నోసిన (నన్ని-కు-౩వ ఆ-౮౯౭ నోయు-నొచ్చు) ఇంచు కృత్తద్ధితప్రత్యయముల కన్నవో చేయించు-చేయి-కూయి-వ్రాయి (అక్షరము)-అలయిక మొ

'చు' వర్ణకంబు పరంబగునపు డన్వాదుల కుత్వలోపం బైన 'ను' స్థానంబున బిందు వెని విభాష నగు ఉ॥ (బా- కి-౫౫, వ్యా-సం-౩౨౩ I విష)

అన్చున్నాఁడు - అంచున్నాఁడు-అనుచున్నాఁడు (క్రియా ౨౨వ సూ) అన్చును-అంచును-అనుచును (క్రియా ౫౬వ సూ) 'అను-కను-కొను-తిను-మను-విను' ఇవి యన్వాదులు

౧వ వివ 'చను' మొదలగునవి యన్వాదులలోనివి గావు 'చన్చును-చంచున్' అనరాదు

౨వ వివ ప్రయోగ ఆ వె అంచుఁ బ్రీతిఁ గౌఁగిలించికొనియె (సభా-౨వ ఆ-౨౯౧) శా ప్రాంచద్భూషణ . । అంచుం దోచె (మనుచ-౨వ ఆ-౬౮)

'ఉన్న' శబ్దంబు పరంబగునపుడు 'ఉండు' ధాతువునకు లోపంబగు ౬౬ (బా-క్రి-౫౬, వ్యా-సం-౩౧౫ III విష)

ప్రథమ ఉన్నవాఁడు-ఉన్నాఁడు, ఉన్నవారు-ఉన్నారు ఉన్నది-ఉన్నవి మధ్యమ ఉన్నవాఁడవు-ఉన్నాఁడవు, ఉన్నావు-ఉన్నవారరు-ఉన్నవారు-ఉన్నారరు-ఉన్నారు ఉత్తమ ఉన్నవాఁడన-ఉన్నాఁడను-ఉన్నాను ఉన్నవారము-ఉన్నారము-ఉన్నాము (క్రియా-౨౧-౨౩ సూ ౧వ వివ ౫౪-౫౬ సూ, సమా-౦౩వ సూ)

౧వ వివ 'ఉన్న' శబ్దపరకమగు 'ఉండు' ధాతులోపము నిత్యమగుటచేత 'ఉండుచున్న వాఁడు-ఉండుచున్నాఁడు' మున్నగు రూపము లసాధువులు విధాన సామర్థ్యముచేత 'ఉండు' ధాతువు లోపించినను దానిమీఁది 'ఉన్న' అను నను బంధము లోపింపదయ్యె నని యెఱుఁగునది

చేదాద్యర్థ నాంతంబయిన 'ఉండు' నకు 'ఉన్నా' దేశంబు విభాషనగు ౬౭ (బా-క్రి-౫౭, వ్యా-సం-౩౧౫ III వి)

ఉన్నను-ఉండినను కం ఇందెంతకాల మున్నను మనక। య్యేదు లాభ మేమి ? (ఆది-౭వ ఆ-౨౬ చూ-క్రియా ౨౧వ సూ ౨వ వివ) 'ఉండు చుండినను-ఉండుచున్నను' అనునవి అపశబ్దములు

## 'తి-డు-ట' పరకత్వమున 'అన్వాదుల' రూపములు

'తి-దు-ట' లు పరంబులగునపు డన్వాదుల 'న' స్థానంబున నెఱసున్నయు నుండు 'డు' లోపంబును విభాష నగు ౬౮ (బా-క్రి-౫౦వ సూ, వ్యా-సం- ౩౨౪ I విష )

అందురు-అనుదురు అంట-అనుట ఉందురు-ఉండుదురు ఉంట-ఉండుట ఇత్యాది 'తి' వర్ణక పరకత్వ ముత్తరసూత్రమున నుదాహరింపఁబడును,

౧వ వివ అన్వాదులలోనివి కామింజేసి 'చను', 'పూను' మున్నగు ధాతువులపట్ల నిట్టి విధులు గల్గనేరవు చనుదురు,చనుట మొ 'చందురు-చంట' అని యుండనేరవు 'అను-కను-కొను-తిను-మను-విను' అనునవి యన్వాదులు (చూ-క్రియా-౬౫వ సూ) ఉ. .చత్తురో మందురొ మానవేశ్వరా (ఆది ౧వ ఆ ౪౬) కం విందు (ఆది ౬వ ఆ ౫౬) ఆ వె .....చే। కొందరయ్యె (ఆది-౭వ ఆ-౧౯౩) 'ఉంట' అను రూపమును దిక్కన-యజ్వ వాడెను గాని నన్నయ వాడఁడు ఉ బంటుతనంబు .అడ్డమాడ రా।కుంట (ఉద్యో-౩వ ఆ-౫౯) సున్న రానవుడు అనితిని-జనితిని మున్నగురీతినె యుండును అట్లె 'ఉండితిని' అనియే యుండును

ఇట బిందువుమీఁది 'త-ద' లకు నిత్య వైకల్పికంబులై 'ట-డ' లగు ౬౯ (బా-క్రి-౫౯, వ్యా-సం-౩౨౪ II విష)

అంటివి-అనితివి అందురు-అండురు ఉంటివి-ఉండితివి ఉందురు-ఉండురు 'ఇట' అనుటచేత నీ విధి ప్రకృత 'తి-దు-ట' వరకత్వమందు మాత్రమె చెల్లును 'పంతము-ఆందము--పోషింతురు' మున్నగు నితర స్థలము లందు వర్తిల్లదు నిత్య వైకల్పికంబులై యనఁగా 'ట'త్వము నిత్యముగాను 'డ'త్వము వికల్పముగాను నగునని యర్థము

## 'ఉండు'డు లోపవిషయము

౧వ వివ నన్నయ 'ఉండు' 'డు' లోపమును ప్రయోగింపబడు 'ఉండితిని-ఉండుట' అనియే ప్రయోగించును 'ఉందురు' మున్నగుచోట్ల 'ఉండురు' అనురీతిని బాక్షిక 'డ' త్వమును (అందురు-అండురు విందురు-విండురు మొ) నన్నయ ప్రయోగింపఁడు 'ఉండు' ధాతువునకు 'ఉంటిని' అను రీతిగల 'ట'త్వమును దిక్కన గ్రంథము లందును బ్రాసాదిస్థలములందుఁ గాన రాదు వెదకి నుదాహ... 'ఉంట' అను చోటి 'డు'లోపమును మాత్రము తిక్కన ప్రాసస్థలముననే ప్రయోగించి యున్నాఁడు 'ఉందురు' మున్నగుచోట్ల 'ఉండురు' అను రీతి గల పాక్షిక 'డ'త్వమును దిక్కన ధారాళముగాఁ బ్రాసాది

స్థలములందుఁ బ్రయోగించెను ఉ ఎండకు. ఆ। కొండును (విరా-౧వ ఆ-౧౩౫, కిందండము కాషాయింబు। ఎ। ట్లొండేని (శాం౫-౬వఆ-౧౭౮) తే గీ విండు నారాయణ పరాయణుండు (అను-౪వ ఆ-౩౭౪) అండేని-అందు వేని (విందును-విండును చూ-వ్యా-సం-౧౫౭౬వ పుట)

౭వ వివ 'ఉండుదురు' మున్నగువానిలోని 'డు' లోపించిన 'ఉందురు' అనురీతి గల ప్రాసాదిస్థల గత ప్రయోగము తిక్కన భారత మందును లభింప లేదు గాని యాతఁడు 'ఉందురు' అను దానినుండి యేర్పడిన 'ఉండురు' అను దానిని బ్రయోగించుటచేత నట్టి తిక్కయజ్వ 'ఉందురు' అను 'డు' లోప రూపముల నంగీకరించె ననక తీరదు "ఉందురు" విదుర యుయుత్స (ఆశ్ర-౧వ ఆ-౩) ఏయుచుందు(ను)-(భీష్మ-౩వ ఆ-౩౧౧) ఇట్టి వానిలో 'ఉండురు' అను రీతిని నవలంబించను 'ఉందురు' అను రీతి గల రూపముల నాతఁ డంగీకరించె నని యైనఁ జెప్పకతీరదు 'ఉందురు' అను రీతి గల రూప ములనుండి కదా 'ఉండురు' అను రీతి గల రూపము లేర్పడవలయును ద్విపద. ఉందురే. । సందేహ (రంగ-రా- కిష్కిం- ౨౫౪వ పుట యూని-ముద్ర) అందు పై । ఉందు రాచోటును (రంగ-రా-కిష్కిం-౨౫౬వ పుట- యూని-ముద్ర)

౩వ వివ 'ను' వర్ణాంత ధాతువులందు (అన్వాదులందు) మాత్రము నన్నయ తిక్కనాదులెల్ల నుఁ మీఁది 'తి' వర్ణమును 'టి' వర్ణముగా నిత్య ముగా వాడిరి కం మంటి హనదేహ మంటిం। గంటి (ఉర-౧వ ఆ-౩౩౪) కం వింటే । కంటే (ఆప-౧వ ఆ-౨౮)

## ముజ్ పరక 'కొను' ధాతు రూపములు

ముజ్జు పరంబగునపుడు 'కో' శబ్దంబు కొనునకు బహుళంబుగా నగు ౩౦ (బా-క్రి-౬౦, వ్యా-సం-౩౭౫ విష)

బహుళంబ టచేత దీర్ఘ ప్రాగ్నాకచో నటచారం బని యెఱుంగునది అనఁగా ముజ్జు పరమగునపుడేకా, జీక్షలలోని వ్యతిరేకార్థకములు, ముజ్యంత

ములు మున్నగునవి పరమగు నపుడును యథాప్రయోగముగ నీ యాదేశము విభాష నగు నని తాత్పర్యము భారతేతర గ్రంథములందే యిట్టి యాదేశ మగు నని యెఱుంగునది మ 'తుది రాజ్యమ్ము సగమ్ము గొమ్ము' అనుచో నన్నయ 'క్రో' అను నాదేశమును బ్రయోగించె ననరాదు అచట "తుది రాజ్యమ్ముం గొమ్ము" అనునది కవిప్రయుక్తము శబ్దాలంకారప్రియుఁగు సంస్కర్త లట్లు ప్రక్షిప్తము చేసిరని యెఱుంగునది "ము-డుజ్జు"లు ముజ్జు నాఁబడు (చూ-క్రియా- ౩౦వ సూ)

ముజ్జు పరంబగు నపుడు దీర్ఘంబునకు హ్రస్వంబును, ఋవర్ణకంబునకు **మాముడియు** నగును ౭౧ (బా-క్రి-౬౧, వ్యా-సం-౩౨౫ విష)

ఆత్మనేపదార్థక స్థలములందును, శబ్దపల్లవ స్థలములందును 'కొను' **ధాతువునకు** వ్యస్త స్థలములందు వలెనె యిక్కార్యంబులు గల్గు నని యెఱుంగు నది **ఉదా** ఆత్మనే చదివికొమ్ము - చదివికొనుము - చదివికొమ్మ చదివి కొండు - చదివికొనుఁడు (సంధి-౨౨వ సూ అడుసున్న రాదు) శబ్దపల్లవ కైకొమ్ము - కైకొనుము - కైకొన్మ కైకొండు - కైకొనుఁడు చేకొండు (బసవ-౭వ ఆ-౫౬౭) వ్యస్తస్థల కొనుము - కొమ్ము - కొమ్మ కొనుఁడు - కొండు గీ వీఁడు గొమ్మని (ఉ హరి-౫వ ఆ-౧౪౬) కొండని వేడ్కతో (శృం-నై-౧వ ఆ ౫౧) అతివారము కామును జీరికెఁగొని (హరి-౪వ ఆ-౩౨) ముదిమి కోఁజాలము (విష్ణు-౬వ ఆ-౧౭౭, గాణ-క్రియా-౩౯౨ కారి-౫౦ విష) ద్వి కర్మంబు త్రావ్మ దా..కోఁదగునె (బసవ ౧వ ఆ-౬౩౫)

౧వ విష 'కొను' ధాతుస్థలమందే కాక స్థానాంతరములందును నీ విధి వర్తిల్లును (తే-రా-కా మొ) తెమ్మ - తెండు, రమ్ము-రండు, కమ్ము-కండు మొ (చూ-క్రియా-౯౫ మొ)

౨వ విష వ్యతిరేక ప్రార్థక స్థలములందు 'కొను' నకు 'కో' కన్పట్టెగు కొనకుము-కొనకుఁడు-చేకొనకుము మొ

వృష్టిని గురిపించిరి ఇది య ప్రేరణార్థంమును నగును ఉదా వర్షము కురిసెను ఇట్లె కరఁగు - కరఁగించు కరఁగు - ద్రవించు మెఱయు - మెఱయించు మెఱయు - ప్రకాశించు ఆఁగు-ఆచు ఆఁగు-నిల్పు ము ప్రయోగ కం శితశర। పరంపరలు గురిసె (విరా-౩వ ఆ-౧౪౩)

౩వ వివ ధాతువు నుజ్యంతముపైని 'చేయు' ధాతువును నిల్పినచో నది ప్రేరణార్థము నిచ్చును ఉదా కొల్చు-ప్రేర కొల్వఁజేయు-కొల్పించు చం .. నిన్నుఁ గొల్వఁ జె। యుదు నని పూని (ఉద్యో-౩వ ఆ-౨౭౦వ ప)

## రంజాదుల 'ఇల్లు'

రంజాదుల యించు (స్వార్థ) కృదాదంబునకు నబిందు కంబున క ప్రేర ణంబున ద్విరుక్త లకారం ఒగు ౭౪ (బా-క్రియా-౭౦, వ్యా-సం-౩-౨౭-౩-౭ I వివ)

రంజిల్లు (అనురాగిల్లు), భేదిల్లు (భిద్దంగు), సందిల్లు (కూడు) * ఈ యాదేశపు యోగమున బిదాదు లకర్మకంబు లగును రాజు పాలనమున జనులు రంజిల్లిరి ప్రే-రాజు పాలనముచే జనుల రంజి పెను-రంజిల్లఁజేసెను గోడ భేదిల్లెను ప్రే-పిడుగు గోడను భేదించెను-భేదిల్లఁ జేసెను 'భిద్' ధాతువు సంస్కృతమున సకర్మకమై యంయ్యుఁ ఉక్తముక్వయును కర్మక మయ్యెను

ప్రేరణేంచుకు ప్రకరణగు నపు రంజాదుల 'ఇంచుక'నకు లోపం బగు ౭౩ (బా-క్రి-౭౨-వ్యా-సం-౩-౨౭-౩-౨౭ I వివ)

---

* నన్నయ 'కంపిల్లు (కదలు)-కంపించు-కంపిల్లఁజేయు' అను రీతి సిద్ధ మమున జేసికొన్నను నన్నయేతరు లట్టి నియమమును బాటింపలేదు కావున 'కంపిల్లు' మున్నగువానిని 'రంజా'దులలోఁ జేర్పలేదు కం ఘూంచినఁ జప్పుడు విని కంపించు శరీరములు (నన్ని-కు-౭ ఆ-౩-౨౯)

లాదేశమున కపవాదము రంజించు (రంజిల్లఁజేయు), భేదించు — (భేదిల్లఁజేయు), సంధించు (సందిల్లఁజేయు) ఇట ''రంజింపించు'' అని కాని, రంజిల్లించు' అని కాని యుండనేర దని భావము

౧౪వ వివ అ ప్రేరణమున 'రంజిల్లు' అనియుఁ, ప్రేరణమున రంజించు' అనియుఁ నుండెడి నియమము మిక్కిలి యరుదు తఱుచుగా 'ఇల్లు—ఇంచు'అను వానిని బర్యాయములనుగాఁ వాడుదురు నియమము — నన్నయ కం వల్లె యని । దిశల్ భే । దిల్లంగ గర్జిల్లి . (ఆది-౬వ ఆ-౬౫) కం తన సుతులు పాండు సుతు లని । మనమును భేదింపక ... (ఆది-౫వ ఆ-౧౬౨) నియమమును వీడి 'వర్తిల్లు—వర్తించు' అనునవి పర్యాయములుగా వాడుట సీ నిషధాదియం దనిమిషపతి ప్రచ్ఛన్న। సంచరణమున వర్తించుటయును (విరా-౧వ ఆ-౫౪) గీ .మందడీల । కెల్ల నూఱట యగుచు వర్తిల్లనేర్తు (విరా-౧౨ ఆ-౯౫) ఇక్కన 'వర్తించు' అనుదానిని ప్రేరణార్థమున 'వర్తిల్లఁజేయు' ఇను నర్థమున వాడకపోలేదు సీ పదపడి విప్రులు . । అధ్వరాదిక సత్క్రియల్ ప్రవర్తింపక (శాంతి-౨వ ఆ-౧౯ ప్రవర్తింపక - ప్రవర్తిల్లఁజేయక)

౨వ వివ 'వర్తిల్లు' మున్నగువానికిఁ బర్యాయముగ 'వర్తిలు' అనునేక లకారఘటిత రూపములను తిక్కన ప్రయోగించెను * ఆ వె పాటిలినఁ జూచి పెద్ద వలచి యైన (అను-౨వ ఆ-౨౩౧వ ప)

౩వ వివ 'మూర్ఛిలు' మున్నగువానికిఁ బర్యాయముగ 'మూర్ఛించు' మున్నగు 'ఇంచు' గంతముల ప్రయోగము కానరాదు అట్లె 'వర్షించు-ఉద'

---

* సూరి 'పాటిలు' మున్నగు నేక లకారఘటితరూపముల నేల యుదాహరింపలేదో తెలియదు "తత్రోభయోర్భవే దేకో । లకార ఇతి కేచన'' అని యథర్వణుఁడును నద్దానిని సూత్రించి యున్నాఁడు బాల-ప్రకీ-౭వ సూ చే లకార లోపము రాకపోదు

ఉదయించు-అస్తమించు' మున్నగువానికిఁ బర్యాయములుగ "వర్షిల్లు-ఉదయిల్లు-అస్తమిల్లు" మున్నగు ప్రయోగములును గానరావు

## ఇంచుగర్థక 'చు'గాగమము

'చు' గాగమం బాచ్ఛికంబున కసంయుక్త 'న-ల-డ-రా'ంతంబునకుం బ్రేరణంబున బహుళంబుగా నగు ౭౬(బా-ప్రక్రి-౭౫, వ్యా-సం-౩౨౮ 1 విష)

పూను-పూనుచు-పూనించు తేలు-తేలుచు-తేలించు మగుడు-మగుడుచు-మగిడించు కుదురు-కుదురుచు-కుదిరించు "విను-వినుచు-వించు" వక్ష్యమాణ (క్రి-౧౧వ సూ) పుగాగమంబు-వినిపించు బాహుళకంబుచేఁ గొన్నిటికి 'చు' గాగమంబు లేదు అను-అనిపించు తిను-తినిపించు కను-కనిపించు దీని యత్వంబునకు దీర్ఘంబు నగు కానిపించు

౧వ వివ 'కాంచు' అనునది 'కను' ధాతు ప్రేరణరూప మనుట యుక్తము 'కాన్పుము' (ఉద్యో-౧వ ఆ-౨౭౦) 'రాముఁడు గృష్ణుని గాంచెను' అం చో 'కాన్పుము' అను చోటియుండు నెనె 'కృష్ణుఁడు లక్ష్మిఁ గాంచునట్లు రాముఁడు చేసెను' అని ప్రేరణార్థము నెన్ననది (చూ-వ్యా-సం-౧౫౫౮౦౨ పుట)

౨వ వివ "అపేక్షి-విదుర(రాలు) ప్రే-విదురుచు (రాలఁజేయు, - పే-పదుకు త్వరపడు) ప్రే-పదుచు(త్వరపడఁజేయుచు)" అను రెండును ప్రేరణార్థకములు ప్రకృత సూత్రమునకు లక్ష్యములె ఆచ్ఛిక శబ్దముల పయిని 'ము' వర్ణకము నిల్పినచో నవి కొన్నియెడల ధాతువులగును (చూ-క్రియా-(౨ [illegible]) ఉదా ఎదురు(ఎదుటివాఁడు) ఎదురుచు-ఎదిరించు, వ్యా-సం-[illegible]) చెమరు(చెమట) చెమరుము(చెమటపట్టు) చిగురు-చిగురుచు ([illegible]) కొన్ని ధాతువుల పై స్వార్థమందు 'ము' వర్ణకము చేరును ఉదా [illegible] ము 'అగురు-అగురుచు' అననవి పర్యాయ రూపములు [illegible] 'ము'కార [illegible] కావుననె యది [illegible]త్పరకత్వమున 'వ'కార

మగును * అద్రువన్ (ఆది-౫వ ఆ-౧౨౪) 'అదిర్చి' అనునదియు నప్రేరణ రూపమే యని తోఁచును 'మిన్నదిర్చెఁ' (ద్రోణ-౫వ ఆ-౩౭౩) 'పఱచు' (పరుగెత్తు) అను దానిలోని 'చ'కారమును నావయవికమె కావుననె 'వారణ, వ్రాతము లుజ్జగించి పఱవన్' (హరి-పూ-౩వ ఆ-౧౨౬) అని యిట్లు ముత్పర కత్వమున వకారము వచ్చెను 'పడు' ధాతుప్రేరణ రూపమగు (క్రియా ౧౫వ సూ) 'పఱుచు' ధాతువునకు రూపాంతరముగఁ గోశకారులు వాడిన 'పఱచు' అనుదానిలోని 'చ'కారము 'చు'గాగమ సంబంధి కావుననె 'పఱపకుమయ్య' (పొందింపకయ్య, అరణ్య-౫వ ఆ-౧౩౩వ ప)

## ప్రేరణార్థక 'పుక్కు'

అట్లు పుగాగమంబును మాన్వాదులకగు ౭౭ (బా-క్రి-౭౪వ సూ, వ్యా-సం-౩౨౮ 11 వ విష)

అట్లు-ఆరీతిగా, నవఁగా నాచ్ఛికంబునకుఁ బ్రేరణంబున బహుళంబుగా 'చు'గాగమంబును 'పు'గాగమంబును నగు నని సూత్రార్థము ఉదా మాను-మానుపు-మానుచు మను-మనుపు-మనుచు బాహుళకం బగుటచేత 'మను' ధాతువునకు 'ఇంచు' గాగమము లేదు, 'మాను' ధాతువునకు 'ఇంచు' గాగమ రూపంబును గలదు మానించు మానింపఁగ (కర్ణ-౩వ ఆ-౧౪౦) "మేలుకనుపు-మేల్కొనుపు(భాస్క-బాల-౩౩౮) మేల్కొలుపు-మేలుకొలుపు''అను వానియందు 'పు'క్కు నిత్యము చుక్కును-ఇంచుగాగమమును లేవు

''చుక్-పుగ్వ''ర్ణకంబులు పరంబులగునపు డిత్వంబునకుత్వం బగు ౭౮ (బా-క్రి-౭౫, వ్యా-సం-౩౨౮ IIIవ విష)

---

* 'అదురుచు-అద్రుచు' అను చోటి (బా-ప్రకీ-౨౦వ సూ) చకారమును ప్రేరణార్థక 'చు'గాగమ సంబంధిగా 'పద్రుచు-విద్రుచు' అను వానిలోని చకారమువంటి దానినిగా సూరి సూత్రించుట సరికాదు 'అద్రుచు'లోని చకార మావయవికము ''పద్రుచు-విద్రుచు''లలోనిది ప్రేరణార్థకము ''ఎద్రుచు''లోనిది స్వార్థిక చుగాగమము

అవ్యవహిత పూర్వస్థోకారమునకే యని తెలియవలెను ఉదా బిగియు-బిగుచు కలియు-కలుపు మొ

అట్లు చుక్పుగాగమంబు లడంగ్వాది మాయ్వాదులకగు, నగుచో వానికడ ప్రాలు లోపించును ౪౬ (బా-క్రి-౩౬, వ్యా-సం-౩-౨౮ III విష).

అట్లు-ఆచ్ఛికంబునకుఁ బ్రేరణంబున బహుళంబుగా నగును అడంగ్వాదులకు 'చు'క్కును మాయ్వాగులకు 'పుక్కు'ను నగుననియు వాని తుది వర్ణము లోపించుననియు నర్థము అ ప్రే-అడఁగు, ప్రే అడఁచు-అడగించు అ ప్రే మాయు, ప్రే మాపు-మాయు చు "అడఁగు-కరఁగు-కలఁగు-సలఁగు-బిగియు" ఇత్యాదు లడంగ్వాదులు 'మాయు - ఉడుగు - కడగు-మడుచు' ఇత్యాదులు మాయ్వాదులు 'ఆఁగు' ప్రభృతు లుభయ గణంబులు ఆఁగ్వాదులకును సంత్య లోపం బగునని యెఱుంగునది బాహుళ్యంబుచేసి కొన్నిటి కించుక్ చుక్పుగాగమంబులు మూఁడును, గొన్నింటి కందు యథాప్రయోగంబుగ రెండును గొన్నింటి కొక్కటియు నగు నని యెఱ్గునది ఆఁగు-ఆఁచు-ఆఁపు-ఆఁగించు ఆఁగు ధాతు వంతర్గత ప్రేరణార్థకముచు గలదు రేఁగు-రేఁచు-రేఁపు-రేఁగించు పాయు-పాచు-పాపు విఱుగు-విఱుచు చూచు చూపు నేరుచు-నేరుపు మేయు-మెపు లేచు-లేపు కలియు-కలుపు తడియు-తుపు తెలియు-తెలుపు ఇత్యాదు లెఱుంగునది

౨వ విష 'కలుచు' (ఎలమి-పేర్మించు) అనునది వేఱొక ధాతువు ఉంపలి 'ఌ'కార మావయవిక ము 'కలఁగు' ధాతు ప్రేరణ రూపము 'కలఁచు' ధాతువునకు భిన్న మని భ్రమింపరాదు చం కలుచుట దోసమే మిం ల్లకి యాండురు తొల్లి యాండురం। గలుతురె. (నన్ని-కు-౨వ ఆ-౧౩౧)

## ౩౮౦ క్-చుక్-పుక్ పర కాగమాదేశలోపాదులు

ఈ ఎక్-చుక్-పుగాగమంబులు పరంబులగునపు డాగమాదేశ లోపంబులు వెల్ల గా బడియెడి రం (బా-క్రి-౩౭, వ్యా-సం-౩-౨౮ V విష)

పూను పేర్చి-పూనుమ-పూన్చు-పూంచు పూర్ణబిందువు విశేషము కం కాంచన । పూంచిన . (విరా-౪వఆ-౪౫) అగు పేర్చి కావించు, వచ్చు ప్రే రావించు-రప్పించు (ముత్పరకత్వము లేనపుడును "కా-రా" దేశములు '-వ-ప'లును) విన్నపము-విన్నవించు (అంగలాదులలోనిది, క్రియా-౨౨ సూ 'విన్నవించు-ఆలించు-పలవించు' అను నుదాహృతులనుబట్టి స్వార్థేంచు క్ప్రర కత్వమందును ప్రకృత సూత్రము వర్తిల్లు ననఁదగును) మోకాలు-మోకరించు-మోకారించు (అంగలాదులలోనిది , మోకటించు-శ-ర) కేక-కేకరించు (కేకా ధ్వనులు చేయు) పలవ (ప్రలాప)-పలవరించు-పలవించు (అంగలాది) ఆలక-(ఆలక్ష)-ఆలకించు-ఆలించు (అంగలాది) వ్రక్క-వ్రక్కలించు (అంగలాది) నొచ్చు-నొంచు-నొప్పించు ఉండు-ఉంచు డిగు-డించు-డిగించు "మే । దినికి డిగింపఁగాఁ గొని (హరి-పూ ౩వ ఆ-౭౦) పెరుఁగు-పెనుచు-పెంచు (పెరిం । గిన-మార్క-౦-౩వ ఆ పెరుంగ-పొండు-౫వ ఆ, శ-ర సూరి దీనిని నిర్బంధు వుగా నుదాహరించెను) తునుఁగు-తుంచు-బాలవ్యాకరణ ప్రథమ ద్వితీయ ముద్రణములందును నిది ఖండ బిందుశూన్యముగనే యున్నది 'తునింగికాళ్ళ' (అచ్చ-రా-ఆరణ్య,శ-ర) తునియు-తునుచు (తునిచి-యయా-౨వ ఆ-౭౪ సూ-రా-ని , శ-ర లో లేదు) ముసుఁగు-మునుచు-ముంచు మొగుడు-మొగుడుచు-మొగుచు-మోడుచు-మొగిడించు చొచ్చు-చొనుపు-చొప్పించు చినుఁగు-చించు-చింపు తెగ్గు-త్రెంచు-త్రెంపు తిరుగు-త్రిప్పు చచ్చు-చంపు నిలుచు-నిలువరించు-నిలుపు కొను-కొలుపు 'కొలిపెను భగదత్తు మీదఁ గ్రూరగజము' (భీష్మ-౩వ ఆ ౧౫౧) చీకటుల్ । గొలుపన్ (హరి-ఉ-భా ౩వ ఆ ౧౧౦) 'వెలకుఁదీయు' అను నర్థమున "కొనిపించు" అను వాడుక గలదు శబ్ద పల్లవ స్థలములందును 'పురికొలుపు' మున్నగురీతి నెఱుంగునది పోవు-పుచ్చు అను ప్రయుక్తమగునపుడును 'మోసపోవు - మోసపుచ్చు' అనియె యుండును "పనుచు-పంచు-పనుపు-పంపు" అనునవియు, వీని యాద్యక్షరలోపమున నేర్పడిన ననఁదగిన "అనుచు-అంచు-అనుపు-అంపు" అనునవియు 'పోవు' ధాతు ప్రేరణరూపములె యనియు వీనికి 'ఆజ్ఞాపించు' అను నర్థమును గౌణముగాఁ గల్గుననియు సూరి యాశయము కాని విని కేమియు నాకార సామ్యము లేదు 'పు' శబ్దమునుండి 'చు' వర్ణసంయోగమున (చూ- క్రియా-౭౬ సూ-౨౬ వివ, క్రియా ౨౨ సూ) 'పనుచు' మున్నగునవియు వాని యాద్యక్షరలోప

మున 'అనుచు' మున్నగునవియు నేర్పడియుండు నని యూహించు టుచితము
వంగు, ప్రే-వంచు-వాంచు ఓడు-ప్రే-ఓడించు-ఒడుచు

## అన్వాదులు-అడ్డాదులు

అన్వాదుల కించుక్కు పరంబగునపుడు 'పు' గాగమం బగు, మానునకు విభాషనగు ౮౦ (బా-క్రి-౭౮, వ్యా-సం-౩-౨౮ VI విష)

అను-అనుపించు 'అను-కను-తిను-విను' అను నాల్గిటికే పుగాగమము నిత్యము. 'మాను' అనునది 'అన్వా'దులలోనిది కాదు దానికి విభాష యని వేఱుగ వచింపఁబడెను మాను-మానిపించు

౧ వ వివ అన్వాదులు క్రియా ౬౫ వ సూత్రమునఁ బేర్కొనఁబడెను వానిలో 'కొను-మను' ధాతువు లింమ విడువఁబడెను ఏలయనఁగా 'మను' ధాతువున కించుక్కు లేదనియు, 'మనుచు-మనుపు' అను రెండు రూపములు మాత్రమే దాని ప్రేరణరూపము లనియు క్రియా ౨౨ వ సూత్రము వివృతిలో వచింపఁబడెను 'కొను' ధాతువునకు 'కొలుపు' అనునది ప్రేరణార్థక రూప మనియు, 'కొనిపించు' అనునది వ్యావహారిక రూప మనియు క్రియా ౮౦ వ సూత్రము వివరణమున వ్రాయఁబడెను అను-అనిపించు, కను-కనిపించు-కానిపించు, తిను-తినిపించు, విను - వినిపించు వీనిలో 'అను-కను-తిను' అను వానికి 'చుక్కు' లేదు 'పుక్కు' విధానమే లేదు (క్రియా-౭౬ వ సూ) 'విను' ధాతువునకు 'వినిపించు' అని ప్రకృతిగా తన్మూల సిద్ధి మను "వినుచు (క్రియా ౨౬) - వింపు (క్రియా ౮౦)" అనియు నుండును

౨ వ వి. 'చను' ధాతువునకు 'చ(ఁ)జేయు' అను మాత్రమే ప్రేరణ రూప ముండును 'నగు' ధాతువు ప్రేరణ రూపము 'నగుపించు' (చూ - క్రియా- ౬౦ వ సూ-టిప్పణి) 'నగి(గు)పించు' ప-క్రి నగిపించెన్ (కళా-౫ వ ఆ-౫౯, సూ రా ని) నగుపించె నచటి యబలాజనమున్ (విరా-౪ వ ఆ ౩౯) నిను నగుపింపఁగా (శాంతి ౬ వ ఆ-౨౧౭) వంటి ప్రయోగముల చొప్పున 'నగు' ధాతువును 'అన్వాదు'లలోఁ జేర్చి దానికిని 'పు'గాగమ మగు నని గ్రహింప వలయును,

అడ్డాదులు కింమకు పరంబగునపుడు 'గు'గాగమంబగు సప్పాదులకు విభాష నగు ౧౨ (బా-క్రి-౭౯, వ్యా-సం-౩౨౮ VII విష)

అడ్డము-అడ్డగించు "అడ్డ (ము)-ఓర (ఒరగు)-పంత (ము)- పెల్ల-బోర-మట్ట (ము-తగ్గించు)" ఇత్యాదు లడ్డాదులు అప్ప-అప్పగించు-అప్పించు అప్ప (అర్పణ), ఒప్ప (అర్పణ)-పల్ల(ము)-పల్లగించు (గుఱ్ఱముమీఁద నా స్తర ణము వేయు) ఇత్యాదు లప్పాదులు (ఈ సూత్రపు లక్ష్యములకుఁ క్రియా-౨ వ సూ చొ. ఇంచుకగును అడ్డాదులు నప్పాదులును నంగలాదులలోనివని యెన్నునది)[1] ప్రకృతసూత్రమున 'ఇంచుకు' అనుటచేత నిది స్వార్థేంచుకు గాని ప్రేరణేంచుకు గాని కావచ్చును 'ఇల్లు-ఇలు' అను రూపములతోను 'ఇంచు'గాగమ ముండవచ్చును స్వార్థ ఓలగిలఁగఁ బెల్లి గిల్లఁ దల్లడపడ (భీష్మ ౧ వ ఆ ౨౬౮) ప్రేరణార్థ బోరగించు (బోరగిల్లఁ జేయు) మొ 'మేళగించు' అను దాని రూపాంతరము మేళవించు గీ వీర శృంగార ములు మేళవించినట్టి (జై-౫ వ ఆ-'శ-ర') ఇట్లె పెల్లగించు-పెల్లగిల్లఁజేయు మొ

ప్రేరణార్థక 'చు'కు పరంబగునపుడు "ఆడు - ఓడు" అనుధాతువుల 'డ'కారమునకు రేఫాదేశమగు[2] ౧౩ (బా-క్రి-౧౦, వ్యా-సం-౩౨౮ VIIIవి)

---

1 సూరి అడ్డాదులలో "చిత్తము-మేళము" అను శబ్దములను నప్పాదులలో 'కోపము' అను శబ్దమును బఠించెను కాని 'ఆచ్ఛిక' మాత్ర విషయక మగు నీ 'గు'గాగమము సంస్కృత శబ్దములపై నిల్చుట సరికాదని తలఁచి వాని నీ గణములలో బంధింపలేదు "గీ కీడు మేలేమి యును జిత్తగింపకుండు" (అశ్వ-౧ వ ఆ-౧౧౬) మున్నగు ప్రయోగములను "చిత్తగ (చిత్తమును బొందు), కోపగ (కోపమునందు), మేళగ (మేళము నొందు)" అను సంస్కృత శబ్దములపైని క్రియా-౨ వ సూ చెప్పిన 'ఇంచు' గాగమము నిల్పి "చిత్త గించు-కోపగించు-మేళగించు" అనురూపములను సమర్థించుకొననగును

2 బాలవ్యాకరణమున 'ఆదోడు కూడుల'నుచు సిద్ధ ద్వంద్వమునఁ బర రూప సంధి చేయుట ప్రమాదకము మఱియు 'కూరు' అను రేఫాంత ధాతువే యుండుటచే 'కూడు' అనుధానికి రేఫాదేశము చేయుట పునరుక్తము కం ఈ

ఆరుచు-ఆడించు (ఆడు + చు ఆడు + ఇంచు స్నానమాడించు-ఆట లాడించు) కం ఆర్పఁగ బొమ్మలు కడంగి । ఏర్పడ (శాంతి ౧ వ ఆ-౨౧౩) మఱుమాట లార్తు (విరా-౨వ ఆ ౩౧౦, అర్తున్-ఆడింతును) మజ్జన మార్ప (వరాహ-౭ వ ఆ-౪౧) వహ్నినార్ప (సభా-౧ వ ఆ-౧౯౩) రాజుల నోర్చి (ఆర ౧ వ ఆ ౩౭౧) అక్క। తారంభుల నోర్చు నెంత యధికుల నైనన్ (సభా-౧వ ఆ ౧౨౩)

## చెఱుచు-చెర్చు-చెఱుపు

చెడునకుం జుక్పు గాగమంబులును, డా కలఘు రేఫంబు నగు ౧౪ (బా-క్రి-౧౧, వ్యా-సం-౩౨౧ IX వి)

చెఱుచు-చెఱుపు (చెడు + చు) చుక్పుగాగమ మాత్ర విధానముచే దీనికి 'ఇంచుక్కు' లేదని యెఱుంగునది 'చెఅచు-చెఅపు' అను 'అ'కార మధ్యములు కోశములందుఁ జూపఁబడెను గాని వానిని నిర్వహించు ప్రయోగములు చూపఁ బడలేదు ఉకార మధ్యము 'చెడు' ధాతున కర్థము గీ ఎఱిఁగి వాని తపము చెఱుపఁబనిచె (ఆది ౫ వ ఆ ౧౧౫) 'చెఱుచు' అనుదానికి 'చెర్చు' అను రూపాంతరము గలదు 'యజ్ఞమేటికిఁ జెర్చె' (పండితా-వాద ౨౦౫వ పుట సూ-రా-ని)

## పఱుచు-పఅచు

పడునకుం జుక్కును డా కలఘురేఫంబు నగు ౧౫ (బా-క్రి-౧౨, వ్యా-సం-౩౨౧ X విష)

పఱుచు (పడు + చు-పొందించు) భయపఱిచె- 'భయపఱుపు' లేదు (భయము + పఱిచె-సంధి-౬౩ సూ) ఇది ప్రాప్త్యర్థక 'పడు' ధాతు ప్రేరణ రూపము ఈ యర్థమున 'ఱ'కార మధ్యము గలదు కం తొ। అంగుట తపోప్రకాశంబు అది పురుషులకున్ (కళా-౩ వ ఆ-౨౨౪) దీని (పఱుప) కిం

రసమెత్తి ... నుదిం। గూఁడ నొప్పు (ఉద్యో-౩ వ ఆ-౭౪) ౩౦ వారని సంక్లేశంబులఁ। గూడ నపుఁడు ..(శాంతి-౬ వ ఆ-౨౪౨వ ప)

చుక్కను 'పు'గాగమంబును రూపాంతరములు లేవు "పఱపు" (బాణమును ప్రయోగించు) అనుదానిని సయితము పతనార్థక 'పడు' ధాతుప్రేరణరూపముగఁ గోశకారు లుదాహరించిరి బాణమును బడునట్లు చేయుటయే కదా బాణమును ప్రయోగించుట 'పఱచు' (పఱుపుమీఁద దుప్పటిని బఱుచుట) అను దానిని సయితము పతనార్థక 'పడు' ధాతు ప్రేరణముగ 'శ-ర' కర్త యుదాహరించెను పఱుపుమీఁద దుప్పటిని బడునట్లు చేయుట యని ప్రేరణార్థము నరయునది

శబ్ద పల్లవం బగు పడున కించుక్క విభాష నగు, అగుచో డాకు లఘు రేఫం బగు ౧౬ (బా-క్రి౧౩, వ్యా-సం-౩౨౧ X విష)

వెలువడు, ప్రే-వెలువరించు (బయలుదేఱు) 'వెలువఱుచు' అనియు నగును అట్లె చొప్పడు, ప్రే-చొప్పరించు-చొప్పఱుచు ఏర్పరించు-ఏర్పఱచు మొ

౧వ వివ ముద్రిత భారత పుస్తకములలో ''పశువరించు-పశువఱుచు'' అని 'శ' వర్ణ ఘటితముగా నుండుట ప్రామాదికము మిశ్రమైన రేఫాదేశము చుక్క వచ్చుట యసంభవము. కాన "పసుపరించు-పసువఱుచు'' (యజ్ఞ పశుత్వము నొందించు) అని యుండవలయును

## ప్రేరణేంచుక్క మీదఁ బ్రేరణేంచుక్క లేదు

ప్రేరణంబునం దించుక్కమీఁద నించుక్క లేదు ౧౭ (బా-క్రి౧౪, వ్యా-సం-౩౨౯-౩౨౯ I విష)

ఇట్లనుటంజేసి ప్రేరణార్థం బయిన యించుగ్భి న్నాగమంబు పయిని బ్రేరణార్థంబు గాగమము నిల్వనగు నని యెఱుంగది ఉదా నొచ్చు, ప్రే-నొంచు పు ం ప్రేరణ -నొంపించు చచ్చు, ప్రేరణము-చంపు పునః ప్రేరణము-చంపించు ఇట్లె స్వార్థేంచుక్క పయిని బ్రేరణార్థేంచుక్క నిల్వవచ్చును ఉదా : పరివర్తించు, ప్రేర-పరివర్తింపించు (ఆది-౧వ ఆ-౧౦౯-౧౧౧, మా-

క్రియా-౭౯పసూ పత్వంబు, క్రియా-౭౩-ప్రేరణార్థకము) రక్షించు, ప్రేర-రక్షింపించు 'చదివించు' అనరాదు 'చదివింపఁజేయు' అనవలయును

## 'ఉ'త్వమధ్య 'యి'త్వమధ్య మగుట

ఇత్వంబుగాని 'ఎ' త్వంబుగాని కూడుచో ననాద్యంబయిన 'ఉ' త్వంబునకు 'ఇ'త్వంబు బహుళంబుగానగు ౭౦ (బా- క్రి-౭౫, వ్యా-సం-౩౩౦ విష)

నిగుడు-నిగిడి-నిగిడెన్- నిగిడించు చదువు-చదివితిని - చదివించెను వెనుకటి 'కనిపించు-వినిపించు' మున్నగున వెల్ల దీనికి లక్ష్యములె అనాద్యం బనుటచేత "కుదురు-కుదిరించు-కుదిరెను, కుడుచు-కుడిచెను" మున్నగు చోటు లందెల్ల మొదటి 'ఉ కారము 'ఇ' కారము కానేరదు బహుళంబనుటచేత నీ సూత్రము ప్రయోగానుసారముగ ప్రవర్తిల్లు ననఁదగును శబ్దరత్నాకరమునఁ బురుటియాలు-పురుటిల్లు-పురుడించు మున్నగు శబ్దము లుదాహరింపఁబడెను అది యట్లుండఁగా "సీ ఆలోన గదఁ బూన్చి యభ్ర మాతంగంబు । కుంభ పీఠంబు పగుల్చ యసుర" (హరి-పూ-౪వ ఆ-౧౫౪) అను మహాకవి ప్రయోగమును గలదు (యతిస్థానము)

ప్రేరణార్థకము పరంబగు నపుడు చకారంబునకు 'ప' కారం బగు ౭౯ (బా- క్రి-౭౭, వ్యా-సం-౩౩౧-౩౩౧ I విష)

చకారము ధాత్వవయవ మైనను, నాగమ సంబంధియైనను నీ పత్వంబు కల్గును అవయవిక సీ పృథివీపతుల విడిపించి చెఱలు (సభా-౧వ ఆ-౨౧౫-౧౧౦ గద్య) ఆగమచకార పరివర్తింపించు (ఆది-౧వ ఆ-౧౧౯-౧౧౦ గద్య) ద్విరుక్తచకార కం తెప్పించి తొంగుగు మీవని । యొప్పించి (విరా-౪వ ఆ-౩౯) బహుళ మగుటచేత "సీ మెచ్చించిన యా జగజెట్టి యితఁడె । . (ఉద్యో-౩వ ఆ-౧౭౫) ద్విత్వస్థలములందు విభాషను 'ప' త్వ మగును 'మెప్పించు' అని కోశములందుఁ గలదు కాని యిట్టి పత్వమునకు యతి ప్రాసాద స్థల గత ప్రయోగము లభింపలేదు 'హెచ్చు-హెచ్చించు' ఇత్యాదు లందు 'ప' త్వము లేనేలేదు "ఇచ్చు-ఇప్పించు, తెచ్చు-తెప్పించు" ఇత్యాదు

లందు నిత్యము "వచ్చు-రప్పించు-రావించు నొచ్చు-నోంచు-నొప్పించు చొచ్చు-చొనుపు-చొప్పించు" ఇత్యాదులందు విశేష రూపాభావ పక్షమున నిత్యమె।

ముజ్జీత్తులు ముత్తు నాఁబడు ౯౦ (బా-క్రి-౧౬, వ్యా-సం-౩౩౧ I విష)

ముడుజ్జులును, 'జీ' ఇద్వర్ణముగాఁ గలవియు 'ముత్తు' అను సంజ్ఞ గల వగును

## ముత్పరకత్వమున 'ప-వ'

ఆగమాన్య చకారంబుల కద్విరుక్తంబులకు ముత్తు పరంబగునపుడు 'ప-వ' లగు ౯౧ (బా-క్రి-౧౮)

ఆగమ పచింపఁడు-పచింపక-పచింపని-పచింపమి-పచింపకుము-పచింపుము-పచింపుఁడు-పచింపన్-పచింపఁగల-పచింపఁబడు-పచింపకుఁడు ఆచ్ఛిక ధాతువులందును నిట్లె' అడచు-అడపఁడు-అడఁపక-అడఁపని-అడఁపమి-అడఁపుము-అడఁపుఁడు-అడఁపన్ మొ అన్య చకార-అవయవిక పిలువఁడు-పిలువక-పిలువని-పిలువమి-పిలువుము-పిలువుఁడు-పిలువకుము - పిలువకుఁడు-పిలువన్-పిలువఁగల-పిలువఁబడు మొ అద్విరుక్తము లనుటచేత "శా రాజు మె। చ్చం గేళీగలి యుల్లసిల్లఁ జని యశ్వత్థామ" (భీష్మ-౨వ ఆ-౩౦౪) అను రీతిని 'ప' త్వము లేదు ఇట్లె గ్రుచ్చు-గ్రుచ్చన్, పుచ్చు-పుచ్చన్, వ్రచ్చు-వ్రచ్చన్ మొ "శ-ర, సూ-రా-ని" కారులు "గ్రువ్వన్-పువ్వన్-వ్రవ్వన్" అను రీతిని వత్వము నిరాధారముగ వాడిరి అట్టి వత్వమును నిర్వహించు ప్రయోగ మొక్కఁడేని కానరాదు "ఒగుచు-తివుచు-తివుపన్-తివ్వన్-తివన్" అనుచో ద్విరుక్త చకారమునకు వచ్చిన 'వ' త్వము కాదు "నొవ్వఁ బల్కెదు సభలోనఁ జివ్వకొల్ల" (ఉద్యో-౪వ ఆ-౨౩౧) అను చోటి 'నొవ్వన్' అనెడి 'వ' త్వము ద్విరుక్త 'చ' కారమునకు వచ్చినది కాదు నొచ్చునకు 'నోవు' అనియే ముత్పరకత్వమున నగును (చూ-క్రియా-౯౧వ సూ) ఇట్లు 'నోవన్' అని యేర్పడినపిదప 'వ' కార ద్విత్వమయ్యెను (చూ-ఆచ్ఛి-౩౬వ సూ)

౧వ వివ • కవిత్రయాదీతర కవి ప్రయోగంబులందుఁ గొన్నియెడల "ను" జ్యంతాదులు పరంబు లగునపుడు 'ప' త్వము విభాషనగు కం ఊ । హించ నాక నాల్గు గడియం । సంచారము (కళా-౩, । ప్రౌఢ-క్రియా-౧౬వ సూ) చం తీ । ర్చుము వెసఁ బొమ్ము సమ్మ మనుమన్ (కళా-౬వ ఆ-, ప్రౌఢ-క్రియా-౧౬౫ సూ)

## ఇవ్వన్-ఒలువన్ మొ. వ్యావహారికములు

౨వ వివ 'విడుచు-విడునట్లుచేయు' అను ప్రేరణార్థమున 'విడుపన్' అనవలెను "విడుచు-త్యజించు" అనుచో 'విడువన్' అని యర్వాచీనముగా నేర్పడెను ఒలుచు-ఒలుపన్ సాధువు 'ఒలువన్' సరికాదు (ఒలియు, ప్రేరణ-ఒలుచు) విఱుచు-విఱుపన్ - సాధువు, 'విఱువన్' వ్యావహారిక రూపము "ఇచ్చు-ఈయన్-ఇయ్యన్-ఈన్" సాధురూపములు 'ఇవ్వన్' వ్యావహారిక రూపము 'ఎగుచు-ఎగుపన్' సాధురూపము 'ఎగువన్' వ్యావహారిక రూపము తాలుధాతు ప్రేరణము తాల్పన్ (తాల్పఁగ, సభా-౧వ ఆ-౭౬) వ్యావహారిక వాసనచే "ఇవ్వన్-ఒలువన్-విడువన్-విఱువన్-ఎగువన్" అను రూపములు హితముగా వినఁబడును కాని యట్టిచోటి 'వ' త్వమునకు మహాకవి ప్రయోగ ప్రామాణ్యము లేదు

ఖండ బిందువుమీఁది సిద్ధ 'చ' కారంబునకు ముత్తు పరంబగు నపుడు 'ప' కారంబు ప్రాయికంబుగా నగు ౯౨ (బా-క్రి-౮౯వ సూ, వ్యా-సం ౩౩౧ III విష)

తలఁపక-తేఁపక (తేఁచు-ధా- ఉద్గారించు) సైఁపక(సహింపక) తోఁపక 'ఏఁచు'నకు వైభాషికంబు ఏఁపక-ఏఁచక 'నోఁచు'నకుఁ గలుగదు-నోఁచక ఏఁచుటకు విభాష చ । ఏఁ । పసగునె యైన నీవయిన పంపెదఁ గైకొ (విరా-౨ ఆ-౨౬౩, మూ-వ్యా-సం-౧౬-౨-౨వ పుట) శా కం, జాత వ్రాతము మాటువేర నవి యేఁపస్ సాగె (- ౫-౩వ ఆ-౨౦౧) వెనుకటి క్రియ-౯౧౬ సూ చూప న . రా . ౨ రానెరు ప్రకృత సూత్రము 'ప'త్వము ప్రాయికముగా విధించుచున్నది.

# గర్జింపుచున్-చేరుపుచున్-చుదు-తు

కవిత్రయాదీతర ప్రయోగములందు వర్తమానార్థక 'చు' వర్ణక పరకత్వమునందును నాగమ 'చ' కారమునకు 'ప' త్వము విభాషగ నగును ౯౩ (ప్రౌఢ-క్రి-౧౭, వ్యా-సం-౧౬౧౨ ౧౬౧౩ పుటలు ౩౩౧ వ విష)

చం కపటపు మోవిఁ జే। రుపుచును (కళా-౭౩-౬-౧౬౨వ ప) ఉ కంపిత గ। ర్జింపుచునున్న (జై-౨౫ ఆ-౪౬) * ఇట్టివి ప్రాచీనకవి సమ్మతములు కావు ఉ ఇంచుక దుః। ఖింపుచు (అశ్వ-౪వ ఆ-౭౩)

తద్ధర్మాద్యర్థకము, నుభయ ప్రార్థనాద్యర్థకము నగు 'దు' క్కుతోఁ గూడ నాగమ, తద్భిన్న 'చు' వర్ణములు రెండును 'తు' వర్ణముగా మాఱును

ఇట్టి యెడల ద్విరుక్త 'చు' వర్ణంబు ద్విత్వ 'తు' వర్ణం బగును కవిత్రయాదీతర ప్రయోగములందు "చుదు" అను దానితో పాటుగ 'యుదు' అనునదియు వైకల్పికముగా 'తు' వర్ణంబును, బూర్ణము మీఁది 'చుదు' వైకల్పికముగా 'పుదు' అనునదియు నగును ౯౪ (బా-క్రి-౬౦-౧౦౮, వ్యా-సం-౩౩౨ I విష)

ద్వివిధ 'చుదు' లను 'తు' అగుటకు రక్షించును + దు + రు-రక్షింతురు గెలుచు + దు + రు గెలుతురు ఉభయ ప్రార్థన రక్షించు + దు + అ + ము-రక్షింతము గెలుచు + దు + అ + ము-గెలుతము కం, నివేదిం। తును తల్లికి (అవి-౬వ-౨౪౦) పుత్రయుగళ వర్ణా (ఆర-౨వ ఆ-౩౫౧) ద్విత్వ కం పోయి మనము చత్తు మెల్లి భీష్మ ౨వ ఆ-౨౫౨) నన్నయ

* ఇట్టి యర్వాచీన కవి ప్రయోగములను జూచి కాబోలును నహోబలపతి సన్నయ చింతామణిచే నిట్టి 'చ'త్వరూపము సు సాధించి తన కవిశిరోభూషణమున "గర్జింపుచున్న్నాఁడు-పోషింపుచున్నాఁడు" అని ప్రామాణికముగా నుదాహరించెను దీనిని బట్టి యిప్పుడు సంస్కర్తలు ప్రాచీన గ్రంథములందును నిట్టి ప్రయోగములను ప్రక్షిప్తము చేయుచున్నారు

ఏమి సే। యుదు సుతులార (ఆది ౧ప ఆ ౩౦౪) యుదు-తు పో్ౕరిడ౯ జేతువౌ (కపిక-౩వ ఆ ౫౫) కం చే। తురె యకట (దశా-౩౪౫వ పు) నన్నయయే కాక తిక్కనాదులును 'చేతురు' మున్నగు రీతిని 'తు' వర్ణమును బ్రయోగించి రనుట పొరపాటు అట్టి పాఠములు ప్రక్షిప్తములు (చూ-వ్యా-సం-౧౬-౨౧-౧౬-౨౯ పుటల) 'ంచుదు-ంపుదు' ప్రయోగము కం తుద బహువచనమునకు నిం। పుమరును ఛింతురును నయ్యెం బుడమి యెడల నిం, చుదురును గలుగు (కావ్యాలం-౯వ ఉల్లా-౧౬౦) 'పూజింపుదుము' (ఆర-౨వ ఆ ౨౫౬) అని నన్నయ ప్రయోగించె ననుట కల్ల అచట "పూజింతుము రుద్రునిం దనుచు వేడ్క" అనియే నన్నయ ప్రయోగించిన పాఠము అర్వాచీను లట్టివానిని బ్రయోగించిరి గీ వచింపు। దురు వరుస మూడటంచు నందుల నధర్మ...(వరాహ-౭వ-ఆ-౧౧౦ బాలక-౩౩-౭౪ పుటలు)

౧వ వివ కావింపుట, కోపింపుట మున్నగునవి కేవలము నపశబ్దములు తిమ్మ కవ్యాదు లిట్లు 'ట' వర్ణక పరక 'చ' కార మునకు 'ప'త్వము గల దనుట మిక్కిలి పొరపాటు అట్టి ప్రయోగము లశ్రిత చరములు

అగు-వచ్చు-చొచ్చు-చూచుటకు మట్టు ఎరంపగ నపుడు 'కా-రా-చొచ-చూడు' లగు ౯౫ (బా-కి్రి-౯౧, వ్యా-సం-౩౩౩ పిష)

అగు కాఁడు-కమ్ము-కాఁగల-కాన్-కన్ మొ వచ్చు రాఁడు-రమ్ము-రాన్-రాఁగల మొ చొచ్చు చొరఁడు-చొరుము-చొరన్ - చొరఁగలఁడు మొ చూచు చూడఁదు-చూడు ము-చూడన్-మాడఁటకు (గూ-టుమ్ము-యవ్వె-కి్రి-౪౩వ సూ) మొ

## ముత్పరక నిషులు

౧వ వివ ముత్పరకత్వము లేనిచోటఁ వై యాదేశముల నాధునికలు ప్రయోగించుట భ్రాంతి వరాలకము "వారి" శ్రీకృష్ణ భారతము ౯వ ఆ-౨౭౨, చూ-బాలక-౧౧౬ పుట) ఇందిట్టివి పెక్కు గి -షు

ముత్తు పరంబగు నపుడు 'ఇచ్చు' అను గానికి '౬౪' అనునది సర్వాదేశ మగును జేత్తు పరమగు నపుడు 'ఈయు-ఇయ్యి' అన నాదేశములును నగును ౯౬ (బా-కి్రి-౧౨, వ్యా-సం-౩౩౪ వి)

ము జ్ఞు పరమగునపుడు ఇమ్ము-ఈ. బహు-ఇండు కానిమ్ము-కానీ, ము జీత్తు పరమగునపుడు ఈ యుము-ఇయ్యకుము-ఈకుము ఇయ్యకుండు-ఈకుండు ఈయండు-ఇయ్యండు-ఈండు ఈన్-ఈయున్-ఇయ్యన్ ము

౧౨ ౪౨ ద్విపద వనరాశి త్రోవ యిష్వక. (రంగ-రా-బాలకాం ౨౨ పుట) ఇది వ్యావహారిక రూపము. రంగనాథ రామాయణమునందలి వ్యావహారిక రూపములలో నిది యొకటి ప్రామాణిక కవు లెవ్వరును నిట్టివానిని ప్రయోగింపరు

౨౨ ౪౨ 'ఈవుతన్'(ఇచ్చుతన్)అను రూపము "సూ-రా-నిఘంటువు" నుదాహరింపఁబడెను ఇందలి 'వ' త్వము నిరాధారము దీనిని నిర్వహించు మహాకవి ప్రయోగము లేదు

'తే-తేరు'లు తెచ్చునకగు ౯౭ (బా-క్రి-౯౩, వ్యా-సం-౩౩౫ విష).

తెమ్ము-తే-తెరుము-తేరు తెండు-తేరుఁడు తేఁడు-తేరఁడు తేన్-తేరన్, తేవలయు (ఆది-౨౨ ఆ-౧౦౫) తేరఁ గడఁగె (ఆర ౩౫ ఆ-౭౬)

"చావు-నోవులు" "చచ్చు-నొచ్చు"ల కగు ౯౮ (బా-క్రి-౯౪, వ్యా-సం-౩౩౬ ౨౪)

చచ్చు చావఁడు-చావుము బహు-చావుఁడు నొచ్చు నోవఁడు-నోవుము బహు నోవుఁడు ద్విత్వము నొవ్వఁడు-నొవ్వుము (అచ్చి-౩౬౪ సూ)

జీత్తు పరంబగునపుడు వాని 'వు' వర్ణంబు విభాషను లోపించును ౯౯ (బా-క్రి-౯౫, వ్యా-సం-౩౩౭ విష)

చచ్చు చాక-చావక చాకుము-చావకుము చాకుఁడు-చావకుఁడు నొచ్చు నోక-నోవక నోకుము-నోవకుము మ జ్ఞు పరం బగునపుడీ 'వు' లోపము లేదు 'నొచ్చు' అను దానికి బర్యాయముగా 'నోయు' ధాతువు గలదు దాని కీ యాదేశాదు లోఁ బ్రిని క్తి లేదు కిఁ బ్రయోగపడుటఁ గ మఁగొని । నోయుదు .(శాంతి-౨౨ ఆ-౩౩౧)

అగు-కను-కనులకు ముజ్జీత్తులు పరంబు లగునపుడు 'కా-నా-కాన' లు విభాష నగు ౧౦౦ (బా-క్రి-౯౬, వ్యా-సం-౩౩౭ విష)

ఈ సూత్రము యథాసంఖ్యాన్వయియైన మూఁడు వాక్యములగుచున్నది 1 అగునకు ముజ్జు పరంబగునపుడు 'కా' దేశము విభాషనగును (క్రియా ౯౩వ సూత్రముచే వచ్చు నిత్య 'కా' దేశమున కిది యపవాదము) 2 'అను' ధాతువునకు జీత్తు పరంబగునపుడు 'నా' అను నాదేశము విభాషనగును 3 'కను' ధాతువునకు జీత్తు పరంబగునపుడు 'కాన' అను నాదేశము విభాషనగును ఉదా 1 అగు కమ్మ-అగుము-అవుము (అచ్చి-౬౯వ సూ) - ఔము (క్రియా-౧౦౭వ సూ) కండు-అగుఁడు-అవుఁడు-ఔఁడు 2 అను నాఁడు-అనఁడు నారు-అనరు నాన్-అనన్ నాక-అనక నాని-అనని 3 కను కానఁడు-కనఁడు కానన్-కనన్ కానక-కనక మొ

## 'నేరుచు'-'పోవు'

'నేరుచు'నకు లాట్టునందును భూతార్థక రూపములందును* 'రు' వర్ణము బహుళముగా లోపించును, ముత్తు పరంబగునప్పుడు దీనియందలి 'చు' వర్ణము వైకల్పికముగా లోపించును ౧౦౧ (బా-క్రి-౯౭, వ్యా-సం-౩౩౯ విష)

లాట్టు నేతును-నేరుతును నేర్తురు-నేరుతురు కం ద్యూతక్రీడకుఁ గొండొక, నేతున్ (విరా ౧వ ఆ-౧౯౬) భూతార్థ నేచెను-నేరిచెను నేచిన-నేరిచిన నేచి-నేరిచి మొ బహుళగ్రహణ మువలన- "కం ..చే హా రాద్యంతము। నేచుకొనం గలరు" (వరాహ-౧౦వ ఆ-౭౩) ఇత్యాదులు సాధ్యములు ముత్తు నేరఁడు-నేరుచఁడు నేరము-నేరుచము ఏఁగాల్పనకైన నేరఁ బోలునే (ఆది ౧వ ఆ ౧౯) నేరుపన్-నేరన్ మొ

---

* సూరి భూతార్థములందే లిట్టువందు మాత్రమే 'రు' లోపము బహుళ మని సూత్రించెను ఆ పక్షమున నీ క్రింది భూతార్థ రూపము సాధ్యములు నేరవు "నేచినయట్లు (మౌసల ౧వ ఆ ౨౦౩), నేచియు నేరకుండియును (వశి కుమార-౩వ ఆ ౧౪౦, కేతన)

పోవునకు 'దుజ్మత్తు'లు పరంబు లగునపుడు 'వు' లోపంబు విభాషనగు ౧౦౨ (బా-క్రి-౬౭, వ్యా-సం-౩౩౬ విష) *

దుక్క- పోవుదురు-పోదురు పోవుదుము-పోదుము మత్తు పోవఁడు-పోఁడు పోవన్-పోన్ పోవఁగలఁడు-పోఁగలఁడు పోవకుము-పోకుము. పోవుదము-పోదము (ఉభయప్రార్థ) పొవుము-పొమ్ము-పో పోవుఁడు-పొండు "పదము-పద-పొదము-పొద" అనునవి "పొమ్ము" అను దానికిని, 'పొదఁడు' అనునది 'పొండు' అను దానికిని బర్యాయములు కావు 'పొద-పద' మున్నగు నవి క్రియా-౩౭వ సూత్రమున విస్తరించి చెప్పఁబడెను

౧వ వివ అర్వాచీన కవులు 'తి' (భూతార్థక) వర్ణకము పరంబగు నపుడును 'వు' లోపము ననఁగా యిలోపమును (చూ-క్రియా ౧౦౩వ సూ) ప్రయోగించిరి ఉదా-పోయితివి-పోతివి పోయితిరి-పోతిరి 'మనమే యమ్మడు పోరిమో యితనికిన్ (వరాహ ౧౦వ ఆ ౩౭వ ప, వ్యా-సం-౧౬౪౪-౧౬౪౫ పుటలు-మా).

## అగు-పోవుల కడవ్రాల లోపము

'అగు-పోవుల' కడవ్రాల కిద్వ్యక్తంబులు పరంబు లగునపుడు యకారం బగు ౧౦౩ (బా-క్రి-౬౬, వ్యా-సం-౩౪౦ విష)

అట్ల క్రియా ౧౦౭ సూత్రము చెప్పిన 'అయి'కి పాక్షికముగా 'ఐ' వచ్చును అయి-ఐ అయిన-ఐన పోవు పోయిన-పోయి- పోయిరి-పోయెను-

---

* సూరి "పోవునకుం దుజ్మత్తులు ముజ్ఞం బరంబులగునపుడు 'వు' లోపంబుం 'బొద పదలు' విభాషనగు" (౬౭ క్రియా) అని సూత్రించెను 'పొద-పద' అను వానిలో నస్మదర్థ సాహిత్యమును గలదని క్రియా-౩౭వ సూత్రమున వివరింపఁ బడుటచే నిందు 'పొద-పద'ల యాదేశమును మరలఁ జెప్పలేదు

పోయెడు-పోయెడి మొ కం అయినది నలువురు శార్ఙకు । లయు మోక్షణము. . (ఆది ౧వ ఆ ౨౬౫౪; ఈ యున్న పౌష్య ప్రోలికిఁ । బోయి. .(ఆది-౧వ ఆ ౧౧౭)

౧వ వివ కడప్రాల కనుటచేత 'అగు' ధాతు 'గ' కారమునకే 'య' కారమయ్యె ననవచ్చును గాని యాపక్షమున-'అవితిని' మున్నగు ననిష్టరూపములు దుర్వారములగును గాన 'అచ్చి ౭౫' చొప్పున వకారము చేసి దానికి 'య' కారము చేయనగును

'అగు'నకు వక్రంబు గూడుచో దీర్ఘం బగు ౧౦౪ (బా-క్రి-౧౦౦, వ్యా-సం-౩౪౦ విష)

ఆయెను-అయ్యెను (అచ్చి ౩౬వ సూ చొప్పున ద్విత్వమును, సమా-౭౬వ సూ చొప్పున హ్రస్వమును గల్గెను ఇట్లే-ఆయెడు-అయ్యెడు మొ కం వెఱ । గయ్యెడు. ।కన్యము ..(ద్రోణ-౩వ ఆ-౨౩౭)

## పిలుచు 'చు' లోపము

'పిలుచు' మొదలగువానికి ముత్తు పరంబగునపుడు కడవాయి బహుళంబుగ లోపించు ౧౦౫ (బా-క్రి-౧౦౧, వ్యా-సం-౩౪౧ I విష)

పిలఁడు-పిలువఁడు పిలుమ-పిలుపుము పిలన్-పిలువన్ పిలఁగలఁడు-పిలువఁగలఁడు బహుళగ్రహణంబుచే 'లు' నకు ముజ్జు పరంబగునపుడు 'చ' లోపంబు నిత్యంబు చెప్పు-చె-చెండు పిలుచు-నిలుచు- తలఁగు-తొలఁగు- గెలుచు- వెఱచు ఇత్యాదులు పన్నిదము చఱము (ఆది ౨వ ఆ ౩౨) చఱచి + ము-చఱము

౧వ వివ బా-గు-ప్ర 'ఱఁగు' నకు మాఱుగా 'తలఁచు' అను దానిని నిప్పటి పొరపాటు 'తలఁచు'నకు 'చు' లోపమె లేదు తలఁగు కం బల్లికులు చెలఁగు అలఁచని । (భాగ ౧౦వ స్క-౨-పూ-౧౩౬౭-సూ-రా-సి) కం ౹ ౹౦ ౹ ౹౨ గుబ్బలి కంచుకులు ను-। దల తల మనఁ బతియుఁ జతుర తరముగ డబస (నిర్వ-౮వ ఆ ౨౪) ఇట్టివి విరోధించును

లాఁతిచో సహితము 'కా' దేశాదులు కానంబడియెడి ౧౦౬ (బా-క్రి-౧౦౨, వ్యా-సం-౩౪౨వి)

లాఁతిచో-ముత్తు కానివి పరమగునపుడుసు కావుతన్-ాతన్ (చూ-క్రియా-౩౪౫ సూ) అగుట-కావుట (ఆది-౧వ ఆ ౧౩౯ సిద్ధముకావు టెఱింగి) కానన్-కావునన్-అనుడును-అనవుడును-నావుడును మొ

౧వ వివ 'రావించు-రప్పించు-కావించు' మున్నగు చోట్ల నిత్యము ఇవి క్రియా ౭౦వ సూత్రము చేతనె సిద్ధించును

౨వ వివ చా బిడ్డ (బసవ-౭వ ఆ-౩౧౦-కడుపులోఁ జచ్చిన బిడ్డ) చా పరువు (మనుచ-౪వ ఆ-౪౫-చావునకుఁ దెగించిన పరుగు)

౩వ వివ 'కావునన్-కానన్' అని ద్రుత ప్రకృతికములె న్యాయముగాఁ గా లయును 'కాన్+అ-కాన అ ను వ్యుత్పత్తి చొప్పున భారతమున నిది కళ గా కె కన్నట్టుచున్నది మ ధృతరాష్ట్రుండును కా।న తగం బొందుట (ఉద్యో-౧వ ఆ-౩౫౭) భారతమున ద్రుత ప్రకృతికతను నిర్వహింపఁజాలు ప్రయోగ మగపడదు "కం రసభావా ద్యుపని బద్ధరసములు గానన్" (నరస ౫౦ ఆ ౨౩౦) అను రీతి నర్వాచీనులు దీని ద్రుతాంతముగా వాడిరి

## అయి-ఐ, అవు-ఔ

ఆచ్ఛికంబులందు 'అయి-అవు' అనువానికి* వరుసగా "ఐ-ఔ" అను నవి బహుళంబుగా నాదేశములగును ౧౦౭ (బా-క్రి-౧౦౩, వ్యా-సం-౩౪౭-౩౬౭ I వి౩)

ఆయిరి-ఐరి అయి-ఐ అయితిరి-ఐతిరి అవును-ఔను అవుట-ఔట మొ శబ్ద ఖండము లందును నిట్లగును అయిదు-ఐదు అయిరేని-ఐరేని

* 'అయి,యవు'లకు అను సూరిగారి సిద్ధ ద్వంద్వము సంహితా యకా రాను రామాదికములు

(బచ్చెన పని చేసిన పెండ్లికుండలు) అవుడు-ఔఁడు (పెదవి క్రిందిచోటు) గవుసెన-గౌసెన మొ

౧౨ వివ 'ఐ-ఔ' లకు 'అయి-అవు' అనునవి యాదేశములగుటయుఁ గలదు ఉదా కైక-కయిక దైవమ్-తద్భవ (దై + అము-దయియము)-దయ్యము యౌవనమ్-తద్భవ (జౌవనము-జవువనము)-జవ్వనము ఇట్టిపద్ధతి మిక్కిలి యరుదనఁ దగును

౨౩ వివ అచ్చికంబులం దనుటచే నీ పద్ధతి సంస్కృత సమములందు ప్రవర్తిల్లదు ఉదా దైవమ్-యౌవనమ్-దయిత (భార్య)-జైనముని శివుకము (మంగళము) కవులు-కైకయి మొ

## లట్ప్రరకత్వమున 'కలుగు' నకు 'కల'

అస్త్యర్థకంబును ప్రాప్త్యర్థకంబును (సకర్మక)* నగు 'కలుగు' ధాతువునకు 'కల' అను నాదేశము లట్ప్రరత్వమున నిత్యముగా నగు ౧౦౮ (బాల-క్రి-౧౦౪, వ్యా-సం-౩౪౪ వి)

లట్టు-ప్రథ -లఁ ఖ---ఎ (కలవాఁడు-కలాఁడు-కలఁడు కలవారు-కరులా-కలరు) మధ్య-కలవు మధ్య కలవు-కలరు (కలవాడవు-కలాఁడవు-కలవు మొ) ఉత్త కలను-కలము (కలవాఁడను-కలాఁడను-కలను మొ) ప్రాప్త్యర్థకత్వమునందు 'కలవు-కలరు-కలము' అనునవి ప్రాచీన భాషలో లేవు క్రియా ... సూ చొప్పున ఏదంతము కామింజేసి "చు-ఉన్న" అనునవి

---

* సూరి అస్త్యర్థకి 'కలుగు' ధాతువునకు మాత్రమె 'కల' అను నాదేశము (బాల-క్రి-౧౦౪) విధించెను కాఁగా ప్రాప్త్యర్థక 'కలుగు'నకు క్రింది ... రూపములు సాధ్యములు కానేరవు 'ఎఱుకఁ గలరె మగువ లెందు (ఆది ... ౩౪) ... కంటె గాద్పుకంటె (అది ౧౨ ఆ-౧౧౨, ... దేవ్ బాలుఁ డైనఁ గడు వృద్ధు మహాన్ (ఆర-౩౯ ... జూచుచునుండు విషము ... (ఉద్యో ౧౨ ౮-౩౧౨)

రావు క్రియా ౨౦వ సూ చొప్పున 'ఉన్న' లేదు గాన "డి-వి" అనునవి రానేరవు లట్పరకత్వమున 'కలా' దేశము నిత్యమగుటం జేసి "ధనలాభము గలుగుచున్నది" మున్నగుచోటులందు 'కలుగుచున్ + ఉన్నది' అను రీతిని వర్తమానార్థక 'చు' వర్ణక ద్వారమున రూపసిద్ధి నరయునది

౧వ వివ అస్త్యర్థకత్వమున "కలవు-కలను-కలము" అను వానిని దిక్కనాదులు ప్రయోగించిరి "నీ వచ్చుటఁ గలవొ లేవొ నిక్కము చెపుమా" (విరా-౪వ ఆ ౨౧౧) ఇట్లు తిక్కన 'డ' కార రేఫ లోపములను (కలవాఁడవు-కలాఁడవు-కలవు) సైత మంగీకరించెను ప్రాప్త్యర్థమునందు సైతము 'కలవు-కలను-కలము' అను రూపములను సంస్కర్తలు ప్రక్షిప్తములను జేసిరి కాని యా యా చోటులందు 'కలదు' అను సాధురూపమే కవిప్రయుక్తము ఉదా కం నేరుపుఁ గల ననుచు నహం। కారంబున (హరి-పూ-౫వ ఆ-౨౪౭) ఇచట 'నేరుపు గల దనుచు' అనునదే కవిప్రయుక్తము (చూ-వ్యా-సం-౧౬౫౭వ పుట) బీరముఁ గల వేని (ఆర ౧వ ఆ ౩౦౯) ఇట 'బీరముగల దేని' అనునదే కవి ప్రయుక్త పాఠము ప్రాచీనులు "కలవాఁడను-కలాఁడను కలవాఁడు-కలఁడు" మున్నగు రీతిని దచ్చబ్ద 'వకార-వాకార' లోపమును (సమా-౦౩వ సూ) ప్రయోగింతురే కాని ప్రాప్త్యర్థక 'కలుగు' ధాతు స్థంమున "కలాఁడను-కలాను-కలను కలారము-కలాము-కలము కలాఁడవు-కలావు-కలవు" అను రీతిని డకార రేఫ లోప రూపములను ప్రయోగింపరు

తద్ధర్మాద్యర్థ్యక విశేషణ స్థలము నందును నర్థద్వయమునందును 'కలుగు' ధాతువునకు "కల" అను నాదేశము విభాషనగు ౧౦౯ (బా-క్రి-౧౦౫, వ్యా-సం-౩౪౪ విష)

కలవాఁడు-కలుగువాఁడు-కలిగెడివాఁడు కలాదేశము మీఁద 'ఎద్యేడు' లు నిల్వవు *

* సూరి 'కలుగు' అనుదానిపైన సయితము 'ఎద్యేడు' లు నిల్వవని వచించుట పొరపాటు కం ఏ। ర్పడ జగిములు గ్రమ్మఱఁ గలి। గెడునప్పుడు (ఆర-౪వ ఆ-౨౩౭) సూరి ప్రాప్త్యర్థక 'కలుగు' ధాతువునందు తద్ధర్మాద్యర్థక త్వము న 'కలా' దేశమును దిక్కన ప్రయోగించె నని చూచుకొనలేదు.

అ స్త్యర్థమందు 'కలుగు'-త్రర్థమున ఉ వాఁడిమయూఖముల్ గలుగు వాఁడు (ఆది-౩వ ఆ-౧౧౨) కొడుకులు గలవాఁడు (ఆది-౮వ ఆ-౨౫) ప్రా ప్త్యర్థమందును 'కలా' దేశము కం తిరమైన నడవడిం గల। పరిణత చిత్తుండు (శాంతి-౫వ ఆ-౧౮౯)

## లజ్యాది పరకత్వమున 'కల్గు'

'కలుగు' నకు "లజి-మిజి-కజి-నిజి-వడి" ప్రత్యయములు పరమగు నపుడు 'లే' అనునది సర్వాదేశమగు ౧౧౦ (బా-క్రి-౧౦౬, వ్యా-సం-౩౪౪వి)

(క్రియా-౧౫వ సూ-లజి. క్రియా-౪౮ మిజి క్రియా-౫౦ కజి క్రియా-౫౩ నిజి కృత్-౨౨ వడి చూ) ప్రా ప్త్యర్థకత్వమున వ్యతిరేకమునందు "లేవు లేను-లేము-లేవడి'' అను రూపములు లేవు తక్కిన యన్ని యెడలఁ ప్రా ప్త్యర్థ మందును న స్త్యర్థమున నంతటను వ్యతిరేకమున 'లె' అను నాదేశ మగు నని యెఱుంగునది అ స్త్యర్థ వ్యతిరేక ప్రథ లేఁడు-లేరు లేదు-లేవు మధ్య లేవు-లేరు ఉ త్త లేను-లేము తక్కిన లేమి-లేక-లేని-లేవడి నీవచటఁ గలవొ లేవొ (విరా ౪వ ఆ-౨౧౧) ప్రా ప్త్యర్థ వ్యతిరేక మధ్యమ-బహు- లేరు ప్రథ లేఁడు-లేరు * లేదు-లేవు 'మి' ప్రభృతి లేమి-లేక-లేని మా యందు లేని గుణములు (ఆర ౧వ ఆ ౮) సామర్థ్య, గెలువలేమి (భీష్మ ౨వ ఆ ౩౫౨)

౧వ వివ ప్రా ప్త్యర్థకత్వమందును 'లేవు-లేను-లేము' అనువానిని గొన్ని యెడల ముద్రణసంస్కర్తలు ప్రక్షి ప్తములు చేసిరి అట్టియెడల నెల్ల 'లేదు' అను నదే కవి ప్రయు క్త పాఠము ఉదా అంత యెఱుక లేనె (లేని దాననె, ఆర ౧వ ఆ-౨౩౧, ఇట "అంత యెఱుక లేదె" అనియే కవి ప్రయు క్త పాఠము

---

* సూరి ప్రా ప్త్యర్థకత్వమున వ్యతిరేకమందు 'లే' అను నాదేశమే లేదనుకొనుట కేవలము పొరపాటు కం ధృతరాష్ట్రిండును బుత్త్రియు। మతి లేరైరి (భీష్మ ౩వ ఆ ౨౨౭) లావు లేరైరి (ఆశ్రమ ౨వ ఆ ౧౫౨)

## 'వలచు' వ్యతిరేకరూపములు

వ్యతిరేకంబునందు 'వలచు' నకు 'ఒల్ల' విభాషనగు ౧౧౧ (బా-క్రి-౧౦౭, వ్యా-సం-౩౪౬ విష)

ప్రథ ఒల్లఁడు-ఒల్లరు ఒల్లదు-ఒల్లవు మధ్య ఒల్లవు-ఒల్లరు ఉత్త ఒల్లను-ఒల్లము ఒల్లమి-ఒల్లక-ఒల్లని ఒల్లాదేశాభావ పక్షమున ప్రథ- వల వఁడు-వలవరు మొ క్రియా ౯౧వ సూ చొప్పున 'వలచు' ధాతు సిద్ధ 'చ' కారమునకు 'వ' కారాదేశము ఆ వె జముఁడు వట్టికొన్న । వానినైనఁ గావ వలతురు వలచిన । నొల్లకున్న (ద్రోణ ౨వ ఆ-౨౯౦)

౧వ వివ వ్యతిరేక భావార్థమున 'ఒల్లమి' అను దానికిఁ బర్యాయము 'ఒల్లఁబాటు' అనునది యగు నందురు కాని 'ఒల్లఁబాటు' శబ్దములోని పూర్వావయవము "ఒల్లన్" అను భావార్థక నిపాత మనుట యుక్తము (చూ-సంధి-౨౬) గీ ప్రాణములు నర్థములు నొల్లఁ బాటు సేసి (భీష్మ ౧వ ఆ-౧౮౨)

**౨వ వివ 'వలవదు-వలదు' అనునవి పర్యాయ రూపములుగా నగపడును కాని 'వలవదు' అనునది 'వలచు' ధాతు వ్యతిరేక రూపము 'వలదు' శబ్దము 'వలయు' ధాతు వ్యతిరేక రూపము చేయవలయు-చేయవలదు 'వలదు' శబ్దమునుండి "వలదు-వల్దు-వద్దు'' అను రీతిని రూపము ఉప్పతిల్లును**

## ఘటక క్రియలు

స్వార్థ వ్యతిరేకము లందలి కొన్ని క్రియల తుదిని జేరిన 'అగు-పోవు' మున్నగువాని స్వార్థిక వ్యతిరేక రూపములు వివిధములగు నర్థ విశేషములకు ఘటకము లగును కావుననె యవి ఘటకక్రియ లనఁబడును అట్టి జంటలందు వివిధములగు నాగమాదేశ లోపాదులను గల్గును ఇట్టి జంట లీపఱును గొన్ని సందర్భాంతరములందు సూత్రింపఁ బడెను ఇంకను సూత్రింపఁబడుఁను ౧౧౨ (బా-క్రి-లేదు, వ్యాసం-౩౪౭ విష ౧౬౮౩ పుట మొ, ౧౬౮౭ పుటలు)

ఉదా నమ్మనేర నయ్యేదన్ (ఆది-౪వ ఆ-౩౦) మనఁ బోవక పోవఁగ రాదు (ఉద్యో-౩వ ఆ-౪౬) వృష్టిలే దవుౘ (ఆది-౪వ ఆ-౨౪౯) పుట్ట దయ్యెనే-పుట్టరైరె (ఆది-౬వ ఆ-౬౦) నాకుఁ బనిసేయ దయ్యనేనిన్ (ఆది-౩వ ఆ-౧౩౨) ఈఁ జాల నయ్యెదన్ (అర-౭వ ఆ-౩౬౪) రాక పోఁడు-ఉండక పోఁడు (మనుచ-౩వ ఆ- ) చేయనే చేయఁడు చేసెనా చేయును చేయ నిమ్ము చేయ నగును చేయ రాదు చేయఁదగును చేయఁ దగదు - చేయ రాదు చేయఁ గూడదు (క్రియా-౪౭వ సూ లో వివరింపఁ బడెను) తెలియఁ జేసెను ఒనరఁ జేసెను (క్రియా-౭౩వ సూ-౩ వివ) పండఁ బాఱిన పొల మెండఁ బాఱెను (ప్రారంభార్థకములు పండ నారంభించిన పొల మెండుట కారంభించెను మనుచ ౩వ ఆ-౧౨౯) చేయ నున్నాఁడు-చేయఁ బోవును (ఇవి భావ్యర్థమునే యిచ్చును ధాతువు నుజ్యంతముపైని 'ఉండు-పోవు' ధాతు రూపములు నిల్చి భవిష్య దర్థబోధకము లగును) చేయఁ గలఁడు (భావ్యర్థమున నుజ్యంతముపైని 'కల్గు' ధాతువు చేరును, క్రియా-౨౭వ సూ, ఇట్టిదె సామర్థ్యార్థకము నగును) చేయుచున్నాఁడు (వర్తమానార్థమున చువర్ణాంతముపైని 'ఉండు' ధాతురూపములు నిల్చును- క్రియా-౨౨౧వ సూ) చేయఁబడును (ధాతువు నజ్యంతముపైని 'పడు' ధాతురూపములు నిల్చును, క్రియా-౫౯వ సూ) చదువుకొనును (క్రియా-౬౨వ సూ, ఆత్మనేపదార్థకము) చేయఁ జూచెను (యత్నార్థకము-చేయ యత్నించెనని యర్థము) చేయరైరి-చెప్పనయితిని (క్రియా-౧౧౮) చేయరా-ఏమిర- వచ్చెం జుమా- చదువవె-చదువవయ్య-చనుదెంచెను (గమనార్థకములు 'తెంచు' యోగమున 'ఆగమనా'ర్థకము లగును, క్రియా-౧౧౬) తెల్లగాన్-లెస్సగాన్-చేయఁగన్-చెప్పఁగాన్ (౧౧౯-క్రియా) - పండుకొనెను-చొరఁబడెను (క్రియా-౧౧౫వ సూ) మొ

౧వ వివ ఇట్లు ధాతువులె కాక కొన్ని నామములు జంటయును నర్థవిశేష బోధకము లగును ఉదా తీయ విలుకాఁడు-తియ విల్తుఁడు-పచ్చ విలుకాఁడు-పచ్చవిల్తుఁడు-చెఱకు విల్కాఁడు (మన్మథుఁడు) మొ

పడుజి కొసు' లొకానొకచో స్వార్థంబునం దనుప్రయుక్తము లగు ౧౧౩ (బా-క్రి-౧౦౯, వ్యా-సం-౩౪౭ I విష)

క్రియా-౨౯-౬౨ సూత్రముల చొప్పున నకర్మకములు కర్మార్థకములు నాత్మనేపదార్థకములును కానేరవు కాన నట్టియెడ నిల్చు 'పడు-కొను'లు స్వార్థికము లననగును ఉదా చొరఁబడెను (చొచ్చెను, క్రియా-౯౨వ సూచొరు) నిలువఁబడును (నిలుచును) కూడఁబడును పండుకొనును మొ.

## 'తెంచు' ధాత్వనుప్రయోగము

తెంచు ధాతు వగ్వాదుల కనుప్రయుక్తం బగు ముత్తు పరంబగునపుడు 'తెంచు'నకు 'తే-తేరు' లగును ౧౧౪ (బా-క్రి-౧౧౦, వ్యా-సం-౩౪౭ IV విష)

అగు-నెగయు-పోవు-చొచ్చు-పుచ్చు-తోఁచు - నడచు-పఱచు -మొలచు-పీచు-అరుగు-ఏఁగు-చను ఇత్యాదు లగ్వాదులు చనుదెమ్మనుము (ఉద్యో-౧వ ఆ-౧౭౬)

ఉత్వంబుపైని "తెంచు" 'త' కారము 'ద'కారంబగు ౧౧౫ (బా-క్రి-౧౧౦, వ్యా-సం-౩౪౭ IV విష

అగుదెంచు (కావచ్చు-పూర్తికావచ్చు) నెగయుదెంచు (జలాదులనుండి పైకి లేచు) పోవుదెంచు (సమాప్తి కావచ్చు) అగుదేన్-అగుదేరన్ మొ ఏనేఁడు లగుదెంచె (ఆర-౪వ ఆ-౩వ ప) మునిశాప దినములు పోవుదెంచె (ఆది-౨వ ఆ-౧౯౯)

అరుగ్వాదులకు "తెంచు" పరంబగునపుడు 'గు' లోపంబు విభాష నగు. వీనిని ప్రాచీను లాగమువార్థమందె వాడుదురు ౧౧౬ (బా-క్రి-౧౧౦, వ్యా-సం-౩౪౭ IV విష)

అరుగుదెంచు-అరుదెంచు (వచ్చు) ఏగుదెంచు-ఏతెంచు (వచ్చు, గులోపము రాఁగా 'ఉ'కారాంతత్వము లేమింజేసి 'ద'త్వము రాదయ్యె) చనుదెంచు (వచ్చు) ప్రీతి నరుదెంచి కనిరి (ఆర-౩వ ఆ-౧౫౯) మీ రిందుల కందఱుఁ

జను । దేరఁగ (ప్రాసస్థలము, సభా-౨వ ఆ-౧౩౯) అర్వాచీనులు 'వెళ్ళు' అను నర్థము పురికేగుదెంచి ఏమని విన్నవించెదఁ (జై-౨వ ఆ-౭౩, ఏగు దెంచి-వెళ్ళి) చంచలలోచన యెం దరుదెంచెనొ (రసిక-౬వ ఆ-౪౪ జై-౪వ ఆ-౧౨౨) ఎట్లు మింటఁ జనుదేరఁగ (పోవు రెట్లు)

'తెంచు' పరంబగునపుడు 'పీచు' ప్రభృతుల తుది 'చు'వర్ణంబు లోపించు ౧౧౭ (బా-క్రి-౧౧౨, వ్యా-సం-౩౪౭ IV విష)

పీచు + తెంచు-పీతెంచు (గాలి విసరు) మొలతెంచు (మొలచు + తెంచు-అంకురించు) పఱతెంచు (పఱచు + తెంచు-పరుగిడివచ్చు) తోఁతెంచు (తోఁచు + తెంచు-ఉదయించు మొ సూ-రా-నిఘంటువున నిది నిర్బంధువుగా 'తో తెంచు' అని యుదాహరించుట ప్రామాదికము చూ-వ్యా-సం-౧౯౭౧వ పుట) పుచ్చు + తెంచు-పుత్తెంచు (పంపు) చొత్తెంచు (చొచ్చు + తెంచు-చొరఁబడు) తదలు చకారముతో సంధించునపుడు ద్విత్వ తకార మేర్పడుట కవి ప్రయోగ సిద్ధము సీ పు । త్తెంచెఁ గాకున్న నేరఁ డికఁడు (ఆర-౧వ ఆ-౫౫, పుచ్చు + తెంచు) ఆ-వె ఇత్త మెల్లభంగి నిత్తన్వి (నిర్వ-౩వ ఆ-౧౧౭, ఇచ్చు + ద + ము-ఇత్తము)

భూతంబున లజికి భూత తద్ధర్మా * ద్యర్థకం బగు 'అగు' ధాతు వను ప్రయుక్తంబగు ౧౧౮ (బా-క్రి-౧౧౪, వ్యా-సం-౩౪౩ V వి).

లజికి-వ్యతిరేకార్థక క్రియకు - ఉదా భూత ప్ర వాఁడు రాఁడ య్యెను వారు రారయిరి అది రాదయ్యెను అవి రావయ్యెను మధ్య నీవు రావయితివి. మీరు రారైతిరి ఉత్త నేను రానయితిని మేము రామయితిమి. తద్ధర్మాద్యర్థ నేను రానయ్యెదను-నమ్మనేరనయ్యెదను (ఆది-౪వ ఆ ౩౦, చూ-క్రియా-౧౧౨వ సూ)

---

*సూరి లిడంతంబగు 'అగు' ధాతువు మాత్రమె యను ప్రయుక్తమగు నని సూత్రించెను ఆ పట్టున "నమ్మనేర నయ్యెదను" (ఆది ౪వ ఆ ౩౦) మున్నగు ప్రయోగములు సంగ్రహింపబఁడవు

# 'కాన్-కన్' అను వాని ప్రయోగము

'అగు' ధాతు నుజ్యంతరూప మగు 'కాన్' అనునది వికల్పకముగ హ్రస్వము నందును ఇవి (కాన్-కన్) క్రియా విశేషణములకును, విధేయ విశేషణములకును, నుజ్యంతములకును బరముగా విభాషను నిల్చును కొన్నిట నివి యన్వితము లగును కొన్నిట వ్యర్థములై యనుప్రయుక్తము లగును ఇవి ప్రథమమీఁద నిల్చునపుడు 'గ' కారాదేశము నిత్యము (చూ-సంధి ౧౪వ సూ) ౧౧౯ (బా-క్రి-౧౧౫-౧౧౬ , వ్యా-సం-౩౪౭ VI విష)

క్రియయందలి విశేషమును దెల్పునది క్రియా విశేషణము ఉదా అది వేగముగా వచ్చెను , వాఁడు లెస్సగాఁ బల్కెను నామమందుండు విశేషమును దెల్పుచు, ననఁగా నామవిశేషణ మగుచుఁ గ్రియతో నన్వయించునది విధేయ విశేషణము ఉదా వాఁడు పల్కినది న్యాయముగా నున్నది ఇట్టి యెడల 'కాన్-కన్' శబ్దములు వాక్యమున నన్వితములె యగుచున్నవి * నుజ్యంతములమీఁద నివి యనుప్రయుక్తములె యనఁ దగును ఉదా నేను వినఁజెప్పము-నేను వినఁగాఁ జెప్పము క్రియావిశేషణ విధేయ విశేషణముల మీఁద నివి నిల్వక పోవచ్చును పెల్లు దొరగు నెత్తురునై (భీష్మ-౧వ ఆ-పరీక్షితున్...కృతాంత నికేత నాతిథిని జేసె (ఆది-౧వ ఆ-) ఇట ద్వికర్మమన్నను ననవచ్చును (చూ-వ్యా-సం-౧౬౩౦వ పుట) ఇవి భావ్యర్థకాదులందు నిల్చుటయుఁ గలదు చదువఁగఁ గలఁడు-చదువఁగలఁడు చదువఁగఁబడెను-చదువఁబడెను వినఁగావలయు-వినవలయు మొ (క్రియా-౯౫వ సూ 'కాన్' సిద్ధించును )

---

*సూరి క్రియా విశేషణములకు నిత్యముగా ననుప్రయుక్త మగునని సూత్రించుట సరికాదు క్రియా విశేషణములపై ని సైతము నిల్వక పోవచ్చును ఉదా : పెల్లు దొరఁగు నెత్తురునై (భీష్మ-౧వ ఆ చూ-ప్రౌ-క్రియా-౨౨వ సూ) లెస్సగాఁ బల్కె ననుచో లెస్స యగునట్లు పల్కె నని 'కాన్' శబ్ద మన్విత మగుచుండుటచే దాని ననుప్రయుక్త మనరాదు ఇది విధేయ విశేషణములకు పయిని నిల్చుꠀ "బాహుబల గర్వ మఖర్వముగా" (కర్ణ-౨వ ఆ-౧౦౫)

౧వ వివ ఉదా కావున నీకు నృపి పమః గౌరవరాజునకుం బ్రియం బునుం। గా విధి మెచ్చ బాహుబల గర్వ మఖర్వము గాఁగ లక్ష్మి కిం। జేవయుఁ గీర్తి కున్నత విజృంభణముం గలుగన్ ముకుంద గాం। డీవులఁ దాఁకి గెల్చెదఁ గడింది మగంటిమి యుల్లసిల్లఁగన్॥ (కర్ణ–౨ ఆ–౧౦౩) ఇందు వివిధములైన 'కాన్–కన్' శబ్దముల వాడుకల నరయ వలయును

౨వ వివ 'కానున్నది' మున్నగు చోటులందును 'కాన్' అను దానికి హ్రస్వము గల్గుట గలదు కం సకతి కయ్యము...కనున్నది (కళా౧వ ఆ–) నీకు నాథుఁడు గనున్న (కళా–౫వ ఆ–) కం. .కృతకృత్యుఁడు గవలయు... (అను–౪వ ఆ–౨౬), అధీశుఁడు గఁగోరు (నన్ని–కు–౬వ ఆ – ౭౨౨, చూ–వ్యా–సం–౧౬౧౨వ పుట)

౩వ వివ 'భుగుల్ భుగుల్ గాఁ గ్రిక్కెన్' (ఉ–హరి–౪వ ఆ–౨౩౧, భుగుల్ భుగుల్ అనునట్లుగాఁ గ్రిక్కెనని యర్థము) నీకుఁగా నని సేయుట (భీష్మ–౧వ ఆ–౧౫౬–నీకై–నీపక్షమున యుద్ధము చేయుట) ఇట్టి వాడుకలును గలవు మఱియు 'మొదలుగాన్' అనుదానిని "మొదలుగాఁగల" అను నర్థమున వాడు సంప్రదాయమును గలదు మత్తకోకిల అంబు ధీశుఁడు లోనుగా సురలు (ఆర–౪వ ఆ–౨౬౧) ద్రోణాచార్యుఁడు మొదలుగాఁగఁ నని కొల్లనివారై (ఉద్యో–౨వ ఆ–౨౫౦, ద్రోణాచార్యుఁడు మొదలుగాఁ గలవారని యర్థము)

## శబ్దపల్లవ క్రియలు

పూర్వావయవము ప్రథమా ద్వితీయాన్యతర విభక్తిగ నుండు నామమయి యుండ నుత్తరావయవము ధాతు వగు జంట శబ్దము శబ్ద పల్లవ సంజ్ఞ గల దనఁ దగును ౧౨౦ (బా–క్రి–౧౧౧, వ్యా–సం–౩౪౧ విష) *

---

* సూరి వికృతివివేక టీకానుసారియై "ధాత్వాదులకు ధాతువు లనుప్రయుక్తంబు లయి విలక్షణార్థాభిధాయకంబు లగు, నీయవి శబ్దపల్లవంబులు నాఁబడు" అని సూత్రించెను ఇందలి విలక్షణార్థాభిధాయకత్వ మొక శబ్ద పల్ల వాసాధారణ ధర్మము కాదు జంట శబ్దములలో నర్థ విశేషము సాధారణముగఁ గల్గుచుండును శబ్దపల్లవములలోని యుత్తరా వయవమును దాని (శబ్దపల్లవముయొక్క) యర్థములోఁ గొంతభాగము గలదై యుండును గాన నది యర్థము లేనిది కాదు కాన

ఇట్టి సంజ్ఞను జేయుటచేతఁ దక్కిన ద్వ్యవయవము లగు జంట శబ్దములను (౧౦౨ మొ ౧౧౯ వఱకు క్రియా) శబ్దపల్లవములనుట సంప్రదాయము కాదనియు, వానిని ద్వ్యవయవ క్రియ లనియె వాడవలయు ననియు నెన్ననగును (చూ-ప్రౌఢ-క్రియా-"శబ్దపల్లవక్రియలును ద్వ్యవయవ క్రియలును సమాప్తంబులై"...౨౪)

పూర్వావయవము ప్రథమాంత మగునపు డా శబ్దపల్లవ మకర్మక మగును ఉదా. రూపఱు (రూపుచెడు-నశించు). పెంపఱు (నశించు) అలవడు (వశపడు) చొప్పడు (జాడపడు) వెలువడు (బయలుదేఱు) ఆపోవు (ఆదట పోవు) విజయంచేయు మొ

పూర్వావయవము ద్వితీయాంత మగునపు డా జంట సకర్మము కావచ్చును అకర్మమును గావచ్చును ఉదా అకర్మక చిందులాడు (నర్తించు) చెట్టవట్టు (వీఁపు మీఁదిభాగము చెట్ట) నాట్యమాడు (నర్తించు) రక్కొన-రెక్కొను (రేకుకొను-వర్ధిల్లు) కోల్పడు (చెడు) మేలుకొను-మేలుకను (నిద్ర లేచు) వాసపోయు మొ సకర్మక చేకొను-కైకొను (తోడ్కొను-తోకొను) ఈకొను (ఈయకొను-ఇయ్యకొను-అంగీకరించు) తలపోయు (తలపులు పోయు-ఆలోచించు)

ద్వ్యవయవశబ్దములు కూర్చుండు (కూరుచు+ఉండు) నిలుచుండు (నిలుచు+ఉండు) పన్నుండు-పరుండు (పడు+ఉండు) త్రెక్కొను (త్రెంచు+కొను-చంపు) ఏఱుపఁక-ఏర్పడు (ఏఱు-క్రింద యున్న గింజల నేఱు) మొ

---

దాని ననుప్రయుక్తము గాదు ఇట్టియు శబ్దపల్లవములలో నాద్యవయవము ధాతువై యుండినచో వ్యాకరణసమ్మతము గాదు అట్టివి ద్వ్యవయవ క్రియ లనిపించుకొనునే కాని శబ్దపల్లవము లనిపించుకొనవు (చూ-వ్యా-సం-౩౪౮ వింశ ౧౬౮౨-౧౬౮౩ పుటలు)

౧వ విధి శబ్దపల్లవక్రియలును ద్వ్యర్థయువ క్రియలును సమాప్తంబులయి పునర్గృహీతంబు లగుచోఁ దత్పూర్వావయవంబులకు లోపంబు విభాష నగు ఆ లలితాంగిఁ దోడ్కొని చనుదెమ్మతే ననువు గూడని పక్షమందు (భోజ-౩వ ఆ-) ఇలకుం దివికిం జననిచ్చు-నిచ్చి (భాస్కర-అరణ్యకాం-౨వ ఆ, ప్రౌఢ-క్రియా-౨౫వ సూ)

## ఆత్మార్థా ద్యభిధానము

ఆత్మార్థం బభిహితంబగుచోఁ దల్లింగ సంఖ్యాభిధాయి వచనంబు ధాతు విశేషణంబుల కగు ౧౨౧ (బా-క్రి-౧౨౦, వ్యా-సం-౩౫౦ విష)

రాముఁడు రావణుం బరిమార్చి సీతయుం దాను సౌమిత్రి సహితంబుగఁ బుష్పకారూఢుండయి సాకేతంబున కేతెంచె తాను శబ్దార్థమె యభిహితంబు కానిచో "రాముండు సీతయుం బుష్పకారూఢుండయి యేతెంచె నని యుండును సీ ధర్మతనయుఁ [illegible] దానును [illegible] దెంచె (అ[illegible]-౧వ ఆ-౬౩, చూ-వ్యా-సం-౧౬౯౯ ౧౭౦౧ పుటలు)

౧వ విధి ఒకానొకచో సహార్థంబున యుష్మదస్మ దర్థంబు లభిహితంబు లగునపుడు క్రియ [illegible] తత్కర్తృ [illegible] విభాష [illegible] వెల్లుదుము వేగము నీవు [illegible] నీ నివాసంబున్ (అ[illegible]-౨వ ఆ) [illegible] కాష్ఠుఁడు సంజయుఁడు. [illegible] దీవు [illegible] సుతులు (ఉద్యో-౨వ ఆ) [illegible] (హరి-ఉ-౩ ఆ-[illegible] ప, ప్రౌఢ-క్రియ-౨[illegible] సూ)

౨వ విధి యుష్మదస్మద్భిన్నకర్తృక మగునపు డనేక [illegible] క్రియకు సమీపకర్తయొక్క లింగ [illegible] [illegible] వాని [illegible] మిత్రులు [illegible] జీవ ధనంబులు [illegible] [illegible] గ్రహించి [illegible] వాని [illegible] గాఁడు [illegible] (శాంతి-౨వ ఆ ప్రౌఢ-వా[illegible] సూ)

సకర్మకంబులకు 'కొను-పడు' అనెడి యనుబంధము లుండవచ్చును గాన స్వరూపమున నాల్గును, ప్రేరణ మున నాల్గును నెనిమిది రూపంబు లేర్పడును ౧౨౨ (బా-సూత్ర సంఖ్య-లేదు , వ్యా-సం-౩౩౩ విష)

౧వ వివ స్వరూప స్వరూప 1 + కొను చేరినది 1 + పడు చేరినది 1 + 'కొను-పడు' లు రెండును జేరినది 1-నాల్గగును ప్రేరణ ప్రేరణము 1 + దానిపయి కొను చేరినది 1 + పడు చేరినది 1 + కొను పడులు రెండును జేరినది 1-నాల్గగును

౨వ వివ స్వరూప 1 మైత్రుఁడు వంటకమును వండెను 2 మైత్రుఁడు వంటకమును వండికొనియెను-ఆత్మనే పదార్థకము 3 మైత్రుని చేత వంటకము వండఁబడియెను-కర్మార్థకము 4 మైత్రునిచేత వంటకము వండి కొనఁబడియె-ఆత్మనేపద కర్మార్థకము

ప్రేరణ 1 చైత్రుఁడు మైత్రునిచేత వంటకమును వండించెను-ప్రేరణము 2 చైత్రుఁడు మైత్రునిచేత వంటకమును వండించుకొనియెను-ప్రేరణాత్మనేపదార్థకము 3 చైత్రునిచేత మైత్రుని చేత వంటకము వండింపఁబడియెను-(ప్రేరణ కర్మార్థక రూపము) 4 చైత్రునిచేత మైత్రునిచేత వంటకము వండించికొనఁబడియెను (ప్రేరణాత్మనేపద కర్మార్థకము)

అకర్మక ధాతువుల కప్రేరణంబున నాత్మనేపద కర్మార్థము లుండనేరవు గాన సకర్మకత్వము నొక భేదమును ప్రేరణాత్మకమున నాల్గును గల్పి యైదు రూపంబు లుండును ౧౨౩

అకర్మకము లకు ప్రేరణంబున మైత్రుఁడు మఱియె ను అకర్మకంబులకుఁ ప్రేరణమున 1 చైత్రుఁడు మైత్రుని మఱచెను (ప్రేరణార్థకము) 2 చైత్రుఁడు మైత్రుని మఱచికొనియెను (ప్రేరణాత్మనేపదార్థకము) 3 చైత్రునిచేత మైత్రుఁడు మఱవఁబడియెను (ప్రేరణ కర్మార్థకము) 4 చైత్రునిచేత మైత్రుఁడు మఱచికొనఁబడియె (ప్రేరణాత్మనే పద కర్మార్థకము)

౧౨ వివ రెండియుం బ్రేరణంబునందు దించు గాగమము గల్గినచో సకర్మకంబునకుం బండ్రెండును నకర్మకంబునకుం దొమ్మిదియు భేదంబులు గల్గునని యూహించునది

ఇది క్రియా పరిచ్ఛేదము

౦) --(౦

# బాలవ్యాకరణోద్ద్యోతము

## కృదంతపరిచ్ఛేదము

౧వ సూ క్రియా ౧ 'ధాతువు' అను నధికారసూత్రమును కృదంత పరిచ్ఛేద సమాప్తి వఱకును నన్వయింపవలయును ధాతువునకుఁ బరముగా విహితములగు ప్రత్యయములలో "తుమున్నును (క్రియా ౧౬వ సూ), ఇంచుక్కును (క్రియా ౨వ సూ-౨౩వ సూ), చుక్కును (క్రియా ౨౬వ సూ), పుక్కును (క్రియా ౩౨వ సూ), పద్వానుబంధమును (క్రియా ౫౯వ సూ), 'కొను' శబ్దంబును (క్రియా ౬౨వ సూ)" అనునవి తప్పఁ దక్కిన యావఱ కుపదేశించిన 'ట' మున్నగు (క్రియా ౪౬వ సూ-మొ-౫౨వ సూ-వ) ప్రత్యయములును నిటపైని జెప్పఁబడు 'క' ప్రత్యయాదులును 'కృత్తు' లనఁబడును * ఇంచుగంతములు మొదలయినవి ధాతువులె యనఁబడును తద్ధితాంతములకువలెనె కృత్ప్రత్యయాంతములకును కారక ౧వ సూ ౧వ వివరణము చొప్పునఁ బ్రాతిపదికత్వము కల్గును దానిపయిన వాక్యాన్వయ యోగ్యములగు విభక్త్యాదులు నిల్చును

అట్టి కృత్తులు రెండు విధములు 1 ఆచ్ఛిక కృత్తులు "ట-అమి-ఇ-అక మొ చేయుట-చేయుమి-చేసి-చేయక-చేయుచున్-చేయుచున్-చేసికొన్-చేయుచున్న-చెయఁగల-చేసిన-చేయని-చేయు-చేసెడు-చేసెడి-చేయుచున్ (వగయిరా)" మొదలగునవి యావఱ కుపదేశించినవి వక్ష్యమాణములు క-అమి మొ ఎఱుక-పూనిక-కలిమి-కూరిమి-చేత-కూఁత మొ ॥ సా సంస్కృతికములు అన-తవ్య మొ అన కృ+అన-కరణము భూ+తవ్య-భవితవ్యము ఇట్లె భవనము-గన్తవ్యము మొ

ఆచ్ఛిక కృత్తుల యర్థములు యథావ్యవహారంబుగ గ్రాహ్యంబులు ౧ (బా-కృ-౧వ సూ, వ్యా-సం-౩౫౫ I పిష)

---

* "ధాతువునకు ఎఱాతంబయిన 'తిఙ్' భిన్న ప్రత్యయంబు కృత్తనాఁబడు" అని సూరి వచించెను కాన పక్షమున 'ఇంచుక్కు' మున్నగునవియుఁ గృత్తులను భ్రాంతి గల్గును

ఒక్కొక్క ప్రత్యయమె వివిధార్థంబులు నగుచుండును మొలక (ఇది కర్త్రర్థకము) కానుక (ఇది కర్మార్థకము)

## ధాతువు తుది 'కా' దుల లోపము

ఇటం గృత్ "క-గ-త-ప పేములు (ప+ఇమి)" పరంబులగునపుడు ధాతువు తుదినున్న "క-గ-చ-య-వ" లకు లోపంబగు ౨ (బా-కృ-౨, వ్యా-సం-३३८ విష)

ఆచ్ఛిక కృత్సంబంధులగు కాదులు పరంబు లగునపుడు ధాతువు తుది 'క-గ-చ-య-వ' లకు వానిమీఁది యచ్చులతోఁగూడ లోపం బగునని యర్థము 'ఇట' అనుటచేత నీ విధి యీ యాచ్ఛిక కృత్పరిచ్ఛేదమందు మాత్రమె వర్తిల్లు నని యెఱుంగునది కాన "కలుగు+క = (క్రియా ३० సూ) కలుగక" మున్నగు క్రియాపరిచ్ఛేదోక్త కృత్ప్రత్యయము లెడల సమస్త మీవిధి వర్తిల్ల నేరదు ఉదా ఆఁగు+క (ఆచ్ఛి-కృత్-३వ సూ) ఆఁక ఱురియు+ప (ఆచ్ఛి-కృ-౯వ సూ) ఱురిపము కలుగు+ఇమి (ఆచ్ఛి-కృత్-౧౪వ సూ) కలిమి ఈ యాచ్ఛిక కృత్ప్రత్యయములలో నెల్లనియు నావృత్తి గణ ఘటిత ములై యుండదగు 'ఇమి' అనునది 'ఇడి' మున్నగువాని కుపలక్షణము (చూ-కృత్తు ౨౬వ సూ)

'క' వర్ణకం బలుగ్వాదుల కగు ३ (బా-కృ-३వ సూ, వ్యా-సం-३३८ ష)

అలుగు+క-అలుక (కోపము-భావా) ఆఁక (ఆఁగు+క నిరోధము-భావా) ఎఱుక (ఎఱుఁగు+క-ఎఱుఁగుట-భావా, ఇట బిందులోపంబు - ఇట్లు గొన్నిట నెఱుఁగునది) దీనికి 'జ్ఞానము-సోదె-జ్యోతిశ్శాస్త్రము' అనునవి యర్థ ములగునపు డిది కరణార్థకము (సాధన మగునని యర్థము) కదఁక (కదఁగు+క-పూనిక భావా) కలఁక (కలఁగు+క-సంక్షోభము-భావా) కాఁక (కాఁగు+క-తాపము-భావా) తునుక (తునుఁగు+క-ఖండము-కర్తరి) నడక

२३)

(నడచు + క గమన ...-భావా) నంక (నంగు + క-నంగుట-భావా) పోక (పోవు + క-పోవుట-భావా) మడఁక (మడఁగు + క-ధౌతవస్త్రము-కర్త్రి) మలఁక (మలఁగు + క-మెలిక-భావా) మునుక (మునుఁగు + క మునుఁగుట-భావా) మూక (మూఁగు + క-సంఘము కర్త్రి) మొలక (మొలచు + క-అంకురము-కర్త్రి) రాక (వచ్చు + క వచ్చునకు 'రా'-ఆగమనము-భావా) వంక (వంగు + క-వంకర-కర్త్రి) వీఁక (వీఁగు + క-పెల్లువీఁగుట-ఓకుట-భావా) కానుక (కను + క-'ఇక-క-పు' అనునవి పరంబు లగునపుడు 'కను' నకు దీర్ఘంబు-ఉపాయనము-కర్మ) కినుక (కినియు + క కోపము-భావా) నుదుక (నుదియు + క-వృద్ధి-కర్త్రి)-ఇత్యాదు లలుగ్వాదులు

## 'ఇమి-తజ్' అను కృత్తులు

'ఇమి' పర్ణకంబు కలుగ్వాదుల కగు ౪ (బా-కృ-౪, వ్యా-సం-౩౫౮ విష)

కలిమి (కలుగు + ఇమి-కల్గుట-భావా 'సంపద' అర్థమగుచో నధికరణార్థకము) ఓరిమి (ఓరుచు + ఇమి-భావా) కూరిమి (కూరుచు + ఇమి-కరణాదిరి చేతఁ బ్రీతిని గూర్తురు) నేరిమి (నేరుచు + ఇమి-భావా) వేలిమి (వేలుచు + ఇమి-భావా-హోమము 'వ్రేలుచు' అను దానికి 'హోమము చేయు' అను నర్థము లేదు) బడిమి (బడిసు + ఇమి-గఁదుపుటుట-భావా) బ్రిదిమి ([illegible] + ఇమి-జీవనము-భావా) ఒడ్డిమి (ఒడ్డు + ఇమి-పందెమున నొడ్డఁబడిన ధనాదికము-కర్మ) తాలిమి (తాలు + ఇమి-ఓర్మి-'తాలు' ధాతుజ మన్నయెడల భావార్థకము, 'తాల్చు' ధాతుజ మన్న పక్షమున నధికరణార్థకము దీనియందు ధైర్యము తాల్తురు) ఇత్యాదులు

'తజ్' పర్ణకము చేయ్యాదుల కగు ౫ (బా-కృ-౫, వ్యా-సం-౩౫౮ విష)

చేఁత (చేయు + త-చేయుట-భావా 'కృత్యము-పని' అర్థమగునపుడు-కర్మార్థకము-చేయఁబడునది) జీత్తు గా [illegible] పూర్వకము చూ-తత్స-[illegible] సూ) 'దాయు-దాయు-కలయు' అన్నగుదానికి రానేరదు కాన నిది భావార్థక 'ట'

ప్రత్యయము (క్రియా-ఆధారసూ)వంటిది. ఇట్లు అలంత (అలయు + త-అలయుట -భావా) కూఁత (కూయు + త-భావా) 'మొఱ్ఱ' అను నర్థమున గర్మార్థకము కూయఁబడునది) కోఁత (కోయు + త-భావా) గీఁత (గీయుట-భావా) నేఁత (నేయు + త-భావా) పూఁత (పూయు + త-పంపినా వ్యు-కర్మా-పూయఁబడునది) పోఁత (పోయు + త-భావా) మూఁత (మూయు + త-మూయుటలో నగునది-కర్త) మేఁత (మేయు + త-మేయుట-భావా) పశ్వాదుల యాహార మర్థమగునపుడు-కర్మార్థకము) మ్రోఁత (మ్రోయు + త, ధ్వని-భావా) రోఁత (రోయు + త-జుగుప్స-భావా రోఁతలు-తిట్లు-కర్మా) లాఁత (లాయు + త, ఉద్రేకించుట-భావా) వ్రాఁత (వ్రాయు + త-వ్రాయుట-భావా) 'లేఖనము' కర్మా-వ్రాయఁబడునది) వ్రేఁత (వ్రేయు + త-వ్రేయుట-భావా వ్రేఁత-దెబ్బ కర్మా వ్రేయఁబడునది) ఈఁత (ఈఁదు + త, 'దు'లోపము, నీటిపైఁ దేలుట-భావా) పుడఁత (పుడఁచు + త, ధౌతవస్త్రము-కర్త) కలఁత (కలఁగు + త సంక్షోభము-భావా) ఇత్యాదులు

## 'కువ-కు' ప్రత్యయములు

'కువ' వర్ణకం బడంగ్వాదుల కగు ఉ (బా-కృ-ఉ)

అడఁకువ (అడఁగు + కువ-భావా, రూ-అణఁకువ అచ్చి-ఆంధ్ర సూ) ఎఱుకువ (ఎఱుఁగు + కువ-తెలివి కరణా దీనిచేతఁ దెలియఁబడును, ఇది నిర్వ్యాపక శబ్దము) కలఁకువ (కలఁగు + కువ-సంక్షోభము భావా) నలఁకువ (నలఁగు + కువ-ఆపద-వ్యాధి-భావా, నలఁకువ-శ్రమ-కరణా దీనిచేత శ్రమ గల్గును) పెనఁకువ (పెనఁగు + కువ, పెనఁగుట-భావా-పెనఁకువ-యుద్ధము అధికరణార్థకము దీనియందు వెనఁగులాడుదురు) పొలకువ (పొలయు + కువ-జాడ భావా, పొలకువ-మార్గము-అధికర-దీనియందుఁ బొలయుదురు-సంచరింతురు) మఱకువ(మఱచు + కువ, అజ్ఞానము-కరణా దినిచే మఱపు గల్గును) మెలఁకువ (మెలఁగు + కువ-జాగరూకతతోడ వర్తనము-భావా, మెలఁకువ-మెలఁకువలు-అధికర దీనియందు మెలఁగుదురు) లోఁకువ (లోఁగు + కువ-లొంగుబాటు-భావా) వేకువ (వేగు + కువ-ప్రాతఃకాలము-అధికర, దీనియందు వెగును-తెల్లవారును) ఇత్యాదులు

'ట' వర్ణకం బాడ్వాబుు కగు, నగువో నంత లోపంబగు ౭ (బా-కృత్-౭ సూ, వ్యా-సం-౩౬౧ విష)

ఆట (ఆడు ట-భావా) ఊట (ఊఱు + ట-క ర్త9, ఊఱిన ద్రవము) ఊఱట (ఊఱడు + ట, ఊరిడిల్లుట-భావా, ఊఱట-సహాయము-క ర్త9) ఏఁకట (ఏకరు + ట, అపేక్ష-భావా) ఓట (ఓడు + ట భావా-రూపా-ఓటము-ఓటమి) తివుట(తిరువు + ట-కాంక్ష-భావా) తేట(తేఱు + ట-మీఁదికిఁ దేఱునది-క ర్త9) త్రిమ్మట (త్రిమ్మరు + ట-పర్యటనము-భావా) పంట (పండు + ట, భావా) పాట (పాడు + ట, గానము-కర్మ-పాడఁబడునది) మంట (మండు + ట-జ్వాల-క ర్త9) వంట (వండు + ట-భావా) వేపట (వేపరు + ట, విసుగు-భావా) అనుప్రయుక్తమగు 'ఆట' శబ్దము ప్రాణికముగాఁ గ్లిబసమంబు-కోలాటము-పోరాటము, 'పోరాట' అనియుఁ గలదు "నిటి పోరాటం దోటమి పాటు" (భాగ-గజేంద్రో) మండ్రాటము (సంతాపము) 'కొనియాట' అనియే యున్నది-ఇత్యాదులు

## 'టు-వ' ప్రత్యయములు

'టు' వర్ణంబు పడ్వాబుు గు, గుచో ంవి యూఙ్త్యక్షర శేషంబులయి దర్ఘింబు నొందు ౮ (బా-కృత్-౮, వ్యా-సం-౩౬౨ వి)

పాటు (పడు + ట-పడుట-భావా పాటు-ఆపద-అధికర దీనియందు పడుదురు) చేటు (చెడు + టు, చెడుట-భావా, చేటు-ఆపద-అధికర-దీని యందుఁ జెడుదురు) ఆటు (అడుచు + టు-హాలి-దెబ్బ-భావా) కాటు (కఱచు + టు, భావా, కఱచు-అభ్యసించు' అనుదానికి ప్రత్యయము రాదు అది 'కఱపు' అగును) పోటు (పొడుచు + టు భావా) వాటు (వయుచు + టు-వైచుట-భావా) ఏటు (ఏయు + టు-బాణాదులను బ్రయోగించు-భావా) ఓటు (ఓడు + టు, భావా) ప్రేటు (ప్రేయు + టు-కొట్టు-భావా, రూపా-వేటు) ఇత్యాదులు

'వ' వర్ణకంబు తిఙ్మప్వాదుల గగు ౯ (బా-కృత్౯ వ్యా-సం-౩౬౩ విష)

తిరిపము (తిరియు + ప-భిక్షము-భావా, ఈ 'ప' వర్ణ కాంతములు ప్రాయికముగా నపుంసక లింగ సమములు) తిరిపఁడు (భిక్షించువాఁడు-కర్త్రి-రూపా-తిరిపకాఁడు-తిరిపరి) కలియు-కలయు + ప-కలపము (లేపన ద్రవ్య విశేషము-కర్మా-పరిమళ ద్రవ్యములతోఁ గలపఁబడినది-లేదా-అధికరణార్థకము-పరిమళ ద్రవ్యములు దీనియందుఁ గలియును) పొలపము (పొలయు + ప-వ్యాపనము-భావా) మురిపము (మురియు + ప-నడకయందలి కులుకు-భావా; రూపాం-మురిపెము) వలిపము(వలియు + ప-సన్నగిల్లునది-కర్త్రి)ఇత్యాదులు

## 'త-పు' వర్ణకములు

'త' వర్ణకం బావులించు లోనగువాని కగు ౧౦ (బా-కృత్-౧౦, వ్యా-సం-౩౬౪ విష)

ఆవులింత (ఆవులించు + త) ఇవెల్ల భావార్థకములె అంగలాదులలోనివి గాన వీనికి స్వార్థమునం దించు కగు (క్రియా-౨౨ సూ) వీనికి 'త' వర్ణక పరకత్వమునఁ దుది 'చు' వర్ణము లోపించును ఇగిలింత (ఇగిలించు + త) ఓకిలింత (ఓకిలించు + త) కుళ్ళగింత (కుళ్ళగించు + త) కుసిలింత (కుసిలించు + త-అతృప్తిచే ఖేదపడు) కొక్కిరింత (కొక్కిరించు + త-పరిహసించుట) కొప్పరింత (కొప్పరించు + త-విజృంభణము) గిలిగింత (గిలిగించు + త-చక్కిలిగింత-కితకితలు పెట్టుట) ఇత్యాదులు

'పు' వర్ణకంబు మాయ్యాదుల కగు ౧౧ (బా-కృత్-౧౧, వ్యా-సం-౩౬౫ విష)

మాపు (మాయు + పు-భావా, మాపు - రాత్రి - అధికర - దీనియందుఁ గన్నులు మాసిపోవును) మేపు (మేయు + పు-మేఁత-భావా, మేపు-పశ్వాద్యాహారము కర్మార్థకము మేయఁబడునది) అడుపు (అడుచు + పు-దెబ్బ-భావా, అణుపు-రూపా-ఆచ్చి-౪౦ చూ) ఇఁపు (ఇంచు + పు, భావా) ఏఁపు (ఏఁచు + పు-వేఁచుట భావా, ఏము + పు-వృద్ధి-భావా) కాపు (కాచు + పు, చూ కృత్తు-౩౨ సూ- ఎసూ ౨-వీక్షణము-భావా) కాపు (కాచు + పు, కాయలు కాచుట-

రక్షించు ౦-భావా, కాపు-రక్షకుఁడు-కర్త) చూపు (చూచు + పు-వీక్షణము భావా) తలఁపు (తలఁచు + పు-తలఁచుట-భావా, తలఁపు-వాంఛ-ఇచ్ఛ-కర్మా-తలఁపఁబడునది) తోఁపు (తోఁచు + పు-తలంచుట-భావా) త్రేఁపు (త్రేఁచు + పు-ఉద్గారము-భావా) త్రోపు (త్రోచు + పు-త్రోయుట-భావా) పూఁపు (పూఁచు + పు-బండికెడ్లనుఁ బూఁచిన పూఁపు-భావా) పెనుపు (పెనుచు + పు-పెంచుట-భావా) పొలుపు (పొలుచు + పు-ఒప్పిదము-భావా) ప్రోపు (ప్రోచు + పు-రక్షణము-భావా) మెప్పు (మెచ్చు + పు-శ్లాఘ-భావా) మోపు (మోచు + పు-గడ్డి లోనగువాని కట్ట-భావా లేదా-కర్మా-మోయఁబడునది) వలపు (వలచు + పు-కోరిక-వాసన-కర్మా-వలఁచఁ బడునది) వాపు (వాచు + పు-ఉబ్బు-భావా) వేలుపు (వేలుచు + పు-వేల్వఁబడునది-కర్మా)-ఇత్యాదులు

## పు-ఇంపు-ఇక వర్ణకములు

'రక్షింపు (రక్షించు + పు-రక్షణము-భావా)'' అను రీతిని దత్సమ ధాతువులపైని 'పు' వర్ణకము నిలుచు (రక్షింపుట మొదలగు వానివలె) వాడుక కలదు ఇట్లె బోధింపు-పోషింపు-మేళగింపు మొ "క్వచి దింపు ర్వతాం కేచి। దూచిరే సహి మే రుచిః'' అని యథర్వణుఁ డనెను (వ్యా-సం-౩౦౯-౩౦౯ I విష) 'ఆరగింపు' (పర-౪ ౩-౧౯౯, సూ-క్రియా-౪౬ సూ ౬ వివ)

'ఇక' వర్ణకం బంజ్వాదుల కగు ౧౭ (బా-కృత్-౧౭ సూ, వ్యా-సం-౩౬౬ విష)

[illegible] ( [illegible] + ఇ - [illegible]-భావా) [illegible] (అమరు + ఇక-ఒప్పిదము-భావా) [illegible] ([illegible] + ఇ -అరయుట-భావా। అలయిక (అలయు + ఇక-[illegible]-భావా) [illegible] ([illegible] + ఇ-[illegible]-భావా) ఓడికి (ఓడు + ఇక-[illegible] ది-[illegible]) ఓపిక (ఓపు + ఇ - ఓపుట-భావా) కానిక (కను + ఇక-దీర్ఘము-మా-[illegible]-ఉపాయనము-కర్మా-గౌరవము [illegible]) [illegible] ([illegible] + ఇ -కూర్చుట-భావా) కోరిక (కోరు + ఇ- [illegible]-కర్మా కోరఁబడునది) పొందిక (పొందు + ఇక-ఒప్పిదము-భావా) [illegible] (పోవు + ఇక-పోవుట-భావా) తూనిక

(తూఁగు + ఇక, తూఁగునకు-తూచ్వాదేశము-తూఁచు - అధికర - దీని యందు సరిగఁ దూఁగును-ఇత్యాదులు

## నవర్ణకోదాహృతులు

'వీచు' ప్రభృతులకు 'నజి' యగు ౧౩ (బా-కృత్-౧౩, వ్యా-సం-౩౬౭ విష)

వీచన (వీచు + నజి నజి జిత్తుగాన క్రియా-౨౦వ సూ చెప్పిన 'ఉ' కారమునకు 'అ'త్వమును, క్రియా-౯౦-౯౧ సూ చెప్పిన చకారమునకు 'వ'త్వము నగును, వ్యజనము-కర్త్రి-విసరునది-విసనకఱ్ఱ) దట్టన (దట్టించు + నజి, తర్జనము-దట్టించుట-భావా)* ఇత్యాదులు

౧వ వివ 'దట్టించు' లోనగువానికి 'నజి' పరమగునపుడు 'దట్టన'-దట్టనము' మున్నగు రూపము లేర్పడును ఉదా దట్టించు + నజి-దట్టన దీవించు + నజి-దీవన (రూపాం-దీవెన-భావా) పాటించు + నజి-పాటన (ఆదరణము-భావా)-ఇత్యాదులు

## 'బడి-గడ' వర్ణకములు

'బడి' యేల్వాదుల కగు ౧౪ (బా-కృత్-౧౪ వ్యా-సం-౩౬౮ విష)

ఏలుబడి (ఏలు + బడి-భావా) కట్టుబడి (కట్టు + బడి-పన్ను-కర్మా-

---

* సూరి ''అర్పాదులకు 'నజి' యగు'' (బా-కృత్-౧౩) అని సూత్రించుట సరికాదు అవి కృదంతము లనరాదు అవి 'అర్పణ' మున్నగు ప్రకృతుల వైకృతము లనుట యుక్తము సంస్కృ-అర్పణమ్, వైకృ అప్పన-అప్పనము (రూపాం-ఒప్పన-ఒప్పనము) సంస్కృ-ఉజ్ఝనమ్, వైకృ ఉజ్జన-ఉజ్జనము (విడుమట) సంస్కృ ఘట్టనా-ఘట్టనమ్, వైకృ గట్టన-గట్టనము సంస్కృ-గణనా-లేదా-ఘటనా-ఘటనమ్, వైకృ గడన-గడనము సంస్కృ-మార్జనా-మార్జనమ్, వైకృ మన్నన-మన్ననము ము

కట్టఁబడునది) కనుబడి (కను + బడి-రాజులు తీసికొను పన్ను-కర్మార్థకము-రాజులచేఁ గనఁబడునది) కొనుబడి (కొను + బడి-భావా) గిట్టుబడి (గిట్టు + బడి-కొనుటలోని గిట్టుపాటు-భావా) చెల్లుబడి (చెల్లు + బడి-మాట చెల్లుట-భావా) చేరుబడి (చేరు + బడి-సమీపము-కర్త్రి-సమీపించునది) తగులుబడి (తగులు + బడి-కొలుబడి మున్నగువానిలోని తగులుపాటు-భావా) తీఱుబడి (తీఱు + బడి-అవకాశము-భావా) పెట్టుబడి (పెట్టు + బడి-వ్యాపారమున ముందుగఁ బెట్టు ధనాదికము-కర్మా పెట్టఁబడునది) పోబడి (పోవు + బడి-వులోపము-పోవుట-భావా) మ్రొక్కుబడి (మ్రొక్కు + బడి-దేవతాదికమునకు మ్రొక్కుకొనుట-అధికరణా దీనియందు ధనాదికముతో మ్రొక్కుదురు) వచ్చుబడి (వచ్చు + బడి-ఇతరులు నుండి వచ్చునది-కర్త్రి, రూపాం-రాబడి) సాగుబడి (సాగు + బడి-కృషి-అధికర-దీనియందు సాగ-యత్నము చేయుదురు) ఇత్యాదులు

'గడ' చేర్వాదుల కగు ౧౩ (బా-కృత్-౧౩, వ్యా-సం-౩౬౯ వి)

చేరుగడ (చేరు + గడ-సమీపము-కర్త్రి, సమీపించునది-చేరుగడ-శరణము-కర్మార్థ-ఆర్తులచేఁ బొందఁబడునది) తిరుగడ (తిరుగు + గడ-గులోపము-మఱచేతఁ దిరుగునది-కర్త్రి) తీఱుగడ (తీఱు + గడ-తీఱిక-భావా) తేఱుగడ (తేఱు + గడ-తేటపడుట-భావా) త్రెగడ (త్రేఁచు + గడ-చులోపము, బిందులోపము-ఉద్గారము-భావా) మనుగడ (మను + గడ-మనుట-భావా) మనుగడ-జీవనోపాయము-కరణార్థకము దీనిచేత జీవింతురు) విడుగడ (వీడుగడ-విడు + గడ-విడుపు-భావా) ఇత్యాదులు

## 'ఇకి-వు-అ' అను ప్రత్యయములు

'ఇకి' కోర్వాదుల కగు ౧౨ (బా-కృ-౧౩, వ్యా-సం-౩౭౦ విశ)

కోరిక (కోరు + ఇకి-ఇచ్ఛ-భావా) పూనిక (పూను + ఇకి-పూనిక-భావా) పోలిక (పోలు + ఇకి-పోలిక-భావా) మనికి (మను + ఇకి-జీవించుట-భావా మనికి-నివాసస్థానము-అధిక-దీనియందు మనుదురు) వినికి (విను +

ఇకి-వినుట-భావా) చూడికి (చూచు + ఇకి-చూచునకు ముత్వరకత్వమందువలె 'చూడు' ఆదేశము-చూపు-భావా) ఇత్యాదులు

'వు' వర్ణకంబు మన్వాదుల కగు ౧౩ (బా-కృత్ ౧౭ వ్యా-సం-౩౭౧)

మనువు (మను + వు-జీవనము-భావా) కావు (కాచు + వు-రక్షణము చేయు, బొట్టు-కర్త్రి, దృష్ట్యాదిదోషములను గాచునది) కొలువు (కొలుచు + వు-సేవ-భావా) చావు (చచ్చు + వు-వర్ణలోపాది వికృతి-మరణము-భావా) తడవు (తడయు + వు-ఆలస్యము-భావా) నిలువు (నిలుచు + వు - నిల్చుట-భావా) నోవు (నొచ్చు + వు, రూ నొవ్వు, నొచ్చునకు 'నో' వచ్చును-నొప్పి -భావా) పూవు (పూచు + వు రూపా-పువ్వు- పుష్పము-కర్మార్థ - పూయఁబడునది, ప్రువ్వు ప్రుచ్చు + వు-'చ' ద్వయమునకు 'వ' ద్వయము-పురుగు-పురువు కరణా-దీనిచేతఁ బ్రుచ్చును) పుట్టువు (పుట్టు + వు-జన్మము-భావా) తొడరువు (తొడరు + వు-యత్నము-భావా) ఇత్యాదులు

'అ' వర్ణకంబు గీత్యా (ర్యా) దుల కగు ౧౮ (బా-కృత్-౧౮, వ్యా-సం-౩౭౨ విష స్పష్టార్థము ఙ్యా)

గీఱ (గీఱు + అ-గీఁత-భావా) ఊఁద (ఊఁదు + అ-ఊఁబ్బ-భావా) ఎండ (ఎండు + అ - సూర్యాతపము కర్త్రి - అంతర్గత ప్రేరణార్థకము-ఎండించునది) కాయ (కాయు + అ- శలాటువు-కర్మార్థ చెట్టుచేఁ గాయఁబడునది) చదియ (చదియు + అ-నలఁగుడు- భావా) తునియ (తునియు + అ-ఖండము-కర్త్రి-తునిసినది) పరియ (పరియు + అ-బీఁట-భావా) పాయ (పాయు + అ-నచె చీలి-కర్త్రి- ఒక వస్తువునుండి పాయునది) పిడుచ (పిడుచు + అ-అన్నము పోయగువానికియుద్ద-కర్మార్థ-పిడుకఁబడునది) మీట (మీటు + అ-ఏతము మున్నగువానికీలు-కర్త్రి-మీటునది) ముడియ (ముడియు + అ-మూట-కర్మార్థ-ముడువఁబడునది) ఏపర (ఏచరు + అ- పేలు-కర్త్రర్థ-ఏచరు వాఁడు) ప్రమ్మ (ప్రమ్ము + అ-ఖండము-కర్త్రి-ప్రమ్మునది) ఇత్యాదులు.

## 'అక-డు' ప్రత్యయములు

'అక' వర్ణకంబు మాఱ్పా (ర్వా) దులకగు ౧౫ (బా-కృ-౧౫ వ్యా-సం-౩౭౫-విష)

మాఱకము (మాఱు + అక మార్పు-భావా) 'అక' ప్రత్యయాంతము లెల్ల నపుంసక సమములు అమ్మకము (అమ్ము + అక-అమ్ముట-భావా) అంపకము (అంపు + అక-ప్రేషణము-ప్రేరణా-భావా చూ-క్రియా-౧౦ వ సూ) పంపకము (పంచు + అక-చకారమునకు 'ప' త్వము, విభాగము-భావా పంపు + అక-క్రియా-౧౦ వ సూ-పంపకము-ప్రేషణము-భావా) వంటకము (వండు + అక 'డ' కారమునకు 'ట' కా రాదేశము-అన్నాదికము-కర్మార్థ-వండఁబడునది) త్రోమకము (త్రోము + అక-తోముట-భావా, 'త్రోము' అను రేఫమున కాధార మగపడదు శ-ర-లో 'తోమక' మనియే యున్నది) అద్దకము (అద్దు + అక-వస్త్రములకు వేయు రంగు-కర్మార్థ-అద్దఁబడునది)

'డు' వర్ణకం బాఱ్పా (ర్వా) దులకగు, నగునపుడు పకారంబు 'చ-య' ల కగు ౨౦ (బా-కృ-౨౦ వ్యా-సం-౩౭౪ విష)

ఆఱుడు (ఆఱు + డు-నిర్ధనమగుట-భావా) అమ్ముడు (అమ్ము + డు-అమ్మకము-భావా) అల్లుడు (అల్లు + డు-అల్లిక-భావా, ఇది నిర్బంధుకము-జామాతర్థకము కాదు ప్రాఁకు-అధికర-ఎతాదికము దీనియందల్లుకొనును) ఎక్కుడు (ఎక్కు + డు-ఎక్కుట-భావా ఎక్కుడు-వాహనము-అధికర-దీనియం దెక్కు చురు) క్రుమ్ముడు (క్రుమ్ము + డు-క్రుమ్ముట-భావా) చోపుడు (చోపు + డు-కలఁత-భావా, చోపు-కలఁచు-తరుము-మొ) త్రొక్కుడు (త్రొక్కు + డు-ఆపద-భావా) త్రోపుడు (త్రోసు + డు- త్రోపు-భావా) దంపుడు (దంచు + డు-దంపుట భావా) దాఁపుడు (దాఁచు + డు-దాఁచుట-భావా) దిగుడు (దిగు + డు-పల్లము-కర్త-దిగుఁడు) దోఁపుడు (దోఁచు + డు-కొల్ల-భావా) పెంపుడు (పెంచు + డు-కర్మార్థ-పెంపఁబడునది) పేఁపుడు (పేఁచు + డు-ధావా అధిపుఁడని యర్థము) ప్రాఁకుడు (ప్రాఁకు + డు-ప్రాఁకుట-భావా) మాపుడు

(మాయు + డు-మాటికి-భావా) రా పుడు (రామ + డు-రాచుట-భావా)-ఇత్యాదులు

## 'ఉ' ప్రత్యయము

'ఉ' వర్ణకం బడుక్వాదుల కగు ౨౧ (బా-కృ-౨౧, వ్యా-సం-౩౭౩ విష )

అడుకు (అడుకు + ఉ-దొంతి-కర్మా-దొంతిగ నిల్పబడినది అడుకులు-ఓపిటములు, అటుగులు వ్యావహా నిత్యబహువచనము-దీని కిధాతువుతో సంబంధ మగపడదు) అంటు (అంటు + ఉ-ఆశౌచము-అపాదానా-అంటుట వల్లఁ గల్గునది-అంట్ల-బహు-వండిన పాత్రలు-కర్త్రి-మసి యంటునవి) ఒప్పు (ఒప్పు + ఉ-ఒప్పిదము - భావా) ఒఱుగు (ఒఱుగు + ఉ - ఒఱుగుట-భావా-'ఒఱగు' అనియు నన వచ్చును నిర్ణాయక ప్రయోగము లెదు) ఒసఁగు(ఒసఁగు + ఉ-ఈవి-కర్మా-ఒసఁగఁబడునది ) ఇత్యాదులు ఆది శబ్దముచే "చదువు (చదువు + ఉ-విద్య) అడలు (అడలు + ఉ-దుఃఖము) పలుకు (పలుకు + ఉ -మాట) ఒడ్డు (ఒడ్డు + ఉ-పందెము) కఱపు (కఱపు + ఉ-కఱచు-ప్రేర కఱపు-బోధనము) ఎఱుకు (ఎఱుఁగు + ఉ గకారము కకార మగును-సోదె చెప్పువాఁడు) పుట్టు (పుట్టు + ఉ-జన్మము) హెచ్చు( హెచ్చు + ఉ-అధిక్యము) ఉబ్బు(ఉబ్బు + ఉ-ఉబ్బిపోవుట) చెప్పు (చెప్పు + ఉ-చెప్పినమాట) కుడుపు (దీని'చ'కారము 'ప'కార మగును, కుడుచు + ఉ-కూడు-అన్నము)"-మొదలగు వానిని గ్రహింపనగును

## 'వడి' ప్రభృతులు - 'ఇ' ప్రత్యయము

'వడి' ప్రభృతులు నిల్లెఱుంగునది ౨౨, (బా-కృత్-౨౨, వ్యా-సం-౩౭౮ విష)

వడి కొలువడి (కొలుచు + వడి-కొలఁత-భావా) గెలువడి (గెలుచు + వడి-గెలుపు భావా) నడపడి (నడుచు + పడి-ప్రవర్తనము-భావా) లేవడి (లేఁగు వ్యతిరేకము-లే + వడి-చూ క్రియా-౧౧౦ సూ దీని పర్యాయము-లేమి-క్రియా ౧౧౦ లేమి + ఇడి-లేమిడి-ఇది తద్ధితాంతము)

వి విరివి (విరియు + వి-విస్తృతి-భావా) తెలివి (తెలియు + వి-వివేకము-కరణా-దీనిచే నెల్లయుఁ దెలియును) అవు తగవు (తగు + అవు-బహుమతి-కర్త-తగియుండునది తగవు - అభియోగము - అధికర - దీనియందు న్యాయము తేలును) నగవు (నగు + అవు-నవ్వుట-భావా) ఇ వ్రాయి (వ్రాయు + ఇ-అక్షరము-కర్మార్థ-వ్రాయఁబడునది) చేయి (చేయు + ఇ-కర్త-పనులుచేయునది) కలి కనుకలి (కను + కలి-చూపు-భావా) వినుకలి (విను + కలి-వినికి-భావా)- ఇత్యాదులు

డయ్యు-దయ్యు-నొచ్చు-పుచ్చులకు 'ఇ' వర్ణకింబగు, నగుచో వాని కడ హల్లు 'ప'కారంబగు ౨౩ ( ప్రౌఢ-కృత్-౧ , వ్యా-సం-౩౭౬ విష )

డప్పి (డయ్యు + ఇ-డప్పి-భావా) దప్పి(దయ్యు + ఇ-దప్పి -భావా) నొప్పి (నొచ్చు + ఇ-బాధ-భావా) పుప్పి పుచ్చు + ఇ-భావా)

## 'ఇడి-ఎన-పుర' ప్రత్యయములు

రాచున 'కిడి' వర్ణకంబగు ౨౪ (ప్రౌఢ-కృత్-౨వ సూ)

రాయిడి (కృత్తు ౨వ సూ 'చ' లోపము రాచు + ఇడి-ఉపద్రవము-భావా రాచు ధాతువునకు కృత్తు ౧౧వ సూ చొప్పున 'పు' రాఁగా 'రాపు' అగును కృత్తు-౨౦వ సూ-చొప్పున 'డు' రాఁగా 'రాపుడు' అగును 'రాచు' చకారము పకారమగును చూ-కృత్తు-౨౦వ సూ 'రాచు' నకు ఇడి' ప్రత్యయము చేరఁగా 'రాపిడి' అగును ఇందుచు 'చ' కారము 'ప' కార వగును)

ఈర్చుబ్బు కందు దువ్వు వడ్డించుల కెన వర్ణకం బగు, అగుచో 'ఈర్చు-ఉబ్బు'ల 'చ' కార 'బ' కారములు 'ప'కార మగును 'వడ్డించు' అను దాని 'ఇంచు' లుప్తంబగు ౨౫ ( ప్రౌఢ-కృత్తు-౩వ సూ, వ్యా-సం-౩౮౬విష)

ఈర్పెన ( ఈర్చు + ఎన-ఈళ్ళ దువ్వె-- ర్త-ఈరుల పేర్చునది ) ఉప్పెన (ఉబ్బు + ఎన-చూ-కృత్-౨౧వ సూ-సముద్రాదుల పొంగు-అధికర-

దీనియందు సముద్రాదు లుబ్బును) కందెన (కందు + ఎన-మసి-కరిణా-దీనిచే బండి యిరుసు నల్లనగును) దువ్వెన (దువ్వు + ఎన-కంకతిక-కేశప్రసాధని-పన్నె కర్త్రి-తల చిక్కు-ను దువ్వునది) వడ్డెన (వడ్డించు + ఎన-భోజ్య పదార్థములను భోజన పాత్రములందుఁ బెట్టుట-భావా)

'పుర' వర్ణకంబు కాచు-దాఁచు-దాయ్యాదులకగు ౨౬ ( ప్రౌఢ-కృత్-౪వ సూ, వ్యా-సం-౩౭౬ విష)

కాఁపురము (కాఁచు + పురము-సంసారము-కర్త్రి-కాఁగఁ జేయునది సంసారము జనులను గాఁగఁజేయు నని భావము) క్రాఁగు-ప్రే-క్రాచు, కాఁగు-ప్రే-కాఁచు ఇట్లగుటచేత దీనికి "కాచు = రక్షించు" అనునది మూలము కాదు దాఁపురము (దాఁచు + పురము-దాఁచుట-భావా) దాపురము(దాయు + పురము-సమీపము-కర్త్రి-సమీపించునది)

## 'మతి-వు-వలి-ఇలి-వ-దల-కడ' ప్రత్యయములు

ఎక్కు-దిగులకు ప్రేరణార్థంబున "మతి" వర్ణకంబగు అగుచో 'ఎగు' అనునది "ఎక్కు"న కాదేశం బగు ౨౭ (ప్రౌఢ-కృత్-౨౫ సూ, వ్యా-సం-౩౭౬ వి) ఎగుమతికి (ఎక్కు + మతి భావా) దిగుమతి (దిగు + మతి-భావా చూ-కృత్-౩౧)

'వు' వర్ణకం బులియ్యాదుల కగు ౨౮ (ప్రౌఢ-కృత్-౬వ సూ, వ్యా-సం-౩౭౬ విష) ఉలవు (ఉలియు + వు-ధ్వని-భావా) ము

'కాచు-వీచు' లకు 'వలి' వర్ణకంబగు ౨౯ (ప్రౌఢ-కృత్-౭, వ్యా-సం-౩౭౬ విష)

కావలి (కాచు + వలి-రక్షణము-భావా) వీవలి (వీచు + వలి-గాలి-కర్త్రి-వీచునది)

'ఒమగు' ప్రకృతులకు 'ఇలి' యగు ౩౦ (గణ, వ్యా-సం-౩౭౬)

ఒదిగిలి (ఒదుగు + ఇలి) పొక్కిలి (పొక్కు + ఇలి) చెక్కిలి (చెక్కు + ఇలి)

'వ' వర్ణకంబు శబ్దములకగు ౩౧ (గాణ). తెగువ (తెగు + వ-సాహసము) ఎగువ (ఎక్కు + వ-ఎక్కునకు ఎగు-చూ-కృ-౨౭వ సూ)

అరుగ్వాదులకు 'దల' యగు ౩౨ (గాణ, వ్యా-సం-౩౭౬ విశ) అరుగుదల (అరుగు + దల) విడుదల (విడు + దల) మొ

'వచ్చు-పోవు-నిలుచు' లకు 'కడ' వర్ణకం బగు ౩౩ (గాణ, వ్యా-సం-౩౭౬)

రాకడ (వచ్చు + కడ-వచ్చునకు-'రా') పోకడ (పోవు + కడ-పోవు 'వు' లోపము) నిలుకడ (నిలుచు + కడ)

తెలియునకు 'విడి' యు, కొనునకు 'కోలు' నగు ౩౪

తెలివిడి (తెలియు + విడి) పొగక్కోలు (పొగు + కొను) విల్చుకోలు (విల్చు + కొను)

ఇట్లే-ఉక్కివము (ఉక్కు + ఇవము సంస్కృతము) అలుకలుంబు (బాధ-అలుగు) పని (పడు + ఇ) మొదలుగు తెలుగు కృత్తులనంతములు వానిని సాకల్యముగా నుపదేశింప శక్యము కాదు

ఇది ఆచ్ఛిక కృదంత పరిచ్ఛేదము

౦) —(౦

# బాలవ్యాకరణోద్యోతము

## సంస్కృత కృదంతము

౧వ వివి సంస్కృత కృదంత పరిచ్ఛేదాదిని సంస్కృత కృత్తుల స్వభావము కొంత వివరింపబడును

కృత్తులును, వాని యర్థములును సాధారణముగాఁ బ్రయోగ వేద్యములె

శ్లో॥ కృతోయే యత్ర విహితా। స్తత్రనూనం భవన్తితే। కృద్ధోః క భావ ఇత్యుక్తే। రన్యత్రాపి ప్రయోగతః" (ముగ్ధ ౯౭౫వ సూ. ధు-ధాతువు క-కారకము ముగ్ధబోధసంజ్ఞలు) "చెప్పఁబోయెడి ప్రత్యయము కృత్సంజ్ఞ గలది అయ్యది ధాతువునకుఁ బరముగ నగును అది కారకమందును భావార్థమందును నగును" అని పయిశ్లోకమునకు భావము. ఇట్లు వోపదేవుఁడు "కృద్ధోః క భావే" అను సూత్రముచే వచించి యున్నాఁడు వోపదేవుఁడిట్లు కారకమందనెనే కాని కృత్తుల కర్త నిర్ణయము చేయలేదు కృత్ప్రత్యయములను సాకల్యముగాఁ జెప్ప శక్యము గాదు

శ్లో॥ కృత్తద్ధిత సమాసానా। మభిధానం నియామకమ్। లక్షణం త్వనభిజ్ఞానాం। తదభిజ్ఞాన సూచకమ్'' (ముగ్ధ-౧౭౦౩వ సూ) పాణినీయులును ఇట్లె చెప్పుదురు ''ఉణాదయో బహుళమ్''(౩-౩-౧, సి-కౌ-౩౧౬౯వ సూ) 'ఉణ్' మొదలగు కృత్ ప్రత్యయములు ధాతువునకుఁ బరముగ బహుళముగా నగును ఈ బాహుళ్య మిట్లు వివరింపఁబడెను ''కేచి దవిహితా అప్యూహ్యాః-'' ''సంజ్ఞాసు ధాతు రూపాణి। ప్రత్యయాశ్చ తతః పరే। కార్యా ద్విద్యా దనూబన్ధ। మేతచ్ఛాస్త్ర ముణాదిషు'' అని మహాభాష్యమున వ్రాయఁబడెను

ఇక నివి కృత్తులు ధాతువుపైనె నిల్చుచు కృదంతములు నామములె యగును

## తవ్య-అనీయ-య ప్రత్యయములు

'తవ్య-అనీయ-య' అను ప్రత్యయములు కర్మార్థము నందును (ముగ్ధ-'ధ') భావార్థమునందును ధాతువుపై నిల్చును (ముగ్ధ-౯౭౬వ సూ, సి-కౌ-౨౮౩౪-౨౮౪౨ సూ)

ఈ తవ్యాది ప్రత్యయములను "కృత్య" ప్రత్యయములనియుఁ బాణినీయులు (ముగ్ధ-'లః' సంజ్ఞ) వాడుదురు ఇవి సకర్మకములకుఁ గర్మార్థమును నకర్మకములకు భావార్థమునందును నగును

భావార్థ వివరణము తద్ధిత ప్రత్యయమునందలి భావము "ప్రకృతి జన్య బోధమునందుఁ బ్రకారంబు భావంబు నాఁబడు" ఉదా ఘటత్వము - నైల్యము-నీలత్వము-నీలత మొ ఘటత్వావచ్ఛిన్నము-ఘటత్వవిశిష్టము- ఘటము మొ

క్రియలయందలి భావము భావము-భావన - ఉత్పాదన ఉత్పాదనానుకూల వ్యాపారము భావ మని యర్థము అనఁగా ధాత్వర్థము భావము

తిఙ్వాచ్యభావమున లింగ వచనాది భేదము లేదు ఉదా త్వయాయుష్మాభి ర్మయాస్మాభీ రామేణ రామైర్ఘటేన ఘటైర్వా భూయతే ('నీచేతను, మీచేతను నాచేతను మాచేతను రామునిచేతను రాములచేతను ఘటముచేతను ఘటములచేతను') అని యేది కర్తగానున్నను నకర్మకములకు "భూయతే" అనియే సమాపక క్రియ సంస్కృతమున నుండును తెలుఁగున నిట్టి భావార్థక సమాపక క్రియకుఁ బ్రయోగము లేదు (క్రియా ౫౮వ సూ) తెల్గున సకర్మక క్రియలకే కర్మార్థక సమాపక క్రియా ప్రయోగము గలదు

కృద్వాచ్యభావమున లింగ వచనములు తెల్గునందును నుండును ఉదా కర్తవ్యము-కర్తవ్యములు-కృతము-కృతములు అనేక నసి యర్థము మొ

"అవ్యయ కృతో భావే" అను చొప్పున అవ్యయ కృత్తులకు భావ ముండునే కాని లింగ వచనాదిక ముండదు ఉదా చేసి-చేయన్ మొ అట్లని యవ్యయములకు లింగవచనార్థ బోధకము లేకపోలేదు ఉదా స్వః పతతి (స్వర్గమునుండి పడుచున్నాఁడు మొ)

"అవస్థే ద్వే క్రియాయాః స్థః। సాధ్యతా సిద్ధతాపి చ। సాధ్యతా త్వాది (తిఙ్వాచ్యా) వాచ్యా స్యాత్। సిద్ధతా ప్రత్యయ వ్యపేత్। వస్త్వాసత్తే ఘఞాదిః స్యాత్। యోగో లింగేన సంఖ్యయా (సంఖ్యా - వచనమ్, ముగ్ధ-౧౧౩౯వ సూ గిరిశచంద్ర వ్యాఖ్య)

## 'ఇ'డాగమము

ఔదిత్తులు కానట్టి ధాతువులకుఁ బరమగు నార్ధధాతుకమగు 'వస్' సమాహార ( ప్రత్యాహార) వర్ణములకు 'ఇ'మాగమము (పాణి- ఇడాగమము) వచ్చును

౨ (ముగ్ధ-౫౫౪వ సూ, సి-కౌ-౨౧౮౪ - ౨౨౪౬వ సూ, సం-క్రియా-౩, వివృ - సార్వధాతు కార్ధధాతుక వివృతి-చూ)

తవ్యాదు లార్ధధాతుకములు గాన 'ఇమ్' ఆగమము ప్రాప్తించును గాని 'చి' మున్నగు ధాతువులకు రాదని సూచించుచున్నాడు

'శ్వి' మొదలగు కొన్ని ధాతువులు తప్ప నేకాచ్కములగు "ఆద న్తములు-ఇ వర్ణాంతములు-ఉదంతములు-ఋదంతములు" నగు ధాతువులకు 'ఇమా'గమము రాదు ౩ (ముగ్ధ-౫౮౭వ సూ)

ఈ సూత్రము చొప్పున 'చి'ధాతువునకు (అనిట్టు గాన) 'ఇమా'గమము రాదు ''చిఞ్ చిత్యామ్" (పోగుచేయు-కూడబెట్టు సం-క్రియా-౪వ సూత్రముచే గుణము) కర్మార్థ చేతవ్యము-చయనీయము (చి-చే-చయ్ + అనీయ) చేయము (చి + య) భావార్థ ''భూ-సత్తాయామ్'' (అగు), భూ + ఇ + తవ్య (సం-కృత్-౨వ సూ ఇమ్)-భూ(భో-భవ్) + ఇ + తవ్య-భవితవ్యము భూ + అనీయ-భవనీయము భూ + య (అచ్ కార్యము-సం-కృ-౪వ సూ) - భో-భవ్ + య-భవ్యము (కాదగినది)

'ఓ-ఔ' అను నచ్చులకు బరమగు ప్రత్సంబంధియైన 'య' కారమునకు, 'క్య-జ్య' ప్రత్యయముల (ముగ్ధ-౮౪౩-౮౫౧వ సూ) యకారమునకును నచ్చు వంటి కార్యము గల్గును ౪ (ముగ్ధ-౪౨౩వ సూ, సి-కౌ-౬౩-౬౪ సూ, చూ-సం-తద్ధి-౫౭ సూ)

భూ (భో-భవ్) + య-భవ్యము (కాదగినది) ఇవి భావార్థములు గాన నపుంసకలింగము లగును

శ్లో అనామ్ని కారకే వాచ్యే। వాచ్య లిఙ్గః కృదుచ్యతే। భావే ల్యర్థ ఖల ర్థాన్తాః। అనటాద్యాః (ల్యుట్ ప్రత్యయాంతములు) నపుంసకాః। క్త్యాద్యన్తాశ్చ స్త్రీయాంజ్ఞేయాః। పుం స్యథుర్ఘఞ్ లౌ తథా। అన్యేషాం తు కృతాం లిఙ్గం। వేదితవ్యం ప్రయోగతః (ముగ్ధ-౯౬౭వ సూ గిరిశచంద్ర వ్యాఖ్య ల్యర్థ-తవ్యాదులు 'క్తి'-ప్రత్యయము 'అథు' ప్రత్యయము)

29)

# తవ్యాదులు-తృణ్-ణక-ప్రత్యయము

తవ్యాదులు పరమగునపుడు పెపధములగు వ్యాకరణ కార్యము లగును (ముగ్ధ-[illegible] మొ [illegible] సూ, సి-కౌ-[illegible] సూ మొదలుగ) ఖేయము (అగడిత, "ఖను-విదారే" ఖను + య) దేయము (ఇయ్యఁదగినది 'దా-దానే' దా + య) భావ్యము (అవశ్యము కాఁదగినది 'భూ-సత్తాయామ్', భూ-భావ్ + య) కార్యము (చేయఁదగినది, 'కృఞ్-కరణే) కృత్యము (చేఁయ దగిన పని, కృ + య) త్యాజ్యము (విడువఁదగినది, "త్యజ్-హానౌ" త్యజ్ + య) అమావాస్య-అమావస్య (ముప్పదవ తిథి, 'వస్-నివాసే' అమ-చంద్రుని మొదటికళ దానితో నా దినమునఁ జంద్రుఁడు రవితోఁ గూడ నుండును, అమా + వస్ + య) 'కేళిమ' ప్రత్యయము 'కృత్య' ప్రత్యయములలోనిదె పచేళిమము (దానంత నదే పండెడిది, పచ్-పాకే, పచ్ + కేళిమ)

[illegible] తవ్యాదులు '[illegible]' పేపా[illegible] జ్ఞా[illegible]ర్థములను నగును [illegible] వోఢవ్యము వహించు [illegible] '[illegible]-ప్రాపణే', [illegible] + [illegible]) [illegible] స్తోతవ్యుఁడు (స్తుతింపఁ [illegible], ష్టు-స్తుతౌ) మొ ధాతువాంకములో షకారాదిగ నున్న వెల్లఁ బ్రకియలో 'స' కారముతోనె నిల్చును ఇట్లె 'ణ' కారా[illegible] మున్నవెల్ల 'న' కా[illegible] ప్రక్రియలో నిల్చును

ధాతువునకుఁ గర్త[illegible] '[illegible]-ణక' ప్రత్యయము లగును ( [illegible]-[illegible] సూ, సి-కౌ-[illegible] సూ)

తృన్ (కర్త-చేయువాఁడు, 'కృఞ్-కరణే', కరోతీతి-కర్తా, కృఞ్ + [illegible]-కర్తా) 'తృన్' ప్రత్యయము తద్ధర్మ [illegible] వ్యర్థము [illegible] ను [illegible] (చేయువాఁడు, 'కృఞ్-కరణే", కృ + ణక-సం[illegible]-[illegible], కరోతీతి కారకః) స్త్రీత్వ[illegible]-[illegible] [illegible] (స[illegible]) [illegible] (ప-కారిక)

# ణిన్-అన-అన్ ప్రత్యయాదులు

'గ్రహాది' ధాతువులకు 'ణిన్' ప్రత్యయమును, 'నన్ది' మున్నగు ధాతువులకు 'అన' ప్రత్యయమును, 'పచ్' మున్నగు ధాతువులకు 'అన్' ప్రత్యయమును గర్త్రర్థమున నగును (ముగ్ధ ౯౯౩వ సూ, సి-కౌ ౨౮౯౬వ సూ)

'ణిన్' ప్రత్యయములోని 'ణ' కారమును, 'అన్' ప్రత్యయములోని 'న' కారమును సిద్ధవర్ణములు ణిన్ గ్రాహి (గ్రహించువాఁడు, 'గ్రహ్-ఉపాదానే' గృహ్ణాతీతి- గాహీ-సం-క్రియా-౩౫ సూ చొ వృద్ధి) "గణాశ్చ ప్రయోగాను సారేణ బోధ్యాః" అను (ముగ్ధ-౯౯౩వ సూ దుర్గా-వ్యాఖ్య) చొప్పునఁ గృత్తు లలోని గణములు ప్రయోగైక వేద్యములు

ణిత్తగు నట్టియు, ణిత్తగు నట్టియుఁ గృత్ ప్రత్యయము పర మగు నపుడు 'ఆ' దంత ధాతువులకుఁ బరముగ 'యిన్' అనునది నిల్చును (ఇందలి నకార మద్వ్యష్ట ము ముగ్ధ ౯౨౭ సూ సి-కౌ-౨౭౬౧ సూ)

స్థాయి (స్థిరముగా నుండు వి, 'స్థా-గతినివృత్తౌ'-తిష్ఠతీతి-స్థాయీ, స్థా + ణిన్-స్థా + య్ + ఇన్-స్థాయిన్)

'అ-ఇష్ణు-ఇత్ను' మున్నగు కొన్ని ప్రత్యయములు తప్పఁ దక్కిన యే 'కృత్' ప్రత్యయము పరమైనను ప్రేరణార్థక ధాతువు తుది ఇ ప్రత్యయము లోపించును (ముగ్ధ-౭౪౧వ సూ, సి-కౌ-౨౩౧౩ సూ)

ఇ్యంతములు ధాతువులె కాన (సం-క్రియా ౧౨ సూ) దానపై 'కృత్తు' నిల్చునని తాత్పర్యము "ప్రత్యయలోపే ప్రత్యయలక్షణమ్" అను న్యాయము చొప్పున (౨౦-కృత్-౭వ సూ చొప్పున) 'అన' ప్రత్యయము వచ్చును ఉదా నందనుఁడు (సంతోషింపఁజేయువాఁడు-కుమారుఁడు, "నది-సన్తోషే"-నన్దయ తీతి-నన్దనః-నన్ద్ + ఇ + అన-నన్ద్ + అన-నన్దనః) 'నది' ధాతువు తుది 'ఇ' కార మిద్వ్యష్టము, ఇదిత్తగు ధాతువులకు నమ్రగును (ముగ్ధ ౫౭౪౫ సూ, సి-కౌ-౨౨౬౨వ సూ) కావుననే ముగ్ధబోధకర్త 'నన్ద్' అనియే సూచించెను.

మధుసూదనుఁడు (మధువను రాక్షసుని జంపినవాఁడు-విష్ణువు 'షూద-మూరణే' మధుం సూదయతీతి-మధుసూదనః) అలంతి ధాతువులు తప్పఁ దక్కినవెల్ల ధాతుపాఠమున 'ష' కారాదులుగను, ణకారాదులుగను బఠింపఁబడును కావుననే యవి షోపదేశములు, ణోపదేశములు నని వాడఁబడును ప్రక్రియా దశలో నవి సాదులుగను, నాదులుగను వర్తించును (ముగ్ధ ౫౭౦వ సూ, సి-కౌ-౨౨౬౪వ సూ) సూదధాతు ణ్యంత రూపము 'సూది' అగును (సూదయతి) లవణుఁడు (ఒకరాక్షసుఁడు, లూ-ఛేదనే, లునాతీతి-లవణః) ఇది ణ్యంతముకాదు 'అన' ప్రత్యయము 'ణ్యంత' ములకే వచ్చునని తలంపరాదు తపనుఁడు (సూర్యుఁడు, 'తప-ఉపతాపే', తపతీతి-తపనః-తప్ + అన-తపనః) క్రోధనుఁడు (కోపము గలవాఁడు, 'క్రుధ-కోపే'-కృధ్యతీతి-క్రోధనః-కృధ్ + అన-క్రోధనః)

పచాద్యదాహృతి దేవుఁడు (దేవత, 'దివ్-క్రీడా విజిగీషా ప్రభృతిషు', దీవ్యతీతి-దేవః-దీవ్యన్తీతి-దేవాః, దివ్ + అ-దేవ్ + అ-దేవః, సం-క్రి-౪వ సూ చౌ-లఘూపధము గాన గుణను) చరుఁడు (చారుఁడు, చర్-గతౌ, చరతీతి-చరః చర్ + అ-చర) చోరుఁడు (దొంగ, 'చుర-స్తేయే' స్వర్ణాద్యపహరణె చోరయతీతి-చోరః) లఘూపధము గాన గుణము (సం-క్రి-౪వ సూ) వచ్చినది

''ణిన్-అన-అన్-ణక'' అను ప్రత్యయములు పరములగునపుడు వివిధము లగు వ్యాకరణ కార్యము లగును (ముగ్ధ ౭౭౪ మొ ౧౦౦౦ వ సూ)

ణిన్ ద్రోహి (ద్రోహము చేయువాఁడు, ''ద్రుహ-అనిష్టచిన్తనే'', ద్రుహ్యతీతి-ద్రొహన్-ద్రోహి) ద్వేషి (ద్వేషించువాఁడు, ''ద్విష-వైరే''-ద్వేష్టీతి-ద్వేషిన్-ద్వేషీ) పితృఘాతి (తండ్రిని జంపినవాఁడు-హన-వధె'' పితరం హన్తీతి-పితృఘాతిన్-పితృఘాతీ)

అన గాయనుఁడు (పాట పాడు వాఁడు, 'గై-గానే' గాయతీతి-గాయ త్రితైః-గాయనః) హాయనము (సంవత్సరము, 'హా-త్యాగే''-జహాతి ... హాయనము ( వ్రీహి, హా-త్యాగే జహాత్యు దకం హాయనం)

అన్ ఘనాఘనము (వర్షాకాలపు మేఘము-తాపమును బోఁగొట్టునది, హన-హింసాగత్యోః, నిపాతము) వదావదుఁడు (వక్త-''వద-వాక్యే'' వదతీతి వదావదః నిపాతము, ముగ్ధ బాలవ సూ) ప్రియుఁడు (సంతోషపెట్టువాఁడు-'ప్రీ-తర్పణే' ప్రీణాతీతి-ప్రియః) భూరుహము (చెట్టు, రుహ-ఉద్భవే భువి రోహతీతి-భూరుహః) కామదుఘ (కామధేనువు-కోర్కెలనిచ్చునది-'దుహ-దోహే'-కామం దోగ్ధీతి-కామదుఘా) పంకజము (పద్మము-'జన-ఉద్భవే'-పఙ్కాజ్జాయత ఇతి-పఙ్కజమ్) ద్విపము (ఏనుఁగు, 'పా-పానే' ద్వాభ్యాం ముఖ శుణ్డాభ్యాం పిబతీతి-ద్విపః) నగము (కొండ లేదా చెట్టు-'గమ్-గతౌ' న గచ్ఛతీతి-నగః) గిరిశుఁడు (శివుఁడు, 'శీ-శయనే'-గిరౌ శేత ఇతి-గిరిశః) గోవిందుఁడు (విష్ణువు, 'విద-లాభే'-గాం విన్దతీతి-గోవిన్దః) దావము (దవాగ్ని 'దు-ఉపతాపనే'-దునోతీతి-దావః-దవః దు + అ-దో + అ-దవ్ + అ, సం-క్రియా-బవ సూ చొప్పున గుణము వచ్చును) జ్వాలము (మంట, ''జ్వల-దీప్తౌ జ్వలతీతి- జ్వాలః జ్వలః- రూ, జ్వాలా శ్వాసము- (ఊపిరి, 'శ్వస-ప్రాణనే' శ్వసితీతి-శ్వాసః) ఉత్పశ్యుఁడు (మీఁదికిఁ జూచువాఁడు, 'దృశ్-చాక్షుషజ్ఞానే' ఊర్ధ్వం పశ్యతీత్యుత్పశ్యః) పాపఘ్నుఁడు-పాపమునుఁ బోఁగొట్టువాఁడు 'హన-వధే'-పాపం హన్తీతి-పాపఘ్నః) జంగముఁడు (మిక్కిలి నడచు శక్తి గలవాఁడు-'గమ్-గతౌ'-గమ్-యఙ్-లుక్-గమ్ + గమ్-అ-జఙ్గమః)

## 'ణక' ఆశీరాద్యర్థక ప్రత్యయములు

ణక నర్తకుఁడు (నాట్యముచేయువాఁడు, 'నృత్-నర్తనే' నృత్యతీతి-నర్తకః స్త్రీత్వే-నర్తకీ) గాయకుఁడు (గానము చేయువాఁడు, ''గై-గానే'' గాయతీతి -గాయకః-గాయనః రూ) జీవకుఁడు (జీవించువాఁడు 'జీవ-ప్రాణ ధారణే, జీవతాదితి-జీవకః ఆశీరర్థకః) ఇట్లే-నందకుఁడు-వర్ధకుఁడు, మొ

ఆశీరర్థమున మఱి కొన్ని కృత్ ప్రత్యయములును నగును దేవరాతుఁడు (పరీక్షిన్మహారాజు, 'రై-శబ్దే'-దేవా యు రాసూదతి -దేవరాతః) దేవదత్తుఁడు (ఒకని పేరు, 'దా-దానే' దేవా యు దేయాదతి- దేవదత్తః) వీరభువు (వీరుఁడు వీనికిఁ బుట్టుఁగాక: 'భూ-సత్తాయామ్' వీరోఽస్య భూయాదితి- వీరభూః-

వీరభూ + క్విప్) అగ్నిభూతి (అగ్ని వీనికి నెల్లుఁగాక, 'భూ-సత్తాయామ్' అగ్ని రస్య భూయాదితి-అగ్నిభూతిః)

కొన్ని ధాతువులపైని 'అ-ఇ' (ఖన్-ఖి) అను ప్రత్యయములు నిల్చును అట్టి ధాతువులు ద్వితీయాంత నామములతోఁ గొన్నియెడల సమసించును కొన్ని నామములపైని 'మ'కారము నిల్చును వివిధములగు వ్యాకరణ కార్యములును జరుగును ౧౧ (ముగ్ధ-౧౧౦౯ మొ ౧౦-౨౭ వ సూ, ౧౦౧౪-ముగ్ధ-ఖిత్తులకు 'మన్' వచ్చును)

కుంభకారుఁడు (కుమ్మరవాఁడు, 'కృఞ్-కరణే' కుమ్భంకరోతీతి-కుమ్భకారః) పాపఘ్నము (పాపమును హరించునది 'హన-వధే' పాపం హన్తీతి- పాపఘ్నః) సామగుఁడు (సామవేదమును గానముచేయువాఁడు, 'గై-శబ్దే' సామ గాయతీతి-సామగః) యశస్కరము (కీర్తిని జేయునది, 'కృఞ్-కరణే' యశః కరోతీతి-యశస్కరః స్త్రీత్వే-యశస్కరీ) ఫలేగ్రహి (యోగ్య కాలమున ఫలించునది-వృక్షము, 'గ్రహ-గ్రహణే'- ఫలం గృహ్ణాతీతి-ఫలే గ్రహిః-'ఏ'కారాగమశ్చ) దేవాపి (ఒకరాజు-'ఆప-వ్యాప్తౌ' దేవమాప్నోతితి దేవాపి ) ఇట్లె 'వాతాపి' మొ 'మ'కారాగమము కుక్షిమ్భరి (తన కడుపును మాత్రము నింపుకొనువాఁడు, 'భృ-భరణె' కుక్షిం బిభర్తీతి- కుక్షిమ్భరిః) ఇట్లె-ఉదరమ్భరి-ఆత్మమ్భరి మొ జనమేజయుడు (పరీక్షిత్తు కొడుకు, 'ఏజ-కమ్పనే-దీని ణ్యంతమునకు ఏజి-జనమేజయతీతి-జనమేజయః-జనులను గంపింపఁ జేయువాఁడు) పణ్డితమ్మన్యుఁడు (తన్నుఁ బండితునిగాఁ దలఁచువాఁడు 'మన-బోధే' ఆత్మానం పణ్డితం మన్యత ఇతి-పణ్డితమ్మన్యః) పుష్పం ధయము (తుమ్మెద, 'ధేట-పానే'-పుష్పంధయతీతి-పుష్పంధయః) పాణింధమము (చేతులతో, 'ధ్మా-శబ్దాగ్ని సంయోగయోః- పాణిభ్యాం ధమతీతి-పాణింధమః) నాడింధముఁడు (నాడిని నాడీభిర్ధమతీతి-నాడింధమః-నాడులను బూరించి యూదువాఁడు) విధుంతుదుఁడు (రాహువు, 'తుద-వ్యథనే' విధుం తుదతీతి విధుంతుదః) ఇట్లె అరుంతుదుఁడు (అరుస్సు-మర్మస్థానము) లలాటం తపము-(లలాటమును దపింపఁజేయు) అసూర్యంపశ్య (ఘోషాస్త్రీ) నఖంపచ ము (గోళ్ళకు వేఁడిగనున్న-నఖం పచతీతి-నఖంపచః-'పచ-పాకే' చూ

శబ్దార్థ-చిఁ-మున్నగ వానిని సాధించునది) భయంకరము (భయమును జేయునది 'కృఞ్-కరణే' భయం కరోతి-భయంకరః) తురంగమము-గుఱ్ఱము-త్వరితముగాఁ బరుగెత్తునది ('గమ్-గతౌ' తురం త్వరితం గచ్ఛతీతి-తురంగమః, తురంగ రూ) అరిందముఁడు (శత్రువులను దమింపఁజేయువాఁడు-'దము-శమే' అరిం దమయతీతి-అరిందమః) మొ "అనట్" (పాణినిల్యుట్) ప్రత్యయాంశము లందును నిట్టి 'మ'కారాగమ రూపములు గలవు అంధంకరణము (శోకము-అనన్ధః అన్ధః క్రియతే-అన్ధం కరణమ్) ఇట్లె సుభగం భావుకము, సుభగం భవిష్ణువు మున్నగు రూపములును సాధించునది

## క్విబాదులు

కార్య విశేషములకును, నుచ్చారణార్థకముగను, వర్ణవిశేషముల రూపముతో "క్విప్-విణ్" మున్నగు ప్రత్యయములు ప్రయోగానుసారముగా ధాతువుల పయిని విధింపఁబడును ఈ ప్రత్యయముతో నేవర్ణమును నిలువదు అన్నివర్ణములును లోపించును ధాతుమాత్రమె నామముగా నేర్పడును అట్టిచోట వివిధములగు వ్యాకరణ కార్యములును గొన్నిట నగును ౧౨ (ఋగ్ద-౧౦౨౭ మొ ౧౦౩౨ వ సూ-౧౦౩౫ మొ ౧౦౪౯ వ సూ)

ఈ ప్రత్యయమునందలి 'క'కారము గుణాభావమును దెల్పుటకును 'ణ' కారము వృద్ధి వచ్చు నని తెల్పుటకును నిద్వర్ణములుగా నిల్పఁబడెను

ప్రాచి-తూర్పుదిక్కు (చూ-తత్స ౧౯౯వ సూ "అఞ్చు-గతి పూజనయోః" ప్రకర్షేణ అఞ్చతీతి-ప్ర+అఞ్చ+క్వి-స్త్రీత్వే-ప్రాచీ) ప్రతీచి-పడమర దిక్కు! ('ప్రత్యఞ్చతీతి-ప్రతి+అఞ్చ+క్వి-ప్రతీచీ) 'అఞ్చు' ధాతువు తుదినున్న 'ఉ'కా రేద్వర్ణము దాని స్త్రీత్వమున 'ఈ' ప్రత్యయము వచ్చునని తెల్పును (చూ-తత్స ౧౯౯వ సూ) "యుజ్యత ఇతి యుక్-''యుజ-యోగే''-యుజ్+కిం-యుక్, యునక్తీతి-యుజ్ యుజ్+క్విం-యుక్, ఇట్లె ''ప్రాక్-ప్రాజ్ ప్రత్యక్-ప్రత్యజ్'', ప్రాజ్-ప్రాఞ్చౌ-ప్రాఞ్చః-ప్రత్యఞ్చః-యుక్- యుజౌ-యుజః యుజ్-యుఙ్గా-యుఞ్జః) ఆ- [illegible] గా లేమిగాని ''[illegible] యుగ్గ్రహము ప్రాగ్ద్వి-ప్రత్యగ్ద్వి'' మున్న [illegible] వానికి

సమాస పూర్వావయవ స్థితి యుండును (తత్స-౧౦౭౫ సూ) సుఖభాక్కు- (సుఖమునందువాఁడు, "భజ-సేవాయామ్" సుఖం భజతీతి-సుఖ + భజ్ + విణ్-సుఖభాక్-సుఖభాజౌ-సుఖభాజః చూ-సమా ౩౭వ సూ) తురాసాహుఁడు (ఇంద్రుఁడు-వేగమును సహించువాఁడు-"షహ-క్షమాయామ్" తురాం వేగమును సహతే ఇతి- సహ్ + విణ్-తురాషాట్-తురాసాహౌ-తురాసాహః ద్వితీ తురాసాహం తురాసాహౌ-తురాసాహః, చూ-సమా ౪౦వ సూ) అనడ్వాహము-ఎద్దు (వహ్-ప్రాపణే అనః-శకటమ్-వహతీతి-అనస్ + వహ్ + విణ్-అనడ్వాన్-అనడ్వాహౌ-అనడ్వాహః ద్వితీ అనడ్వాహమ్-అనడ్వాహౌ-అనడుహః) సోమపుఁడు- యజ్ఞ సోమ లతారస పానము చేసినవాఁడు ('పా-పానే' సోమం పిబతీతి-పా + విచ్-సోమపాః-సోమపౌ-సోమపాః) విశ్వపుఁడు- (ప్రపంచమును రక్షించువాఁడు - ('పా-రక్షణే' విశ్వం పాతి, రక్షతీతి -విశ్వ + పా + విచ్-విశ్వపాః-విశ్వపౌ-విశ్వపాః) కృధ- (కోపము) ('కృధ్-కోపే' కృధ్యతీతి-కృధ్ + క్విప్-కృధా) వీరుధము-లత ('రుహ-ఉద్భవే' విశేషేణ రోహతీతి-వి-రుహ + క్విప్-వీరుధ్-వీరుత్-వీరుధౌ-వీరుధః, సమా ౪౦వ సూ 'వీరుధా' అను టాంబతమును సాధువె) మార్గాంతరము విస్తృతం ఋణద్ధీతి-వి + రుధ్ + క్విప్- 'రుధ్-ఆవరణే' - వీరుధ్-వీరుధా ఉపానహము-పై జారు-చెప్పుజోడు ('నహ-బన్ధనే'- ఉప-పాదప్రాన్త దేశమ్-ఆసమన్తాత్ నహ్యతీతి-ఉప + ఆ + నహ + క్విప్- ఉపానహ్, ఉపానత్-ఉపానహౌ-ఉపానహః, చూ-సమా ౪౦వ సూ) వాక్కు--వాకు-వాచ-వాక్యము, వాగింద్రియము (వచ్-కథనే', ఉచ్యత ఇతి-వచ్ + విణ్-వాచ్-వాక్-వాచౌ-వాచః) దిశ-దిక్కు- ప్రాచ్యాది దిక్కు ('దిశ-దానే'-దిశత్యవకాశమితి-దిశ్ + క్విన్-దిశ్ దిక్-దిశౌ-దిశః, చూ-సమా ౩౮వ సూ) మధులిహము-తుమ్మెద,పుష్పాసవమును ద్రాగునది ('లిహ-ఆస్వాదనే'-మధు లేఢి ఇతి-మధు + లిహ్ + క్విప్-మధులిహ్ మధులిట్-మధులిహౌ-మధులిహః, చూ-సమా ౪౦వ సూ) తాదృశుఁడు-అట్టివాఁడు ("దృశ్-చాక్షుష జ్ఞానే' స ఇవ దృశ్యత ఇతి-తద్ + దృశ్ + క్విన్-తాదృశ్ తాదృక్-తాదృశౌ-తాదృశః) ఇట్లె భవాదృశుఁడు-భవత్-నీవంటి సదృశుఁడు-సమాన-స, సమానమైనవాఁడు) ఈదృశము, ఇదమ్-ఈ, ఇట్టివాఁడు, కీదృశుఁడు-కిమ్-కీ, ఎట్టివాఁడు, అమూదృశుఁడు-అదస్-అమూ ఇట్టివాఁడు మొ

# 'త్ర' మొదలగు కృత్తులు

ధాతువునకుఁ బరముగ ''త్ర-అస్-ఇస్-ఉస్-మస్-క్వనిప్'' అను ప్రత్యయములు కారక విశేషములందును భావార్థమునందును నిల్చును ౧౩ (ముగ్గ-౧౦౩-వ సూ)

త్ర నేత్రము (కన్ను-కవ్వపుత్రాడు, "ణీ-ప్రాపణే'' నయతి-నయతే అనేన వా ఇతి-నీ + త్ర-నేత్రమ్) దంష్ట్రము-దంష్ట్ర (పెద్దపల్లు-కోఱ, 'దన్శ్-దంశనే', దశ్యతే అనయేతి-దన్శ్ + త-దంష్ట్రా) నద్ధి (గుఱ్ఱపు నడ్డిమీఁది యాస్తరణము కదులకుండఁ గట్టెడి వాఱు-చర్మము, "ణహ్ బన్ధనే' నహ్యతే అనయేతి-నహ్ + త్ర-నద్ధ్రీ) స్తోత్రము (స్తుతి, 'ష్టు-స్తుతౌ' స్తూయతే అనేనేతి-స్తు + త్ర-స్తోత్రమ్) దాత్రము (కొడవలి, ''దా-ఛేదనే'' దాతి-ఛినత్తి అనేనేతి-దా + త్ర-దాత్రమ్) పాత్రము (భోజనాద్యమత్రము, ''పా-పానే" పిఒ త్యనేనేతి-పా + త్ర-పాత్రమ్) పాత్రము-పాత్రుఁడు (పాపమునుండి రక్షించు వాఁడు, ''పా-రక్షణే'' పాతి రక్షతీతి-పా + త్ర-పాత్రమ్)

అస్ రజము (పుప్పొడి-ముట్టురక్తము, ''రన్జ-రాగే", రజ్యతే అనేనేతి-రన్జ్ + అస్-రజస్-రజః) వేధ (బ్రహ్మ-సృజించువాఁడు, "విధ-విధానే'', విధతి-సృజతీతి-విధ + అస్-వేధాస్-వేధాః)

ఇస్ సర్పి-సర్పిస్సు (నేయి) ''సృప-గతౌ'' సర్పతి-వ్యాప్నోతీతి-సృప్ + సర్ప్ + ఇస్-సర్పిస్-సర్పిష్-సర్పిః) హవి-హవిస్సు (నెయ్యి-హోమము చేయునది, ''హు-హోమే'' హూయతే అనేనేతి-హోమము చేయఁబడు-హూ-హవ్ + ఇస్-హవిస్-హవిః)

ఉస్ చక్షువు-చక్షుస్సు (కన్ను-"చక్ష-కథనే'', చష్టే-వస్తు స్వరూపం వక్తీతి-చక్ష్ + ఉస్-చక్షుస్-చక్షుష్-చక్షుః) ధనుస్సు-ధనువు (విల్లు, ''ధన = రవే'', ధనతీతి-శబ్దించును-ధన + ఉస్-ధనుష్-ధనుః)

మన్ శర్మము (సుఖము, "శౄ-హింసాయామ్" శృణాతి-అశుభములను హింసించునది-శౄ-ర్ + మన్-శర్మన్-శర్మ)

క్వనిప్ పారదృశ్వ (పారంగతుఁడు, "దృశ్-చాక్షుష జ్ఞానే"-పారం దృష్టవాన్-పార + దృశ్ + క్వనిప్-పారదృశ్వన్ - పారదృశ్వా) యజ్వ (యాగముచేసినవాడు, "యజ్-దేవపూజనే", యజతేస్మ-యజ్ + వనిప్-యజ్వన్-యజ్వా)

## 'క్త-క్తవతు' ప్రత్యయములు

ధాతువునకుఁ బరముగా భూతార్థము నందలి కర్మార్థమునందును భావార్థ మందును క్త' ప్రత్యయము నిల్చును భూతార్థమునందలి కర్త్రర్థమున 'క్తవతు' ప్రత్యయము నిల్చును (ముగ్ధ-౧౦౫౦వ సూ, సి-కౌ-౩౦౧౨-౩౦౧౩వ సూ)

వీనిలోని 'క' కారము గుణాభావము దెల్పు నిద్వర్ణము క్తవతు ప్రత్యయములోని తుది 'ఉ' కారము స్త్రీత్వమున 'ఈ' పత్యయము వచ్చునని తెల్పు నిద్వర్ణము (చూ-తత్స-౮౯వ సూ)

'క్తవత్' ప్రత్యయాంత రూపములు భవచ్ఛత్రాదులలోని వగుటచేత (తత్స-౧౦౭వ సూ) వీనికిఁ దెలుఁగు విభక్తియోగము లేదు వీనికి స్త్రీత్వమున 'ఈ' కారము వచ్చును అట్టి స్త్రీలింగి రూపములు తెలుఁగున నుండవచ్చును గాని సమాస పూర్వావయవ 'క్తవత్' ప్రత్యయాంత రూపములును తెనుఁగు విభక్తుల నందిన 'ఈ' ప్రత్యయాంత రూపములును గవి ప్రయోగములలోఁ గానరావు

కర్మార్థక 'క్త' స్తుతుఁడు-స్తుత-స్తుతము (స్తుతింపఁబడిన "ష్టు-స్తుతౌ" స్తు + క-స్తుతః-స్తుతమ్-స్తుతా) ఇవి విశేషణములు గాన మూఁడు లింగములు నగును

భావార్థక 'క్త' స్నాతః-స్నాతా-స్నాతమ్ (స్నానము చేయఁబడిన "ష్ణా-శౌచే" స్నా + క్త-స్నాతః-స్నాతమ్-స్నాతా)

క్తవత్ కర్త్రర్థక స్తుతవ ద్భక్తులు (స్తుతించిన భక్తులు, స్తుతవతీ-స్తుతించినది, "ష్టు-స్తుతౌ" స్తు- క్తవత్-స్తుతవాన్ - స్తుతవన్తౌ-స్తుతవన్తః స్త్రీ-స్తుతవతీ-స్తుతవత్యౌ-స్తుతవత్యః)

## అనునాసిక లోపము-'త' కారమునకు 'న' కారదేశము

తనాది గణ ధాతువులయొక్కయు, వనధాతువుయొక్కయు 'ఇమ్' రాని ధాతువులయొక్కయు, దుది యను నాసికమునకు 'తిక్' ప్రత్యయేతర కిత్తులును జిత్తులును నగు 'ఝస్' సమాహార వర్ణములు పరమగునపుడును య్ప్రత్యయము (క్త్వా ప్రత్యయాదేశము) పరమగునపుడును లోపము గల్గును ౧౨ (ముగ్ధ-౬౭౬వ సూ, సి-కౌ-౨౪౨౧వ సూ)

గతము (గతించిన, "గమ్-గతౌ" గమ్ + క్త-గతః-గతా-గతమ్) హతము (చంపఁబడిన, హన-వధే, హన్ + క్త-హతః-హతా హతమ్)

"క్షి-డీ-దీ-దూ-లీ-లూ-సూ" మున్నగు ధాతువుల కంటెను, 'ఓ' కార మిద్వర్ణము గాఁగల ధాతువులకంటెను, దకారాంత ధాతువులకంటెను, 'య-ర-ల-వ' లతోఁ గూడిన సంయోగము గల 'ఆ' వర్ణాంత ధాతువులకంటెను, గొన్ని ఋూదన్త ధాతువులకంటెను బరములగు "క్త-క్తవత్" ప్రత్యయముల 'త' కారమునకు 'న' కారాదేశ మగును అట్టియెడలఁ గొన్ని వ్యాకరణ కార్యము లగును ౧౬ (ముగ్ధ ౧౦౨౨వ సూ, సి-కౌ-౩౦౧౬ మొ ౩౦౧౯ వ సూ)

క్షీణుడు (త్రిలిం "క్షి-క్షయే" క్షి + క్త-క్షీణః-క్షీణా-క్షీణమ్) వీని కిట్లు దీర్ఘము వ్యాకరణ కార్యములయ్యెను డీనము (త్రి ఎగురబడిన, "డీ-నభోగతౌ" డీ + క్త-డీనః-డీనా-డీనమ్) దీనుఁడు (త్రి దుఃఖితుఁడు, "దీ-క్షయే" దీ + క్త-దీనః-దీనా-దీనమ్) దూనము (త్రి సంతప్తము, "దూ-ఖేదే" దూ + క్త-దూనః-దూనా-దూనమ్, లీనుఁడు (త్రి భద్ధుఁడు "లీ-శ్లేషణే, ద్రావణే", లీ + క్త-లీనః-లీనా-లీనమ్) లూనము (త్రి ఛిన్నము, "లూ-ఛేదనే" లూ + క్త-లూనః-లూనా- లూనమ్) సూనము (త్రి ప్రసూతము-పుష్పము, 'సూ-ప్రసవే" సూ + క్త-సూనః-సూనా-సూనమ్)

ఓష్ఠితులు రుగ్ణము (త్రి) రోగాన్వితః, "రుజో-భఙ్గే" రుజ్ + క్త-రుగ్ణ). భుగ్నము (త్రి) రోగాదులచేఁ గుటిలమైనది, "భుజో-కౌటిల్యే" భుజ్ + క్త-భుగ్నః) దాన్త భిన్నము (విదారితము, త్రి "భిద-ద్విధాకరణే"-భిద + క్త-భిన్నః) 'య-ర-ల-వ' సంయుక్తావర్ణాన్త శ్రాణము (పక్వము "శ్రా-పాకే" శ్రా + క్త-శ్రాణః త్రి)

ఋూదన్త కీర్ణము (త్రి) విక్షిప్తము, "కౄ-విక్షేపే" కౄ + క్త-కీర్ణః-త్రి) జీర్ణము ముదిసినది ("జౄ-జరాయామ్" జౄ + క్త-జీర్ణః-త్రి) శీర్ణము (శుష్కము, "శౄ-హింసనే", శౄ + క్త-శీర్ణః-త్రి)

## 'క్త' ప్రత్యయాంత నిపాతములు

"నిర్వాణము-ఋణము-ఫుల్లము-విత్తము-క్షీబము-కృశము-ఉల్లాఘుఁడు" అనునవియు (ముగ్ధ-౧౦౬౫వసూ) "క్షుబ్ధము-స్వాంతము-ధ్వాంతము-కష్టము-లగ్నము-మ్లిష్టము-పరివృఢుఁడు-ఆభ్యర్ణము" అనునవియు (ముగ్ధ-౧౦౭౫వసూ) "దాంతుఁడు-శాంతుఁడు-పూర్ణము స్పష్టము-ఛన్నుఁడు" అనునవియు (ముగ్ధ-౧౦౭౮వ సూ ఈ తుదివి వికల్పముగా 'ఇ' ప్రత్యయము లోపించినవి-సం-కృ-౯౯వ సూ) నిపతితములగు 'క్త' ప్రత్యయాంతములు ౧౭

నిర్వాణము (మోక్షము, "వా-గమనే-హింసనేచ", నిర్ + వా + క్త-నిర్వాణః) ఋణము (అధమర్ణ దేయ ధనము-"ఋ-గతౌ" ఋ + క్త-ఋణమ్) ఫుల్ల (వికసితపుష్పము, "ఫుల్ల-వికసనే" ఫుల్ల + క్త-ఫుల్లః త్రిలిం) విత్తము (ధనము, "విద-లాభే" విద + క్త-విత్తమ్) క్షీబము (మదించిన, "క్షీబ-దర్పే"-క్షీబ + క్త-క్షీబమ్-త్రిలిం) కృశము (కృశించినది-"కృశ-తనూకరణే" కృశ + క్త-కృశ త్రిలిం) ఉల్లాఘుఁడు (రోగనిర్ముక్తుఁడు "లాఘ-సామర్థ్యే"-ఉత్ + లాఘ + క్త-ఉల్లాఘః) క్షుబ్ధము (ఆలోడితము-"క్షుభ-సఞ్చలనే" క్షుభ్ + క్త-క్షుబ్ధ త్రిలిం) స్వాంతము (మనస్సు, "స్వన-శబ్దే" స్వన + క్త-స్వాన్తమ్) ధ్వాంతము (చీకటి) ("ధ్వన-శబ్దే" ధ్వన + క్త-ధ్వాన్తమ్) కష్టము (పీడ, 'కష - వధే' కష +

క్త + కష్టమ్) లగ్నము (సక్తము, 'లగ-సఙ్గే' లగ + క్త-లగ్నమ్-త్రిలిం) మ్లిష్టము(అస్పష్టవాక్యము,'మ్లేచ్ఛ-దేశోక్తౌ' మ్లేచ్ఛ + క్త-మ్లిష్టమ్)పరివృఢుఁడు (ప్రభువు "వృహ-వృద్ధౌ" పరి + వృహ + క్త-పరివృఢః) దృఢము (కఠినము, "దృహ్-వృద్ధౌ" దృహ్ + క్త-దృఢమ్) అభ్యర్ణము (సమీపము "అర్ద-పీడాయామ్" అభి + అర్ద + క్త-అభ్యర్ణః) క్షామము (క్షీణించిన, "క్షై-క్షయే" క్షై + క్త-క్షామః త్రిలిం ఇవి కర్త్రర్థక క్త ప్రత్యయములు) శుష్కము(ఎండినది, "శుష-శోషే"-శుష్ + క్త-శుష్క త్రిలిం) పక్వము (పరిణతము, "పచ్-పాకే" పచ + క్త-పక్వమ్ త్రిలిం) దాంతుఁడు (ఇంద్రియ నిగ్రహము గల, "దము-శమే" దము + ఇట్ + క్త-ఇట్లోప సం-కృ-౯వ సూ దాన్తః-త్రిలిం) శాంతుఁడు (శాంతి గల, "శమ-శమే" శమ + ఇట్ + క్త-ఇట్లోపము సం-కృ-౯వ సూ శాన్తః-త్రిలిం) పూర్ణము (నింపఁబడినది, "పూర్-పూర్తౌ" పూర్ + ఇట్ + క్త-పూర్ణః త్రిలిం) స్పష్టము (వ్యక్తమైనది "స్పశ్-గ్రన్థ, బాధయోః" స్పశ్ + ఇట్ + క్త-స్పష్టః-త్రిలిం) ఛన్నము (ఆచ్ఛాదితము, "ఛద-సంవరణే" ఛద + స్వార్థిక ఇట్ + క్త-ఛన్నః- త్రిలిం) వీని కర్తృకర్మాదులు యథాసంభవ గ్రాహ్యములు

## భావ-కర్మ-కర్త్రర్థక 'క్త' ప్రత్యయము

గత్యర్థాకర్మకి ధాతువుల మీఁదను 'శ్లి-స్థా' యున్న కొన్ని ధాతువుల మీఁదను భావ కర్మ కర్త్రర్థములందు 'క్త' ప్రత్యయ మగును వ్యాపార రం భార్థములందును కర్త్రర్థమున 'క్త' ప్రత్యయ మగును గాన (ముగ్ధ-౧౦౯౨-౧౦౯౩వ సూ, సి-కౌ-౩౦౧౩-౩౦౧౮వ సూ)

క్త ప్రత్యయము కిత్తు గాన గుణము లేదు గత్యర్థ స గఙ్గాం గత (వాఁడు గంగాగతుఁడయినాడు, "గమ్-గతౌ" గమ్ + కర్త్ర- క్త-గతః స గఙ్గాం గతః) వాఁడు కృష్ణుని బ్రాప్తుఁడయినాఁడు ("ఆప్-వ్యాప్తౌ" ప్ర + ఆప్ + కర్త్ర- క్త-స కృష్ణం ప్రాప్తః) కర్మార్థ మాని వేఁ కృష్ణుఁడు ప్రాప్తుఁడయినాఁడు ("ఆప్-వ్యాప్తౌ" ప్ర + ఆప్ + కర్మార్థ - క్త-తేన కృష్ణః ప్రాప్తః) విష్ణువు శేషునందధిశయించినాఁడు "శీ-శయనే" అధి + శీ + కర్త్ర- క్త-శేష

స్త్రీ-పచ న్తీ శత్ప ౧౦౭౬ సూ) పచ ద్దేవదత్తు ఃడు(వండుచున్న దేవదత్తుఁడు), పచంతి (వండుచున్న స్త్రీ) 'పచ్' ధాతు వుభయపదము గాన దీనికి 'శతృ, శాన' ప్రత్యయములు రెండును నగును పైవెల్ల శత్రంతములు

శాన పచ్ + శప్ + మాన-పచమానః, స్త్రీ-పచమానా పచమానుఁడు (వండుచున్నవాఁడు), పచమాన (వండుచున్న స్త్రీ)

కర్మార్థ పచ్యమానము (వండఁబడుచున్న-పచ్ + యక్ + శాన-పచ్యమానః-స్త్రీత్వే-పచ్యమానా)

## 'శతృ' ప్రత్యయాదేశములు

'విద్' ధాతువుమీఁది శతృప్రత్యయమునకు 'క్వసు' అను నాదేశము వికల్పముగా నగును ౨౪౪ (ముగ్ధ-౧౧౦౩వ సూ, సి-కౌ-౩౧౦౯వ సూ)

ఇందలి 'ఉ' కార 'క' కారము లిద్వర్ణములు ఉకారము స్త్రీత్వమున 'ఈ' ప్రత్యయ మగు నని తెల్పును కిత్త్వము గుణాభావమును దెల్పును విద్వాంసుఁడు (పండితుఁడు), విదుషి (పండిత-"విద్-జ్ఞానే" విద్ + శతృ-క్వసు-విద్వస్-విద్వాన్-విద్వాంసౌ-విద్వాంసః స్త్రీత్వే-విదుషీ) 'క్వసు' రాని పక్షమున 'శత్రంత' మె నిల్చును (విద్ + శతృ-విదత్-విదన్-విదన్తౌ-విదన్తః స్త్రీ, విదన్తీ-విదన్త్యౌ-విదన్త్యః) 'విదత్' అను శతంతమునకుఁ దెల్గున (లిత్స ౧౦౭వ సూ) విభక్తి యోగములేదు స్త్రీత్వమున-విదంతి-విదుషి

శక్త్యర్థమునందును, వయోఽర్థమునందును, తాచ్ఛీల్యార్థమునందును 'శతృ' ప్రత్యయముచోట 'మాన-ఆన' ప్రత్యయములు లగును (పాణిని-శానచ్) అకారముపై 'మాన' అనియుఁ దక్కిన యెడల 'ఆన' అనియు నిల్చునని యెఱుంగునది ౨౪౫ (ముగ్ధ-౧౧౦౪వ సూ, సి-కౌ-౩౧౦౮వ సూ)

నిఘ్నానుఁడు (శత్రువును జంపకర్తుఁడు, "హన్-వధే" ని + హన్ + శప్ లోప అదాదిః-ఆన్-నిఘ్నానః) వయోఽర్థ బిభ్రాణుఁడు (కవచ

మును భరించువాఁడ యౌవనవంతుఁ డను తాత్పర్యము ''భృ-భరణే''-జుహో త్యాదిః చూ-సం-క్రి-౫వపిప ౧-౯-సూ-అభ్యాస కార్యఁ భృ+శప్‌లోప-అన-బిభ్రాణః) తాచ్ఛీల్యార్థ భుంజానుఁగు (భోగశీలుఁడు ''భుజ-భక్షణే'' భుజ్+శప్‌లోప-అదాది-అన-భుఞ్జానః) ఇట్టి 'లపమానుఁడు' మున్నగు పర స్మైపదములు 'శాన' ప్రత్యయాంతములు కాపచ్చును శబ్లోపమున నివి 'అ' కారాంతములు కావు గాన వీనిమీఁద 'అన' అనునది నిల్చినది

భవిష్యదర్థమునఁ గర్త్రర్థమునందుఁ బరస్మైపది ధాతువునకు 'స్యతృ' ప్రత్యయమును, నాత్మనేపది ధాతువునకు 'స్యమాన' ప్రత్యయమును నగును ౨౬ (ముగ్ధ-౧౧౦౫వ సూ, సి-కౌ-౩౧౦౭వ సూ)

'స్యతృ' అను ప్రత్యయములోని ఋకారము స్త్రీత్వమున 'ఈ' ప్రత్య యము వచ్చునని తెల్పు నిద్వర్ణము (చూ-తత్స-౮౯వ సూ) ఈ 'స్యతృ' ప్రత్యయము భవచ్ఛత్రాది విషయమే కాన (తత్స-౧౦౭ సూ) దీని కాంధ్ర విభక్తి యోగము లేదు కాన "కరిష్యత్కావ్యము" (చేయనున్న కావ్యము) అను రీతినె దీనికిఁ దెల్గునఁ బ్రయోగ మని యెఱుంగనగును కరిష్యమాణము (చేయుచున్న ''కృఞ్-కరణే'' కృ+స్యమాన-కృ+ఇ+స్యమాన-కరిష్య మాణమ్)

## 'ఇష్ణు-ష్ణు-స్ను' మున్నగు ప్రత్యయములు

ణ్యంతముల కన్నను, 'భ్రాజ-భూ-సహ-అలంకృ'' మున్నగు కొన్ని ధాతువుల కన్నను దద్ధర్మ తచ్ఛీలాద్యర్థములందుఁ గర్త్రర్థమున 'ఇష్ణు' ప్రత్యయ మగును ౨౭ (ముగ్ధ ౧౧౦౬వ సూ సి-కౌ-౩౧౧౬వ సూ)

కారయిష్ణువు (చేయించు నిచ్ఛగలవాఁడు, ''డు-కృఞ్-కరణే'' కృ+ణి+ఇష్ణు-కారయిష్ణుః, సం-కృత్-౯వ సూ చొ॥ ణిలోపము లేదు) భ్రాజిష్ణువు (ప్రకాశించు స్వభావము గల "భ్రాజ-దీప్తౌ'' భ్రాజ్+ఇష్ణు-భ్రాజిష్ణుః) భవిష్ణుఁడు (ఆయెడి స్వభావము గల, ''భూ-సత్తాయామ్''

భూ-భవ్ + ఇష్ణు-భవిష్ణుః) సహిష్ణుఁడు (సహించు శీలము గలవాఁడు, "షహ -క్షమాయామ్" సహ + ఇష్ణు-సహిష్ణుః) అలంకరిష్ణువు (అలంకరించుకొను స్వభావము గల, "డు-కృఞ్-కరణే" అలమ్ + కృ-ఇష్ణు-అలంకరిష్ణుః")

"(ష్ణుక్)-ష్ణు-స్ను-ను (క్ను)-ఉక (ఊక)-ఆక (ష్టాక)-ఆలు-రు-మర (కర్మ)-ఉర (ఘుర-కుర)-ఊక-పర-ర-ఉ-ఆరు-అన్త-ఇత్ను-ఇత' మున్నగు ప్రత్యయములు తచ్ఛీలాద్యర్థకులందుఁ గొన్ని కొన్ని ధాతువులపైని గర్త్రర్థమున నిల్చును అట్టి యెడలఁ గొన్ని వ్యాకరణ కార్యములు నగును ౨౮ (ముగ్ధ-౧౧౧౭ మొ ౧౧౫౩వ సూ సి-కౌ-౩౧౧౯ మొ ౩౧౬౬వ, కొన్ని ఉణా'దులును)

జిష్ణువు (జయశీలుఁడు-అర్జునుఁడు, "జి-జయే" జి + ష్ణు-జిష్ణుః) స్థాస్నువు (స్థితి శీలుఁడు-"స్థా-గతి నివృత్తౌ" స్థా + స్ను-స్థాస్నుః) ధృష్ణువు (ప్రగల్భుఁడు, "ధృష్-ప్రాగల్భ్యే" ధృష్ + ను-ధృష్ణుః) ఘాతుకుఁడు (హింస్రుఁడు, "హన-వధే" హన్ + ఉక-ఘాతుకః) భావుకము (మంగళము, "భూ-సత్తాయామ్" భూ-భవ్ + ఉక-భావుకమ్) లుంటాకుఁడు (దోఁచుకొనువాఁడు, "లుణ్ట-స్తేయే" లుణ్ట + ఆక-లుణ్టాకః) వరాకుఁడు (అధముఁడు, "వృ-సేవాయామ్" వృ + ఆక-వరాకః స్త్రీ-వరాకీ) పతయాలుఁడు (పతనశీలుఁడు, "పత్-గతౌ" పత్ + ఇ + ఆలు-పతయాలుః) స్పృహయాలుఁడు (కోరెడు శీలము గలవాఁడు, "స్పృహ-ఇచ్ఛాయామ్" స్పృహ + ఇ + ఆలు- స్పృహయాలుః) శత్రువు (విరోధి, "శద్-శాతనే" శద్ + రు-శత్రుః) భీరువు (భయశీలుఁడు "భీ-భయే" భీ + రు-భీరుః) ఘస్మరుఁడు (భక్షణ శీలుఁడు, "ఘస-భక్షణే" ఘస్ + మర-ఘస్మరః) భాసురము (ప్రకాశ శీలము గల, "భాస్-దీప్తౌ" భాస్ + ఉర-భాసురః) మేదురము (దట్టమైనది, "మిద-స్నేహే" మిద + ఉర-మేదురః) భంగురము (వంకరైనది, "భఞ్జ-వక్రీభావే" భఞ్జ + ఉర-భఙ్గురః) భిదురము (వజ్రము, "భిద-ద్వైధీకరణే" భిద్ + ఉర-భిదురః) విదురుఁడు (తెలిసినవాఁడు, "విద్-జ్ఞానే" విద్ + ఉర-విదురః) ఛిదురము (ఛేదనశీలము, "ఛిద్-ద్వైధీకరణే" ఛిద్ + ఉర-ఛిదురః) జాగరూకుఁడు (అప్రమ

తుఁడు, ''జాగృ-జాగరణే'' జాగృ + ఊక-జాగరూకః) భాస్వరము (ప్రకాశించునది, ''భాస్-దీప్తౌ'' భాస్ + వర-భాస్వరః) స్థావరము (చలింపనిది-వృక్షాదికము, ''ష్ఠా-గతి నివృత్తౌ'' స్థా + వర-స్థావరః) ఈశ్వరుఁడు (అష్టైశ్వర్యములు గల, ''ఈశ-ఐశ్వర్యే'' ఈశ్ + వర-ఈశ్వరః) జిత్వరుఁడు (జయశీల, ''జి-జయే'' జి + వర-జిత్వరః స్త్రీ-జిత్వరీ) అజస్రము (ఎల్లప్పుడు, ''జస్-మోక్షణే'' నఞ్ + జస్ + ర-అజస్రమ్) నమ్రుఁడు (వినీతుఁడు, ''ణమ్-నతౌ'' నమ్ + ర-నమ్రః) శంభువు (శివుఁడు, ''భూ-సత్తాయామ్'' శమ్-మంగళ + భూ + డు-శమ్భుః) ఇట్లె విభుఁడు-ప్రభువు-స్వయంభుఁడు మొ వందారుఁడు (వందన శీలుఁడు, ''వది-అభివాదన స్తుత్యోః'' వన్ద్ + ఆరు-వన్దారుః) జయంతుఁడు (ఇంద్రుని కొడుకు, ''జి-జయే'' జి + అన్త-జయన్తః) స్తనయిత్నువు (మేఘము, ''స్తన-మేఘశబ్దే'' స్తన + ణిచ్ + ఇత్ను-స్తనయిత్నుః, అదంతధాతు చురాది సం-కృత్-౯౨ సూ ణిలోపాభావము) లవిత్రము (కొడవలి, ''లూ-ఛిది'' లూ + ఇత్ర-లవిత్రమ్) చరిత్రము (చరిత్ర ''చర-గతౌ'' చర్ + ఇత్ర-చరిత్రమ్) పవిత్రము (పరిశుద్ధము-శ్రాద్ధపవిత్రము ''పూ-శోధే'' పూ + ఇత్ర-పవిత్రమ్) భిక్షువు-(సన్న్యాసి, భిక్ష-లోభే భిక్ష + ఉ-భిక్షుః) ఆశంసువు (చెప్పు నిచ్ఛగల-కథయిత, ''శన్స్-స్తుతౌ'' ఆ + శన్స్ + ఉ-ఆశంసుః) ఇచ్ఛువు (ఇచ్ఛతో నుండు, ''ఇష్-వాఞ్ఛాయామ్'' ఇష్ + ఉ-ఇచ్ఛుః-నిపాత) బిందువు (సున్న-నీటిబొట్టు, ''విద్-జ్ఞానే'' విద్ + ఉ-బిన్దుః-వబయో రభేదః-నిపాత) ఇట్లు మరికొన్నియు సాధ్యములు

## ఘఞ్-అల్-అనట్ ప్రత్యయములు

కర్మాదికారములందును, భావార్థమునందును ధాతువుమీఁద 'ఘఞ్-అల్-అనట్' అను ప్రత్యయములగును ౨౯ (ముగ్ధ ౧౧౩౪-౧౧౩౫ సూ సి-కౌ-౩౧౮౪-౩౧౮౬-౩౨౩౧-౩౨౯౦-౩౨౯౩వ సూ)

'ఘఞ్' లోని 'ఘ'కార 'ఞ'కారములును (సం-క్రియా-౩ చౌ వృద్ధిని ఇత్కారము తెల్పును), 'అల్' ప్రత్యయములోని 'ల'కారమును 'అనట్' ప్రత్య

యములోని 'ట'కారముకు 'ఖ'ద్వర్ణములు భావార్థకములు నపుంసక లింగము లగును ఈ 'అనట్' ప్రత్యయ మనే పాణినీయులు 'ల్యుట్' ప్రత్యయ మందురు క్విప్-ఘఞాది పరకత్వమును నుపసర్గమునకుఁ బహుళముగ దీర్ఘంబగు (సి-కౌ-౧౦౪౪-౧౦౪౫ సూ) ప్రాకారము-ప్రాసాదము-నీహారము-నీవారము- ఇట్టివి ఘఞంతములు ఇట దీర్ఘము నిత్యము క్విబంతములు వీరుధము(పొద)మొ "ఉపసర్గస్య దీర్ఘత్వం। క్విబ్ ఘఞాదౌ క్వచి ద్భవేత్" (ముగ్ధ-౧౧౩౪వ సూ దుర్గా)

కర్మాద్యర్థ ఘఞ్

ప్రాకారము (కోఁటగోడ, "కౄ-విక్షేపే" ప్ర + కౄ + ఘఞ్- ప్రాకారః, లెదా - "కృఞ్-కరణే" ప్ర + కృ + ఘఞ్ - ప్రాకారః) పాదము (చరణము, "పద-గతౌ" పద్ + ఘఞ్ - పాద -దీనిచేత నడువఁబడును కరణార్థ) దాసుఁడు (సేవకుఁడు, "దాస-దానే" దాస + ఘఞ్ - దాసః-సంప్రదాన-వీనికొఱకు పని యీఁబడును) ఉపాధ్యాయుఁడు (గురువు, "ఇఙ్- అధ్యయనే" ఉప + అధి + ఇఙ్-ఏ-ఆయ్ + ఘఞ్ -ఉపాధ్యాయః- అపాదాన- దగ్గరకుఁబోయి ఇతనివలన అధ్యయనము చేయఁబడును) ప్రసాదము (దయ "షద-గతౌ" ప్ర + సద్ + ఘఞ్ -ప్రసాదః-అధికరణ, దయయందు మనసు నిర్మల మగును)

భావార్థఘఞ్ సమాజము (పశు భిన్నమనుష్యాది సంఘము, "అజ- గతౌ" సమ్ + అజ + ఘఞ్ - సమాజః)

కర్మాద్యర్థ 'అల్' ప్రత్యయము నిలయము (ఇల్లు, "లీ-శ్లేషే" ని + లీ + అల్-నిలయః అధికరణ-దీనియందు నివాసము చేయఁబడును) కరము (చెయి, "కృఞ్-కరణే" కృ + అ-కరః కరణ కారకమ్-దీనిచేతఁ బనులు చేయఁబడును)

భావార్థమగు 'అల్' ప్రత్యయము నుదాహృతులు సమజము (పశ్వాదుల సంఘము, "అజ-గతౌ" సమ్ + అజ్ + అల్ - సమజః)

'అనట్' ప్రత్యయోదాహృతులు కర్మాద్యర్థకము (ల్యుట్-పాణిని) ఛేదనము (కత్తి, "ఛిద్-ఛేదే ద్వైధీకరణే" ఛిద్ + అనట్-ఛేదనః, కరణ కారకము, దీనిచేత ఛేదింపఁ బడును)

భావార్థకమగు 'అనట్' (ల్యుట్-పాణినీయులు)

శయనము (ప్రక్క- పరుండుట, "శీ-శయనే" శీ + అనట్-శయనమ్)

## సన్నంతముల 'ఉ' ప్రత్యయము

సన్నంతముపైని గర్త్రర్థమున 'ఉ' ప్రత్యయము నిల్చును ౩౦ (ముగ్ధ ౧౧-౨౩ వ సూ, సి-కౌ-౩౧౪౮ వ సూ) హల్లునకుఁ బరముగ నున్న ధాతువు తుదినున్న 'అ' ౩ ర 'య' కారములకు శిట్ భిన్నము పరమగునపుడు లోపము కల్గును ౩౧ (ముగ్ధ ౭౭౫ వ సూ, సి-కౌ-౨౩౦౮ ౨౬౩౧ సూ)

'ఇమ్' ప్రత్యయము రానట్టి 'సన్' ప్రత్యయము పరమగు చుండఁగాఁ గొన్ని ధాతువుల 'అ' కారమునకు 'ఇస్' అనునది యగుటయు, నభ్యాస లోప మును గల్గును సంయోగాదిస్థ సకారము లోపించును ౩౨ (ముగ్ధ-౮౧౧-౨౧౩ వ సూ, సి-కౌ-౨౬౨౦-౨౬౨౩-౩౮౦ సూ)

పయి సూత్రములచొప్పున సన్నంతములకు 'ఉ' ప్రత్యయమును, సన్నంత 'స' కారోపరిస్థమగు 'అ' కారమునకు లోపమును, నభ్యాస లోపమును 'ఇస్' అనునది వచ్చుటయు దీని సంయోగాది 'స' కరలోపమును రాఁగా 'లిప్సు' మొదలగు రూపములు గల్గును

లిప్సువు (లాభమును బొందఁ గోరువాఁడు, లభ్-లాభే లబ్ధుమిచ్ఛుః-లభ్ + సన్ + ఉ-లిప్సుః, లాభమును బొందుట కిచ్ఛించువాఁడు) జిగీషువు (జయేచ్ఛ గలవాఁడు, "జి-జయే" జేతు మిచ్ఛుః-జి + స + ఉ-జిగీషుః, జయిం చుట కచ్ఛ గలవాఁడు) చికీర్షువు (చేయ నిచ్ఛించువాఁడు, "డుకృఞ్-కరణే" కర్తు మిచ్ఛుః-కృ + స + ఉ-చికీర్షుః)

## 'ఊక', 'యఙ్ లుక్' ప్రత్యయములు

యజంతములగు (లోపించినను) కొన్ని ధాతువులపైని "ఊక-ఇ" (కి) అను ప్రత్యయములు కర్త్రర్థమున నిల్చును యజంతములు కాకున్నను 'ఆదంతములు, ఋదంతములు, ఉపధాలోపులు' నగు ధాతువులకు 'ఇ' ('కి') ప్రత్యయమగును అపుడు ధాతువు ద్విరుక్తి నందును ౩౩ (ముగ్ధ-౧౧౧౭-౧౧౧౮-౧౧౧౯ వ సూ, సి-కౌ-౩౧౪౬-౩౧౫౧- ఇందలి వార్తికము, చూ-సం-క్రియా ౬-౧౧-౧౨ సూ)

యాయజూకుఁడు (పునఃపున ర్యజ్ఞ శీలుఁడు, "యజ్-పూజనే" యజ్ + యఙ్ లుక్-సం-క్రి-౧౨ వ సూ + ఊక-యాయజూకః)

దందశూకము (పాము, "దన్శ-గర్హా దంశనే-దంశనే చ" దన్శ్ + యఙ్ లుక్ + ఊక-దన్దశూకః, మాటిమాటికి గర్హముగఁ గఱచునది)

వావదూకుఁడు (వక్త, "వద్-వాచి" వద్ + యఙ్ లుక్ + ఊక-వావదూకః, పునః పునర్వక్త)

చాచలి (మిక్కిలి చలించునది, "చల గతౌ" చల్ + యఙ్ లుక్ + ఇ-చాచలి)

యజన్తములు కానివాని యుదాహృతులు

దాది (ఇచ్చువాఁడు, "దా-దానే" దా + ఇ-దా + దా + ఇ-దాదిః, ఇది 'ఆ' దంతో దాహృతి) జఘ్ని (చంపువాఁడు, "హన్-వధే" హన్ + ఇ-హన్ + హన్ + ఇ-జఘ్నిః ఇది ఉపధాలోపి)

## త్రిమగాది ప్రత్యయములు

'డు' అనునది (ధాతు పారమున) యిద్వర్ణముగాఁ గల ధాతువునకుఁ 'దద్ధాత్వర్థమునుండి పుట్టిన' యను నర్థమునందు "త్రిమక్" అను ప్రత్యయమగును ౩౪ (ముగ్ధ ౧౨౪౩వ సూ, సి-కౌ-౩౨౬౬-౩౫౨౧వ సూ)

కృత్రిమము (అస్వాభావికము-ఒకరిచేఁ జేయఁబడినది, ''డు-కృఞ్-కరణే'' కృ + త్రిమక్-కృత్రిమః) పక్త్రిమము (పండించినది-''డు పచిష్-పాకే'' పచ్ + త్రిమక్-పక్త్రిమః)

ఈ ప్రత్యయము భావార్థకము కాదనియు విశేషణమువంటిదనియు ముగ్ధబోధకర్తయగు వోపదేవుని యాశయము

''ణిన-అథు-నఙ్-కి-క్యప్-అ'' అను ప్రత్యయములు కొన్ని కొన్ని ధాతువులకు భావార్థమునం దగును, అట్టి యెడల కొన్ని వ్యాకరణ కార్యములు నగును ౩౫ (ముగ్ధ-౧౧౪౦ మొ ౧౧౫౬వ సూ, సి-కౌ-౩౨౧౫ మొ )

సాంరావిణము (కోలాహలము-బజారులోని కలకల ధ్వని, 'ణిన' అను నీ కృదంతముపైని 'ష్ణ' అను తద్ధితము నిల్వఁగా చేర్పడినది ''రు-ధ్వనౌ'' సమ్ + రు + ణిన + ష్ణ-సాంరావిణమ్) వేపథువు (కంపము, ''వేప-కమ్పే'' వేప + అథు-వేపథుః) యత్నము (ప్రయత్నము, యత్ + నఙ్-యత్నః) యజ్ఞము (అధ్వరము, ''యజ్-దేవపూజనే'' యజ్ + నఙ్-యజ్ఞః) యాచ్ఞ (ప్రార్థనము, ''యాచ్-యాచనే'' యాచ్ + నఙ్-యాచ్ఞా) ఆది (మొదటిది, ''దా-దానే'' అ + దా + కి-ఆదిః) అంతర్ధి (అంతర్ధానము-వ్యవధానము, ''ధా-ధారణే'' అన్తర్ + ధా + కి-అన్తర్ధిః) ఇట్లు ప్రాదులకంటెను, 'అన్తర్' అను నవ్యయముకంటెను బరమైన ''ద-ధ'' లాదిని గల ధాతువులపైని 'కి' ప్రత్యయము నిల్చును

శయ్య (పాన్పు, ''శీ-శయనే'' శీ + క్యప్-శయ్యా) విద్య (చదువు-జ్ఞానము, ''విద-జ్ఞానే'' విద్ + క్యప్ విద్యా) క్రియ (కార్యము, ''కృఞ్-కరణే'' కృ + క్యప్-క్రియా) ప్రశంస (స్తుతి, ''శన్స్-స్తుతౌ'' ప్ర + శన్స్ + అ-ప్రశంసా) పూజ (అర్చ, ''పూజ్-పూజనే'' పూజ్ + ఞి + అ-పూజా సం-౹కి-౯వ సూ చొప్పున 'ఞి' లోపము, త్రప (లజ్జ, ''త్రప్-లజ్జాయామ్'' త్రప్ + అ-త్రపా) శ్రద్ధ (స్పృహ, 'ధా-ధారణే'' శ్రత్ + ధా + అ-శ్రద్ధా శ్రత్-శ్రద్ధా-అవ్యయ)

ఇట్లుగ 'క్యప్' ప్రత్యయాంతములును, 'అ' ప్రత్యయాంతములును స్త్రీ లింగములె యగును

## సన్నంతముల మీఁది 'అ' ప్రత్యయము

సనాది ప్రత్యయాంతములపైని భావార్థమున 'అ' ప్రత్యయము నిల్చును 'అ' ప్రత్యయాంతములెల్ల స్త్రీ లింగములె యగును ౩౬ (ముగ్ధ ౧౧౫౩వ సూ, సి-కౌ-౩౨౩౯వ సూ)

దిదృక్ష (చూచెడి యిచ్ఛ, "దృశ్-చాక్షుష జ్ఞానే" దృశ్+సన్+అ-దిదృక్షా, సం-క్రియా-౬-౩-౧- సూ-చూ) జిగీష (జయేచ్ఛ, ''జి-జయే'' జి+సన్+అ-జిగీషా చూ-సం-క్రి-౬-౨-౧ సూ)

కర్మాదికారకములందును, భావార్థమునందును ధాతువులకు 'క్తి' ప్రత్యయమగును కొన్నియెడల దానిచోట 'ని' అనునది నిల్చును ఇవి తుదిని గల శబ్దములు స్త్రీలింగములు ౩౭ (ముగ్ధ ౧౧౪౭వ సూ, సి-కౌ-౩౨౨౨వ సూ)

కృతి (చేయఁబడిన పని, "కృఞ్-కరణే', కృ+కర్మార్థ-క్తి-కృతిః) కృతి (చేయుట-కరణము, "కృఞ్-కరణే" కృ+భావార్థ-క్తి-కృతిః) బుద్ధి (మతి, "బుధ్-జ్ఞానే" బుధ్+కరణార్థ-క్తి-బుద్ధిః, బుద్ధ తే అన యూ) స్మృతి (స్మరణము, ''స్మృ-స్మరణె'' స్మృ+క్తి-భావార్థ-స్మృతిః) హాని (క్షతి, ''హా-గతౌ''-హా+భావార్థ-క్తి-హానిః)

## 'అ-అన' ప్రత్యయములు

''ఈషత్-దుర్-సు'' ఉపానికంటెఁ బరమైయున్న ధాతువుపైని "అ (ఖల్)-అన" ప్రత్యయములు భావ కర్మార్థములందు నిల్చును ౩౮ (ముగ్ధ-౧౧౬౧వ సూ, సి కౌ-౩౩౦౫వ సూ)

ఈషత్కరము (ఈషత్ప్రయాస సాధ్యము, "కృఞ్-కరణే"-ఈషత్ + కృ + ఖల్-అ-ఈషత్కరః, ఖిత్త్వమువలనఁ గొన్నియెడల 'మన్' వచ్చును అర్థ్యంభవము- సం-కృత్-౧౧౧వ సూ) దుష్కరము (అతి కష్టముతోఁ జేయఁ బడు పని, "కృఞ్-కరణే" దుర్ + కృ + ఖల్-అ-దుష్కరః) సుగమము (సుఖముగాఁ జేరఁబడునది, "గమ్-గతౌ" సు + గమ్ + ఖల్-అ-సుగమః) సుయోధనుఁడు (కురు రాజు, "యుధ్-యుద్ధే" సు + యుధ్ + అన-కర్మార్థ-సుయోధనః-సుఖముగా వీనిచే యుద్ధము చేయఁబడును) దుశ్శాసనుఁడు (కురు యువరాజు, "శాస్-శాసనే"-దుర్ + శాస్ + కర్మార్థ-అన-దుశ్శాసనః, వీనిచే దుష్టముగా శాసింపఁబడును)

ణ్యంతములపైని 'విద్' మున్నగు కొన్ని ధాతువులపైని 'అన' ప్రత్యయము నిల్చును తదంత నామము స్త్రీలింగ మగును ౩౯ (ముగ్ధ-౧౧౫౦వ సూ, సి-కౌ-౩౨౧౪ దీని క్రింది వార్తికమును, దీనిని పాణినీయులు 'యుచ్' ప్రత్యయ మందురు నపుంసక మగు 'అన' ప్రత్యయాంతమును ల్యుడంత మందురు)

కారణ (యాతన, "కృ-హింసాయామ్"-కృ + ణి లోప-అన-కారణా) వేదన (దుఃఖానుభవము, "విద్-లాభే"-విద్ + అన-వేదనా) "లాభార్థా ద్విదేర్యుచ్ వ్యాఖ్యానాత్ "విద-జ్ఞానే" ఇత్యస్మాత్తు విత్తిః "విద-వేద నాఖ్యాన నివాసేషు" ఇతి చురాదేస్తు ణ్యాసశ్రన్థ ఇతి యుచి వేదనేత్యపి" (సి-కౌ-బాలమనోరమా వ్యాఖ్య-౧౧౫౨వ పుట) శబ్దస్తోమ మహానిధిలో 'ల్యుట్-అన' వచ్చు జ్ఞానార్థకధాతువుపైనే 'యుచ్' ప్రత్యయమునిల్పి "వేదనా" అనునది సాధింపఁబడెను

ఇంక "తుమ్-క్త్వా-ణముల్ ణమ్" అనునవి యవ్యయము లగుటచేఁ దెల్గున వానికిఁ బ్రయోగ ముండదు అయినను సుప్రసిద్ధములైన నిపాతనాది ప్రయోగార్థములును నగుటచే నవి యిటఁ జెప్పఁబడుచున్నవి

## 'తుమ్' ఆది ప్రత్యయములు

సమాన కర్తృకములగు రెండు క్రియలలో నేది రెండవ దానికిఁ బ్రయోజన మగునట్లు వాడఁబడునో యట్టి ధాతువుపైని భవిష్య దర్థమున భావార్థము వాచ్య మగుచుండఁగా "తుమ్" ప్రత్యయ మగును ౪౦ (ముగ్ధ ౧౧౬౪వ సూ, సి-కౌ-౩౧౭౫వ సూ)

'కృఞ్-కరణే' (కృ-కర్ + తుమ్-కర్తుమ్) "కర్తుం యాతి (చేయుట నిమిత్తము వెళ్ళుచున్నాఁడు ఇట వెళ్ళుటకుఁ జేయుట ప్రయోజనము గానఁ 'చేయు' అను నర్థముగల 'కృఞ్' అను ధాతువుపైని 'తుమ్' ప్రత్యయము నిల్చినది)

సమాన కర్తృక క్రియలలోఁ బూర్వకాలిక మగు ధాతువుపైని 'క్త్వా' ప్రత్యయము నిల్చును ఇది పరమగునపుడు ''గుణము, 'ఇమ్' ప్రత్యయము' అనునవి వచ్చుట మొదలగు వ్యాకరణ కార్యములును ప్రయోగానుసారముగ నగును ౪౧ (ముగ్ధ-౧౧౬౬వ సూ మొ, సి-కౌ-౩౩౨౦ మొ)

ఇందలి 'క' కారము గుణాభావమును దెల్పు నిద్వర్ణము

శయిత్వా యయౌ-పరుండి వెళ్ళెను ''శీ-శయనే' శీ-శే-శయ్ + ఇ + త్వా-శయిత్వా ఇచట 'ఇమ్' అనుదానికి గుణము కిత్త్వము చేలేదు ''శ్రు-శ్రవణే' శ్రు + క్త్వా-శ్రుత్వా యయౌ (విని వెళ్ళెను)

సమాసమున 'నఞ్' భిన్నమగు నవ్యయము మీఁది ధాతువుపై నున్న 'క్త్వా' ప్రత్యయమునకు 'యప్' అను నాదేశ మగును ౪౨ (ముగ్ధ-౧౧౭౬ మొ, సి-కౌ-౩౩౩౨ మొ)

ఇందలి 'ప' కారము హ్రస్వముమీఁది 'త' కార మగునని తెల్పు నిద్వర్ణము ''కృఞ్-కరణే'' ప్ర + కృ + త్ + య-ప్రకృత్య, ప్రకృష్టగఁ జేసి, 'నఞ్' మీఁద 'య'ప్పు రాదు, "అకృత్వా-చేయుక వచ్చెను "హన్-వధే''

ని + హన్ + యప్-ని + హ(న్) + త్ + య-నిహత్య యయౌ (సం-కౌ-౧౩౫వ సూ చొప్పున ననునాసిక లోపము) ఆదాయ- ఇట 'త్' కారము రాలేదు, ఆదంత ధాతువు

'మాటి మాటికి' అను నర్థము వాచ్యమగుచుండఁగా భూతార్థమున 'ణమ్' ప్రత్యయము వికల్పముగా నగును ౪౩ (ముగ్ధ-౧౧౦౭౩వ సూ, సి-కౌ-౩౩౪౩-౨౧౪౦ సూ)

'ణ' కార మాద్యచ్చునకు వృద్ధి యగు నని తెల్పు నిద్వర్ణము "స్మృ-స్మరణే" స్మృ-స్మార్ + అమ్-స్మారం స్మారం నమతి-స్మృత్వా స్మృత్వా నమతి (స్మరించి స్మరించి నమస్కరించు చున్నాఁడు)

ఇ ది సం స్కృ త కృ త్ప రి చ్ఛే ద ము

ఓమ్ తత్సత్

---

# గుణవద్గ ణాగుణవ ద్గణములు

(కౌముదీ రజతోత్సవ సభాధ్యక్షోపన్యాసము)

శ్లో॥ ప్రథమైకవచన తుల్యం। సర్వత్ర హలన్త మగుణవత్ ప్రభృతి।
గుణవద్గణో ద్వితీయై। కవచన తుల్యోభవే ద్వికృతౌ॥

శ్లో॥ ద్వితోత్వే సర్వహలాం హ్రస్వా। ద్విత్వంతు దీర్ఘతో బహుళమ్।
అగుణవతాం సర్వహలాం। సౌర్లోపో గుణవతాం డుమూ ప్రాగ్వత్॥

అని హలంతములు సంస్కృతములు తెలుగునకు వచ్చెడివిధి నన్నయ చెప్పెను వీని తాత్పర్యమును విశరించెదను

హలంతములగు సంస్కృతములు తత్సమము లగునపుడు గుణవద్గణము, నగుణవద్గణము నని ద్వివిధముగ వచ్చును గుణవద్గణము గానిది యగుణవద్గణ మని తాత్పర్యము ఇది మహ దమహత్తుల వంటిది అగుణవద్గణము సంస్కృత ప్రథమైకవచనాంతతుల్య ప్రాతిపదికముగను గుణవద్గణము సంస్కృత ద్వితీయైక వచనతుల్య ప్రాతిపదికముగను నుండును

అగుణవద్గణ గతములలోఁ దుదిని హల్లుగల్గినచో నా హల్లు హ్రస్వపూర్వక మగునేని నిత్యముగను దీర్ఘపూర్వకమగునేని వైకల్పికముగను ద్విత్వమునం దును-వానిమీద 'ఉ' కారము నిల్చును ప్రాతిపదికము తుదిని హల్లులేనియెడల నజంతములవలె రూపసిద్ధినొందును గుణవద్గణగతముల తుదిని నిల్చిన మ కారము లోపించును పిదప నది యజంతమె యగును గాన దాని రూపసిద్ధియు నజంతములకు వలెనె గల్గును అగుణవద్గణ గతములలోఁ దుదిని హల్లునిల్చు నపుడు చరమరూపమే ప్రాతిపదిక మగును అనంతా బరువములు దుదనిగలవె ప్రాతిపదికములగును ఇట్లుగ 'ఉ' కారము వచ్చు శబ్దములకు ప్రథమైకవచన మగు 'సు' ప్రత్యయము లోపించును పుంలింగ రూపము ఎప్పుడు గాని యితర లింగములలదు నా పుంలింగ ప్రాతిపదికమే దానికి యుండును ఉదా విద్వాంసుడు- విద్వాంసము మొ

సంస్కృత ప్రథమైకవచనమున 'టా'ంతములగు జాంతములును (ఉదా రాట్టు మొ) చాంత శబ్దములును సంజ్ఞావాచకములగు తాంతశబ్దములును నాంత శాంతములును నగుణవర్గములలోఁ జేరును సంస్కృత ప్రథమైకవచనమున, 'కా'ంతములగు జాంతములును తాంత దాంత ధాంత హాంతములును 'విద్వాన్' మున్నగు వస్వంతములును గుణవర్గణములోఁ జేరును

ద్విరదగతి రగడ నిండు చందురుఁడు నీ నెమ్మొగమ్ము సుహృత్తు
గండుగోయిల ఫణితి కలభాషలకు తొత్తు
(ప్రభావతీ ప్రద్యుమ్నము ౫వ ఆశ్వా ౧౫౭)

కం॥ "ఆద్యంత ప్రాసంబుల । . . . ." అను రగడల నియమముచొప్పున నిందలి "సుహృత్తు" అనునది మార్చరాదు అట్లయినను మహాభారత విరుద్ధమగుటచేత నిది ప్రామాణికము కాదు వ్యావహారిక పదమే యని గ్రహించవలెను

కం॥ సృంజయ కే । కయ యదు పాంచాల రాదిగాఁ గల సుహృదుల్॥ (ఆరణ్య-౧వ ఆ ౨౪౯వ ప)

కం॥ అలఘులు రైభ్య భరద్వా । జులు దమలో సుహృదులై విశుద్ధ తపో ని । శ్చలిత... (ఆరణ్య ౩వ ఆ-౨౫౭వ ప)

కం॥ ముదం । బుఁ బెంచెన్ సుహృదులెట్టి పుణ్యము లొనఁగన్॥ (ఆది-౫వ ఆ-౩౨వ ప)

ఇట్లు దాంతమగు సుహృచ్ఛబ్దము గుణవర్గణములోనిదే యని భారత ప్రయోగములవలన సిద్ధమగుటచేత నీ పింగళి సూరనవి మహాకవియైనను నితని ప్రయోగము గ్రామ్యము గాని యవ్యావహారిక మే యగును గ్రహింపవలెను దీనినిబట్టి దాంతములె యగునుచో "ఆంధ్ర పరిషత్తు-ఆంధ్ర సాహిత్య పరిషత్తు-ఆంధ్ర విశ్వకళాపరిషత్తు" మొదలగునవి వ్యావహారిక పదములె యనియు "ఉపనిషదము - ఆంధ్రసాహిత్య పరిషదము - ఆంధ్ర విశ్వకళా పరిషదము" అని

యుండ వలెననియు విశదమగుచున్నది ఇవి స్త్రీలింగము లయినను ముదాదుల లోనివి భారతమున దాంతములెల్ల గుణవర్ధణ గతములుగనే ప్రయోగింపఁబడి యున్నవి ("ప్రథ-సుహృత్-సుహృద్-సుహృదౌ-సుహృదః-ద్వితీ-సుహృదమ్-సుహృదౌ-సుహృదః" ఇట్లె తక్కినవి గ్రహించునది)

చ॥ "ఉడిగి సభాసదుల్ పలుకకుండిరి .." (సభా-౨వ ఆశ్వా ౩౧వ ప)

సీ॥ బ్రాహ్మణ ప్రవరుల బ్రహ్మవిదుల.. ... (సభా-౨వ ఆ ౧౨౧)

చ॥ ధర్మసం । విదులన నున్న యీ భరతవీరుల వంశము నేఁ డధర్మ
సం । పద నతినింద్యమయ్యె... ..(సభా-౨వ ఆశ్వా-౨౧౯వ ప)

గీ॥ ... . .. ధర్మసంవిదుఁడవు (సభా-౨వ ఆ ౨౪౦వ ప)

చ॥ . . . వివిధాస్త్ర సం । పదయును..
(ఉద్యోగ-౪వ ఆశ్వా ౨౪౯వ ప)

క॥ ... .. ఎట్టి యున్నత బం సం । పదమైన టీవులను
నా । యెదురను ... (ఆర-౪వ ఆశ్వా ౧౧౦ నన్నయవే)

క॥ ఆపద గడవఁ బెట్టఁగ । నోపి . . (ఉద్యో ౩వ ఆశ్వా ౬వ ప)

క॥ . । ఆపదఁ । కవ్విధ ము సుఖాపహమగునే॥
(శాంతి ౪వ ఆశ్వా ౩వ ప)

మ॥ మద మాతంగ ..... సం । పద లోలిన్ ..
(సభా-౧వ ఆ ౧౯వ ప)

ఇట్లు నన్నయ తిక్కన లిద్దఱును బ్రయోగించిరి ఒక్కటనైన "సంపత్తు" అని యుగుణవర్ధణముగాఁ బ్రయోగింపలేదు

కం॥ నారాయణీయ మగు నీ। సాహాఖ్యానంబు వినినఁ జదివిన సంప। త్తారోగ్యాయు స్స్వర్గతు లేంకి . '' అని ముద్రిత పుస్తకములలో నున్నను దాళపత్రమాతృకలలో ''సంప। త్త్యారోగ్యాయు స్స్వర్గతు। లేరికి ... ...'' అనియే యున్నది ఇదియే కవి ప్రయుక్త పాఠ మనఁదగును

## శ్రీనాథాది మహాకవి ప్రయోగములు.

సీ॥ ప్రణవ పంచాక్షర బ్రహ్మ విద్యా మహో, పనిషత్తు నీపాణి పల్ల
వాగ్ర। ము .. (కాశీ ౨వ ఆశ్వా-౬౯వ ప)

సీ॥ పరిపాటి ముండకోపనిషత్తుఁ దాపనీయోపనిషత్తు నభ్యుపగమించు. .
(కాశీ ౨వ ఆశ్వా-౧౩౧)

వీనిని సవరింప నగును కాన వీనిని శ్రీనాథుఁడు ప్రయోగింపలేదేమో?

సీ॥ ప్రణవ పంచాక్షర బ్రహ్మవిద్యా మహోపనిషద మీపాణిపల్లవాగ్ర।
ము... ...

సీ॥ పరిపాటి ముండకం బురియాడి తాపనీయోపనిషదము నభ్యుపగ
మించు ..

అని శ్రీనాథుఁడు ప్రయోగించెనేమో? కల్లె-

గీ॥' ''శైవ పరిషత్తుఁగూడి వైష్ణవుల నవ్వ''(కాశీ ౭వఆశ్వా-౨౩౩వపద్య)
అనుచోట ''శైవపరిషదముఁను వైష్ణవుల నవ్వ''అని ప్రయోగించెనేమో?

ఇట్లె

సీ॥ ''ప్రత్యయంబు తనూనపాత్తు బాడబులకు .. ...'' అనుచోట
(కాశీ-౩ ) ఆశ్వా-౨౦౬ ప)

''ప్రత్యయంబు తనూనపాతుఁడు ద్విజులకు '' అని శ్రీనాథుఁడు ప్రయో
గించనేమో?

శ్రీనాథుఁడు ప్రయోగించెనని ''ఉపనిషత్తులు'' మొదలగువాని నొప్పు కొన్నను నవి వ్యావహారిక పదములెయనియు నగ్రాహ్యములె యనియు చెప్ప వచ్చును దాంత, తాంతములు గుణవర్ధణము లోనివనియె కదా భారత ప్రయోగము లున్నవి

కం॥ భవ। జ్జనకుఁ బరీక్షితుఁ భుజగజాల్మిఁడు .. . ...
(ఆది ౧వ ఆ ౧౨౧వ ప)

అని 'త' కారాంతములును గుణవర్ధణము ద్వితీయైకవచనతుల్య ప్రాతిపదికము ననియె కదా భారత సమ్మతము

శ్రీనాథుని యీ క్రింది ప్రయోగ మంగీకరింపరాదని యొప్పికొనక తీరదుగదా

సీ॥ విడువంగ వచ్చునే విఘ్నాంధకారార్క డుంఠి విఘ్నేశు మండూక జఠరు। (కాశీఖండము ౨వ అశ్వా ౧౧౨వ ప)

సీ॥ కంఠాగ్ర కఠరాజు డుంఠి విఘ్నేశుండు
(కాశీ పీఠిక-౧వ ఆశ్వా ౨వ ప)

ఈ శ్రీనాథుని ప్రాసప్రయోగమ్మునాశ్రయించి తరిగొప్పుల మల్లన్న కవియుఁ బ్రయోగించెను

శా॥ కంఠేకాల పదారవిందయుగళప్రై గ్రైవాలి లోలార్కునిన్।
ఢుంఠీశున్ వినుతించి (చంద్రభాను చరిత్రము ౩వ ఆశ్వా ౭౨వ ప)

వీని నుదాహరించి శ్రీ సూర్యరాయ నిఘంటువునం దిట్లు వ్రాయఁబడెను
''డుంఠి సం-వి-ఇ-పుఁ కాశిలో వాయువ్య దిక్కుననుండు విఘ్నేశ్వరుండు . ..''
కాని డుంఠి శబ్దమె యగపడదు (శ్రీ-సూ-రా-ని)

శ్లో॥ "ఢుణ్ఢాన్వేషణ ఇత్యేకో । ఢకారాన్తః ప్రకీర్తితః"

(కవికల్పద్రుమ ధాతు పారము)

సంస్కృత ప్రామాణిక కోశములలో "ఢుంఠి" శబ్దమే లేదు "ఢుణ్ఢి" శబ్దమే యగపడుచున్నది

ఢుణ్ఢిః-పు-గణేశే (సర్వశబ్ద సంబోధిని) ఢుణ్ఢిః-పు-గణేశ్వర విశేషే. యథా-"అన్వేషణే ఢుఢి రయం ప్రథితోస్తి ధాతుః। సర్వార్థ ఢుణ్ఢితతయా భవఢుణ్ఢినామా। కాశీ ప్రవేశ మపి కో లభతేఽత్ర దేహీ । తేషాం వినా తవ వినాయక ఢుణ్ఢిరాజ" ఇతి కాశీ ఖణ్డే గణేశంప్రతి శివవాక్యమ్ (శబ్దార్థచింతామణి కోశము)

ఇట్లే "వాచస్పత్యము", "శబ్దకల్పద్రుమము" అను కోశములందు నుదాహరింపఁబడెను గ్రంథ విస్తర భీతిచే వాని నుదాహరింపలేదు

ప్రసంగవశమున శ్రీనాథుని 'ఢుంఠి' శబ్దము విమర్శింపఁబడినది గాని యది ప్రస్తుతము కాదు ప్రకృత మనుసరింతము

సీ॥ ఋత్విజుండని విచారించి పూజించితే. (సభా-౨వ ఆ ౧౧వ ప)

మత్తకోకిలము స్నాతకుండును ఋత్విజుండును ... ... .. (సభా ౨వ ఆశ్వా-౪వ ప)

సీ॥ .. .. ... ఋత్వి । జుండుగఁ గ్రతువొనర్చుచు నుండ ..

(శాంతి ౩వ ఆ ౧౧౬వ ప)

అని భారతమందెచ్చటను 'ఋత్విజుంతు' అనియే యుండుటచేత "సుత్రి క్కుల విఱిచి ఋత్విక్కుల బాధించి" (వరాహపురాణము ౫వ ఆశ్వా-౧౧౫) వ అను ఘంట సింగయ్య వరాహపురాణ ప్రయోగములోని "ఋత్విక్కులు" అనునది వ్యావహారికమె యని గ్రహింపఁదగును

ప్రథమైకవచనమున 'కాం'తము లగు జాంతములెల్ల గుణవద్గణగతము లుగానే భారతమునఁ బ్రయోగింపఁబడెను

మత్తకోకిలము సంయుజుండును బూజనీయులు (సభా ౨వ ఆశ్వా ౪వ ప)

మత్తకోకిలము దో । షోద్ధతిన్ రుజ లుద్భవింపఁగ .. (స్త్రీపర్వ-౧వ ఆ ౪౧వ ప)

గీ॥ "భుక్ప్రదమునకు భుజుఁడగు భూభుజుండు।" (ఆం-భా ౪౦వ ప) అని ప్రాచీనుఁడగు కేతన వచించియున్నాఁడు కాన వరాహపురాణ ప్రాసప్రయోగము కావ్యభాషలో గ్రాహ్యము కానేరదు గుణవర్ధనములోఁ జేరినది యగుణవర్ధనములోఁ జేరదనియు, నట్లె యగుణవర్ధనములోఁ జేరినది గుణవర్ధనములోఁ జేరనేరదనియు నన్నయభట్ట సిద్ధాంతమని యీవఱకు వ్రాసియున్నాను. ఈ సిద్ధాంతము గవిశిరోభూషణకర్తకుఁ గొంత దెలియునని చెప్పవలసియున్నది

"గుణవర్ధన వ్యతిరిక్తం హలంతం ప్రథమైక వచనతుల్యం స్యాత్" అని ఆ గుణవర్ధన శబ్దమున కర్థము వ్రాసియున్నాఁడు (౩౮౦వ పుట-కవిశిరోభూషణము) ఋత్విజుఁడు-"ఋత్విజుండని విచారించి పూజించితే" ఇత్యాచార్యః-సుహృదుఁడు-వేదవిదుఁడు"(కవిశి-౩౮౫వ పుట)అని యుదాహరించెను అతడు"ఋత్విక్కు-సుహృత్తు-వేదవిత్తు"అనురూపముల నుదాహరింప లేదు కాని"పరీక్షితుఁడు" అని యుదాహరించియు (కవిశి-౩౮౬వ పు) "మరుత్తు" (కవిశిరో ౩౮౬ పు) అను రూపము నుదాహరించుట,"ఋత్విజుఁడు"అని యుదాహరించియు "స్రిక్కు, అసృక్కు" అని యుదాహరించుట (కవిశిరో-౩౮౮వ పుట) నరయఁగా నీ నన్నయ సిద్ధాంతమును సరిగాఁ దెలిసికొనలేదని తోఁచుచున్నది

ఇంతియకాక సూరిగారి "ఒకానొకచో మహత్త్వంబునందు మతుప్ప్రకారంబున కానాదేశంబు విభాషనగు" ననుసూత్రమున కాధారముగ "భగవానుఁడు-హనుమానుఁడు"(కవిశిరో ౩౮౫వ పుట) అను రూపముల నుదాహరించుటయె కాక "ప్రశానుఁడు" (కవిశిరో ౩౮౨ వ పుట) అనియు నుదాహరించెను "ప్రశానుఁడు-ప్రథమైక వచన తుల్యత్వం దీర్ఘాత్పరత్వాన్న ద్విత్వమ్ (కవిశిరో ౩౮౨వ పుట) అను నీతని వ్రాఁతనుబట్టి"అగుణవతాం సర్వహలాం సో ర్లోపః" అను చింతామణి సూత్రము నెట్లు వ్యాఖ్యానించెనో తెలియకున్నది ఉగాగమము వచ్చుటచేత 'సు' అను ప్రథమైకవచనమునకు లోపము చెప్పియు వానికి 'డు' ప్రత్యయము నెట్లుచేసెనో తెలియకున్నది ఈ వ్రాఁతకు నాధారముగా నీ క్రింది ప్రయోగమున్నది చ॥గొనకొని హేమచారు మణికుండల మండితమైన యింద్రజిత్తుని తల తత్‌క్షణంబునన త్రుంచి . (భాస్కరరామా-యుద్ధకాం-౧౩౭౮-అయ్యలార్యునిది) (వ్యా-సం-౬౨౮వ పుట) 'డు' మంతము కానిచో దీనికి 'ని'గాగమ మెట్లువచ్చును ? ఈ ప్రయోగము వ్యవహారస్థమును గాదు

కొన్ని యకృతి పదములకుఁ బ్రథమైక వచనతుల్య ద్వితీయైకవచన

తుల్య ప్రాతిపదికములు రెండును నుండునని సూరి ''ఋత్విక్కు-ఋత్విజుఁడు సీవృత్తు-సీవృతము'' అని యుదాహరించి ఋత్విగాదు లాకృతిగణమని చెప్పుట చేత బాలవ్యాకరణము వ్యాఖ్యాతలగు (క్రీ॥ శే॥) బ్ర॥ శ్రీ కల్లూరు వేంకటరామ శాస్త్రిలు గారనేక పదములను ద్వైరూప్యము గలవానినిగాఁ బ్రయోగములు చూపకయె యుదాహరించిరి

''వణిక్కు-వణిజుఁడు, పుష్పముక్కు-పుష్పముచుఁడు, వేదవిత్తు-వేదవిదుఁడు, పాలితకకుప్పు-పాలితకకుభుఁడు, ఘృతస్పృక్కు-ఘృతస్పృశుఁడు, సురద్విట్టు-సురద్విషుఁడు, అమృతలిట్టు-అమృతలిహుఁడు, త్వక్కు-త్వచము, తటిత్తు-తటితము, జలముక్కు-జలముచుఁడు, మధులిట్టు-మధులిహము, కకుప్పు-కకుభము, ప్రావృట్టు-ప్రావృషము, ఆపత్తు- ఆపద, త్విట్టు-త్విష, సంపత్తు-సంపద, క్షుత్తు-క్షుధ, దృక్కు-దృశ, దిక్కు-దిశ, రుక్కు-రుష'' (బా-గు-ప్ర ౧౩౫-౧౩౬ పుటలు) ఆకృతి గణములో నున్నదనుటకుఁ బ్రయోగము చూపవలదా ?

శబ్దరత్నాకరాది కోశకర్తలును బ్రయోగములను జూపకయె యెవ్వరికిఁ దోఁచిన రూపములకు వారుదాహరించిరి దిఙ్మాత్ర ముదాహరించెదను

ఋత్విజుఁడు (శ-ర), ఋత్విజుఁడు-ఋత్విక్కు (సూ-రా-ని), సీవృత్తు (శ-ర), సీవృత్తు-సీవృతము (సూ-రా-ని), ఆపద(శ-ర) ఆపత్తు-ఆపద(సూ-రా-ని), కకుప్పు (శ-ర), కకుప్పు-కకుభ (సూ-రా-ని) ('కకుభము' అకారాంతము), కకుత్తు (శ-ర, సూ-రా-ని) ('కకుదము' అకారాంతము)

ఆంధ్ర వ్యాకరణ సంహితా సర్వస్వమునందును బాలవ్యాకరణోద్ద్యోతము నందును ''సత్యజిత్, ఇంద్రజిత్'' అను శబ్దములకును, సకారాంత మహన్మహతీ వాచకములకును భారత ప్రయోగానురోధము ద్వివిధరూపములును నుండనగునని చెప్పఁబడెను కాని వానికిని ద్వివిధరూపము లుండునని యంగీకరింపనక్కరలేదు (బాలవ్యాకరణోద్ద్యోతము ౧౨౯వ పుట)

'సత్యజి' చ్ఛబ్దమునకు ద్వివిధరూపము లుండునని చెప్పనేల ? ఆ॥ వె॥ సత్యజిత్తుమేన సాయక దశకంబు।'' (భార ద్రోణ ౧వ ఆ-౨౧౧వ ప) అను చోటఁ దిక్కయజ్వ ''సత్యజితుని మేన సాయక దశకంబు''అనియె ప్రయోగించి యుండునని చెప్పనగును అప్పుడది తక్కిన తాంతములవలెనె గుణపద్గణము లోనె చేరియుండును